TELUGU SAHITYA MALA SERIES : 1

Edited by Prof R. SUBBA RAO (Osmania University)

# NAVA RASA GANGADHARA

A TELUGU RENDERING WITH COMMENTARY
OF PANDITARAJA JAGANNATHA'S RASA GANGADHARA

BY

SAHITYA VIDYA PRAVEENA

J. MADHAVA RAMA SARMA,

VICE-PRINCIPAL, SANSKRIT COLLEGE, TENALI.

NAVYA SAHITYA PARISHAT

GUNTUR

# నవరసగంగాధరము

## ప్రథమాననము

శ్రీ జగన్నాథ పండితరాయల
రసగంగాధరమునకు అనువాదము


సాహిత్య విద్యా ప్రవీణ
జమ్ములమడక మాధవ రామ శర్మ
ఉపాధ్యాయుడు, సంస్కృత కళాశాల, తెనాలి



నవ్య సాహిత్య పరిషత్తు
~ గుంటూరు ~

# ని వే ద న ము

పూజ్యశ్రీచరణుల చరణసీమాసేవలో సముల్లాసము పొంది
స్వాత్మ సమావేశము సంపాదించిన
సాహిత్య శ్రీభావనాఫలముగా స్వరూపలాభము కాంచిన
న వ ర స గం గా ధ ర ము ను
అ స్మ ద్గు రు వ ర్యు లు
బ్రహ్మశ్రీ, వేదమూర్తి, మహామహోపాధ్యాయ,
కలా ప్రపూర్ణ, వైయాకరణసార్వభౌమ, సర్వతంత్రస్వతంత్ర
**శ్రీ తాతా సుబ్బరాయ శాస్త్రి పాదుల**
సదయవత్సల సరసహృదయ చతురసాహితీశక్తికి
స మ ర్పి స్తు న్నా ను

వాగ్దేవతా దీవ్యతు !

జయపురమహారాజాశ్రిత, రాజ్యాన్తర్గత సకలసంస్కృత విద్యాలయ నిరీక్షకః,
సంస్కృత రత్నాకర పత్రికా సంపాదకః, రసగంగాధర వ్యాఖ్యాతా కవిశిరోమణి,
సాహిత్యాచార్య,

**పండిత భట్ట శ్రీ మధురానాథ శాస్త్రీ**

## ఆ శ ం సా

రసో యత్ర వ్యక్తో విలసతి వివిక్తో గుణగణో
లభన్తేఽలంకారా అపి చ వికలంకా మిహ రుచమ్
పటుప్రౌఢస్ఫీతాక్షరభరపరీతా ప్రతిపదం
విమర్శవ్యాసంగా జ్జయతి రసగంగాధరగవీ.

రసగంగాధరనామ్నీ పండితరాజోత్థకావ్యమీమాంసా
వ్యాఖ్యాతా బత! బహుధా వసుధాయాం సంస్కృతాదివాగ్గుంభైః.

కిం తు గ్రంథనిబంధు ర్దేశగిరాఽసౌ పురా న చావిరభూత్
సా న్యూనతా నిరస్తా మాధవరాయాఖ్యపండితే నాఽద్య.

మాధవరాయబుధేంద్రా దవిందత యో హి సాంద్ర మాంధ్రగిరమ్
రసగంగాధరనామా విబుధానా మావిభాతు గుంభోఽయమ్.

పండితరాజేన కృతో మాధవరాజేన యోజితః స్వగిరా
గుంభనగుమ్ఫై రమందః సందర్భోఽయం చిరం జయతు !

ఇత్యాశాస్తే జయపురమహీమహేన్ద్రేణ మానితోఽనుకులమ్
జయపుర సంస్కృతవిద్యా కేంద్రాధ్యాపకపదం చిరా దుపయన్.
స న్మంజునాథనామా సుకవిశిరోమణిపదేన పరిచయవాన్
దేవర్షిపాహ్వా భట్ట శ్రీ మధురానాథ శర్మాఽసౌ.

సంస్కృత సాహిత్య సదనమ్
భట్టగార్డెన్, రెసిడెన్సీ రోడ్, జయపూర్
౧౩. ౫. ౧౯౪౨.

శ్రీహరిః

"భారతీయధర్మ" సంపాదకః, హిందీ రసగంగాధర కర్తా
సాహిత్యాచార్య, శుద్ధాద్వైతాలంకార,
పండిత పురుషోత్తమ శర్మా చతుర్వేదీ.

## శు భా శం స న మ్.

అమన్ద మానన్ద ముదీరయన్త్యః
ప్రౌఢిప్రకర్షం పరమం భజన్త్యః
సద్విద్యసాహిత్యవిదాం సమాజే
జయన్తి తాః పణ్డితరాజవాచః.

రసగంగాధరనామ్నీ తాసు ప్రథితైవ కావ్యమీమాంసా
సేయం నాగరభాషాన్తరం మయా ప్రాపితా పూర్వమ్.

సంప్రతి తస్యాః శ్రీమన్మాధవరాయేణ సూరిణా విహితః
అవలం బ్యాంధ్రగిరం స్తాదనువాతోఽయం చిరంజీవీ.

మేయో కాలేజ్, అజమేర్, రాజపుటానా,
అధిక జ్యేష్ఠ కృష్ణ తృతీయా, భౌమవాసరః
వి. సం. ౧౯౯౯ క్రీ. శ. ౨. ౬. ౧౯౪౨.

# ప్రస్తావిక

అలంకార శాస్త్రవీథిలో జగన్నాథ పండితరాజకృత రసగంగాధరము అధికారికమైన చరమగ్రంథమని వేత్తల అభిప్రాయము. జగన్నాథుడు ఆంధ్రుడు. గోదావరీప్రాంత నివాసి. తండ్రి పేరుభట్టు. తల్లి శ్రీలక్ష్మి. (అమలాపురము తాలూకాలోని ముంగండ అగ్రహారము వీరి స్వగ్రామము.) 'పండితరాజు' ఢిల్లీశ్వర దత్తమైన విద్వద్బిరుదము. జన్మనామము 'జగన్నాథుడు'. ఆసఫవిలాస ప్రారంభములో 'తైలంగ కులావతంసేన పండిత జగన్నాథేన' అని వ్రాసికొనినాడు. జగన్నాథుని వంశస్థులు వేగినాటివారని ప్రతీతి. శ్రీకులపతిమిశ్రుడనే జగన్నాథ శిష్యుడు 'తైలంగ వెలనాటిద్విజ' అని వ్రాసినాడు. వీరింటి పేరేమో స్పష్టము కాలేదు. కులపతిమిశ్రుడే. 'జగన్నాథ త్రిశూలధర' అని విశేషించినాడు. 'త్రిశూల' అనునది ఇంటిపేరు కావాలి. ఇది 'ముక్కామల'కు సంస్కృతీకరణ మేమో !

జగన్నాథుని వంశము విద్వదాలవాలము. జగన్నాథునితండ్రి పేరుభట్టు. బహుశాస్త్ర పఠనము కావించిన మహావిద్వాంసుడు. జ్ఞానేంద్ర భిక్షువు దగ్గర అద్వైతము, మహేంద్రుని సమక్షంలో తర్కశాస్త్రము, ఖండదేవసన్నిధిలో పూర్వ మీమాంస అభ్యసించి పేరుభట్టు ఉత్తీర్ణుడైనాడు. వ్యాకరణశాస్త్రము మాత్రము శేషవీరేశ్వర పండితుని దగ్గిర చదివినాడు. ఈ మహాపండితుని గురుచరణ సన్నిధానములోనే జగన్నాథుడుకూడా శాస్త్రపఠనం చేసి ఉంటాడు. 'అస్మద్గురు పండిత వీరేశ్వరాణాం' అని తన మనోరమా కుచమర్దనంలో చెప్పుకొనడంవల్ల తండ్రికి వ్యాకరణశాస్త్రాధ్యాపకుడైన శేషవీరేశ్వర పండితుని దగ్గరనే జగన్నాథుడుకూడా శబ్దశాస్త్రము సాంగంగా అధ్యయనము చేసినట్లు స్పష్టము/జగన్నాథుడు వేదాంత న్యాయ వైశేషిక మీమాంసా వ్యాకరణ సాహిత్యాది శాస్త్రాలలో మహా విద్వాంసుడని నిరూపించడానికి ఆయన గ్రంథాలే చాలు.

ఆంధ్రులు ఉన్నత శాస్త్రాధ్యయనం కోసం కాశీ వెళ్లే ఆచారం మొన్న మొన్నటి వరకూ ఉన్నది. కాశీపట్టణం విద్యాపీఠంగా చిరకాలంనుంచీ ప్రకాశించిన దనుట నిర్వివాదాంశము. అదిలో అధ్యయనం కోసం వెళ్ళిన ఆంధ్రులు స్వీయపాండిత్య ప్రకర్షవల్ల అధ్యాపక పీఠాలుకూడా ఆక్రమించారు. అందులో ముఖ్యంగా వ్యాకరణ సాహిత్య శాఖలు ఆంధ్రుల యాజమాన్యంలో బహుకాలం నిలిచి విస్తరించిన వనడానికి కూడా అవకాశాలున్నవి. తండ్రీ కుమారు లిద్దరికీ గురువైన వీరేశ్వరపండితుడుకూడా ఆంధ్రుడే అయి ఉండాలి. వీరి యింట వ్యాకరణ

క్రీ. శ. ౧౬౧౪లో విజయనగరసామ్రాజ్యంలో ఉప్పతిల్లిన అంతర్విప్లవ సంక్షోభంలో జగన్నాథుడు ఆంధ్రదేశము విడిచి ఉత్తరముఖంగా దిగ్విజయయాత్రకు బయలుదేరి ఉంటాడు. జగన్నాథపండితునికి ఢిల్లీశ్వరదర్శనం కలగడానికి కొన్నికథ లున్నాయి. ఈ కథలు కంచికి పోయినా అసలు ఆ కాలచరిత్రసందర్భాలు కొంచెం పరిశీలింతాము. జహంగీరు పాదుషా సౌందర్య ప్రియుడనీ, సాహిత్యలంపటుడనీ ప్రతీతి. నూర్జహాన్ సమ్మోహన ప్రభావమూ, అసఫఖాన్ రసిక ప్రతిపత్తీ మూలములుగా ఆనాటి ఢిల్లీదర్బారు కళాప్రసక్తములైన రసవద్వినోదాలకు నెలవై అలరారినదని చరిత్ర. అసఫవిలాసంలోని అభివర్ణాదులను పట్టి చూడగా రసికుడైన అసఫఖానే రసవత్కవితాకళానిధి ఐన జగన్నాథునికి రాజాస్థానప్రవేశం ఇప్పించి ఉండునని అనడం సమ్మతము. జగన్నాథపండితుడు షాజహాను ప్రభుత్వకాలంలో సంపూర్ణ సంపద్వైభోగా లనుభవించి, దారాతో సాహిత్యసహవాసము జరపినట్లు కన్పడుతున్నది. షాజహాను చక్రవర్తి జగన్నాథుని సరసాభిరామసాహిత్యగోష్ఠికి, విశ్వతోముఖమైన విద్వద్వాదకౌశలానికి అలరి పండితరాజ బిరుదాన్ని ప్రసాదించాడు. ఒకానొక ప్రచండ విద్వద్వాదములో జగన్నాథుడు కావించిన అద్భుతఖండన మండనములకు చకితుడై పండితరాజును రజతనిష్కములతో తులాభారము చేశాడని కూడా ఐతిహ్యం ఉన్నది.

పండితరాజు ఉద్గ్రంథరచనమంతా ఢిల్లీలోనే జరిగిందని చెప్పవచ్చు. మహాకవి భవభూతి 'యథా స్త్రీణామ్ తథా వాచామ్ సాధుత్వే దుర్జనో జనః' అని అర్థోన్ముక్తంగా చెప్పినాడు. కాంతలపట్ల, కాంతాలంబనాలైన కావ్యాలపట్ల కుత్సాప్రవణంగా ఉండడము లోకస్వభావమైతే కావ్యకారకులైన కవులను గురించి శిష్టదృష్టి మరొకవిధంగా ఉంటుందా? దర్శనీయమైన రూపమూ, ప్రదర్శనీయమైన వాక్కూ ఎప్పుడూనూ ఏదో నిందకు తప్పలేదు. మహాకవి కాళిదాసు యశోముఖాన వ్యభిచారపంకతిలకం అంటింది. శ్రీనాథుని చరిత్రపుటలకు స్వైరవిహారధూమం అలముకొన్నది. మహాభక్తుడైన ధూర్జటి కవికి వారవనితాబాంధవం సంధిల్లింది. ఇలాగే పండితరాజకీర్తికేతనానికికూడా యవనీస్నేహచ్ఛిద్రం తగిలింది. చూడగా విద్వాంసులైనవారు, మోక్షపక్షపాతమైన నివృత్తిపథాన్ని వదిలి అలంకారభాగధేయమైన నాగరిక జీవితం నడిపినప్పుడు ఈ అపవాదు తప్పనట్లున్నది. అందునూ, ప్రాచీనతను విమర్శించే స్వతంత్రత; నవీనాన్ని ఉత్పాదించే ఉత్సాహం, అందులో ముఖ్యంగా పరంపరాయాతములైన ప్రమాణాలను ప్రమేయదృష్టితో చర్చించి సిద్ధాంతాలను తేల్చే సాహసమూ కలిస్తే ఈలాటి వ్యత్యయానికి అవకాశం ఎక్కువ. పండితరాజు బహుశాస్త్రపారంగతుడు. ఉత్తమ వైదికకులసంజాతుడు. విశేషించి ఆనుపూర్విక విద్య

శాస్త్రము తోబుట్టువుగా సర్వసమ్మాన సంపత్తులూ అనుభవించి రాణించి ఉంటుంది. అనూచానంగా తరతరములబడి వ్యాకరణశాస్త్రాధ్యయనం వీరింట ఫలోదయం కావించిందని ఊహించవచ్చు. అయితే (పండితరాజు వ్యాకరణ శాస్త్రాన్ని 'శేషామలఫణితి' అని అపూర్వంగా వ్యపదేశించాడు.) పాణినిముని ఆది శేషుని అవతారమని ప్రతీతి. ఈ శాస్త్రానికి సిద్ధాంత కారకుడైన భట్టోజి దీక్షితుడు శేష వీరేశ్వరుని శిష్యుడు. బహుశాస్త్రపారంగతుడైన పేరుభట్టు ఇతని సహాధ్యాయి మన పండితరాజుకూడా శబ్దశాస్త్ర తీర్థవాసము వీరేశ్వర గురుచరణ క్షేత్రంలోనే చేశాడు. ఈ సందర్భ సామంజస్యాలను బట్టి ఈ ఆంధ్ర బ్రాహ్మణుల ఇంటిపేరు క్రమక్రమంగా సంఛన్నమై శేషఫణి వారనీ వాడుకలో శేషమువారని క్రమంగా సుప్రసిద్ధి కెక్కి ఉంటుంది. ఈ ఆచారం ఆంధ్ర దేశంలో చిరంతనంగా వస్తూనే ఉన్నది. వ్యాకరణమువారు, పురాణమువారు, వారణాశివారు, చతుర్వేదులవారు, ద్విభాష్యమువారు ఇత్యాది గృహనామాలన్నీ ఇలా వచ్చినవే అనడం సహేతుకమైనది.

జగన్నాథునితండ్రి చతుశ్శాస్త్ర మహాపండితుడు. తండ్రి చేతిమీదుగా ఆరితేరిన కుమార పండితుడు వ్యాకరణంకోసం కాశీ వెళ్లాడు. అపరశేషావతారమని పేరందిన శేషంవారింట శ్రీ వీరేశ్వరుని దగ్గిర శబ్దశాస్త్రాన్ని సాకల్యంగా చదివాడు. అస్థాన కృతముగాని విద్యామదమో, లేక విద్వజ్జయ చికీర్షో జగన్నాధుని గిలిగింతలుపెట్టి ఉంటుంది. ఆ కాలములో జహంగీరు ప్రభుత్వం సంధ్యారక్తిలో రాణిస్తూ ఉన్నది. జగన్నాథపండితుడికి ఢిల్లీదర్బారులో ప్రవేశ సన్మానం జరిగింది. ప్రకాశానికి కాక పోయినా అనంత ప్రభావ విస్తృతికోసమైనా జగన్నాథపండితుడు తప్పక అరబ్బీ, పారసీలను అభ్యసించి సముచితకౌశలం సాధించి ఉండాలి. లేకపోతే మొగలు చక్రవర్తులతో సాహచర్య సంభాషణాది కాలకు అవకాశం ఉండి ఉండదు. ముఖాముఖీ ప్రస్తావన ప్రచోదనం కానిదీ జగన్నాథుని పాండిత్య ప్రకర్షగాని సంస్కృత సాహిత్య నర్మరుచిగాని ఢిల్లీశ్వరులను ఆకర్షించి ఉండదు. ఇది లేనిది అంతఃకరణ పూర్వమైన అభిమాన గౌరవాలు కుదరడంకూడా దుర్లభము. కాబట్టి జగన్నాథ పండితుడు అష్టభాషాధురంధరుడన్న ప్రశంస వాస్తవమే అయిఉండాలి.

జగన్నాథపండితుడు ఢిల్లీచక్రవర్తులతో సహచరించిన కాలము నవ వయస్సని తానే చెప్పుకున్నాడు. క్రీ. శ. ౧౬౨౦—౧౬౬౦ మధ్య పండితరాజు ఢిల్లీదర్బారులో ఆస్థానకవిగా ఉన్నాడని పలువురు పండిత పరిశోధకుల సిద్ధాంతము. ఇది అనేక విధాల సమంజసముగా కనబడుతున్నది. ప్రథమ వేంకటపతి అస్తమయానంతరం

క్రీ. శ. ౧౬౧౪లో విజయనగసామ్రాజ్యంలో ఉప్పతిల్లిన అంతర్విప్లవ సంక్షోభంలో జగన్నాథుడు ఆంధ్రదేశము విడిచి ఉత్తరముఖంగా దిగ్విజయయాత్రకు బయలుదేరి ఉంటాడన్న జగన్నాథపండితునికి ఢిల్లీశ్వరదర్శనం కలగడానికి కొన్నికథ లున్నాయి. ఈ కథలు కంచికి పోయినా అసలు ఆ కాలచరిత్రసందర్భాలు కొంచెం పరిశీలింతాము. జహంగీరు పాదుషా సౌందర్య ప్రియుడనీ, సాహిత్యలంపటుడనీ ప్రతీతి. నూర్జహాన్ సమ్మోహన ప్రభావమూ, అసఫఖాన్ రసిక ప్రతిపత్తి మూలములుగా ఆనాటి ఢిల్లీదర్బారు కళాప్రసక్తములైన రసవద్వినోదాలకు నెలవై అలరారినదని చరిత్ర. అసఫవిలాసంలోని అభివర్ణాదులను పట్టి చూడగా రసికుడైన అసఫఖానే రసవత్కవితాకళానిధి ఐన జగన్నాథునికి రాజాస్థానప్రవేశం ఇప్పించి ఉండుననడం సమ్మతము. జగన్నాథపండితుడు షాజహాను ప్రభుత్వకాలంలో సంపూర్ణ సంపద్వైభోగా లనుభవించి, దారాతో సాహిత్యసహవాసము జరపినట్లు కన్పడుతున్నది. షాజహాను చక్రవర్తి జగన్నాథుని సరసాభిరామసాహిత్యగోష్ఠికి, విశ్వతోముఖమైన విద్వద్వాదకౌశలానికి అలరి పండితరాజ బిరుదాన్ని ప్రసాదించాడు. ఒకానొక ప్రచండ విద్వద్వాదములో జగన్నాథుడు కావించిన అద్భుతఖండన మండనములకు చకితుడై పండితరాజును రజతనిష్కములతో తులాభారము చేశాడని కూడా ఐతిహ్యం ఉన్నది.

పండితరాజు ఉద్గ్రంథరచనమంతా ఢిల్లీలోనే జరిగిందని చెప్పవచ్చు. మహాకవి భవభూతి 'యథా స్త్రీణామ్ తథా వాచామ్ సాధుత్వే దుర్జనో జనః' అని అర్థోన్ముక్తంగా చెప్పినాడు. కాంతలపట్ల, కాంతాలంబనాలైన కావ్యాలపట్ల కుత్సాప్రవణంగా ఉండడము లోకస్వభావమైతే కావ్యకారకులైన కవులను గురించి శిష్టదృష్టి మరొకవిధంగా ఉంటుందా? దర్శనీయమైన రూపమూ, ప్రదర్శనీయమైన వాక్కూ ఎప్పుడూనూ ఏదో నిందకు తప్పలేదు. మహాకవి కాళిదాసు యశోముఖాన వ్యభిచారపంకతిలకం అంటింది. శ్రీనాథుని చరిత్రపుటలకు స్వైరవిహారధూమం అలముకొన్నది. మహాభక్తుడైన ధూర్జటి కవికి వారవనితాబాంధవం సంధిల్లింది. ఇలాగే పండితరాజకీర్తికేతనానికికూడా యవనీస్నేహచ్ఛిద్రం తగిలింది. చూడగా విద్వాంసులైనవారు, మోక్షపక్షపాతమైన నివృత్తిపథాన్ని వదిలి అలంకారభాగధేయమైన నాగరికజీవితం నడిపినప్పుడు ఈ అపవాదు తప్పనట్లున్నది. అందునూ, ప్రాచీనతను విమర్శించే స్వతంత్రత; నవీనాన్ని ఉత్పాదించే ఉత్సాహం, అందులో ముఖ్యంగా పరంపరాయాతములైన ప్రమాణాలను ప్రమేయదృష్టితో చర్చించి సిద్ధాంతాలను తేల్చే సాహసమూ కలిస్తే ఈలాటి వ్యత్యయానికి అవకాశం ఎక్కువ. పండితరాజు బహుశాస్త్రపారంగతుడు. ఉత్తమ వైదికకులసంజాతుడు. విశేషించి ఆనుపూర్వీక విద్య

త్సాం ప్రదాయంలో పుట్టి పెరిగిన ఆంధ్రుడు. ఇక ఈ మహనీయుని జీవితవృత్తం చూస్తే పండితులతో ప్రచండవాదము; అన్యజాతీయులైన ఢిల్లీచక్రవర్తులతో స్నేహసహవాసాలు; పైపెచ్చు మ్లేచ్ఛభాషాధ్యయనము; వీనితోపాటు సకల సంపద్భోగమైన నాగరకగృహస్థయోగము. వీనిలో ఒక్కొక్కటే పండిత వైముఖ్యాన్ని చాలినంత ఉద్రేకింపకల్గినది. ఇవన్ని సంగుచ్ఛమైతే కృష్ణపక్షంలో కాదంబినీ ఖేలనం కాదా? పండితరాజు జీవితంలో ఈ మహాదోషాలన్నీ సముచ్చయమైనప్పుడు శిష్టదృష్టి ఎలా ప్రసరిస్తుందో ఊహించవచ్చు. జగన్నాథ పండితుడు ఒకానొక యవనకాంతను వివాహమాడి ఆమెతో ఉచ్ఛృంఖలంగా జీవితం గడపినాడని లోకంలో ఒకప్రవాదం ఉన్నది. ఈ ప్రవాద నిరాధారమైన దని చిరకాలంనుంచి నా విశ్వాసం. ఇప్పుడు మహావిద్వాంసు లనేకులు ఈ నిశ్చయానికే రావడం సంతోష కరము. నా విశ్వాసానికి ఆధారాలుకూడా లేకపోలేదు. యవనీ పండిత రాజ దాంపత్యాన్ని స్థిరీకరించే సమకాలిక ప్రమాణా లేవీ లభించ లేదు. యవనీస్నేహస్థాపకములుగా పరంపరాయాతాలైన పద్యాలకు పండితరాజు గ్రంథాలలో ఏమూలా సందుదొరక లేదు. పైగా లవంగి అనేపేరు యవనస్త్రీలకు సహజంకూడా కాదు. నిజంగా లవంగిని, బిల్హణుడు యామినీదేవినివలె త్రికరణంగా కామించి ప్రేమానుసంధాన కైవల్యాన్ని పొంది ఉన్నట్లైతే భామినీ విలాసాన్ని లవంగీ విలాసమనే అభిధానించి ఉండును. పైగా షాజహానుచక్రవర్తి కాశ్మీరంలో హిందూమహమ్మదీయ వివాహాలను నిషేధించాడు. ఇందుచేత ఈ నిషేధం కాశ్మీరేతర ప్రాంతంలోకూడా ఉండిఉండాలి. నిర్భయంగా సమకాలిక పండితులను ప్రతిపక్షించి, సనాతనశాస్త్రకారులను, ప్రాచీన విద్యామర్యాదలను నిస్సంకోచంగా పూర్వపక్షంచేసి, మ్లేచ్ఛప్రభుప్రియాదరపీఠాన్ని శంకాలవం లేకుండా అధిష్ఠించిన ధీరునకు తన అతఃకరణ ప్రేమపీఠమైన లవంగిని అజరామరమైన స్వీయవాగంబరములో ఎక్కడా స్పష్టంగా చిత్రించడానికి ధైర్యం చాలింది కాదంటే విశ్వసనీయంగా లేదు. గుడిమ్రింగినవానికి గుల్లోలింగము ఆమలకప్రాయం కాదా? ఉన్నదేమంటే ఢిల్లీ చక్రవర్తులు అతిభోగలాలసులు, సంగీత సాహిత్య ప్రియులు, సౌందర్యపరతంత్రులు. అందులో జహంగీరు జీవితపట మంతా నూర్జహాను స్ఫురద్రూపరేఖాజాతముతో సమ్మోహనమైన కాలము. తరువాత షాజహాన్ కూడా నిరుపాధికమైన ప్రేమోపాసన జరిపిన మాధుర్యదీక్షితుడు. తన ప్రాణేశ్వరి పరమప్రణయాంశకు తాజ్ మహలు సుందరమందిరములో శోభాసమాధిని స్థాపించిన రసహృదయుడు. దారా అనారత పారవశ్య ప్రాపకములైన ప్రసన్నకళలకు చిక్కిన స్నిగ్ధస్వభావం కలవాడు. అసలు ఆసఫ్ ఖానే అనన్యకళాకామిగా కని పిస్తాడు. చిత్రంలో చిందే సౌందర్యాన్ని, స్వరంలో స్పందించే మాధుర్యాన్ని

చక్కగా అనుభవింపకలిగినట్లే ఈ భావుక వతంసుడు సాహిత్యంలో సముపలబ్ధమయ్యే రసచ్ఛాయాసౌభాగ్యాలను భోగింపగల సహృదయుడుగా సైతం స్ఫురిస్తాడు. స్థాణుప్రాయమైన దైనందిన చర్యాదికంతోపాటు ప్రాణక్లిన్నమైన సాంఘిక సంచారాన్ని సమాలోచిస్తే ఆ కాలపు చరిత్రలోనే ఈ వ్యాఖ్యానానికి అవకాశం ఉన్నది. అలాటి సంపన్నకాలంలో, మహాభోగపరిసరంతో, ఈలాటి రసిక ప్రభుకూటములో చేరి చేదోడు వాదోడుగా మహైశ్వర్యాలాలసుడైన పండితరాజును లోకం అన్యథా భావించిందంటే విపరీతమేమీ లేదు. తాళచ్ఛాయలో పయఃపానముకూడా ప్రమాదాస్పదమే కదా ?

ఆలోచింపతగ్గ చరిత్రాంశము ఇంకొకటికూడా ఉన్నది. దక్షిణాపథములో విజయనగరసామ్రాజ్యము హిందూ ధర్మప్రతిష్ఠాసంరక్షణకై నిలిచింది. సనాతన విద్వత్తుకు పురాతన మతాచార్యకానికి ఆదరసంపత్తులు చూపి పోషించి భూషించింది. ఈ సామ్రాజ్య విచ్ఛేదనకు ఢిల్లీ చక్రవర్తులు కారకులైనారు. ఈ పరిస్థితిలో విజాతీయులైన ఢిల్లీశ్వరులపట్ల దేశీయులకు విరోధభావము కల్గడము ఆశ్చర్యం కాదు. అలాటి చక్రవర్తులను ఆశ్రయించిన బ్రాహ్మణ విద్వాంసునిపట్లకూడా భ్రష్ట భావము ప్రబలటంలో వింత ఏమీ లేదు.

ఇలాటి సందర్భాలలో నవ్యసాహిత్యోపాసకుల దృష్టి ఒకవిధంగా ఉన్నది. నిర్మాణ నిపుణులు, ప్రతిభాభాస్వంతులు, అజరామరయశోవంతులు అయిన మహనీయుల జీవితం క్షీరసాగరం వంటిది. దానిని నెరసులకోసము మథించడము అనుచితమని వారి మతము. అతీవ విశిష్టవ్యక్తుల జీవితాలను కొలవడానికి సామాన్యధర్మసూత్రాలు చాలవు. వాటికి అందని ఉద్వేలత్క్షణావరణ మంతా భ్రష్టబంధంగా భావించడం న్యాయం కాదు. కాళిదాసాది మహాకవుల రచనలు మాత్రమే సాహిత్యం కాదు. వారి జీవిత మంతా మహాసాహిత్యమే. తదీయ స్మృతినామ పారాయణాదికం ఉజ్జీవ దాయకము, కాబట్టి ఏతదారాధనా కలాపంలో "యావదపదానం, సుప్రసిద్ధం సముచితం తావదేవ వర్ణనీయం" అన్న పెద్దలవాక్యం పాటించడమే న్యాయ్యం. శిష్టా స్మృతిని బట్టికూడా విచికిత్సాబలము అభియోగి పక్షములోనే ఉపకరిస్తుంది. పండితరాయల ప్రఖ్యాతిని ప్రచ్ఛన్నము చేస్తున్న సాక్ష్యము ప్రత్యక్షంగా శూన్యంగాను, పరోక్షంగా ఆద్యంత కింవదంతిమీదను ఆధారపడ్డదిగాను ఉన్నది. ఇక ప్రాజ్ఞుని నిర్ణయము ఎలా ఉండవలెనో సుస్పష్టము. ఇంకా ఈ కాలుష్యకూపం లోతు చూతా మనేవారికి ధన్యవాదము.

సాహిత్యం ఒక విలక్షణమైన శాస్త్రము. దాని బీజాలు సనాతనములైనా ఏతద్వ్యవసాయ వికాసదోహద మంతా అర్వాచీనము కావడంకూడా నిజమే. ఐతే నవ్యమైనంతమాత్రాన ఇతరత్రా శాస్త్రమర్యాద పట్టకపోలేదు. ఇందుకు "నవ్యన్యాయ" ప్రకరణాదులు నిదర్శనము. సాహిత్యానికి శబ్దము తల్లి. అర్థము తండ్రి. శబ్దార్థలీలా యోగములో పిత్రువిశిష్టమైన ప్రేమశృంగార మాధుర్యమంతా సాహిత్యం పంచుకొన్నది. అందువల్లనే కాంతము, కమనీయము, మధురము, మోహనము, సరళము, సాంత్వనమూ ఐన యావదాకర్షకస్వాదుసౌభాగ్య మంతా సాహిత్యంలో ప్రతిబింబించింది. అదే కారణంచేత ఆబాలగోపాలప్రాణిమోహనంగా ఉపదేశకారి ఐంది.

సాహిత్యం ప్రధానంగా లోకప్రవృత్తి నన్వేషించి అందున్న లోకోత్తర సువృత్తభావాన్ని ఉన్మేషింపచేస్తుంది. అందువల్లనే దీని ఆవరణము హ్లాదైకమయముగాను రామణీయకముగాను ప్రకాశించడం కల్గింది. ఇష్టానిష్ట సుఖదుఃఖ రుచిరారుచిర మిశ్రబంధమైనది జీవితం. దీన్ని విభాగించుకొని, అందులో సుఖమునే ఆస్వాదించి, ఇష్టమునే గవేషించి, రుచిరమునే దర్శించే అభ్యాసపాటవం సుసాధనకాదా? దానిని ఉపదేశించే పేశలసాహిత్యము మహాదర్శనం కాదా? శిష్టులుకూడా కాదనరు. కాని ఏతత్ప్రవచనము అధికాధికంగా కాంతాసమ్మితమును, శృంగారసుస్నిగ్ధమును ఐన కారణంచేత కాంతలపట్ల, కాంతమైన వస్తుచేష్టాదికముపట్ల పరంపరాగతమైన అకించన భావము మనవారిని వదలింది కాదు. సాహిత్యానికి అవిభాజ్యమైన అవద్యబంధమే ఉంటే భరతునివంటిమునులు, అభినవ గుప్తాదులవంటి పరమశైవులు, అప్పయ్య దీక్షితులవంటి బ్రహ్మిష్ఠులు ఈ శాస్త్రమును సగౌరవంగా సమ్మర్శించి ఉండరు. అయితే ఎంతమంది ఈ సమ్మోహనామ్నాయాన్ని తడివినా, తరచినా, తర్కించినా, దాని మాధుర్యగ్రంథిని విప్పే మహాభాగ్యమూ, అనన్యసిద్ధి జగన్నాథ పండితరాజుకే దక్కింది. ఇది అతిశయ సూక్తము కాని, స్తోత్రవాదము కాని కాదని రసగంగాధరమే నిరూపిస్తుంది.

పండితరాజు గురుకులక్లిష్టమైన బహుశాస్త్రపారీణతను గాని, క్షురధారాప్రాయమైన నిరంకుశవాదనైశిత్యాన్ని గాని నిరూపించడానికి నాకు అధికారము చాలదు, కాని ఈ మహాకవీశ్వరుని ప్రసన్నభాసమానమైన పరిఫుల్లభావనాసౌభాగ్యమును, సుభగసుమసుకుమారమైన చతురవచోమాలాకౌశలమును ఆర్ద్రహృదయంతో ఆకళించి సాహిత్యసాధనలో వినియోగించుకోవచ్చును. పాషాణపంక్తులనుండి పీయూషబిందువులు పిండగలవాడని పండితరాజు తన తండ్రినిగురించి చెప్పుకొన్నాడు. అందు

చేతనే తాను మరుమరీచికలనుండి లలితలావణ్యమునూ, అగాధ 'గిరోపగిరి' గహ్వర ములనుండి మందమృదుమధురధ్వనితరంగాలను, విలక్షించి వినిపింపగల చతురతా వాల్లభ్యమును సమార్జింపగలిగినట్లు తోస్తున్నది. పండితరాజు మాధుర్యోపాసి. అది ఆయన వ్యాఖ్యానదృష్టిలోనే కాక స్వీయరచనలోకూడా స్పష్టమవుతుంది. పూర్వ పంక్తిని చర్చించినా, సూత్రార్థాన్ని అనుగమించినా, తన నవ్యసిద్ధాంతాన్ని ప్రతిపా దించినా లేక ఉదాహరణార్థము అభినవరచన సలిపినా ఈ విలక్షణ స్వభావము పట్టిస్తునే ఉంటుంది.

మానవునికి అలవడిన శబ్దసాధన విలక్షణమైనది. దాని పరిణామము యుగయుగాంత రములలో పరిపక్వమై ఉంటుంది. దైనందిన లోకవ్యవహారానికి ఉపయోగించిన భాష ఆంతరంగస్పందనాన్ని వినిపించడానికి కూడా వినియోగపడ్డది. మానవ యంత్రము తపస్తప్తమై బృంహించినపుడు శబ్దతత్త్వము ఉన్మక్తమై బ్రహ్మాండవ్యాపక మవుతుంది. అలాంటి ప్రాగుషస్సులలోనే శ్రుతులు ఆవిష్కరించినవి. ఆ ప్రజ్వలానువాక ములు ప్రభుసమ్మితముగా ఉండవా? వానిని ఆర్షధర్మములుగా అనంతరవాఙ్మయము అంగీకరించి శిరసా అవధరించడము కూడా న్యాయమే. ప్రభుసమ్మితమైన ప్రవచనము మిత్రసమ్మితమైన పురాణేతిహాసప్రపంచంగా విస్తరిల్లడముకూడా నిజమే. దాని మహత్తును గుర్తించే గీతాశాస్త్రము కూడా "వాఙ్మయం తప ఉచ్యతే" అని గౌరవిం చింది. అయితే ఈ వాఙ్మయము ఏకైకముగా కాంతాసమ్మితమై ఆనందోపాసనకు వినియోగించే రేఖాసాహిత్యమందే సముపపన్నము అయింది. కర్మముఖంగా, ధర్మ సూత్రాలతో, నీతి బలముచేత, బహుధా యథాసాధకుడైన మానవుడు సహజము, సగుణము, సంపన్నము, అయిన సాహిత్యోపాసనలో సిద్ధిని పొందడము కూడా సుసంగ తమే. కాని విధినిషేధాలు, ఇష్టానిష్టాలు, పుణ్యాపాపాలు, జ్యోతిస్తమస్సులు అవినా భావంగా సమావృతమై జరిగే లోకవృత్తములో కేవలం హితముఖమైన సరళ సాధన నిర్మించడము అసాధ్యం. అయినా అట్టి కార్యాన్ని కవి సాధించాడు. ఇదే కావ్యము. దీనికే సాహిత్యమనే అన్వర్థనామాన్ని శాస్త్రకారులు నిపతించారు. హితమంటే అనంతవ్యాపకమైన కల్యాణాంశ. సృష్టిలోని రమ్యమైన సమస్తరూప కలాపమందును, మధురమైన యావత్పద భాండారమునందును, మహాకవులు హితావ తరణాన్ని దర్శించి నిత్యనవ్యస్ఫురితమున్నూ, యావత్ప్రాణి సులభమున్నూ అయిన ఏతన్మృదూకరణసామగ్రిని తమకృతిక్రతువులో వినియోగించుకున్నారు. అందుచేతనే సాహిత్యచక్రార్చనకు రామణీయకము న్యాసంగానూ, మాధుర్యము కీలకంగానూ ఆనందం సిద్ధిగానూ ద్యోత్యమవుతున్నది.

ఈదృష్టితో చూస్తే జగన్నాథుని మహాకవిగా పరిగణింపక తప్పదు. రచన పరిమితంగా ఉన్నదికాబట్టి ఆ స్థానం రాదనడం సమంజసంగా లేదు. కస్తూరి చిన్నమంత చాలదా? గోవుపాలు గరిటెడైనా చాలునన్నాడు మన వేమన్న వేత్త. జగన్నాథుని కావ్యవాటికలో అనాఘ్రాతకుసుమాలూ, అనాస్వాదిత మధురరుచులూ, అపూర్వ ఫలబంధములూ సాహిత్యోపాసకులకు లభిస్తున్నవి. భావం పరిచితమైనా భాష అభినవంగా ఉంటుంది. పాకానికి పోలికలున్నా రుచులు అపర్యుషితాలుగా తగులుతవి. ఇదంతా కాంతాసమ్మితంగానే ప్రసాధితం కావడం గమనింపతగిన విషయం. ప్రతిభాభాసితమైన అక్షరరమ్యసౌభాగ్యాన్ని ఇంత పంచిపెట్టిపోయినా జగన్నాథమహాకవిని లోకం పండితరాజుగా మాత్రమే స్మరిస్తున్నది. దీనికి కారణం బహుశా రసగంగాధర రచనలో వినియుక్తమైన పాండిత్యధారాశాతపాతమే అయిఉండాలి.

(పండితరాజు ధ్వనివాది. బహిర్గతము కాకపూర్వము శబ్దము ధ్వని రూపంలోనే ఉన్నది. ~~శ్రుతమైన తత్వాలె తిరిగి~~ (ధ్వనిరూపంగానే అంతర్గతమౌతున్నది. పైగా చైతన్యమున కంతకూ ధ్వననావస్థ సన్నిహితము, సాహిత్యము, సాకల్యముకూడా. సూక్ష్మాతిసూక్ష్మమైన ఈ జగద్వ్యవస్థను సందర్శనముచేసి తదనుసంధానమునకు శబ్దసూత్రములు నయించిన సనాతనులు వంద్యులు.)

అవిచ్ఛిన్నమైన కాలమును విభాగిస్తే అహోరాత్రద్వంద్వము లబ్ధమైనట్లే, అవబుద్ధమైన చైతన్యాన్ని వ్యవకలనం చేస్తే ఇష్టానిష్టయుగబంధము సిద్ధిస్తుంది. ఈ పార్థక్యాన్ని అంగీకరించి ఏతత్ తత్త్వ నిరూపణానికి వినియోగించింది శాస్త్రం. ఈ ద్వంద్వంలోని ఇష్టార్థములనే సంవరించి సాధించింది సాహిత్యం. మొదటిది ధర్మజిజ్ఞాసావధానం. రెండవది ఇష్టార్థప్రతిపాదనం. అందుచేతనే వేదశాస్త్రపురాణవ్యతిరిక్తమైన వ్యంజనావృత్తి నాశ్రయించడమే కాక, ఈ శబ్దం అలంకరణంగా కూడా రమణింపకలిగింది. రామణీయకశోధనలోనూ, సాధనలోనూ, అనురణన మార్గాన వెళ్లినప్పుడే ఇష్టార్థం అయింది. ఇదేధ్వని. శబ్దార్థ వ్యాపారంలో విలీనంగా ఉన్న సౌభాగ్యాన్ని సంపాదించి స్వాద్యంగా చేయజాలిన దీని మహత్తు అపూర్వమైన అనంతంగా శాసించింది. (ధ్వని వాదానికి ఆచార్యత్వం మనవారు ఆనందవర్ధనునికి ఇచ్చివేశారు. కాని ఈ ధ్వన్యామ్నాయాన్ని విచారించి, విమర్శించి, నిర్విశేషంగా నిర్ధరించే సుకృతం జగన్నాథపండితరాజుకే వశమయింది.)

అపూర్వమైన వ్యంజకశబ్దస్వీకారం చేసిన కవిభారతి విలక్షణం కాక తప్పింది కాదు. అందువల్లనే 'అనన్యపరతంత్రాం' అని శాస్త్రకారులు దీని స్వరూపాన్ని నిర్దే

శించారు. పరమార్థంగా అనుస్యూతమైన ఆనందాన్ని ఇష్టార్థప్రాయంగా పాటించడం, కర్మజ్ఞానయోగాదికమైన సాధనను కాంతాసమ్మితోపదేశకంగా అనువదించడం, శమదమన నిగ్రహాపూర్వమైన జీవితనిష్ఠను ఆస్వాదనచర్వణముఖంగా అనుఘటించడం, ఇవన్నీ బ్రహ్మపుణ్యాహవాచకమైన శబ్దప్రపంచంలో సామాన్య ప్రతిపాదనములు కావు. ఒక్కొక్కటే విప్లవనిధానం కాతగినది. అయితే శబ్దవ్రతుల స్ఫోటవాదాన్ని, పాణినీయమును సేశ్వరగణంలో పఠింపని ప్రాచీనుల దృష్టినీ సమీక్షించి సంభావిస్తే సాహిత్యఫలబీజపరిణామం ద్యోతకం కాకపోదు. 'వాఙ్మయం తప ఉచ్యతే' అన్న గీతావాక్యంలోనే దీని సమన్వయం కుదురుతుందని నా విధేయ విజ్ఞాపన. ప్రతిభావ్యుత్పత్తుల పరమపరిపాకంగా జగన్నాథుడు అవతరించాడు. శబ్దసృష్టిలో మననజలధి నిమగ్నుడై రసగంగాధర మణిని తెచ్చి ఇచ్చాడు. ఇందులో లలితమైన మంత్రమహత్తంతా నిగరణంగా ఉన్నది. శ్రుతులు స్వర ప్రధానాలైనట్లే సాహిత్యంకూడా ధ్వనిమయంగానే భాసిస్తున్నదనే దివ్యసూత్రం స్ఫురిస్తున్నది. సహృదయులైనవాఙ్మయ తాపసులకు ఇది ఆప్తము ఆచార్యకమును అగును. దీనిని పట్టుకోవడం కూడా సులభంకాదు. బహుజన్మసుకృత విశేషంచేత కర్మఫలం సిద్ధించినట్లే, అనేక భవ సాహిత్యోపాసనా వాసనచేతనే సహృదయతాసులభమైన రసాస్వాదనం లభిస్తుంది. ఈ మహామాధుర్య ప్రాప్తిని పండితరాజు:

'పాషాణాదపి పీయూషం, స్యందతే యస్య లీలయా'

అని వ్యంగ్యంగా చెప్పాడు. బండరాళ్లు పాడిఆవులై జున్నుపాలు పిండుతవట. అథవా గండ శిలలనుండి అమృతం చిందుతుందట. ఇదే సాహిత్యలీల. అన్వయ సమాస కఠినాలైన శబ్దపాదములనుకూడా అమృతప్రాయములుగా ఉంచేటట్లు పాఠంచెప్పేవాడు పేరుభట్టు, అని సన్నిహితానురణనం అవుతున్నది. అంతేకాదు 'పాషాణం నిర్జీవం, నీరసం, నిష్ఠురకాఠిన్యగర్భం. ఇది శిల్పలీలాపరిణామంలో జీవకళలు ఉట్టిపడేటట్లు, రమణీయరేఖలు రాణించేలాగు, ప్రసన్నరూపసౌందర్యం భాసించేరీతి తీర్చిదిద్దుతున్నాడు శిల్పి' అనికూడా ధ్వనిగోళంలో తరంగించే అవకాశం ఉన్నది. ఈ మధురతంత్రానికి దర్పణగౌరవం ఎందు కివ్వకూడదు?

పండితరాజు దీక్షితులను అధిక్షేపించిన ధోరణి ధూర్తదుష్టంగా ఉన్నదని కొందరు అంటున్నారు. దానికి కథనూ, కారణాలనూ కూడా కల్పించారు. అయితే జగన్నాథుడు రమణీయార్థప్రతిపాదకశబ్దానురక్తుడు. అప్పయ్య అద్వైత సిద్ధాంత విచారాసక్తుడు. వీ రిద్దరికి కయ్యం ఎలా కలిసిందీ తేలడంలేదు. ~~పైగా ఐతిహాసికులు~~ దీక్షితులకాలాన్ని ~~రెండు విధాల~~ నిశ్చయించారు. ఒకటి క్రీ. శ. ౧౫౨౦-౧౫౯౩ లేక

మధ్య. రెండవది ౧౫౫౩-౧౬౭౬ లకు నడుమ. వీనిలో మొదటి నిరూపణకు శాసన సాహిత్యసాక్ష్యం పుష్కలంగా ఉన్నది. దీనిని అంగీకరిస్తే ౧౫౯౦ మొదలు ౧౬౬౦ వరకూ ఉన్న జగన్నాథ పండితరాజు అప్పయ్యదీక్షితుల అంతుకు గురియై కసి తీర్చుకొన్నాడన్న అల్పాపవాదం అంతరిస్తుంది. కాదా భట్టోజీ 'గురుద్రోహం' అనవద్యంగా అంగీకరించేటప్పుడు జగన్నాథుని వృద్ధనిరసనం సైతం అట్టిదనే ఒప్పుకోవాలి.

అసలీ దీక్షిత కక్షకు కారణం భట్టోజీ అని నా సందేహం. ఈ మహాపండితుడు మహారాష్ట్రుడని ప్రతీతి. కాని ఈతని డెబ్బదినాలుగు కారికలకు భూషణమనే వ్యాఖ్యానం రచించిన కొండభట్టు భట్టోజీకి భ్రాతృవ్యుడు. కొండభట్టు, కొండయ్య ఇత్యాదులు మహారాష్ట్ర నామములు కావు. వీరుకూడా ఆంధ్రులై మహారాష్ట్ర సంబంధ బాంధవ్యాలవల్ల అనాంధ్రులై, వేషభాషలచేత మహారాష్ట్రులని వ్యవహారంలోనికి వచ్చి ఉండాలి. తాను ఆంధ్రుడై కాశీలో వ్యాకరణాచార్య పీఠం అధిష్ఠించి, శేషావతారమని నిశ్శేషఖ్యాతి గడించిన శ్రీకృష్ణపండితుని, సాక్షాత్ గురుదేవుని ధిక్కరించి ఖండన ముండనాదులతో ఎదుర్కొనిన భట్టోజీ దీక్షితుని అభిజాత్యద్రోహిగాను, గురుద్రోహిగానూ పాటించి పండితరాజు ప్రతిఘటించాడంటే వైపరీత్యమేమీ లేదు. ఈ కుటిల వ్యాపారానికి అప్పయ్యదీక్షితులు ఊతఇచ్చి ఉంటాడని ప్రొఫెసర్: వి. ఎ. రామస్వామిశాస్త్రిగారు సందేహిస్తున్నారు. ఇది ఇలా ఉండనిస్తే భట్టోజీవ్యాకరణపాఠం కాలక్రమంగా ప్రసిద్ధికి వచ్చినా, అతని కాలంలో తీవ్రవిమర్శన పాలయినట్లు నిదర్శనాలు ఉన్నవి. షాజహాన్ చక్రవర్తి దర్శనమిచ్చి ౧౫౦౦ రూపికల పారితోషికమునూ, సర్వవిద్యానిధాన అనే గౌరవ బిరుదమునూ సమర్పించి గౌరవించిన నృసింహేశ్వరస్వామి పండితరాజుకు సమకాలీనుడు. ఈ స్వామికి పూర్వాశ్రమంలో కవీంద్రాచార్య సరస్వతి అని పేరు. ఇతడు బహుశాస్త్రపారంగతుడు. మనోరమాఖండనం, శాశికాసంగ్రహం అనే వ్యాకరణ గ్రంథాలను రచించినాడు. వాటిలో భట్టోజీ మతాన్ని ఖండించడమే కాక మనోరమాకుచమర్దనమును శ్లాఘించినాడనికూడా తెలుస్తున్నది. కాబట్టి ఈ ఆక్షేపణాధ్యాయానికి ప్రత్యేకస్పర్ధను బీజంగా శంకించడానికి అవకాశం కానరాదు.

ఇరవైఐదు సంవత్సరాలక్రింద నేను శాంతినికేతనానికి తీర్థవాసిగా వెళ్ళితిని. ప్రథమ పాదాభివందన సుముహూర్తంలో కులపతులు రవీంద్రకవీంద్రులు కన్నులలో నవ్వులు నుడికారంలో తొలకాడగా ఇలా అన్నారు:

"ఆంధ్రులు ప్రియంకరులు, స్వచ్ఛందశీలురు. హాలకవిరాజు మొదలు జగన్నాథ పండితరాజుదాకా వారిలో కళాకాలీనం ధారాగతంగా ప్రవహించింది. కవితా కింకరుడై ఒక కుమారాంధ్రుడు ఆశ్రమానికి రావడం సంతోషం".

అప్పటినుంచీ ఈ గ్రంథమణి ఆంధ్రవాఙ్మయమాలానాయకంగా చూడాలని నా అభిమతం. అది నేటికి సిద్ధించింది. మా ప్రార్థనం మన్నించి అతిప్రౌఢమైన రసగంగాధరాన్ని నవరసగంగాధరముగా అనువదించిన మాధవరామశర్మగారికి అభినందనములు. ఏతత్ కృతి స్వీకారానికి అంగీకరించి సాహిత్య వ్యవసాయాన్ని ఆదరించిన కళాప్రపూర్ణులు తాతపాదులు సుబ్బారాయశాస్త్రి మహామహోపాధ్యాయులు వందనీయులు. ఈ యాపత్సన్నివేశంలో నా కొక నవ్యమహోదయ దర్శనమౌతున్నది. గురుప్రసాదాభిశోభితమైన మాతృమహోద్యానంలో మాధవ మధుర పల్లవార్చన జరిగింది. నవప్రియ వాల్లభ్యానికి ఇది శోభన సూచిక.

'లలితా కుటీరం' - సికందరాబాద రాయప్రోలు సుబ్బారావు
చిత్రభాను. జ్యేష్ఠ. కృష్ణ దశమి

# వి జ్ఞ ప్తి

ఆత్మ శ్రీసమవాప్తయే రసగవీ సేయం మయాऽనూదితా
దేవీ తత్ర కృపావతీ రసమయీ హేతుః పరాంబా మమ
యస్యామేయ విశిష్టశక్తి విశదై స్సాహిత్యసంవాదిభిః
సూక్తై రున్మిషితోऽస్మి నౌమి తమహం శ్రీ సుబ్బరాయాభిధమ్.

శ్రీ గురుదేవుల సన్నిధానంలో విద్యాభ్యాసము చేసే సమయంలోనే రసగంగాధర మును అనువదించాలన్న సంకల్పం కలిగింది. తెలుగునాటి పరిషత్తులు సాహిత్యపు మార్మికతను, దార్శనికతను, మనోజ్ఞతను విశదము చేయవలసిన అవసరము ఉన్నదని భావకుల భావము నవ్యసాహిత్య పరిషత్తు రసగంగాధరమును అనువదింప చేయాలని నిశ్చయించుకున్నపుడు నా సాహిత్యాభిరుచిని అభిమానించిన శ్రీ నోరి నరసింహ శాస్త్రిగారు నన్ను సూచించారు. శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి చిరకాలాభి లషితము ఈ సకలోద్యమానికి మూలపీఠము. మిత్రులు శ్రీ తెలికచర్ల వెంకటరత్నం గారు ఈ అనువాద కార్యమును నాకు ఆదేశించారు. ఈ విషయమును అప్పుడు ఆ సద్గురు పాదులకు మనవిచేశాను. శ్రీ వారి ఆశీర్బలము నన్ను అధికంగా ప్రోత్స హించింది. మా వంశములో ఎప్పుడో ఆంధ్రీకృతమై వెలువడ వలసిన ఈ గ్రంథము ఇప్పుడు ఈ విధంగా ప్రకాశీకృత మగుట నా అదృష్టము.

ఆంధ్రులు సాహితీసేవనము వలన హృదయమృదులత్వమును సంపాదించిన సహృద యులు. సాహిత్యమును ప్రత్యేకదర్శనంగా అంగీకరింప గలిగిన ఆలంకారికులలో ఆంధ్రుడయిన పండితరాజ జగన్నాథుడు అగ్రమహితమూర్తి. విహారి సతసయి వ్రాసిన విహారిలాలుకు భాగినేయుడయిన శ్రీ కులపతిమిశ్రుడు పండిత రాజశిష్యుడు. ఆతడు తన గ్రంథంలో గురువందనం చేస్తూ జగన్నాథ స్వరూప తత్త్వమును స్పష్టంగా నిరూపించాడు. నారాయణభట్టు అనే ఆంధ్రుడు పండిత రాజశిష్యులలో ఒకడు. నారాయణభట్టుకూ పండిత రాజుకూ బాంధవ్యంకూడా ఉన్నది. నారాయణభట్టు వంశమువారు ఇప్పటికీ రాజపుటానా జయపురంలో ప్రసిద్ధులై ఉన్నారు. భట్టశ్రీ మధురానాథ శాస్త్రి గారు తమ 'సాహిత్య వైభవం'లో ఈ విషయమును నిరూపిం చారు. జగన్నాథుని ధర్మపత్ని కామేశ్వరి అని శ్రీ శివశంకరశాస్త్రిగారి ఊహ.

రసగంగాధర గ్రంథము అలంకార శాస్త్రమూర్ధన్యము. దానిని నవరసగంగాధరముగా అనువదించి ఆంధ్రదేవిని ఆరాధింప గలిగానని ఆనందించుచున్నాను.

౧ ప్రాతః స్మరణీయపాదులు మా పితృ పాదులు శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారి విశిష్ట సాహితీశక్తి సమావేశము.

౨ పూజ్య శ్రీ చరణులు సాహితీ విద్యాదేశికులు శ్రీ తాతా సుబ్బారాయశాస్త్రి పాదులు వాత్సల్యకలితమంజులాశీః ప్రభావ ప్రస్మృతి.

౩ అస్మదంతేవాసుల ఆకాంక్ష.

౪ శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి సందేశస్వీకృతి.

౫ నవ్యసాహిత్యపరిషదాదేశము.

౬ పండితరాజుపైని పక్షపాతము.

౭ ఆంధ్రభాషాభిలాష.

౮ భాషాంతరానువాద సమీక్ష.

౯ సాహితీదర్శన వ్యాసక్తివలన నాలో కలిగిన స్పందము.

అనే ఈ నవరీతి మేళనమువలన నవరసగంగాధరము ఈ రూపము వహించింది. భావముఖంగా గ్రంథమును అనువదించాను. పండితరాజ విమర్శవైభవమును ఆస్వాదించడానికి పండితరాజ శ్లోకాలె తగినవని నాతలంపు. విద్యార్థులకూ మిత్రులకూ పాఠాలు చెప్పేటపుడు అవలంబించిన ఉపపాదనశైలిని నేను దీనిలో నిబంధించాను. గ్రంథాంతర విషయప్రసక్తి వచ్చినపుడు పూర్వాపరసందర్భాలను పరిశీలించుకొన్నాను. విషయ విశదిమాసక్తి కొన్ని స్థలాలలో పునరుక్తికి అవకాశ మిచ్చింది. మొదట కొన్ని శ్లోకాలకు సముచ్చలితములయిన భావాలను ఉల్లేఖించాను. మిగులు వానికి ఇది మార్గదర్శని అవుతుందని ఊహ.

భావకులకు సాహిత్య దర్శనము భావకతాసంపాదకము. అట్టి భావకతాపురస్సరంగా పండితవిమర్శకులు ఈ గ్రంథమును భావించి నిర్దుష్టము చేయవలసిందని కోరుతున్నాను. దూరదూరాన ఉండికూడా రసగంగాధరాభిమానంతో ఆశంసనములు పంపిన పండితులకూ నారచనకు దోహద మిచ్చిన సహృదయులకూ సాంజలిబంధముగా ధన్యవాదము లర్పించుతున్నాను.

శ్రీ మాధవరామశర్మ

# విషయసూచిక

## ౬ స్థాయిభావము



## ౭ రసధ్వని.



## ౮ రసవిశేషాలు



## ౯ గుణములు



## ౧౦ రచన

శ్రీ ర్జయతు

# నవ రసగంగాధరము

## ప్రథమాననము

### ౧. ఉపక్రమము

స్మృతాపి తరుణాతపం కరుణయా హరంతీ నృణాం
అభంగురతనుత్విషాం వలయితా శతై ర్విద్యుతాం
కలిందగిరినందినీతటసురద్రుమాలంబినీ
మదీయ మతిచుంబినీ భవతు కాపి కాదంబినీ.

స్మరింపబడిన మాత్రాన మానవుల (తీవ్ర సంసార) తరుణాతపమును దయతో హరించునదీ, నాశము లేని శరీరకాంతి కలిగిన మెరుపుల శతముతో చుట్టుకొనబడినదీ, కలిందగిరినందిని అయిన యమునానది యొక్క తటముపైని సురద్రుమములను అవలంబించినదిన్నీ అయిన అనిర్వాచ్య స్వరూప స్వభావము కల కాదంబిని నా మతిచుంబనము చేయునది అగు గావుత. నా బుద్ధివృత్తిలో విరాజిల్లు గావుత. ఈపద్యములో శ్రీకృష్ణుడు కాదంబిని (మేఘమాల)గా చెప్పబడినాడు. *

---

* గ్రంథారంభములో మంగళాచరణము చేయుట భారతీయుల పవిత్ర సంప్రదాయము. గ్రంథాదిలో చేయబడు మంగళాచరణము ప్రారంభించిన కార్యములో ప్రతిబంధకము అయిన పాపములను నశింపచేయగలదు. ఇది శిష్యులకు శిక్ష. దీనిని పఠించేవారు ''పెద్దలు ఈవిధముగా స్తవము చేస్తున్నారు. మనముకూడా స్తవము చేయవలయును''అని తలంచుతారు. ఇంకా ఇది వ్యాఖ్యాతృశ్రోతృజనానికి ఆనుషంగికముగా మంగళప్రదము. పండితరాజు జగన్నాథునకు శ్రీకృష్ణుడు ఇష్టదైవము. ఇష్టదైవమును

శ్రీమత్ జ్ఞానేంద్రభిక్షోరధిగత సకల బ్రహ్మవిద్యాప్రపంచః
కాణాదీ రాక్షపాదీ రపి గహనగిరో యో మహేంద్రా దవేదీత్
దేవాదే వాధ్యగీష్ట స్మరహరనగరే శాసనం జైమినీయం
శేషాంక ప్రాప్త శేషామలభణితి రభూ త్సర్వవిద్యాధరో యః.

శ్రీమత్ జ్ఞానేంద్రభిక్షువునుండి సకలవేదాంత విద్యావిస్తరమును పొందినవాడును, మహేంద్రపండితునుండి కణాదుని గౌతముని గహనవాణీవిలాసముల తెలిసినవాడును, కాశీపట్టణములో ఖండదేవుని నుండియే జైమినిమహర్షిప్రోక్తమైన పూర్వమీమాంసాశాస్త్రమును అధ్యయనముచేసినవాడును, శేష శ్రీకృష్ణుడు అనే వీరేశ్వర పండితునిదగ్గర పాతంజల విమలఫణితి (వ్యాకరణము) పొందినవాడును, సర్వవిద్యాధరుడునూ అయిన; *

---

ముందుగా స్తుతించుట సముచితము. శ్రీకృష్ణుడు ఈ స్తవములో కాదంబిని. అని వ్యాచ్యస్వరూపతత్వము కల కాదంబిని మా మతిచుంబిని అగుగావుత అని దీనిలోని కోరిక. స్మరణమాత్రముచేసినా ఈకృష్ణకాదంబిని కరుణామయస్వభావముతో మానవుల తరుణా(ప్రచండా)తపము నైనా హరించును. మానవుల సంసార పరితాపము శ్రీకృష్ణ స్మరణమున నశించుతుందని భావము. కరుణామయుడైన భగవానుడే తీవ్రసంసారతాపపాపములను నశింపచేస్తాడు. మేఘమాలకు ఈసామర్థ్యములేదు. వందలకొలదీ మెరుపులు ఈకాదంబినిని చుట్టుకొని ఉన్నవి. ఆ మెరుపుల తను కాంతి అభంగురము. మేఘాల మెరుపులు క్షణప్రభలు. చిక్కని కాంతి కలిగిన గోపీకన్యాసహస్రము నందనందనుని వలయించుకొన్నదని భావము. యమునాకూల నీపావలంబిని అయిన శ్రీకృష్ణకాదంబిని మా మనోరసములో విహరించు గావుత అని తాత్పర్యము. దీనిలో కాదంబినీపదస్వారసతనుబట్టి శ్రీ బృందావనాధిష్ఠాత్రీదేవి రాధనుకూడా స్తుతివిషయముగా గ్రహింపవచ్చును. శ్రీ రాధాదేవీపక్షమున కూడా పై విశేషణములను సమన్వయించుకొనుట సులభమే. శ్రీకృష్ణభగవానుని స్త్రీరూపముగా నిధ్యానముచేయుట ఒక ఉపాసనాసంప్రదాయ విశేషము.

* గురువందనముచేయుట విధి. తన విద్యాసాంప్రదాయికత్వమును సూచించుట అవసరము. అపుడు తన వాదము కేవల కల్పనాప్రసవము కాదు. దీనిలో పండితరాజు తన గురుసంప్రదాయవిశేషములను తెలియజేస్తున్నాడు. సంప్రదాయ సంశుద్ధిని తెలియజేయుట ధీమంతుల లక్షణము. జగన్నాథునితల్లి శ్రీలక్ష్మి, పేరుభట్టు తండ్రి. ఆతడు మహాపండితుడు. జ్ఞానేంద్రయతి సన్నిధానములో వేదాంత విద్యను అధ్యయనము చేసినాడు. మహేంద్రపండితునిదగ్గర న్యాయవైశేషికములను

పాషాణాదపి పీయూషం స్యందతే యస్య లీలయా
తం వందే పేరుభట్టాఖ్యం లక్ష్మీకాంతం మహాగురుం.

పేరుభట్టు లీలచే పాషాణము నుండి కూడా పీయూషము (సుధ) స్యందించుతుందో అట్టి లక్ష్మీవల్లభుడు మహాగురువయిన "పేరుభట్టు" అను ప్రసిద్ధనామము కల పితృదేవుని నమస్కరించెదను. *

నిమగ్నేన క్లేశై ర్మననజలధే రంతరుదరం
మయోన్నీతో లోకే లలితరసగంగాధరమణిః
హర న్నంతర్ధ్వాన్తం హృదయ మధిరూఢో గుణవతాం
అలంకారాన్ సర్వా౯ అపి గళితగర్వాన్ రచయతు.

మనన మహాసాగరము యొక్క ఉదరాంతర్భాగములో నానా క్లేశములను పొంది మునిగిన నాచే (జగన్నాథునిచే) సుందరతరమైన "రసగంగాధరము" అనే మహామణి తీసికొని రాబడినది. ఈ రసగంగాధరమణి అంతరంధకారమును హరించుతూ గుణవంతులహృదయమును అధిరోహించి అలంకారాలను అన్నిటినీ గర్వహీనములనుగా చేయుగావుత. ♦

---

...దివినాడు. కాశీపట్టణములో ఖండదేవుని సన్నిధిని పూర్వమీమాంస అభ్యసించినాడు. ...షవీరేశ్వరుని శిష్యుడై వ్యాకరణవిద్య నేర్చినాడు. పేరుభట్టు సకల విద్యాధరుడు, ...దితర శాస్త్రవేదాదివిజ్ఞాత.

* జగన్నాథునకు పేరుభట్టు జనకుడుమాత్రమే కాదు; విద్యాగురువు. మహా...మహిమశాలి అయిన పేరుభట్టు తన చాతుర్యమువలన పాషాణమునుండికూడా ...పీయూషమును స్రవింపచేస్తాడు. ఆతడు మహాగురువు అట్టి ఆతనికి వందన మని ...పరుస్తుతి. పండితరాజు సకల విద్యలను తండ్రిదగ్గరనె అభ్యసించినాడు. అయినా ...తరుల సన్నిధిలోకూడా శిష్యుడైనట్లు చరిత్రలు చెప్పుతున్నవి. పేరుభట్టు మంత్రోప...దేశము చేసిన మహాదేశికుడు. కనుకనే అందరికన్నా ముందుగా వందనీయుడు అని ...గ్రహించవచ్చును.

♦ పాఠకులకు ప్రరోచన కలుగుటకై ప్రబంధమును ప్రశంసించుట రచయితల ...మర్యాద. కర్త గొప్పదనము కృతిలో బింబించుతుంది. ఆత్మవిశ్వాసము కల పండితకవి ...స్వగతగుణములను చెప్పుట అసముచితము కాదు. జగన్నాథునకు ఈ కావ్యమీమాంస

పరిష్కుర్వ న్త్వర్థాణ్ సహృదయధురీణాః కతిపయే
తథాఽపి క్లేశో మే కథమపి గతార్థో న భవితా
తిమీంద్రాః సంక్షోభం విదధతు పయోధేః పున రిమే
కి మేతే నాయాసో భవతి విఫలో మందరగిరేః.

సహృదయధురీణులయిన కొందరు విద్వాంసులు సాహిత్యపదార్థములను పరిష్కరింతురు గావుత! అయినా ఏ విధముగానూ నా అత్యధిక శ్రమ గతార్థముకాదు. ఈ తిమితిమింగిలాలు సముద్రానికి సంక్షోభము కలుగ జేయు గావుత! అంతమాత్రాన ఏమి ప్రయోజనము ఉన్నది? దీనిచేత మందరగిరి ప్రయాసము విఫలము అవుతుందా? *

---

గముచేసిన ధీశాలి. ఈ విషయము ఈ శ్లోకములో నిరూపిత మవుతున్నది. నానా క్లేశములు పడి, యుక్తిపూర్వక నిరంతరానుచింతనరూప భావనాసాగరోదరాంతర్భాగములో మునకలు మునిగి, రమణీయ నవరసగంగాధర మహామణిని పండితరాజు లోకానికి తీసికొనివచ్చినాడట. ఈ విషయము ఆతని నిశితమైన విద్యావ్యాసక్తిని సూచించు తున్నది. గుణవంతులు, హృదయముకలవారు, ఈ మణిని ఆదరించితే వారి హృదయము పరిష్కృత మవుతుంది. వారి అంతర్ధ్వాంతము అపహృతము అవుతుంది. నిఖిలాలంకార చిరప్రరూఢగర్వము గళిత మవుతుంది. ఇది గ్రంథప్రశంస. ఈ నవరసగంగాధర గ్రంథము బాగా భావితమైనట్లయితే సాహిత్య విషయాజ్ఞానము పోతుందని ఏతదితర నిఖిలాలంకార శాస్త్రగ్రంథములు ఏవీ అవసరము కాదనీ భావము. సర్వసాహితీ నిబంధముల సారము దీనిలో నిబంధింపబడిఉన్న దని తాత్పర్యము.

* సాహితీవిషయములో పూర్వతనుల అనేక గ్రంథా లున్నప్పటికీ ఈ గ్రంథానికి ప్రసక్తిఉన్నదని ఈ పద్యములో నిరూపిత మవుతున్నది. కొందరు సహృదయ పుంగవులు కావ్యార్థములను పలుపద్ధతులలో పరిష్కరించారు. అయినప్పటికీ నా ఈ గ్రంథరచనాక్లేశము గతార్థము కాదు. అనేక తిమింద్రాలు సముద్రములో సంక్షోభమును గలుగజేయవచ్చును. అంతమాత్రాన మందరపర్వత ప్రయాసము విఫల మవుతుందా? దండి, భామహుడు, ఆనందవర్ధనుడు, అభినవగుప్తుడు, కుంతకుడు, రుయ్యకుడు, అప్పయదీక్షితుడు మొదలయినవారు చాలామంది సాహిత్య విషయమును చర్చించారు. కాని కలుగవలసిన ప్రయోజనము ఈ రసగంగాధరమువలననే కలుగుతుంది. మందరమే సాఫల్యమును సంపాదించింది. రసగంగాధరమే సార్థక్యమును చేకూర్చుతుంది. ఇతరులు సాహిత్యసాగరములో చేసిన దంతా సంక్షోభమే.

నిర్మాయ నూతన ముదాహరణానురూపం
కావ్యం మయాఽత్ర నిహితం న పరస్య కించిత్
కిం సేవ్యతే సుమనసాం మనసాఽపి గంధః
కస్తూరికాజననశక్తిభృతా మృగేణ.

ఈ రసగంగాధరములో ఉదాహరణానురూపమైన నూతన కావ్యము నిర్మాణించి నాచేత కూర్చబడినది. ఇతరునిదికొంచెమయినా ఇందులో లేదు. కస్తూరికాజననశక్తిని ధరించిన కస్తూరికామృగము మనస్సుతో నయినా సుమనోగంధమును సేవించుతుందా? దానికి వలె నాకూ (ఇతరములు) అవసరములు కావు. *

మననతరితీర్ణవిద్యార్ణవో జగన్నాథపండితనరేంద్రః
రసగంగాధరనామ్నీం కరోతి కుతుకేన కావ్యమీమాంసాం.

జగన్నాథ పండితరాజు మననమును నావగా చేసికొని విద్యాసముద్ర పారంగతుడు అయినాడు. రసగంగాధరము అనే పేరు కలిగిన కావ్య మీమాంసను కుతుకముతో రచించుతున్నాడు. ఈ కావ్యాలోచనము కుతూహల క్రియ. ♦

---

* ఇతర గ్రంథాలకన్న వేరొక విశేషముకూడా ఇందులో ఉన్నది. ఇతరాలంకారికులు ఉదాహరణావసరము వచ్చినపుడు అన్యదీయ పద్యాలను గ్రహించారు. జగన్నాథుడు ఆ విధముగా కాక ఉదాహరణానురూపమైన నూతన కావ్యమును నిర్మాణించాడు. అది భామినీవిలాసము. దానిలోని శ్లోకములే సామాన్యముగా దీనిలో లక్ష్యములుగా కూర్పబడినవి. కస్తూరికాజననశక్తి కలిగిన కస్తూరికామృగము ఇతర సుమనోగంధమును మనోవీథిలోనయినా సేవించుతుందా? రసగంగాధరములో అపేక్షిత లక్ష్యసామగ్రి అంతా తనదే. లేశముగా నయినా పరకీయత్వభావన అక్కడ అక్కరలేదు. అసమర్థులు పరకీయానుసరణము చేస్తారు. పండితరాజుకు అటువంటి ఆ అవస్థ లేదని భావము.

♦ జగన్నాథుని ప్రతిజ్ఞాపరిచయములు దీనిలో ప్రకటితములు అవుతున్నవి. నిరంతరభావనామయవిమర్శ అనే నౌక ఆధారముగా విద్యాసాగర పారంగతుడు అయిన జగన్నాథ పండితరాజు కుతూహలముతో అనాయాసముగా కావ్యమీమాంసను రచించుతున్నాడు. ఆ కావ్యమీమాంసకు రసగంగాధరము అని పేరు.

రసగంగాధరనామా సందర్భోయం చిరం జయతు
కించ కులాని కవీనాం నిసర్గసమ్యంచి రంజయతు.

రసగంగాధరము అనే ఈ గ్రంథసందర్భము చిరకాలము ఉత్కర్షతో వెలయుగాత. ఇంకా స్వభావరమణీయములు అయిన కవికులములను రంజిల్లచేయుగాత. *

## ౨. కావ్యలక్షణము

కావ్యానికి అనేక ప్రయోజనములు ఉన్నవి. కీర్తి, విగళిత వేద్యాంతరమయిన పరమాహ్లాదము, గురురాజ దేవతా ప్రసన్నత మొదలయినవి కావ్య ప్రయోజనాలు. ఇటువంటి ఈ కావ్యవ్యుత్పత్తి ఇద్దరు వ్యక్తులకు ఆవశ్యకము. వారిలో ఒకడు కవి. ఈతడే కావ్యకర్త. రెండవవ్యక్తి సహృదయుడు. ఈతడు కావ్యానందానుభవిత. కావ్యమర్మవిజ్ఞాత. కావ్యమునుండి ఆనందమును ప్రకాశింపచేయడానికి సహృదయత్వమే ముఖ్యసాధనము. కవికూడా సహృదయుడు అయినప్పుడే కావ్యానందమును అనుభవించగలుగుతాడు. కాబట్టి గుణాలంకార రసభావాదులచే నిరూపింపదగిన ఆ కావ్యవస్తువు ఏమి ? ఎట్టిదానిని కావ్య మనవచ్చును? ఎటువంటి దానిని కావ్య మనరాదు ? ఇట్టి ఈ విషయములను తెలియజేయడానికి కావ్యలక్షణమును నిరూపించవలసి ఉన్నది.

వ్యావహారికలక్షణ మనీ వ్యావర్తక లక్షణమనీ లక్షణము రెండు విధములుగా ఉంటుం దని శాస్త్రమర్యాద. ఇది కావ్యము, ఇది కావ్యము,

---

* పండితరాజు ఆశంసనము ఈ పద్యములో ఉన్నది. సహృదయ పండిత కవులకు సంతోషమును సంపాదింపచేయడానికి కవి ప్రయత్నము చేస్తాడుకదా! రసగంగాధరము అనే ఈ బుద్ధిస్థరచన చిరకాలము సర్వోత్కర్షతో విలసిల్లుగాత. ఇంకా ఈ గ్రంథము నిసర్గ మనోహర కవికులసంతానములను మధురముగా రంజింప చేయుగాత. ఇటుపై సాహితీ జిజ్ఞాస కలిగిన కవు లందరూ దీనినే అనుసరించుతారు. అటుపిమ్మటగూడా ఇది సంప్రదాయముగా భవిష్యత్తులో అందరూ ఈ రసగంగాధర నిరూపిత రసభావార్థమునే స్వీకరించి రంజితులు అవుతారు. ఇది శుభాశంసనము.

అనే వ్యవహారములో ఉపయోగించే లక్షణము వ్యావహారిక లక్షణమవుతుంది. ఇది కావ్యము కాదు, ఇది కావ్యము కాదు, అని కావ్యేతరములను వ్యావర్తింప చేయుటలో ఉపయోగించే లక్షణము వ్యావర్తక లక్షణము అవుతుంది. కావ్యము గుణాలంకారరసభావాదివిశిష్టమై ఉంటుంది. గుణాలంకారాదులు విశేషణాలు. కావ్యము విశేష్యము. విశేష్యముగా తెలియదగిన కావ్యములో కావ్యత్వము విశేష్యతావచ్ఛేదకము అవుతుంది, విశేష్యతావచ్ఛేదకరూపముగా ఉండే లక్షణము వ్యావహారిక మవుతుంది. ఇదే కావ్యానికి కావ్యేతరముకంటె, అనగా అకావ్యముకంటె భేదమును బోధించుటలో సాధనము అవుతుంది. తదితరభేదబుద్ధిసాధనముగా ఉండేది వ్యావర్తకలక్షణ మవుతుంది. ఇట్టి కావ్యలక్షణము నిరూపింపబడుతున్నది.

## రమణీయార్థ ప్రతిపాదకశబ్దః కావ్యమ్.

రమణీయార్థ ప్రతిపాదనము చేయు శబ్దము కావ్యము అని కావ్యలక్షణము. రమణీయ, అర్థ, ప్రతిపాదక, శబ్ద అనే లక్షణశరీరంలోని ఈ నాలుగు పదములూ సార్థకములు. రమణీయ కటాక్షాదికము కూడా రమణీయార్థమును ప్రతిపాదింప వచ్చును. అయినా అది శబ్దము కాదు కాబట్టి కావ్యముకాదు. వ్యంగ్యమును చెప్పు శబ్దముకూడా కావ్యమే. దాని సంగ్రహమునకే 'వాచక' పదమును విడిచి 'ప్రతిపాదక' శబ్దము గ్రహింపబడినది. వ్యాకరణము రమణీయ శబ్దప్రతిపాదకమే కాని రమణీయార్థప్రతిపాదకము కాదు. కాబట్టి అది కావ్యముకాదు. అందువలననే ఈ లక్షణానికి అక్కడ అతివ్యాప్తి లేదు. 'ఘటమును తెమ్ము' అనే శబ్దము సామాన్యముగా అర్థమును ప్రతిపాదించు తున్నది. అయినా అది రమణీయార్థప్రతిపాదకము కాదు. మొత్తముమీద లక్షణములోని ఏకైకాంశము కల వానిని కావ్యముగా వ్యవహరింపరాదని సారాంశము. శబ్దము కావ్యము, ప్రతిపాదక శబ్దము కావ్యము, అర్థప్రతిపాదకశబ్దము కావ్యము, అను మూడులక్షణములూ అతివ్యాప్తిదోషదుష్టములు. కాబట్టి పైని చెప్పిన విధాన దోషాలను పరిహరించుకొని, - 'రమణీయార్థ ప్రతిపా

దక శబ్దము 'కావ్యము' - అని కావ్యలక్షణమును చెప్పుట సముచిత
పక్షము.

రమణీయత్వము అనుగతముగా లేదు. దాని స్వరూపపరిజ్ఞానము ఆవశ్య
కము. ఒక్కొక అర్థమును పునఃపునరనుసంధానము చేయగా అలౌకికా
నందము కలుగుతున్నది. ఆ ఆనందమునే లోకోత్తరాహ్లాదము అని
అంటారు. లోకోత్తరత్వమునకే చమత్కారము అని పేరు. ఇది అనుభవ
సాక్షికము. ఇది ఒక జాతి విశేషము. ఇట్టి లోకోత్తరాహ్లాదజనక
జ్ఞానగోచరత్వమే రమణీయత్వము. ఈ లోకోత్తరత్వములో సహృద
యుల అనుభవమే ప్రమాణము. 'నీకు పుత్రుడు ఉదయించినాడు' 'నీకు
ధన మిస్తాను' అనే లౌకికవాక్యాలను ఎన్ని పర్యాయములు భావన
చేసినా ఆ జ్ఞానమువలన లోకోత్తరాహ్లాదము కలుగదు. అక్కడ కలిగే
ఆనందము లౌకికము కాని అలౌకికముకాదు. కాబట్టి ఆ వాక్యాలను
కావ్యముగా వ్యపదేశించరాదు. కాగా చమత్కారమును కలుగచేసే
భావన కలదో, ఆ భావనావిషయమైన ఏ అర్థము కలదో, అట్టి
ము[illegible]నకు ప్రతిపాదకమైన శబ్దము కావ్య మని తేలినది. అందువలన
చమత్కారజనకభావనావిషయార్థ ప్రతిపాదక శబ్దము కావ్యము అని
సారార్థము.

ఇక్కడ లక్షణమును వేరొకవిధముగా కూడా భావించాలి. పూర్వము
చెప్పినవిధముగా లక్షణమును అంగీకరించితే ఒక దోషము వాటిల్లు
తున్నది. ఒకచోట కావ్యము కాదగిన వాక్యము, కావ్యము కాదగని
వాక్యము రెండూ కలసి ఉన్న వనుకొనండి. అక్కడ ఉన్న ఆనుపూర్వి
అంతటివలనా చమత్కారము కలగడములేదు. సమూహాలంబనక
ముగా చమత్కారము కలుగుతున్నట్లే అచమత్కారముకూడా కలుగు
తున్నది. అటువంటి కావ్యాకావ్యోభయ విషయకజ్ఞానము ఉన్నచోట
పైనిచెప్పిన లక్షణానికి అతిప్రసక్తి కలుగుతున్నది. ఈ విషయమునే
ఈ విధముగా గ్రహించాలి. ఈ చెప్పిన స్థలములో రమణీయార్థ ప్రతి
పాదకశబ్దము ఉన్నందువలన ఆ వాక్యమును కావ్య మనవచ్చును.
అక్కడనే చమత్కారజనక భావనావిషయార్థ ప్రతిపాదకశబ్దముల

కంటె భిన్నములయిన ఇతరశబ్దాలు కూడా ఉన్నవి. వానికి కావ్యత్వము ఇష్టముకాదు. పూర్వముచెప్పిన విధముగానే లక్షణ భావనచేస్తే ఈ చెప్పిన స్థలములో కావ్యత్వము అంగీకరించినప్పుడు కావ్య మన జెల్లని తద్గతకతిపయశబ్దాలకు కూడా కావ్యత్వము కలుగుతున్నది. కాబట్టి అతి వ్యాప్తిదోషము వాటిల్లు తున్నదన్నమాట. అందువలన కావ్యలక్షణ మును ఈ విధముగా గ్రహించాలి. ఎటువంటి ఆనుపూర్వి కలిగిన శబ్దములచేత ప్రతిపాదింపబడిన అర్థమును విషయనుగా చేసికొనిన విశిష్టభావన చమత్కారజనకము అవుతుందో అటువంటి ఆనుపూర్వి ఉన్నప్పుడు మాత్రమే కావ్యత్వమును అంగీకరించాలి. ఇప్పుడు పైని చెప్పిన దోషబాధ రాదు. కొన్ని కొన్ని శబ్దాల ఆనుపూర్వి ఒక్కొక్క విధమైన అర్థమును ప్రతిపాదించుతుంది. ఆ అర్థముయొక్క భావన వలన మనస్సులో చమత్కారోత్పత్తి కలుగుతుంది. అటువంటి చమత్కార జనిక అయిన భావనలో ఆ విధమైన శబ్దానుపూర్వి ఉండి తీరాలి. ఆ విధముగా ఉన్నప్పుడే కావ్యము అవుతుందని ఆశయము. అట్టి ఆనుపూర్వి లేనప్పుడు కావ్యము కాదు. అందువలన ఏమీ అతి ప్రసక్తి లేదు.

నైయాయికరీతిని అనుసరించి లఘుభూతమైన లక్షణమును గ్రహింప వలె నంటే 'చమత్కారత్వవత్త్వం కావ్యత్వం' అని ఫలితార్థమును భావింపవచ్చును.

చమత్కారయుక్తత్వము కావ్యలక్షణము. చమత్కారత్వమనేది ఆయా కావ్యాలవలన కలిగే చమత్కారము అంటే లోకోత్తరములయిన ఆహ్లాదము లన్నిటిలోనూ ఉండే ఒక జాతివిశేష మన్నమాట. ఆ చమత్కారత్వమనే జాతి సమవాయసంబంధముచే చమత్కారము లన్నిటి లోనూ ఉంటుంది. "కావ్యము శబ్దరూపముకదా! దానియందు చమత్కారము ఏ విధముగా ఉంటుంది?" అనే శంక కలుగవచ్చును. ఆ శంకానివారణమునకు ఈ సంబంధమును గ్రహించాలి. ఇక్కడ "స్వవిశిష్టజనకతావచ్ఛేదకార్థ ప్రతిపాదకత్వ" మనేది సంబంధము.

సంబంధము ఉన్నచోట సంబంధి తప్పకుండా ఉంటుంది. పర్వతమందు వహ్నిసంయోగము ఉన్నపుడు సంయోగసంబంధముచే సంబంధిఅయిన వహ్ని పర్వతమందు ఉంటుంది. అట్లాగే పైని చూపిన సంబంధముచే చమత్కారత్వవత్త్వము కావ్యరూపశబ్దమందు ఉంటుంది కాబట్టి లక్షణ సమన్వయము కుదురుతుంది.

ఆ సంబంధము ఏ విధముగా ఉన్నదో చూడండి. కావ్యార్థజ్ఞానము కలుగగానే చమత్కారము ఉదయించుతుంది కాబట్టి కావ్యార్థజ్ఞానము చమత్కార కారణము. సంబంధములో ఉన్న "స్వవిశిష్ట" పదానికి చమత్కారత్వ విశిష్టమయిన చమత్కారము అని అర్థము. దానికి జనకము కావ్యార్థజ్ఞానము. కారణ మవుతున్న జ్ఞానములో అర్థము విశేషణము. కారణములోని విశేషణము కారణతావచ్ఛేదక మని శాస్త్రీయ సంకేతము. ప్రకృతములో కావ్యార్థజ్ఞానము చమత్కారజనకము కాబట్టి కావ్యార్థము చమత్కారజనకతావచ్ఛేదక మయింది. కావ్యరూపశబ్దము అటువంటి అర్థానికి ప్రతిపాదకము. ఆ అర్థప్రతిపాదకత్వము కావ్యరూప శబ్దమం దున్నది.

చమత్కారత్వానికి కావ్యరూపశబ్దముతో పై సంబంధము ఉన్నది. సంబంధము ఉన్నట్లయితే ఆ సంబంధముచే సంబంధిఅయిన చమత్కారత్వము కావ్యరూపశబ్దమందు ఉండక తప్పదు. ఆయా కావ్యాలవలన కలిగే చమత్కారాలు భిన్నభిన్నము లయినా వానియందు ఉండే చమత్కారత్వము ఒకటే కాబట్టి పై సంబంధముచేత చమత్కారత్వవత్త్వము కావ్యా లన్నిటిలోనూ ఉన్నందువలన అన్ని కావ్యాలలోనూ లక్షణము సమన్వయింపవచ్చును.

## ప్రాచీన లక్షణ ఖండనము

ఇంతవరకూ పండితరాజ కావ్య లక్షణము. ప్రాచీన సాహిత్యాచార్యులతో కొన్ని విషయాలలో ఈతడు ఏకీభవించడు. సాహిత్య శాస్త్ర ప్రాచీనాచార్యుడు కావ్యప్రకాశకర్త అయిన మమ్మటుడు మొదలయిన వారు ప్రాచీనులుగా చెప్పతగినవారు.

"అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్యం"

అని ప్రాచీనలక్షణము. దోషరహితములు గుణసహితములు అలంకారయుక్తములూ అయిన శబ్దార్థములు కావ్యమని లక్షణభావము. ఈ విషయమును ముందుగా విమర్శించవలసి ఉన్నది. శబ్దార్థములు రెండూ కావ్యము అని వ్యవహరించుట ఉచితము కాదు. ఆ విధముగా పలుకుటలో ప్రమాణము లేదు. బాగా విచారించితే, శబ్దవిశేషమే కావ్యమని నిరూఢము అవుతున్నది.) "కావ్యము బాగా పఠింపబడుతున్నది" "కావ్యము వలన అర్థము తెలుస్తున్నది." "కావ్యము వినబడినది." "అర్థము తెలియలేదు" ఇటువంటి సర్వసాధారణ వ్యవహారాలు శబ్దానికే కావ్యత్వమును సిద్ధము చేస్తున్నవి. కాని, అర్థానికి కావ్యత్వమును ధ్రువ పరచడములేదు.

ఇక్కడ ప్రాచీనవాదులు ఈవిధముగా అనవచ్చును. "శబ్దార్థములు రెండూ కావ్యమయినా "శబ్దము మాత్రమే కావ్యము" అనే విశ్వజనీన వ్యవహారమును కుదురుపాటు చేసికొనడానికి లక్షణను ఆశ్రయించాలి. కుదురుపాటు లేని వానిని లక్షణ కుదుర్చుతుంది గదా! అని."

ఇది సరికాదు. కావ్యశబ్దము యొక్క ముఖ్యప్రయోగము శబ్దార్థముల రెండిటినీ అవలంబించి ఉన్నట్లు ఏదైనా దృఢప్రమాణము ధ్రువపరచితే పైనిచెప్పిన లక్షణను అంగీకరించవచ్చును. కాని అటువంటి ప్రమాణము ఏమీ కనపడడము లేదు. "శబ్దార్థయుగళము కావ్యము" అనే విషయములో ప్రమాపకము అయిన దృఢతరప్రమాణము లేనప్పుడు పైని చెప్పిన లక్షణను అంగీకరించ రాదు. కావ్యప్రకాశకారాదుల వచనము ఈ విషయములో ప్రమాణము కాదు. వారిపై ప్రమాణబుద్ధి ఉన్నపుడు కదా వారి వచనానికి ప్రామాణ్యము ఉండేది! ఎవరితో అభియోగము ఉన్నదో వారి కథనానుసారముగా నిర్ణయము చేయరాదు. మమ్మటాదులతో మాకు మతభేదము ఉన్నది. అందువలన విమతవాక్యము అశ్రద్ధేయముకాగా కావ్యశబ్దానికి శబ్దార్థయుగళమందు శక్తిగ్రాహక ప్రమాణము ఏమీ లేదని తేలిన అర్థము. పైని చెప్పిన సార్వజనికవ్యవహారము శబ్దమే కావ్యము అని నిశ్చయపరచుతున్నది.

కావ్యశబ్దానికి శబ్దవిశేషమందే శక్తి ఉన్నట్లు సిద్ధాంతపరచుతున్నదని భావము. శబ్దమందే ప్రసరించే శక్తిని వారించటానికి ఎవరు పూను కొంటారు ?

ఈ వాదమువలన "శబ్దమే కావ్యము" అనుటలో సాధకయుక్తి లేదు. అర్థమే కావ్యము అనుటలో కూడా సాధకప్రమాణము లేదు. వినిగమకము ఏమీ లేనందువలన "శబ్దమూ అర్థమూ రెండిటియందూ శక్తిని అంగీకరించాలి" అనే వాదము కూడా పరాస్తము అవుతున్నది.

కాగా శబ్దవిశేషమే కావ్యపదార్థము అని సిద్ధమైనది. కాబట్టి దానికే లక్షణము చెప్పుట యుక్తము. కాని తాము ఏమో కల్పించినదానికి లక్షణకథనము ఆవశ్యకముకాదు, యుక్తమూ కాదు. వేదపురాణాది లక్షణాలలోకూడా ఈ వ్యవస్థనే అనుసరించాలి. అంటే వానిని కూడా శబ్దరూపములనుగానే తెలిసికోవాలి. వానికే లక్షణము చెప్పాలి. కాక పోతే ఈ దురవస్థ తప్పదు.

శబ్దార్థములు రెండిటికీ కావ్యత్వమును అభిమానించే కొందరు ఈ విధముగా చెపుతారు. "రసోద్బోధకత్వమే కావ్యత్వము. అనగా మన అంతరాత్మకు ఆనందాస్వాదమును సంపాదింపగలిగేది అయితేనే కావ్యము అన్నమాట. ఏది ఆనందాస్వాదమును ఇవ్వగలదో అది కావ్యము. శబ్దము రసోద్బోధకము కావచ్చు. అర్థమూ రసోద్బోధకము కావచ్చు. ఆస్వాదోద్బోధకత రెండింటిలోనూ సమానమే. కాబట్టి శబ్దార్థములు రెండిటినీ కావ్యము అనుట యుక్తియుతముగా ఉంటుంది అని. ఈ వాదము సముచితము కాదు. రసోద్బోధకమైన ప్రతీదీ కావ్యము కాదగదు. అట్లాగే అయితే గీతమూ రాగమూకూడా కావ్యమే కావాలి. లక్షణీయమూ కావాలి. రాగము రసవ్యంజకము అవుతుందని ధ్వనికారాది సకలసాహితీవిదులకూ సమ్మతము. ఈ విషయములో బహుకథనము ఆవశ్యకముకాదు. రసవ్యంజకమైనదల్లా కావ్యమే అయితే నృత్యవాద్యాది నాట్యాంగములన్నీ సామాన్యముగా అటువంటివే కాబట్టి వాటిలో కావ్యత్వము ఉన్నదనవలసివస్తుంది. అవి రసో

ద్బోధకములు అయినా కావ్యములు అని ఎవరూ అనరు. దీనివలన రసోద్బోధన సమర్థత్వము కలది లక్ష్యము అవుతుంది అనే వాదము కూడా పరాస్త మవుతున్నదని గ్రహించాలి.

శబ్దార్థములు రెండూ కావ్యపదవాచ్యములు అనే విషయమును ఇంకా కొంత విమర్శించాలి. ఈ విమర్శలో ముందుగా ఈవిధముగా వికల్పించ వలసి ఉన్నది. శబ్దమూ అర్థమూ రెండూ కలిసి కావ్యమా? శబ్దము కావ్యము, అర్థము కావ్యము అనేరీతిగా శబ్దార్థముల రెండిటియందూ కావ్యవ్యవహారము ఉన్నదా? అనేదే ఇచటి వికల్ప స్వరూపము. కావ్య పద ప్రవృత్తిలో ఏది నిమిత్తము? శబ్దార్థములు రెండూ కలిసి నిమి త్తమా? శబ్దమూ, అర్థమూ వేరువేరుగా నిమిత్తములా? అని వికల్ప తాత్పర్యము. ఇక వీనిని పరిశీలించుదాము.

శబ్దార్థములు రెండూకలిసి కావ్యనామముతో వ్యవహరింపబడుతున్నవని అనుట (ప్రథమపక్షము) సముచితముకాదు. ఇక్కడ ఈవిషయమును భావించాలి. ఒకటీ ఒకటీ కలసి రెండు అవుతున్నది. రెండు ఒకట్ల సమ్మేళనా నికి రెండు అని వ్యవహారము. ఒకట్లు రెండుకు అవయవాలు. ప్రత్యేక ముగా అవయవముగా ఉన్న ఏ ఒకటినీ కూడా మనము రెండు అని వ్యవహరించము. "ఏకో న ద్వౌ". ఈవిధముగా "శ్లోకవాక్యము కావ్యము కాదు" అనే వ్యవహారము రావలసి వస్తుంది. శ్లోకవాక్య మనేది కావ్యా నికి ఒక అవయవము అయిన కేవల శబ్దమే కదా! అపుడు శబ్దానికి కూడా సమ్మతమైన కావ్యవ్యవహారము లేకపోవలసి వస్తున్నది. ఇట్లాగే అయితే పూర్వోక్త వ్యవహారము సర్వథా ఉచ్ఛిన్న మవుతుంది.

ఇక ప్రత్యేకముగా శబ్దమూ అర్థమూ కావ్య మని వ్యవహరించడము కూడా సమ్మతము కాదు; సముచితమూ కాదు. అట్లాగే అయితే ఒకే పద్యములో శబ్దార్థములు రెండూ ఉండడమువలన "రెండు కావ్య ములు" అనే వ్యవహారము రావలసి వస్తుంది. అటువంటి వ్యవహృతి యుక్తముకాదు.

కాబట్టి వేదశాస్త్ర పురాణలక్షణము శబ్దనిష్ఠముగా ఉన్నట్లు కావ్యలక్షణముకూడా శబ్దనిష్ఠముగా ఉండడమే సముచితముగా ఉంటుంది; అంటే శబ్దమునే కావ్యముగా భావించాలి కాని శబ్దార్థముల రెండిటినీ కావ్యమనరాదు అని తాత్పర్యము. ఇంతవఱకు కావ్యపదవ్యవహారము ఏదో పరిశీలింపబడినది.

ప్రాచీనాచార్యులు కావ్యలక్షణములో శబ్దార్థాలకు "సగుణౌ సాలంకారౌ" అని విశేషణాలను ఉంచినారు. వీనిని విమర్శించాలి. కావ్యలక్షణములో గుణాలంకారాదినివేశము కూడా యుక్తము కాదు. 'ఉదితం మండలం విధోః" విధు మండలము ఉదయించినది, "గతో஽స్తమర్కః" సూర్యుడస్తంగతుడయినాడు అనే వాక్యాలలో కావ్యలక్షణము అవ్యాప్తము అవుతున్నది. వీనిలో గుణాలంకారములు లేవు. ఇవికావ్యము కాదు అనడము ఉచితముకాదు. చమత్కారమే కావ్యజీవితము. ఈ వాక్యాలు చమత్కారమును కలుగజేయకపోవడము లేదు. ఇటువంటి రమణీయవాక్యాలుకూడా కావ్యముకాదు అనేటట్లయితే, వారు దేనిని 'కావ్యము'అని అంటారో దానిని మేముకూడా 'కావ్యము కాదు' అని అనడానికి అవకాశము ఉండకపోదు. గుణాలంకారాలు లేకపోయినా చమత్కారిత్వము ఉన్నపుడు 'కావ్యము' అని అనుట సముచితముగా ఉంటుంది.

పైనిచెప్పిన వచనాలవలన విజాతీయములయిన నానాచమత్కారములు భాసించుతున్నవి. విధుమండలము ఉదయించినది అను వచనము దూతి పలికినది అయితే "చక్కగా వెలుతురు ఉన్నది, ఈవెన్నెల ఉద్దీపకముగా ఉన్నది, ఇది అభిసరించడానికి సమయము" అని వ్యంగ్యము గోచరించుతుంది. అభిసారిక పలికితే "అమ్మా! ఈ వెలుతురులో అభిసరించితే ఎవరైనా చూస్తారు. గుర్తుపట్టుతారు. రహస్యభంగమవుతుంది కాబట్టి ఇప్పుడు అభిసరించరాదు" అని వ్యంగ్యము. విరహిణీ వచనమైతే "ఇప్పటికీ ప్రియుడు రాలేదుకదా! ప్రాణాలు ఎట్లా నిలుపగలను? నేను జీవించలేను" అని వ్యంగ్యము. ఇటువంటి రమణీయార్థాలు ఎన్ని అయినా భాసించవచ్చును.

సూర్యుడు అస్తంగతుడయినాడు అనే వచనమువలన కూడా నానార్థములు భాసించుతున్నవి. ఈవచనము చౌర్యప్రకరణములోనిది అయితే "ఇప్పుడు దొంగతనానికి సమయము" అనీ, అభిసారికా విషయమయితే "అభిసరణము ఉపక్రమించవలసినది" అనీ, సంకేతింపబడిన నాయికా విషయమయితే "నీ ప్రియుడు వచ్చినట్లే" అనీ, కార్మికులు పలికినదయితే "ఇక పనినుండి విరమించుదాము" అనీ, వటువులను ఉద్దేశించినది అయితే "సంధ్యావిధిని ఉపక్రమించవలసినది" అనీ, బాలునిగురించి అయితే "దూరము వెళ్ళవద్దు" అనీ, గోపాలకవిషయకమయితే "గోవులను చావడిలోనికి ప్రవేశపెట్టుము" అనీ, తాపార్త విషయమయితే "ఇప్పుడు పరితాపము కలుగదు" అనీ, వాణిజక విషయ మయితే "వ్యాపారము కట్టిపెట్టాలనీ, విరహోత్కంఠిత పలికిన దయితే "నా ప్రియుడు ఇప్పటికీ రాలేదుగదా!" అనీ, నానావిధముగా వ్యంగ్యము గోచరము అవుతున్నది. ఇటువంటి మనోహర వాక్యాలలో గుణాలంకారాలు లేక పోయినంతమాత్రాన కావ్యత్వానికి లోటు ఉంటుందా?

గుణత్వము, అలంకారత్వము మొదలయినవి అనుగతములుకూడా కావు. గుణత్వము అలంకారత్వము మాఢిగా వేటిలో ఉండవో ఇప్పటికీ ఇంకా నిశ్చితము కాలేదు. వాని సంఖ్యకూడా ఇంకా నియతము కాలేదు. ఆయా ఆలంకారికు లందరూ తమతమ విచారధారానుసారముగా వానిని నిబంధించుతున్నారు కాబట్టి గుణాలంకారాలకు లక్షణములో సమావేశము సముచితము కాదు. గుణాలంకారాలకే స్వరూపనిశ్చయము సరిగా లేనప్పుడు వానిని అనుసరించి కావ్యలక్షణమును తెలిసికోగలమా? గుణాలంకారాలకు ఒక విధమైన అనుగమము ఉన్నదని తలచేవారి భావమును ఈ విధముగా తెలిసికొనవచ్చును—"గుణములు కావ్యధర్మాలు లేక రసధర్మములు, అలంకారాలుకూడా కావ్య శోభాసంపాదకములు అనిగాని కావ్యధర్మములు అనిగాని నిశ్చయింప వచ్చును. ఈ విధముగా గుణాలంకారములకు అనుగమము ఉన్నది. వేనిలో ఈ చెప్పిన ధర్మాలుంటవో వానిని గుణాలనుగా అలంకారాలనుగా గ్రహింపవచ్చును. వాని సంఖ్య నియతము కానందువలన హాని యేమీలేదు" అని.

కాని ఇక్కడ విషయవిమర్శ ఈ విధముగా ఉన్నది. లక్షణములో కేవలమూ గుణములూ అలంకారములూ మాత్రమే అనుపాదేయములు అని కాదు. వానితోపాటు "దోషరహితములు" అనే విశేషణము కూడా వ్యర్థమే. లోకములో "ఈ కావ్యము దుష్టము" అనే వ్యవహారము ఉన్నది. దీనినిబట్టి "దోషరహితమే కావ్య మన నక్కర లేదు; దోషసహితముకూడా కావ్యము కావచ్చును అని తేలుచున్నది. దోషసహితమందుకూడా కావ్యపదప్రయోగము ఉన్నదే! కావ్యలక్షణములో "అదోషౌ" అనేపదము ఇంకా ఎందుకు? "దోషరహితమేకావ్యము" అనే పట్టుదల ఉంటే లోకవ్యవహారమునకు ఉపపత్తి ఏవిధముగా కుదురుతుంది? లక్షణతో ఉపపన్నము చేసికోమంటారా? అది అనుచితము. లక్షణహేతువులు లేనిదీ లక్షణను అంగీకరించుట శాస్త్రమర్యాద కాదు. ముఖ్యార్థానికి బాధ ఉపస్థితము కాకపోతే లక్షణావ్యవహారములేదు. ముఖ్యార్థబాధ, ముఖ్యార్థ సంబంధము, రూఢి, ప్రయోజనము ఇవి ఉన్నప్పుడే లక్షణ ప్రసరించుతుంది. ఇక్కడ అవి ఏవీ లేవు. కాబట్టి లక్షణ కుదరదు.

ఇక్కడ ఇది పరిశీలనార్హము. ఒక చెట్టుబోదెపై ఒక విహంగము ఉన్నదనుకోండి. ఆ విహగము శాఖపై లేదు. వృక్షము ఒక స్థానములో మాత్రము విహగముతో సంయోగము కలిగి ఉన్నది. వేరొక స్థానములో (శాఖపై) విహగసంయోగాభావము కలిగి ఉన్నది. ఆ వృక్షానికి అంతటా విహగసంయోగము లేదన్నమాట. ఆ విధముగా సంయోగరహితమైనా ఏకాంశములో సంయోగము ఉన్నది కాబట్టి ఆ చెట్టు సంయోగి అనబడవచ్చును. ఇది ఒక యుక్తి. ఈ విధానమును అనుసరించి 'దుష్టం కావ్యం' అనే లోకవ్యవహారాన్ని కుదర్చవచ్చును. ఇతర సర్వస్థానాలలో దోషరహితముగా ఉండడము వలన 'కావ్యము' అనవచ్చును. ఏకాంశములో దోషసహితముగా ఉండడమువలన 'దుష్టము' కూడా కావచ్చును. 'సంయోగరహిత వృక్షము సంయోగి' అన్నట్లుగా అంశభేదాన దోషరహిత మనీ, అంశభేదాన దుష్టమనీ భావించి లోకవ్యవహారమును సరిపెట్టుకోరాదా? అని శంక.

ఈ వాదము యుక్తముకాదు. వృక్షముపై విహగమును చూచిన మానవులకు ఈ ప్రతీతి కలుగుతుంది: "ఈ వృక్షముయొక్క బోదెకు విహగసంయోగము ఉన్నది కాని శాఖకు విహగసంయోగము లేదు" అని. "దుష్టం కావ్యం"అనే వ్యవహారమును పైవిధముగా కుదర్చదలచుకొంటే "ఈ పద్యము పూర్వార్ధములోనే కావ్యము, ఉత్తరార్ధములో కావ్యము కాదు" అనే ప్రతీతి కలుగవలసి వస్తుంది. ఇటువంటి ప్రతీతి ఎవరికీ ఉండదు. ఇది స్వరసమూ కాదు. ఇందులో విశ్వజనీనానుభవమూ లేదు. దృష్టాంతబలమును బట్టి సహృదయానుభవమును అపలాపము చేయుట అసంభవము. ప్రత్యక్షగోచరము అయ్యే విషయాన్ని దృష్టాంతముతో అడ్డు పెట్టలేముకదా!

ఇంకా శూరత్వము, వీరత్వము, ధీరత్వము అనేవి ఆత్మధర్మాలు. అట్లాగే గుణాలు కావ్యాత్మ అయిన రసముయొక్క ధర్మాలు. హారాదులు శరీరమును అలంకరింప జేయునట్లు ఉపమాద్యలంకారాలు కావ్యమును అలంకరింపజేయ గలవు. వీరత్వాదులూ హారాదులూ శరీరముయొక్క నిర్మాణములో ఉపయోగింపనట్లుగా గుణములూ అలంకారాలూ కావ్యముయొక్క శరీరమును సిద్ధింపచేయడానికి గాని, స్వరూపలక్షణ సంపాదనకు గాని ఉపయోగించవు. కాబట్టి కావ్యశరీరములో గుణాలంకారాలకు ఘటన ఉపపన్నము కాదు.

## నవీన లక్షణ ఖండనము

ప్రాచీనాచార్యుల పద్ధతి పైవిధముగా ఉన్నది. నవీనులలో సాహిత్యదర్పణకర్త అయిన విశ్వనాథ కవిరాజు ప్రసిద్ధుడు. ఇక ఆతని కావ్యలక్షణపరీక్ష చేయాలి. "వాక్యం రసాత్మకం కావ్యం" అని కవిరాజు కావ్యలక్షణము చెప్పుతున్నాడు. రసపదము ఉపలక్షకము. కాబట్టి రసభావ తదాభాసాదులను రసపదముచే గ్రహించాలి. ఇటువంటి రసమే ఆత్మగా, స్వరూపభూతముగా, సారరూపముగా, సత్తాస్థాపకముగా, ఉన్నట్లయితే అటువంటి కావ్యమే కావ్యము అవుతుంది అని లక్షణభావము. రసమున్నదే కావ్యమని విశ్వనాథుని నిర్ణయము.

ఇది సరికాదు. కావ్యాలు అనేకవిధాల ఉన్నవి. కొన్ని రసప్రధానములు, కొన్ని అలంకార ప్రధానాలు, మఱికొన్ని వస్తుప్రధానకాలు. వర్ణింపబడే వస్త్వలంకారములు కావ్యాలలో స్వమాత్రచారుత్వముతో ఉండడమును సహృదయులు గ్రహించుతూనే ఉన్నారు. రసయుక్తమే కావ్యమని అనుకుంటే వస్త్వలంకారవర్ణన ప్రధానముగా ఉన్నవానిని కావ్యము కాదనవలసి వస్తున్నది. అటువంటివి కావ్యములే కావు అని మీరు అనుట సముచితముకాదు. మహాకవుల సంప్రదాయము, ప్రాచీన పరిపాటి అంతా భగ్నమై పోతుంది. ప్రాచీన సిద్ధకవు లందరూ ఆయా స్థానాలలో తగినట్లుగా జలప్రవాహమును, వేగపద్ధతిని, ప్రపాతమును, సముచ్ఛలనమును, భ్రమణమును వర్ణించారు. కపి బాలాది విలసితములను నిరూపించారు. వీనిలో రసము లేదుగదా! అంతమాత్రాన కావ్యము కాదని సంప్రదాయసముచ్ఛేదము చేస్తారా ? ఈ వర్ణనలు ఉంటే కావ్యాలు కావా ? ఇవి కావ్యములే అని పెద్దలు అంగీకరించుతున్నారు.

ఏదోవిధముగా పరంపరగా వీటిలోకూడా రసస్పర్శ ఉన్నది కాబట్టి ఇవి కావ్యములు కావచ్చునని అన్నట్లయితే "గౌ శ్చలతి" "మృగో ధావతి" గోవు వెళ్ళుతున్నది, మృగము పరుగెత్తుతున్నది అనే వాక్యాలుకూడా కావ్యమే అని అంగీకరించాలి. ఏదోవిధముగా రసస్పర్శ ఇక్కడకూడా ఉండకపోతుందా ? జగత్తులో ఏవస్తువైనాసరే రసపర్యవసానము పొంది తీరుతుంది. జలప్రవాహవేగపతనాదులు ఉద్దీపనవిభావరూపముగా రసస్పర్శకలిగి ఉన్నట్లు ఈవాక్యాలుకూడా విభావానుభావ వ్యభిచారిభావాలలో ఏదో ఒకదానిపర్యవసానము పొందవచ్చును. ఏ పదార్థమైనా విభావాదిరూపము కాకమానదు. కాబట్టి కవిరాజు కావ్యలక్షణముకూడా బాగాలేదు. మొత్తముమీద ప్రాచీననవీనలక్షణాలు ఏవీ యుక్తముగా లేవని గ్రహించాలి.

## కావ్యకారణము

ఇటు పిమ్మట కావ్యకారణమును పరిశీలించాలి. ఇది లేకపోతే కావ్యరచన బయలు దేరదు. కావ్యకారణము ఏమిటి అనే విషయములో

ప్రాచీనులకూ పండితరాజుకూ మతభేదము ఉన్నది. కేవలమూ కవిగతమైన ప్రతిభ ఒక్కటే కావ్యకారణము అని జగన్నాథవాదము. "ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా" అని సామాన్యముగా ప్రతిభాస్వరూపమును పెద్దలు చెప్పుతున్నారు. కావ్యరచనకు ఏయే శబ్దాలు కావలెనో, ఎటువంటి అర్థము అనుకూలము అవుతుందో, అటువంటి శబ్దార్థముల ఉపస్థితిని ప్రతిభ సంపాదించుతుంది. కావ్యఘటనలో కొన్ని కొన్ని శబ్దార్థములే ఆవశ్యకములు అవుతూ ఉంటవి. ప్రతిభ ఉన్నట్లయితే కావ్యక్రియలో కవికి వ్యామోహము కలుగదు.) కార్యసిద్ధతకు ఉపయోగించే వానిని దీనివలన కవి మరచి పోవడమంటూ ఉండదు.

ప్రతిభ కావ్యకారణము) ఏపదార్థమునకైనా సరే కారణము అయ్యేది ఏదో ఒక ధర్మమును కలిగి ఉండాలి. కారణములో ఉన్న విశిష్ట ధర్మానికి కారణతావచ్ఛేదకధర్మము అనిపేరు. ఆ ధర్మమునే జాతి అంటారు. కాబట్టి ప్రతిభలో ఉన్న (ప్రతిభాత్వము కావ్యకారణతావచ్ఛేదకరూపముగా సిద్ధమైన జాతివిశేషము) అని అంగీకరింపవచ్చును. ప్రతిభాత్వ మనేది అఖండమైన ఉపాధిరూపమని జగన్నాథుని నిరుక్తి. ఈ ప్రతిభ కలుగుటలో రెండు కారణములు ఉన్నవి. ఇష్టదేవికిగాని మహాపురుషులకు గాని ప్రసన్నత కలిగితే వారి అనుగ్రహాదులవలన ఒక అదృష్టభాగ్యము సముత్పన్నము కావచ్చును దానివలన కావ్యధార అవిరతంగా ప్రసరించుతుంది. ఒక్కొక్క రూపమైన ప్రతిభలో ఇది కారణముగా ఉంటుంది. ఇది మొదటి కారణము. ఒక్కొక చోట విలక్షణవ్యుత్పత్తి, కావ్యరచనాభ్యాసము రెండూ ప్రతిభా హేతువులు అవుతూ ఉంటవి. ఇది రెండవ కారణము.) ఈవిధముగా చెప్పడమే సముచితముగా ఉంటుంది.

కొందరు అదృష్టము, వ్యుత్పత్తి, అభ్యాసము అనే ఈ మూడూ సమ్మిళితరూపాన కారణము అని అంగీకరిస్తారు. అది సముచితము కాదు. కొందరు పిల్లలకూ అబోధహాతులకూ వ్యుత్పత్త్యభ్యాసములు లేకపోయినా కేవలము మహాపురుషప్రసాదమువలనకూడా ప్రతిభ కలు

గుట ప్రసిద్ధముగా ఉన్నది. అటువంటివారి విషయములో జన్మాంతర వ్యుత్పత్త్యభ్యాసాలు ఉండిఉంట వని అనడము సమాధానముకాదు. ఇటువంటి ఈ కల్పనలో మూడు దోషాలు సంభవించుతవి. గౌరవము మొదటి దోషము. ప్రమాణాభావము రెండవ దోషము. కార్యము అన్యథా ఉపపన్న మగుట మూడవదోషము.

౧. గౌరవము. వ్యుత్పత్త్యభ్యాసాలు రెండూ కారణాలు కావని అన్నప్పటికీ కేవలము అదృష్టమువలననే కావలసిన పని జరిగిపోతూ ఉంటే వాటినికూడా కలిపి కారణస్వరూపమును పెంచుట అనవసరము. గురుభూతమూను.

౨. ప్రమాణాభావము. కవికర్ణపూరాదులు కేవల భాగ్యవశాన ప్రతిభను సంపాదించినట్లు ప్రసిద్ధి ఉన్నది. ఇటువంటి స్థానములో మూడిటినీ కలిపి ప్రతిభాకారణముగా చెప్పడములో ఏమి ప్రమాణము ఉన్నది? అందులో ప్రమాణములేదు.

3. అన్యథాఉపపత్తి. వ్యుత్పత్త్యభ్యాసాలు అక్కరలేకుండా అదృష్టము వలననే కార్యసిద్ధి అవుతూఉన్నదికదా! కొంతమంది బాలాదులకు వ్యుత్పత్త్యభ్యాసాలు లేకుండానే కావ్యరచనాపాటవము ఉంటున్నది. అటువంటిస్థలములో జన్మాంతరీయ వ్యుత్పత్త్యభ్యాసములను కల్పించి వాట్లకు కారణత్వసమర్థనము చేయడము ఉచితముకాదు. వ్యుత్పత్త్యభ్యాసాలకు కారణత్వము ప్రమాణసిద్ధమయినప్పుడు దానిని ఉపపన్నము చేయడానికి జన్మాంతరీయకల్పన ఆవశ్యకము. ప్రకృతములో (వ్యుత్పత్త్యభ్యాసాలు లేకపోయినా వేరొకవిధముగా ఉపపత్తి కనపడుతున్నది. లోకములో వేదాది ప్రబలప్రమాణములు కార్యకారణ భావవ్యవస్థను కలుగజేస్తే ప్రమాణబుద్ధి ఉంటుంది. 'ఈ వస్తువు దీనికి కారణము అవుతుంది' అని వేదాదిబలీయప్రమాణములు నిర్ణయించితే మనము ఈవిధముగా భావింపగలుగుతాము. "ఏది దేనికి కారణమో ఆకారణము లేకపోతే ఆకార్యము సిద్ధముకాదు" అని. "ఆకార్యము ఉన్నట్లయితే ఆ కారణము ఉండితీరాలి" అని. ఆ కారణము ఉన్నప్పటికీ ఆ కార్యము ఉత్పన్నము కాకపోతే, ఆకారణము లేనప్పటికీ కార్యము

ఉత్పన్నము అయితే మనము వివశత్వముతో విలక్షణులము అవుతాము. ఆగమాదులు కారణతానిర్ణయము చేయగా ఈ వ్యభిచారము ఎందువలన వచ్చిందా? అని. అందువలన ఆ వ్యభిచారనివారణకు ప్రయత్నించుతాము. కారణము లేకుండా కార్యము కలిగినపుడూ, కారణము ఉన్నా కార్యము కలుగనపుడున్నూ జన్మాంతరీయధర్మాధర్మాదికము అక్కడ హేతువని నిశ్చయించుతాము. కాకపోతే ఇది వేరొకవిధముగా కావడానికి వీలులేదుగదా ?

శ్రుతిస్మృత్యాదిబలవత్ప్రమాణములు ఈ చెప్పిన కార్యకారణభావమును నిశ్చయపరచకపోయినట్లయితే వ్యభిచారము కలిగినపుడు (కారణము లేక కార్యము కలిగినా, కారణము ఉన్నప్పటికీ కార్యము కలుగక పోయినా) పూర్వవృత్తకారణతానిర్ణయములో భ్రమ ఉన్నదని గ్రహించాలి. ఇటువంటి పరిస్థితిలో జన్మాంతరవిశేషమును కలుపుట సముచితము కాదు. అందువలన పూర్వస్థలములో పూర్వజన్మలోని వ్యుత్పత్త్యభ్యాసములు హేతువులు అని అనడము యుక్తముకాదు. (వ్యుత్పత్తీ అభ్యాసమూ లేకపోతే కవిత బయలు దేరదని ఏ ప్రమాణగ్రంథములో కూడా స్వల్పముగానైనా చెప్పబడలేదు.)

ఈ ప్రమాణాల పరిశ్రమ లేకుండా ప్రతిభాసముత్పత్తిలో కేవలము అదృష్టము ఒక్కటే హేతువు అని అనడముకూడా సరసము కాదు. కొంతకాలముదాకా కావ్యరచన అంటే ఏమోకూడా తెలియకుండా ఉన్నవాళ్లుకూడా ఏదోవిధముగా వ్యుత్పత్త్యభ్యాసాలు కలుగగానే ప్రతిభకలవారు కావడమూ, కావ్యరచనాపాటవమును ప్రదర్శించడమూ ప్రసిద్ధముగా ఉన్నది. ఇటువంటివారే చాలామంది ఉన్నట్లు మనకు తెలుసు. అటువంటి స్థలంలోకూడా "అదృష్టమే కారణము" అంటామా? అట్లాగే అయితే వ్యుత్పత్త్యభ్యాసాలు కలుగక పూర్వము ఆ అదృష్టము ఉండవలసినదేగా ? తత్కార్యముగా కావ్యము బయలు దేరవలసినదేగా ? ఆ విధముగా ఉండడము లేదే. కాబట్టి అంతటా అదృష్టమే కారణమని అనడము యుక్తముకాదు.

ప్రతిభకు ప్రతిబంధకముగా మొదట కొన్నినాళ్లు ఒక దురదృష్టవిశే

షము ఉండడము మూలాన ప్రతిభాసముత్పత్తి కాలేదని అనడము కూడా యుక్తము కాదు. ప్రాయికముగా వ్యుత్పత్త్యభ్యాసములు ఉన్నపుడు కవితలు అల్లగలవాళ్ళు అధికముగా కనపడుతూనే ఉన్నారు. విషయవ్యవస్థ ఈ విధముగా ఉన్నపుడు ఆయా అనేకస్థానాలలో మంచి అదృష్టము చెడ్డ అదృష్టము కల్పించుకొనడము అనవసరము. మొదటి ప్రతిభా ప్రతిబంధకమైన చెడ్డ అదృష్టము వ్యుత్పత్త్యభ్యాసములు కలిగినపుడు నశించిపోతున్నది గదా! ఇటువంటి వ్యుత్పత్త్యభ్యాసములు ఉండవలసిన అవసరము ఉన్నది. కాబట్టి వ్యుత్పత్త్యభ్యాసములకే ప్రతిభాహేతుత్వమును అంగీకరించడము సముచితముగా ఉంటుంది. ఇదే లాఘవప్రక్రియ. అందువలన మొదట చెప్పినట్లుగా అదృష్టము ప్రత్యేకముగా ఒక కారణము అని, వ్యుత్పత్త్యభ్యాసములు పృథక్కుగా కారణము అని నిశ్చయించడమూ రాజమార్గమని గ్రహించాలి; వేరు వేరుగా హేతుత్వమును అంగీకరించడమే యుక్తమన్నమాట.

## విలక్షణత

ప్రతిభాసముత్పత్తిలో రెండు విధములయిన హేతువులు ఇప్పటికి నిర్ణయములో తేలినట్లయినది. స్వతంత్రముగా ప్రతిభకు అదృష్టము ఒక హేతువు, వ్యుత్పత్త్యభ్యాసములు రెండవ హేతువు. ఈ రెండిటి వలనా ప్రతిభ కలుగుతుంది.

ఈ విషయములో ఒకశంక:—అదృష్టము, వ్యుత్పత్త్యభ్యాసములు అనే రెండూ ప్రతిభాసముత్పత్తిలో హేతువులు అని అనడములో ఏమీ ఆక్షేపము లేదు. కాగా కారణము లేనిదీ కార్యము ఉత్పన్నము అగుట అనే వ్యభిచారము ఇక్కడ ప్రసక్తము అవుతున్నది. చూడండి, (అదృష్టజన్యప్రతిభలో వ్యుత్పత్త్యభ్యాసజన్యత్వము లేదు.) వ్యుత్పత్త్యభ్యాసజన్య ప్రతిభలో అదృష్టజన్యత్వము లేదు.) కారణీభూతవ్యుత్పత్త్యభ్యాసాలు లేకపోయినా ప్రతిభ అనే కార్యము పుట్టుతున్నది. ఈ విధముగా హేతుభూత మయిన అదృష్టము లేకపోయినా కార్యమైన ప్రతిభ కలుగుతున్నది. ఇక్కడ కారణములు భిన్నభిన్నములు కదా! కారణములు

భిన్నభిన్నములుగా ఉన్నప్పుడు కార్యము కూడా భిన్నభిన్నముగా ఉండకే ప్రకృతి నియమానికి వేరుగా ఉన్నప్పుడు ఈ చెప్పిన దోషము తప్పదు. ప్రకృతములో కార్యరూపముగా ఉన్నప్రతిభ ఏకవిధముగానే ఉత్పన్నమవుతుందని అన్నప్పుడు ఈ వ్యభిచారము ఉన్నది అని.

ఈ చెప్పబోయేది ప్రకృతములో సమాధానము. అదృష్టమువలనా, వ్యుత్పత్త్యభ్యాసములవలనా ప్రతిభ కలుగుతుంది అనడములో సందేహములేదు. కాని ఒక విషయమును ఇక్కడ గ్రహించాలి; (అదృష్టము వలన కలిగే ప్రతిభ వేరు, వ్యుత్పత్త్యభ్యాసములవలన కలిగే ప్రతిభ వేరు. ఈ రెండు ప్రతిభలూ పరస్పరము విలక్షణములు.) కారణభేదమును బట్టి కార్యముకూడా భిన్నభిన్నమే. అందువలన అదృష్టజన్యప్రతిభలో వ్యుత్పత్త్యభ్యాసజన్యత్వము ఉండవలసిన అవసరము కాని వ్యుత్పత్త్యభ్యాసజన్యప్రతిభలో అదృష్టజన్యత్వము ఉండవలసిన అవసరము కాని లేదు. ఒకరకమైన ప్రతిభలో అదృష్టము హేతువు, వేరొకరకమైన ప్రతిభలో వ్యుత్పత్త్యభ్యాసములు హేతువు. ప్రతిభలో ఇటువంటి విలక్షణత్వము ఉన్నదని అంగీకరించడమువలన ఏ వ్యభిచారప్రసక్తీ లేదు. తమ తమకార్యములో ఆయా కారణాలు నియతధర్మముతోనే ఉంటవి. మొత్తముమీద కావ్యనిర్మాణానికి ప్రతిభ అనేది ఆవశ్యకము. (ఈ రెండు విధములైన ప్రతిభలూ కావ్యనిర్మాణసమర్థములే.)

ఈ విషయ చర్చనే అనుసరించుతూ ఇంకా కొంత ముందుకు పోదాము. కారణములలోని విలక్షణత్వమువలన కార్యమందుకూడా విలక్షణత్వము ఉంటుందని అంగీకరించినట్లయింది. ఇప్పటికి రెండు విధములయిన ప్రతిభలు సిద్ధము లయినవి. వీనివలన కావ్యము కలుగుతున్నది. కావ్యక్రియాసముత్పత్తిలో రెండు విధములయిన హేతువులు ఉన్నవన్నమాట. అదృష్టజన్యప్రతిభ ఒకటి; వ్యుత్పత్త్యభ్యాసజన్యప్రతిభ రెండవది. ఈ రెండిటివలనా ఉత్పన్నమయ్యే కావ్యము ఏకవిధముగానే ఉంటుందిగాని భిన్నముగా ఉండదు అని అనేటట్లయితే పూర్వము చెప్పిన విధముగా దోషము ప్రసక్తమవుతుంది. అందువలన కావ్యములో కూడా వైలక్షణ్యమును అంగీకరించాలి. ఒకవిధమైన కావ్య

ములో అదృష్టజన్యప్రతిభ హేతువు, వేరొకవిధమైన కావ్యములో వ్యుత్పత్త్యభ్యాసజన్య ప్రతిభ హేతువు. అదృష్టజన్యకావ్యము వేరు, వ్యుత్పత్త్యభ్యాసజన్యకావ్యము వేరు అన్నమాట. ఈవిధముగా కావ్యములలోకూడా విలక్షణత్వము ఉన్నది కాబట్టి ఏవిధమైన వ్యభిచారమూ ఇక్కడ ప్రసక్తము కాదు.

ఒక్కొకవ్యక్తిలో వ్యుత్పత్త్యభ్యాసములు ఉన్నప్పటికీ ప్రతిభకలగడము లేదు. అంతమాత్రాన అన్వయవ్యభిచారదోషము ఉన్నదనరాదు. ఎటువంటి వ్యుత్పత్త్యభ్యాసాలు ఉన్నట్లయితే ప్రతిభ కలుగుతుందో అటువంటి వ్యుత్పత్త్యభ్యాసాలు ఆ వ్యక్తిలో లేవు కాబట్టి ప్రతిభ ఉత్పన్నము కాకపోవచ్చు. ప్రతిభను కలుగజేయడానికి సమర్థములయిన వ్యుత్పత్త్యభ్యాసాలు ఆ వ్యక్తిలో ఉన్నవనడములో ప్రమాణము ఏమి ఉన్నది? కారణములు కాగలిగినవి లేకపోవడమువలన ప్రతిభ కలుగ లేదని ఊహించాలి.

ప్రతిభాప్రతిబంధకమైన ఒకానొక విశిష్ట పాపవిశేషమైనా ఆవ్యక్తిలో ఉండిఉండాలి.( అందువలననే ప్రతిభ ఉత్పన్నముకాలేదు.) ప్రతిబంధకము లేకపోవడముకూడా ఒక కారణమే. ప్రతిబంధకము ఉంటే కారణ సామగ్రి చక్కగా లేదన్నమాట. కారణము లేకపోతే కార్యము ఏ విధముగా కలుగుతుంది? ప్రతిబంధకాభావముకూడా కార్యోత్పత్తిలో కారణము అనడము నూతనకల్పన కాదు.

ప్రతిభాసముత్పత్తిలో అదృష్టము (శక్తి), వ్యుత్పత్తి, అభ్యాసము అనే ఈ త్రికమూ హేతువని అంగీకరించేవారుకూడా( ప్రతిబంధకాభావమును కారణమునుగా అంగీకరించక తప్పదు.) శక్తిమాత్రహేతుతావాదులు అంగీకరించనే అంగీకరించుతున్నారు. ఈ విషయములో వారూ వీరూ సమానభాగస్వాములే.

ఒక కవి అనేకకావ్యాలు రచించినవాడయినా ఆతని ప్రతిపక్షి ఎవడైనా మంత్రతంత్రాలతో కొన్నాళ్లవరకూ ఉండే వాక్స్తంభమును కలుగజేస్తే మళ్ళా కావ్యమును రచింపలేకపోవడము ప్రసిద్ధముగానే

ఉన్నది. సముదితశక్త్యాదిత్రయహేతుతావాదులు ఇక్కడ ప్రతిబంధకాభావమును కారణముగా అంగీకరించాలికదా?

## ౪. కా వ్య భే ద ము లు

ఇంతగా విచారింపబడిన ఈ కావ్యముయొక్కప్రకారములు నాలుగు విధములుగా ఉన్నవి. ౧ ఉత్తమోత్తమము; ౨ ఉత్తమము; 3 మధ్యమము; ౪ అధమము అని.

శబ్దార్థౌ యత్ర గుణీభావితాత్మానౌ కమప్యర్థ మభివ్యంక్తః తదాద్యం.

శబ్దము, అర్థము అప్రధానములై చమత్కారమును కలుగజేసే ఒకానొక మనోహరార్థమును వ్యంజనావృత్తిచేత అభివ్యక్తము చేసినపుడు ఉత్తమోత్తమకావ్యము అని పేరు. "కమపి" 'ఒకానొక' అనుటవలన "చమత్కారభూమి అయిన" అని అర్థము. కాబట్టి వ్యంగ్యము అత్యంతము గూఢమయినా, అత్యంతము స్పష్టమయినా, ఉత్తమోత్తమ కావ్యము కాదు. వ్యంగ్యము అత్యంతము గూఢమయినపుడు, స్పష్టమయినపుడు చమత్కారము ఉండదు. వ్యంగ్యము సుందరముగా ఉండని స్థలములో కూడా ఇదేగతి. అపరాంగము వాచ్యసిద్ధ్యంగము అనబడే వ్యంగ్యములు చమత్కారులే అయినా ఈ లక్షణముతో వాటిని గ్రహింపరాదు. అందుకొరకే లక్షణములో "గుణీభావితాత్మానౌ" 'తాము అప్రధానములై' అని చెప్పబడినది. శబ్దచమత్కారముకంటే అర్థచమత్కారముకంటే కూడా వ్యంగ్యచమత్కారము ప్రధానముగా ఉండాలని తాత్పర్యము. అపరాంగవాచ్యసిద్ధ్యంగాలలో వ్యంగ్యానికి ప్రాధాన్యము ఉండదు. వాచ్యముకూడా ప్రధానము అవుతూఉంటుంది. ఆ కారణమువలన అవి ఉత్తమోత్తమకావ్యాలు కావని తెలుసుకోవాలి. వ్యంగ్యము సర్వాతిశయితరమణీయతానిధానము కావాలి అన్నమాట.

ఉదాహరణము:—

> శయితా సవిధే ప్యనీశ్వరా సఫలీకర్తు మహో మనోరథా-
> న్దయితా-దయితాననాంబుజం దరమీలన్నయనా నిరీక్షతే॥

ఒక ప్రియురాలు ప్రియతమునిశయ్యలో సన్నిధానమందే శయనించి

ఉన్నప్పటికీ మనోరథాలను సఫలము చేసికొనడానికి అసమర్థురాలై కొంచెము మీలనము పొందుతున్న నయనాలు కలదై ప్రియుని ముఖాంబుజమును చూస్తున్నది.*

ఈ పద్యములో దయితారతి అభివ్యంగ్య మవుతున్నది. అదే శృంగార రసము. రసాభివ్యక్తికి విభావానుభావవ్యభిచారిసంయోగము అవసరము. ఇక్కడ నాయకుడు ఆలంబనవిభావము, నాయిక సవిధాన శయనించి ఉన్నదికాబట్టి అది రహఃస్థానమని వ్యంగ్యము. ఆ రహఃస్థానాదికము ఉద్దీపన విభావము. దరమీలన్నయనాలతో నిరీక్షణము అనుభావము. చూపులలో అర్థమీలనము ఉన్నందువలన లజ్జ వ్యక్తమవుతున్నది. నిరీక్షణమువలన ఔత్సుక్యము అభివ్యక్తమవుతున్నది. ఈ రెండూ (లజ్జ, ఔత్సుక్యము) వ్యభిచారిభావాలు. వీని సంయోగమువలన రతి అనే స్థాయిభావము అభివ్యంగ్య మవుతున్నది. అదే రసీభావము పొందుతున్నది నాయికానాయకుల పరస్పరప్రేమ అభివ్యక్త మవుతున్నదని కూడా భావింపవచ్చును. ఆలంబనాదిస్వరూపమును మున్ముందు స్పష్టము చేస్తాము.

ఈ పద్యములో:— "ఈతడు శయనించినట్లయితే ఈతని ముఖాం

---

* నాయిక ముగ్ధ. అయినా అతిశయితమైన తమకముతో ఉన్నది. ప్రియుడు సురతాయాసమువలన అలసిపోయి ఉన్నాడు. ఇప్పుడాతడు విరతసురతోత్సాహుడు. అందువలన అసమర్థుడైనాడు. ఉత్కటేచ్ఛ కలిగిన నవవధువు ప్రియునికౌగిలింతలో పొదువబడిఉన్నది. ఒకరి ముఖము వేరొకరికి ఎదురుగా ఉన్నది. ఏకశయ్యలో ఉన్నా తనకు కలిగిన పునఃసురతాకాంక్షను ఈడేర్చుకోలేకుండా ఉన్నది. అతనిని మరల ఆ వ్యాపారములో ప్రవర్తింపచేయడానికి సాహసింపలేకుండా ఉన్నది. తన అర్థనిమీలితనేత్రాలనుండి తన కాంక్షను ప్రియుడు తెలుసుకొనేటట్లు నిరీక్షిస్తున్నది. తన అరమోడ్పు కనుసందులలో నుండి ప్రియుని ముఖాన్ని చూస్తూ అతనికి కాంక్ష ఏవిధముగా ఉన్నదో పరీక్షించుతున్నది. చూపుతో చూపు కలిపి ఆ కాంక్షను కదిలింప దలచుకుంటున్నది. పూర్వవిధానమువలన ఆమెకు కాంక్ష అతిశయించుతున్నది. ఆ వధువు హృదయములో కోరికలు ఊరుతున్నవి. పూర్వపు సురతాస్వాదమును భావించుతూ పారవశ్యం అనుభవించుతూ చూపులనుమాత్రము ప్రసరింపచేస్తున్నది.

బుజమును చుంబనము చేస్తాను'' అనే ప్రియురాలి కోరిక అభివ్యక్త మవుతున్నదని అంగీకరించరాదా? అని అనకూడదు. "అనీశ్వరా సఫలీకర్తుం మహో మనోరథాన్'' అని పద్యములో ఉన్నది. దాని వలన సర్వమనోరథాలూ ఆమె హృదయములో ఉన్నవని ప్రతీత మవుతున్నది. చుంబనేచ్ఛకూడా ఒక విధమైన మనోరథమే. మనోరథ శబ్దముచేత సామాన్యాకారముగా చుంబనేచ్ఛకూడా చెప్పబడినట్లే అవుతున్నది. కాబట్టి ముద్దుపెట్టుకొను కోరిక వాచ్యమూ వ్యంగ్యమూ అవుతున్నదని గ్రహించాలి. వాచ్యము కాకుండా ఉన్న వ్యంగ్యము చమత్కారి అయినట్లుగా వాచ్యమవుతూ ఉన్న వ్యంగ్యము అంతగా చమత్కారి కాదు అని ఆలంకారిక సమ్మతము. కనుక అది ప్రధాన ముగా వ్యంగ్యమని చెప్పినట్లయితే కవి ప్రతిభను తగ్గించినట్లవుతుంది.

మనోరథపదము సామాన్యాకారముగా చుంబనేచ్ఛను చెప్పినా "చుంబ నము చేస్తాను'' అనే విషయవిశేషముతో కూడుకొన్న ఇచ్ఛారూప ముగా వ్యంగ్యము కావచ్చును అని అనడములో ఏమీ చమత్కారము లేదు. ఒక అర్థము విశేషాకారముతో వ్యంగ్యము అయినా సామాన్య రూపముగా వాచ్యము అయినప్పుడు సహృదయులకు చమత్కార మును సంపాదింపదు. ఆ విధముగా ఉన్నప్పుడు దానిలో చమత్కార మును కలుగజేసే శక్తి నష్టము అవుతుంది. ప్రధానవ్యంగ్య మని చెప్ప బడేది ఏవిధముగానూ వాచ్యము కాకూడదు. వ్యంగ్యము వాచ్య వృత్త్యనాలింగితమైనప్పుడే చమత్కారి అవుతుందని ఆలంకారిక లందరూ అంగీకరించుతున్నారు.

ఇంకా చుంబనేచ్ఛకూడా రతికి అనుభావముగా ఉన్నప్పుడే సుందరము. అందువలన ఇందులో ముందుగా రతివ్యంగ్యత్వమును అంగీకరించాలి. చుంబనము రత్యనుభావము కాకపోతే "చుంబించుతాను" అనే శబ్దము వలన గోచరించే [illegible]ము చమత్కారకము కాదు. ఇక్కడ రతి భావమే చమత్కారకము. చుంబనేచ్ఛ రత్యనుభావము కావడమువలన గౌణము. ప్రధానము కాదు.

అట్లాగే ఇందులో లజ్జకూడా వ్యంగ్యమవుతూ ఉన్నప్పటికీ ప్రధానము కాదు. "దరమీలన్నయనా నిరీక్షతే" అనేచోట అర్ధనిమీలన మనే అర్థము గోచర మవుతున్నది. దరమీలనమే లజ్జాభివ్యంజకము. 'దరమీలన్నయనా' అనే పదము నాయికలో విశేషణము. విశేషణసిద్ధార్థము అనువాదరూపముగా వర్ణింపబడుతున్నది. అది విధేయరూపము కాదు. దానిలో విధానము లేదన్నమాట. విశేషణసంబంధము కలిగి గోచరమయ్యే లజ్జ ప్రధానార్థ మనరాదు. అనువాద్యముగా ఉండే లజ్జలో ముఖ్యవాక్యార్థత్వము లేదు.

ఇక్కడ ఇంకా ఈ శంక కలుగవచ్చును.—"దరమీలన్నయనా నిరీక్షతే" అని శ్లోకములో ఉన్నది. ఇందులో నిరీక్షణము విధింపబడుతున్నప్పటికీ కేవలనిరీక్షణమునకు విధానము లేదు. ఆ నిరీక్షణము అనువాద్యార్థములో బాగా సంబంధము పొంది ఉన్నది. అరమోడ్పు కనులతో కూడుకొన్న చూపు విధేయ మవుతున్నదని భావించాలి. దీనినే "దరమీలన్నయనత్వవిశిష్టనిరీక్షణానికి" విధేయత్వము ఉన్నదని అనవచ్చు. ఈ విధముగా గ్రంథార్థమును భావించితే దరమీలనమువలన అభివ్యంగ్యము అవుతూ ఉన్న లజ్జ అనువాద్యముగా (అప్రధానముగా) ఉన్న దనవక్కరలేదు. కాగా త్రపకూడా విధేయకోటిలో చేరి ప్రధానమే అయింది. అందువలన త్రప ప్రధాన వాక్యార్థము కాకూడదా ? అని.

ఈ విషయములో సమాధానగ్రంథమును ఇట్లా భావించాలి. దరమీలన్నయనాత్వవిశిష్టనిరీక్షణము ప్రధానవిధానభాజనమైన దనడము అసమ్మతము కాదు. కాని ఆ నిరీక్షణము త్రపాకార్యముమాత్రము కాదు. నయనాలలోని దరమీలనమే త్రపాకార్యము. ఇచ్చటి విశిష్టనిరీక్షణము త్రపాకార్యము కాదు. రతికార్యమే. శ్లోకములో కొంచెపు కొంచెపు కనుమూతలతోపాటు చూడడముకూడా నిబద్ధమైనది. ఆ విధముగా చూడడము రతి లేనిదీ కుదరదు. కాగా రతికే ప్రాధాన్యము సిద్ధమవుతున్నది. త్రప గుణీభావమే పొందుతున్నది. అటువంటి త్రపకు ముఖ్య

వాక్యతాత్పర్యవిషయత్వము ఉండదు. అందువలననే అది అప్రధానము. త్రపయే ముఖ్యవ్యంగ్యము అనేటట్లయితే "నిరీక్షతే" అనే నిరీక్షణకథనము వ్యర్థమవుతుంది. దానివలన విశేషప్రయోజనమేమీ ఉండదు.

నిరీక్షణవిశిష్టదరమీలనన్నయనాత్వమే ప్రకృతపద్యములో ప్రధాన విధేయ మని అనడముమట్టుకు విపరీతముగా ఉంటుంది. అది అన్వయ సరణి కాదు. శాస్త్రనియమమూ కాదు. అన్వయములో ధాత్వర్థము ప్రధానము కావాలి. 'భావప్రధానమాఖ్యాతం' అని నియమము. నిరీక్షణము ముఖ్యవిధేయము కావాలి. నిరీక్షణము రత్యనుభావము. దర మీలనము త్రపానుభావము. రత్యనుభావమైన నిరీక్షణములో త్రపానుభావమైన దరమీలనము గుణీభావము పొందుతున్నదని అభిధావృత్తి ద్వారా స్పష్ట మవుతున్నది. వ్యంజనామర్యాదలో భావించినపుడు రతిలో లజ్జ గుణీభావము పొందుతున్నదని నిశ్చయించడము సముచితముగా ఉంటుంది. అప్రధాన మవుతూ ఉన్న త్రపకు ప్రధానవ్యంగ్యత్వము సంపాదించుట యుక్తము కాదు.

'శయితా సవిధేపి' అనే పద్యము సంభోగశృంగారోదాహరణము. అక్కడ శబ్దార్థములు రెండూ గౌణములై రతిని అభివ్యక్తముచేసినవి. ఈవిధముగా హర్షాది వ్యభిచారిభావముకూడా అభివ్యక్తముకావచ్చును. భావానికి ఉదాహరణము:

> గురుమధ్యగతా మయా నతాంగీ
> నిహతా నీరజకోరకేణ మందం
> దరకుండలతాండవం నతభ్రూ
> లతికం మా మవలోక్య ఘూర్ణితాసీత్.

ఈ పద్యమును ఒక యువకుడు తన మిత్రునితో చెప్పుతున్నాడు. అత్త, మామ, వదినె మొదలయిన గురుజనుల మధ్యఉన్నది కాబట్టి వినతాంగి అయిన ప్రియురాలు నాచేత కమలముకుళముతో మెల్లగా

కొట్టబడినదై కొంచెము కుండలాలు తాండవించునట్లుగా వంగిన కను బొమలు కలుగునట్లుగా నన్ను చూచి తొట్రుపాటు పడినది. *

దీనిలో ప్రధానముగా అమర్ష అభివ్యక్త మవుతున్నది. "అసమీక్ష్య కారీ! ఏమిటిది? అనుచితము ఆచరించుతున్నావు" అనే అర్థముతో అమర్ష సంవలితము అవుతున్నది. "ఘూర్ణితాసీత్" అనుటవలన పై అర్థము గోచరము అవుతున్నది. ఈ వ్యంగ్యార్థముకంటె శబ్దార్థములు రెండూ గౌణములు అయినవి. ఆ శబ్దార్థములలో అంత చమత్కారము లేదు. అవి అమర్ష భావమునే అభివ్యక్తము చేస్తున్నవి.

వేరొక విచార ప్రణాలికానుసారముగా భావింపవలసి ఉన్నది. అలంకార శాస్త్రాచార్యులు రసభావాదికము అసంలక్ష్యక్రమవ్యంగ్యమని భావించు తున్నారు. రసభావాదులు ప్రతీతము కావడానికి పూర్వము విభావాను భావవ్యభిచారిభావాల ఉపస్థితి ఆవశ్యకము. విభావాదుల అభివ్యక్తి కలిగిన తరువాత రసభావాదికము అభివ్యక్త మవుతుంది. విభావాది ప్రతీతికీ రసభావాది ప్రతీతికీ మధ్య ఉన్న కాలక్రమము అత్యంతమూ సూక్ష్మము. అందువలన వాని పూర్వాపరీభావము లక్షితము కాదు. అందువలననే రసభావాదులు అసంలక్ష్యక్రమములు అని నియతవ్యవ హారము ఉన్నది. అయినప్పటికీ రసభావాదికము సంలక్ష్యక్రమము

* నాయకుడు వినోదరసికుడు. అతని నాయిక తారుణ్యాభరాలస. స్తనభారావనమ్ర. నిత్యమూ ఆ నాయకుడు నిధువనప్రియుడు. ప్రియురాలు అత్తమామల మధ్యలో కూర్చొని ఉన్నది. తన రాకను తెలియచేయడానికి కమలకోరకమును వక్షోభాగానికి తగిలేటట్లు విసిరినాడు. "నీ కుచము కంటె ఈ కోరకము ఎక్కువగా ఉన్నదో తక్కువగా ఉన్నదో చూచుకో" అని నాయకవినోదము గోచరము అవుతున్నది. ఇతరులు చూడకుండా విసిరినా నలుగురిలో ఉండగా విసురుతాడా అని ఆమె చకితురాలు అయినది. మందముగా కుండలాలు కదిలేటట్లు కొంత చిడిముడిపాటుతో కూడు కొన్నది అయింది. 'ఘూర్ణితా' కొంత మదమత్తురా లయినది అన్నమాట. ఎప్పుడూ ఇట్లాంటి పనేనా అని విదలించుకొన్నది. ఉత్తరార్థములో రెండూ నాయకవిశేషణా లయితే నాయకుడు కామాసక్తుడు. ఆమె వక్షోజానికి తగిలేటట్లుగా కోరకమును విసిరి "తన అభిప్రాయమును తెలుసుకొని ప్రవర్తింపవలసినది" అన్నట్లు కనుబొమలను వంచి సైగ చేసినాడు. సవిలాసంగా తన కుండలాలను కదిలించాడు. ఆమె రావడమును అభి లషించుతున్నాడు అని భావము.

కూడా అవుతుందని ధ్వనిప్రస్థానవ్యవస్థాపనాచార్యులయిన ఆనందవర్ధనాభినవగుప్తులు అంగీకరింపకపోలేదు. పండితరాజుకూడా రసభావాదికము సంలక్ష్యక్రమము కావచ్చును అనే సిద్ధాంతమును అంగీకరించుతున్నాడు. విభావాదులకూ రసభావాదులకూ మధ్య ఉన్న ప్రతీతిక్రమము సులక్షము కావచ్చును అన్నమాట. ఈ అభిప్రాయముతో, వేరొక ఉదాహరణము ఇస్తున్నాడు.

తల్పగతాపిచ సుతనుః శ్వాసాసంగం న యా సేహే
సంప్రతి సా హృదయగతం ప్రియపాణిం మంద మాక్షిపతి.

ఈ పద్యము నేను (పండితరాజు) రచించిన ప్రబంధగతము కాబట్టి కొంత పూర్వసాకాంక్షమై ఉన్నది. అందువలన కొంతగా వ్యాఖ్యానించాలి. ఒక నవోఢ ప్రియునితోపాటు పర్యంకమందు శయనించి ఉన్నది. ప్రియుడు దేశాంతరము పోనున్నాడు. అందువలన ఆ నవవధువు ప్రనత్స్యత్పతికా. వారిద్దరూ ప్రస్థానానికి వెనుకటిరాత్రి ఏకశయ్యలో ఉన్నారు. ఈ పూర్వార్థము ఇక్కడ ఆకాంక్షింపబడుతున్నది.*

ఏసుకుమారవధువు తల్పగతురాలై ఉన్నప్పటికీ పూర్వము ప్రియుని

*ఈపద్యనాయిక సుకుమారతనువు. ప్రియుని శరీరము కొంత పటిష్ఠము. ఆ నవవధువుల జ్ఞావిజితమన్మథ. ప్రియాసమాగమముపై ఆనాయికకు కోరికలేకపోలేదు. అందువలననే తల్పగత. అయినా రాగమును మించిన బిడియంఉన్నది. చిన్నప్పటినుండి అనుభూతము అవుతూవున్న ఒంటరితనమును విడువలేకుండా ఉన్నది. ఇప్పుడు ప్రక్కలో ప్రియుడు మెదలుతున్నాడు. ఒక స్పర్శ వెలుగు తనకు శయ్యలో కలుగుతున్నది. నాయకుడు నవవధువును అనుకూలముగా చేసికొనడానికి ప్రయత్నపడుతున్నాడు. అతనికి అనుభవకాంక్ష అధికముగా ఉన్నది. హృదయము బరువెక్కినది. వేడి నిట్టూర్పు పుచ్చినాడు. బుద్ధిపూర్వకముగా వధువుకు తగులచేసినాడు. ఆ లేయెడద ముగుద ఈమధురిమను గ్రహించలేక ఇదివరలో ఆ శ్వాసాసంగమును కూడ సహించలేక పోయెడిది. ఈనాడు అటువంటివానిని సహింపగలదు. ఇటువంటివి కొన్నినాళ్లనుండి అనుభవములోనికి వచ్చినవి. అయినా అసిగ్గుకు సిగ్గులేదు. ఇంకా అందువలననే 'మంద మాక్షిపతి' ఏదో కాంక్షతో ప్రియుడు తన హస్తమును వక్షోజాగ్రాన ఉంచినాడు. ఆ నాయిక భావివిరహావిదూన. అందువలన పునరాకాంక్ష లేదు. అయినా అనుభూతరస. ఎట్లా కాదంటుంది? అందువలననే "మందం".

నిట్టూర్పు తాకుడున్నైనా సహింపలేక ఉండేదో ఆనాయిక ఇప్పుడు (ప్రస్థాన పూర్వరాత్రి) వక్షోభాగాన ఉన్న ప్రియుని హస్తమును మందముగా త్రోయుచున్నది.

నవవధూస్వభావము ఈవిధముగానే ఉంటుందిగదా ? ఆతని హస్తము ఆవిధముగా ఆ వక్షోజాలపై ఉండడము ఆమెకు సమ్మతమే. అయి నప్పటికీ నవవధూజాతిస్వాభావ్యమువలన సాశంకముగా ఉంచబడిన ప్రియునిపాణిని మెల్లగా ఉన్నచోటుకే చేర్చుతున్నదని భావము.

ఇచటి మందాక్షేపమువలన రతిరూపమైన స్థాయిభావము అభివ్యక్తము అవుతున్నది. మెల్లగా ఆక్షేపించుట అనుటవలన రతిభావము సంలక్ష్య క్రమవ్యంగ్యము అని భావించాలి. స్థాయ్యాదులు కూడా సంలక్ష్యక్రమ వ్యంగ్యములు కావచ్చును అని ముందు నిరూపించుతాము.*

ఈ చెప్పిన ఉత్తమోత్తమభేదమునే 'ధ్వని' అంటున్నారు.

## అప్పయ్యదీక్షిత - వివేచనఖండనము

అప్పయ్యదీక్షితుడు అలంకారశాస్త్రములో సుప్రసిద్ధవిద్వాంసుడు. ఆతడు చిత్రమీమాంసాగ్రంథకర్త. ఆ గ్రంథములో ధ్వనికావ్యో

* ప్రకరణము స్ఫుటముగా ఉన్నప్పుడు, విభావానుభావవ్యభిచారిభావాలు ఝడితి ప్రతీతములు అయినప్పుడు మర్మవిదుడు అయిన ప్రమాతకు 'రసము' అని వ్యపదేశింపదగిన ఈ రత్యాదిభావము సూక్ష్మతమమయిన సమయములో గోచర మవుతూ ఉంటుంది. కాబట్టి హేతుహేతుమత్తులకు పౌర్వాపర్యక్రమము అలక్ష్యముగా ఉంటుంది కాబట్టి "అలక్ష్యక్రమము" అనేపేరు తగిఉన్నది. ఎక్కడైతే ప్రకరణము స్ఫుటముగా ఉండక విచారించితేనే గాని తెలియనిదిగా ఉంటుందో; విభావాదులు కూడా బుద్ధిబలముచేత సమున్నేయములుగా ఉంటవో, అక్కడ రసాభివ్యక్తి సామగ్రీ విలంబమువలన చమత్కృతిమంథర మవుతుంది. అందువలననే ఝడితి చమత్కారము ఉత్పన్నము కాదు. క్రమముకూడా సులక్ష మవుతుంది. 'తల్పగతాపి' అనే ఈ పద్యములో "సంప్రతి" అనే పదమువలన "పూర్వము ఆ నాయిక నవవధువుగా ఉన్నప్పుడు సంకోచపరిస్థితి ఒకరకముగా ఉండేది. ఇప్పుడు సంకోచానికికూడా క్రమికమైన సంకోచము ఏర్పడింది. అని పూర్వాపరానుసంధానము చేయవలసి ఉన్నది. అందువలననే అర్థావగతి విలంబముగా కలుగుతున్నది. కాబట్టి క్రమము సంలక్ష్య మవుతున్నది అని ఆశయము.

దాహరణవివేచనము చేసినాడు. పండితరాజు ఆ వివేచనమును ఖండించు తాడు. ఇది ఇక్కడ తెలియదగినది. దీక్షితుని ఉదాహరణమును, దానిపై దీక్షితుడు స్వయముగా చేసిన వివేచనమును ముందుగా పరిశీలించాలి. ఉదాహరణము:

> నిశ్శేషచ్యుతచందనం స్తనతటం నిర్మృష్టరాగోఽధరో
> నేత్రే దూర మనంజనే పులకితా తన్వీ తవేయం తనుః
> మిథ్యావాదిని! దూతి! బాంధవజనస్యాజ్ఞాతపీడాగమే
> వాపీం స్నాతు మితో గతాసి? నపున స్తస్యాధమస్యాంతికం.*

---

* నాయిక సముత్కటతారుణ్య. నాయకుడు రతిపండితుడు. అదీకాక అతడు సుభగుడు. అతని యువతులు అహమహమికతో కాంక్షించుతారు. నాయిక స్వయముగా అతని కళావైదగ్ధ్యము చూచి వలచినది. పరస్పరానురాగము సమున్నతమే. అయినా నాయిక వలపు సముల్లాసము పొందుతూ ఉంటుంది. అతని రతిపాండితీ వైదగ్ధ్యములను భావించుతూ పునారత ప్రక్రియలను వాంఛించుతుంది. తానే అతని తమితీరా సర్వాత్మనా అనుభవించాలని ఉవ్విళ్లూరుతూఉంటుంది. ఆమె భావనా పథములో అతనిచమత్క్రియావిశేషములు భాసించి పారవశ్యమును సంపాదించుతున్నవి. అతని పొందు లభింపమికి కుందుతూ వంత పొందుతూ ఉన్న ఆయువతి దూతిని పంపింది. దూతికీ విశిష్టవిషయములు అన్నీ నిత్యప్రతిభాసములే. చక్కని సంధానకౌశలము కలిగిన దూతికూడా రతికళాప్రవీణ. అతడు తనను వలచినాడో లేదో, ముందుగా తానే వలచి అతని వలపింపజేసింది. ఆచాతుర్యము దౌత్యములో ఉన్నది. దూతికూడా సుభగుని మెప్పించగల సౌందర్యనిధాన. ఆ దూతియొక్క పటిష్ఠములు, బలీయములున్నూ అయిన వేడికుచములు, రతిసర్వస్వాయమాణమైన లలిత మృదులమధురాధరము, చూడగానే సౌందర్యసీమను హృదయంలో ముద్రించగలిగిన సుందర నేత్రాలు, హృదయభావాలను కదిలించి కదిలించి కామవశము చేయడానికి సమర్థమైన తనువు, తనంత తాను మూర్తీభవించి తీయనికోరికలకు మార్గము చూపుతున్న మనస్సు అన్నీ నాయకుణ్ణి వివశునిగా చేసినవి. దూతి నాయికకు మాన్మథకలా మంత్రోపదేశము చేసినదని నాయకునకు తెలుసు. కొంగ్రొత్తలయిన మంచి మంచి ఎదురెత్తులను దూతిక ఇవ్వగలదు. ఇన్నీచూచి, ఇంకాచూచి, విశేషాలను కలయ చూచి నాయకుడు దూతీకాంక్షితమును ఈడేర్చినాడు. వారి భోగక్రియలో మన్మథుడు నేర్చుకోతగిన విశేషములు ఉన్నవి. తనతో ఉపభోగము పొందితేనే కాని నాయికా సంఘటనము కలుగ దని దూతి చెప్పిఉండవచ్చును. అంత మాత్రాన బెదరి అతడు దూతీభోగము పొందినాడని అనుకో నక్కరలేదు. అతడు కృత్రిమానురాగము చూపలేదు. అతడు ఉబికిన తన ప్రేమకు దూతి తగినదే అని తలచి ఉంటాడు. నాయికకు

ఈ పద్యములో ఈ చెప్పబోయేది ప్రకరణార్థము. ఒక సౌందర్య గర్వితఅయిన నాయిక నాయకునిదగ్గరకు దూతిని పంపింది. ఆతని తీసికొనిరమ్మని చెప్పింది. ఆ దూతిక చతుర. తాను ఆ నాయకునియందు చిరకాలమునుండీ అనురక్త. కాని సమయము చిక్కినదికాదు. ఇప్పుడు నాయకునిదగ్గరకు వెళ్లి ఆతనితో సంభోగఫలమును పొందింది. మళ్ళీ నాయికదగ్గరకు వచ్చిన తరువాత "నేను అటునిటు తిరిగి వాపీస్నానానికి వెళ్లినాను" అని బొంకులాడింది. నాయిక విదగ్ధ. విషయమును అంతా చూపుమాత్రాన గ్రహించింది. చాల కటకటపడింది. దూతి అసత్యము పలుకుటను తెలిసికొన్నది. నాయిక దూతితో ఈవిధముగా అంటున్నది.

నీ స్తనతటములందు చందనము నిశ్శేషముగా పోయింది. అధరరాగము నిర్మృష్టము అయింది. మఱి నేత్రములు అత్యంతమూ అంజనరహితముగా ఉన్నవి. నీ యీ తనువు పులకితము అయింది. వసివాడి ఉన్నది. అసత్యభాషిణి! దూతి! బంధుజనానికి పీడ కలుగుతుందని తెలియనిదానా! ఇక్కడినుండి వాపీ స్నానానికి వెళ్లినావు. మరి ఆ అధముని అంతికప్రదేశానికి వెళ్లలేదు" అని సామాన్యముగా పద్యభావము.*

---

ఈ విధానము రుచింపలేదు. ఆమె ఎట్లా సహించుతుంది? తన ప్రేమపాత్రలోని సుధను వేరొకరు ఆస్వాదించడమును ఆమె అంగీకరించుతుందా? నాయకుడు దూతీ సంగమము చేసినా తాను అతని ఏవగించుకోదు. అధముడు అనినప్పటికీ అది దూతికను తిట్టడమే. తన దగ్గర నమ్మకంగా మెలగిన దూతి ఎంత అపకారము చేసింది? తనకు కలిగిన బాధనూ కలిగే బాధనూ ఆలోచించలేదే? ఈ విధముగా అనంతార్థమును అక్లిష్టముగా ఇక్కడ ఊహించవచ్చును.

* అప్పయ్య దీక్షితుడు చిత్రమీమాంసలో ఈ విధముగా ఈ పద్యభావమును విమర్శించుతున్నాడు. ఈ పద్యములో "నీవు వాపీస్నానానికి వెళ్ళినావు. ఆతని సన్నిధికి కాదు" అని ప్రస్తుత వాక్యార్థము. "రమించుటకై తత్సకాశమునకే వెళ్ళావు" అని వ్యంగ్యము. ప్రధానముగా అధమపదమువలన ఇది గోచరము అవుతున్నది. సరే, అధమత్వము జాతిచే కలుగవచ్చును. కర్మచే సిద్ధింపవచ్చును. ఉత్తమనాయిక నాయకునకు జాతివలన కలుగు అపకర్షమును చెప్పదు. జాత్యధముని ఉత్తమురాలు ప్రేమించదుగదా? కాగా ఇక్కడ అధమత్వము కర్మసిద్ధమే కావాలి. దూతీ సంభోగము

ఈ క్రిందివిధముగా అప్పయ్యదీక్షితుని సమీక్షను భావించాలి. స్నానీ పద్యములోని తట - అధర - దూరం - తన్వీ అనే పదఘటిత వాక్యార్థాలు సర్వసామాన్యముగా దూతి వాపీస్నానానికి వెళ్ళలేదని తెలియచేస్తున్నవి. ఆలింగనము చుంబనము మొదలయిన సంభోగాంగము

---

హీనకర్త. అది నాయకుని సాపరాధునిగా చేస్తుంది. ఈకర్తయే నాయకుని అధమతా సంపాదకము. ఇంతకు అతిరిక్తమైన కర్త ఏదైనా ఉన్నప్పటికీ దూతిని పంపడానికి పూర్వము ఆ ప్రాచీనకర్త అంతా సహింపబడినదే అవుతుందని ఊహించాలి. కాబట్టి అది ఉద్ఘాటనార్హము కాదు. దూతీసంభోగరూపమైన హీనకర్తను నాయకుడు ఆచరించినట్లు సన్నిహితచిహ్నాలవలన తెలియడానికి అవకాశము ఉన్నది. మొత్తము మీద అధమపదము ఈ అర్థపర్యవసానము పొందుతున్నది. ఇందులో "రమించుటకే వెళ్ళితివి" అని వ్యజ్యమాన మవుతున్నది.

"నిశ్శేషచ్యుతచందనం స్తనతటం" మొదలయిన వాక్యార్థాలు సంభోగ చిహ్నోద్ఘాటనముద్వారా సాహాయ్యము చేస్తున్నవి. ఉత్తరీయాకర్షణమువలన చందన చ్యుతి కలుగవచ్చును. కాని నిశ్శేషముగా కలుగదు. స్నానము వలన నిశ్శేషచ్యుతి కలుగుతుందని సూచింపడానికి నిశ్శేషవిశేషణము సమర్థము. అంత మాత్రాన వివక్షిత సిద్ధిలేదు. రమణమువలనా స్నానమువలనా కూడా స్తనచందనము నిశ్శేషముగా పోవచ్చును. కాని తటచందనము పోవడముమాత్రము సురతమువలననే కావాలి. స్నానము చేసినపుడు అంతటా చందనము పోతుంది. కేవలము స్తనతటములందే ఉపరిభాగము లందే పోదు. ఇక్కడ తటచందనమే పోవడములో నాయకుని గాఢాశ్లేషములోని కరతల పరామర్శకలన ఒక్కటే హేతువు అని స్పష్టము.

"నిర్మృష్టరాగోధరః" - తాంబూలము వేసికొనడము కొంత ఆలస్యము అయినపుడు ప్రాచీనరాగము కొంత పరిమార్జితము కావచ్చును. కాని నిర్మృష్టము కాదు. నిశ్శేషమృష్టత్వము స్నానమువలన కూడా కలుగవచ్చును. "అధర" అని విశేషముగా చెప్పడమువలన సంభోగచిహ్న ఉద్ఘాటింపబడినది అవుతున్నది. స్నానమువలన అధర రాగముతోపాటు ఉత్తరోష్ఠరాగముకూడా పోతుంది. ఇందులో అధరరాగమే నిశ్శేష మృష్టము అయినది అని చెప్పుటవలన అది చుంబనమువలన, అధరాస్వాదమువలననే జరిగినదని స్పష్టము.

"నేత్రే దూర మనంజనే" - ప్రొద్దుట ఉంచిన కాటుక కాలవిలంబమువలన కొంత విలుప్తము కావచ్చును. కాని అత్యంతమూ పోదు. దూరం అనుటకు 'అత్యంతము' అని అపాతార్థము. కాలవిలంబనమువలన గాని స్నానమువలనగాని అంతటా అంజనలోపము కలుగుతుంది. నేత్రాల ప్రాంతాలలోని అనంజనత చుంబనకృతమే. నేత్రచుంబనము కూడ రతవిధానాలలో ఒకటిగా పరిగణింపబడుతున్నది.

ఈ ? ప్రతిపాదనము చేస్తున్నవి. "ఆతనితో సంభోగమునకే నీవు వెళ్లితివి" అనేది ఇక్కడ ప్రధానవ్యంగ్యము. ఈ ప్రధానవ్యంగ్యవ్యంజనములో తటాదిపదాలు సాహాయ్యమును సంపాదించుతున్నవి.

చూడుడు. ఉత్తరీయాకర్షణమువలనగూడా స్తనాల చందనచ్యుతి కలుగవచ్చును. స్తనతటముల ఉపరిభాగముల చందనచ్యుతి ఆశ్లేషకృతమే కాని స్నానకృతము కాదు. తాంబూలగ్రహణవిలంబనమువలన ప్రాచీన రాగము కొంత మృష్టము కావచ్చును. కాని రాగనిశ్శేషమృష్టత కలుగదు. ఉత్తరోష్ఠము రక్తిమతో ఉండగా అధరమాత్ర నిర్మృష్ట రాగత చుంబనకృతమే కాని స్నానకృతముకాదు, ఇత్యాది గ్రంథముతో "ఇది ధ్వన్యుదాహరణము" అనేవరకు ప్రధానవ్యంగ్య వ్యంజనములో సాహాయకాచరణమును అప్పయ్యదీక్షితుడు ప్రతిపాదించినాడు. అలంకార శాస్త్రతత్త్వము బాగా తెలియకపోవడమువలన చిత్రమీమాంసాకర్త ఈవిధంగా అనుట సంభవించింది. ఈ దీక్షిత ప్రతిపాదనము సకలప్రాచీన గ్రంథవిరుద్ధము; ఉపపత్తి విరుద్ధమూను.

"నిశ్శేషచ్యుతచందనం స్తనతటం" మొదలయిన వాక్యార్థాలు వ్యంగ్యాసాధారణములు అని తలచుట సముచితముకాదు. కావ్యప్రకాశకర్త అయిన మమ్మటుడు పంచమోల్లాసాంతములో ఈ ఉదాహరణమును వివేచనము చేసే సందర్భములో—

"నిశ్శేషచ్యుతచందన మిత్యాదా గమకతయా (యాని) చందనచ్యవనాదీ న్యుపాత్తాని తాని కారణాంతరతోపి భవంతి. అత

"పులకితా తన్వీ తవేయం తనుః" – తన్వీ అనుట సహజతనుత్వ కీర్తనము. స్నానమువలన తనువు పులకితము అవుతుంది. పులకితము అయినా తానవము ఉండడము రతలక్షణమే. పులకిత శరీరము కొంతగా ఉచ్ఛ్వసితము అవుతుంది. ఇపు డట్లా లేదు. కాబట్టి ఈ తనుత్వపులకితత్వాలు రతిక్లేశజనితములే కావాలి.

ఇట్టి ఈ వాక్యములచేత అధమపదము ఉపస్కృతము అవుతున్నది. మొదట 'మిథ్యావాదిని'అనే విశేషణము వాపీస్నానానికి వెళ్ళినావు అనే వాచ్యార్థానికి అనుగుణముగా అన్వయము పొందినప్పటికీ వ్యంగ్యానుగుణము అయిన అర్థమందే చక్కగా పర్యవసానము పొందుతున్నది. ఇది ధ్వన్యుదాహరణము. —"చిత్రమీమాంస"

శ్చాత్రైవ స్నానకార్యత్వే నోక్తానీతి నోపభోగ ఏవ ప్రతిబద్ధానీత్యనైకాంతికాని.”

పూర్వోదాహరణములో చందనచ్యవనాదులు వ్యంగ్యగమకములుగా చెప్పబడినప్పటికీ అవి కారణాంతరమువలనగూడా కలుగవచ్చును. కేవలము సంభోగము వలననే కలుగుత వని అననక్కరలేదు. ఆ శ్లోకములోనే స్నానకార్యములుగా చెప్పబడినవి. ఆ చందనచ్యవనాదులు ఉపభోగములోనే నియతములు గావు. అవి ఒకదానినే సంబంధించి ఉండేవికావు అని భావము. రెండవ దానివలనగూడా అవి కలుగుతవి కాబట్టి అవి అనైకాంతికములు” అని పలుకుతున్నాడు. అందువలన మమ్మట విరుద్ధము అని స్పష్టము.

ఇంకా ఆ స్థలములోనే మమ్మటుడు

> భ్రమ ధార్మిక! విస్రబ్ధః స శ్వాఽద్య మారితస్తేన
> గోదానదీకచ్ఛకుడుంగవాసినా దృప్తసింహేన.

ఓ ధర్మచారీ! నీవు స్వేచ్ఛగలిగి తిరుగుము. గోదావరీనదీ నికుంజనివాసి మత్తకేసరి ఆ శునకమును చంపినది. *ఈపద్యములో వ్యక్తివివేకకర్త అయిన మహిమభట్టు మతమును నిరాకరించుతూ—హేతువు అసిద్ధమయినా, వ్యభిచారి అయినా, సందిగ్ధము అయినా, అర్థము ధ్వన్యమానము కావచ్చును అని వ్యంజన మంగీకరించినాడు.

---

*. ఒక చతురనాయిక గోదావరీనదీతీరనికుంజమును తన నిధువనసంకేతస్థానముగా ఏర్పాటు చేసికొన్నది. ఒక ధార్మికుడు, ఆ విషయము తెలియనివాడు, నిత్యమూ నికుంజపుష్పాలను దేవార్చనకై కోయుచుండును. అందువలన సంకేతభూమీ విరళవిరళము అవుతున్నది. ఆ కులటవనిత సహింపలేకపోయింది. ధార్మికుడు మరలిపోవడానికి ఉపాయమును చింతించింది. ఆ కుంజములో శునకము ఉన్నదని అందరిమాదిరి ధార్మికుడుకూడా భయపడుతాడు. ఆవిషయమును తెలిసిన ఆ కులట ఇట్లా పలుకుతున్నది: “ధార్మికా! నీవు విశ్వాసము కలిగి భ్రమించుము. ఆ కుక్కవలన ఇపుడు భయములేదు. గోదానదీ కచ్ఛకుడుంగ వాసి దృప్తసింహము ఆ శ్వానమును చంపివేసింది.” అని. ఇచట ధార్మికుడు సంచరించుట కులటకు సమ్మతముకాదు. “నీవు ఇక్కడ తిరగవద్దు” అని చెప్పుట కులటకు అభిమతము. తన ఆ విజనవనము వివిధకుసుమామోద

ఈ విధముగానే ధ్వన్యాలోకగ్రంథము మొదటిఉద్యోతములో ఆనంద వర్ధనుడు అభిప్రాయ పడుతున్నాడు. ప్రామాణికులు అందరూ వ్యంజక

---

మధురము. తాను సుకృతి అయిన యువకునితో రహస్యసంభోగసుఖాస్వాదలాలస. ఆ ధార్మికుడు దినదినమూ ఆవిధముగా పువ్వులుకోస్తూ ఉంటే తన లతానికుంజము పలుచన అయిపోతుంది. తమ రహఃకేళీవిలాసరహస్యము ప్రకాశమవుతుంది. ఆ కోమలి ఆ ధార్మికుని పుష్పాపచయమును సహించుతుందా? వాచ్యముగా ధార్మికపుష్పావచయమును నిషేధిస్తే జనులు అనుమానించుతారు. అందువలన ఆ యువతి విదగ్ధ అయినా ముగ్ధమాదిరి "పిచ్చికుక్క చచ్చిపోయినది" అని ప్రియము చెప్పుదానిమాదిరిగా విధిముఖముగా భ్రమణమును నిషేధించుతున్నది. ధార్మికుడు అక్కడ తిరుగుట తన మనోరథపరిపంథి. విఘ్నముగా ఉన్నది. కేసరికిశోరక క్రౌర్యాతిరేకము ఎటువంటిదో ఆ యువతికి తెలుసు. అయినా కుక్కురమారణమాత్రత్రాసోపన్యాసము చేసి ధార్మికునకు ప్రియము చెప్తున్నట్లుగా పలుకుతున్నది.

ధార్మిక అనిసాక్షేపసంబోధనము. నీవు ఇతరుల కార్యవిఘాతకుడవు. అవశ్యంగా ధార్మికుడవే. నీవు తిరుగూ తిరుగూ! ఇక్కడ కాదు. పట్టణ వీధుల్లో తిరుగు. ఇదివరకు కుక్క ఉన్నదని తిరగడము మానివేశావు కాబోలు. ఇపుడా కుక్క లేదు. దృప్తసింహము దానిని చంపింది. నేను వినలేదు అనుకుంటావేమో? ఇపుడే ఆపని జరిగింది. ఆసింహానికి ఇపుడు ఆకలి ఉండదు కాబట్టి మీదికి రాదు అనుకోకు. ఆసింహము భోజనాపేక్షతోటే ఆక్రమించడము కాదు. అది బలగర్విష్ఠము; దృప్తముగా ఉన్నది. ఆ గ్రామసింహారావాన్ని వినేటప్పటికి నీ అంగలతిక భయప్రకంపాకులితము కాలేదూ? నీవు అదృష్టవంతుడవు. ఇక ఆ కుక్క మళ్ళీరాదులే. ఆసింహము దాన్ని చంపిందిగా. కర్ణోపకర్ణికగా నీవూ వినే ఉంటావు, దృప్తసింహము గోదాతటవికటోద్భటనికుంజనివాసి అని. నీకు ఇదివరకే సఖ్యాదిద్వారా ఈవిషయము చెప్పించాను. ఆసింహం ఉన్నదే! గహనములోనుండి బయలుదేరుతుంది. జాగ్రత్త! ఇక్కడ నీవు తిరగవద్దు. నీకు ఇక ప్రసిద్ధ గోదావరీనదీతటీపరిసరానుసరణముకూడా కథాశేష మయినట్లే. ఇంకా లతాగహనప్రవేశశంక ఏమిటి? ఓ శిష్ట్రిపూజకా! ఇక ఇక్కడ తిరగవద్దు పో అని మొత్తముమీద వ్యంగ్యము.

ఈ పద్యములో వ్యంగ్యముగా తలచబడే అర్థము అనుమేయమే అవుతుందని మహిముని భావము. వ్యక్తివాదమును మహిముడు అంగీకరింపడు. అనుమానముచే వ్యంజనమును గతార్థము చేస్తాడు. వ్యక్తివివేకములోని ఈ పద్యముపై మహిమభట్టు వితర్కనమును ఈ విధముగా గ్రహించాలి.

భ్రమధార్మిక అనే ఈ పద్యములో రెండర్థము లున్నవి. ఒకటి వాచ్యము రెండవది ప్రతీయమానము. వాచ్యము విధిరూపము. ప్రతీయమానము నిషేధాత్మకము. ఇవి క్రమముగా ప్రతీతిపథములో అవతరించుతున్నవి. ధూమాగ్నులకు సాధ్యసాధనభావము

ములు సాధారణములే అని తలుస్తున్నారు. సాధారణములుగా ఉండేవి వ్యంగ్యముతో సంబంధించి ఉన్నట్లే ఇతరములతోకూడా సంబద్ధములై

---

ఉన్నట్లు ఈ వాచ్యప్రతీయమానములకుకూడా సాధ్యసాధనభావము ఉన్నది. అవి అవిధముగానే అవస్థితములై ఉంటున్నవి. వీనిలో మొదటిది అయినవాచ్యము విచారణ అక్కరలేకుండగానే స్పష్టమవుతున్నది. ఈ అర్థములోకూడా సాధ్యసాధనములు ఉన్నవి. భ్రమణవిధి సాధ్యము. భ్రమణానికి క్రూరకుక్కురము పరిపంథి. సింహము దానిని మారణము చేసింది. ఈ కుక్కుర మారణరూపమైన సాధనముకూడా పద్యములో ఉపాత్తమై ఉన్నది.

అర్థమును తెలుసుకునే గ్రహీత తన వివేకబలానుసారముగా కాముకీస్వరూపస్వభావ పరిశీలనము చేసినపుడు సామర్థ్యవశాన ప్రతీయమానార్థము ప్రతీతిలో గోచరము అవుతుంది. సామర్థ్యము అంటే కౌలేయకము చచ్చిపోయినా క్రూరతరమైన సత్వాంతరము ఒకటి ఆ లతానికుంజములో ఉన్నట్లుగా ఆ యువతి చెప్పడమే. ఈ సద్భావావేదనమే ప్రతీయమానార్థములో సాధనము. భ్రమణనిషేధము సాధ్యము. ఇక్కడ ఈ సాధ్యసాధనములకు అవినాభావనియమము విరోధమూలకముగా ఉన్నది. ఇది లోక ప్రమాణసిద్ధమే. ఈ పద్యములోని అర్థద్వయములో రెండవది అయిన ప్రతీయమానార్థములోనే వాక్యవిశ్రాంతి ఉన్నది. ఆ అర్థమును గోచరింపచేయడానికే భ్రమధార్మికేత్యాదివాక్యము ఉపాత్తము అయింది. ఈ ప్రతీయమానార్థానికే అనుమేయార్థము అని పేరు.

ఈ వాచ్యానుమేయార్థములు రెండిటికీ సముచ్చయరూపముగా అవగతి ఉపపన్నము కాదు. "భ్రమ! మా భ్రమీః" తిరుగు, తిరగవద్దు, అనే ఈ రెండర్థములూ విరుద్ధములు. విధి నిషేధ రూపాలు. ఇటువంటివానికి ఎప్పుడూ సముచ్చయము కుదరదు. "తిరుగు, లేకపోతే తిరగవద్దు" అనే వికల్పరూపావగతికూడా సముచితము కాదు. వికల్పమే ఇష్టమయితే 'భ్రమధార్మిక' అనే వచనోచ్చారణమే అనర్థకము అవుతుంది. ఈవచనము లేకపోయినా తిరగడమో తిరుగకపోవడమో ఏదోఒకటి ఉండనే ఉంటుంది గదా! ఒక అర్థములో వేరొకటి అంగమూ మరొకటి అంగీ అని ఈ రెండు అర్థాలకూ అంగాంగిభావరూపముగా అవగతికూడాకుదరదు. విధినిషేధములకు ఎన్నడూ అంగాంగిభావము ఉపపన్నము కాదు.

శునకమారణరూపమైన దృప్తపంచాననవ్యాపారము భ్రమణవిధిలో ఏది హేతుభావముతో ఉపాత్తము అయిందో బాగా విమర్శించగా కేవలము అది ధార్మికుని భ్రమణ నిషేధములో పరంపరగా పర్యవసానము పొందుతున్నది. ముందుగా శునకనివారణము, దాని ద్వారా ధార్మిక నివారణము ఉన్నది కాబట్టి పరంపరా పర్యవసాన మన్నమాట. భ్రమణముయొక్క విధినిషేధములు రెండూ బాధ్యబాధకభావముతో కూడుకొని ఉన్నవి. పిచ్చి లేనివాడు ఎవడైనా శునకము ఉన్నంతమాత్రాన

ఉంటవి. కాగా వ్యంజకములు అసాధారణములు' అని తలుస్తూఉన్న దీక్షితుని గ్రంథము ప్రాచీనవిరుద్ధము అని స్పష్టమవుతూ ఉన్నది.

---

తిరగక అక్కడే దృప్తసింహసద్భావశంక ఉన్నపుడుకూడా స్వేచ్ఛగా తిరుగుతాడా? కాబట్టి అనుమేయార్థములోనే విశ్రాంతిఉన్నదని అంగీకరించాలి. అవిశ్రాంతి నియమములో విధినిషేధాలకు గల బాధ్యబాధకభావము హేతువు ఉండడమే ఇక్కడ విశేషము. దీన్ని అవశ్యంగా అంగీకరించాలి.

కాగా ఈ పద్యములో "ధార్మికా! స్వేచ్ఛగా తిరుగుము" అనే వాక్యార్థరూపమైన భ్రమణవిధి వాచ్యము. దానికి "ఈ నాడు ఆ శునకము ఆ.........చేత చంపబడినది"అనే వాక్యార్థ రూపముగా ఉన్న దృప్తసింహవిహితక్రూరకుర్కురమారణము అర్థమైన హేతువు. పైని చెప్పిన విధముగా ఆక్షేపింపబడుతున్నది కాబట్టి భ్రమణప్రతిషేధము అనుమేయమేకాని వాచ్యముకాదు.

'గోదావరీకచ్ఛకుడుంగవాసినా' అనుట వలన గోదావరీకచ్ఛకుహరమునకు ధర్మిత్వము నిర్దేశింపబడుతున్నది. దృప్త సింహేన అనుట వలన శునకమారణకారణ కథనద్వారముగా ఉపాత్తమైన దృప్తసింహ సద్భావమునకు హేతుత్వము చెప్పినట్లు అవుతున్నది. కుడుంగవాసినా అనే సింహవిశేషణమువలన సింహము పక్షములో (ధర్మి) ఉన్నట్లు ఉపపాదింపబడుతున్నది. దృప్తసింహసద్భావము హేతువు. నిర్భయభ్రమణము సాధ్యము. ఈ రెండూ సమానాధికరణములు కావు కాబట్టి వీటికి సహానవస్థానవిరోధము ఉన్నది. ఇది ప్రసిద్ధమే. ఒకదాని సద్భావమును (ఉండుట) చెప్పుటచేత స్వభావవిరుద్ధమైన ఉపలబ్ధినిబట్టి రెండవదాని ప్రతిషేధము గోచరము అవుతున్నది. సింహము ఉన్నది అంటే భ్రమణవిధి లేదు అన్నమాట. అందువలన ఈ రెండు అర్థములకూ ప్రతీతి సమశీర్షికముగా ఉండదు. కాబట్టి వేరొక అర్థములో వాక్యానికి విశ్రాంతి ఉండరాదా? అనే ప్రశ్నకే అవకాశము లేదు. అందువలన భ్రమణ నిషేధము అనుమేయమేకాని వ్యంగ్యము కాదు అని నిశ్చయించాలి.

చూచేవారికి విషయములో ఏమీ సంశయము లేదు అనేనిశ్చయము ఉన్నపుడే ప్రవృత్తి కలుగుతుంది. ప్రకృతంలో విధివాక్యమును ప్రయోగించిన కాముకీస్వభావపరిశీలనము చేస్తే అటువంటి నిశ్చయము కలగడములేదు. వ్యాపకవిరుద్ధోపలబ్ధివలన భ్రమణ ప్రతిషేధము గోచరము అవుతున్నది. అగ్ని ఉన్నది అనే నిశ్చయము ఉంటే తుపార (మంచు) స్పర్శ ఉన్నది అనే జ్ఞానము కలుగదుగదా!

ఇంకా కేసరి అంటే కరికలభకుంభనిర్భేదైకహేవాకి. అటువంటిది దారుణతరము అయిన ఎలుగుబంటి మొదలగువాటిపై తన వ్యాపారమును చూపుతూ ఉండడము ప్రసిద్ధము. అటువంటివానిని విడిచిపెట్టి కౌలేయకమును వధచేసినట్లుగా చెప్పడములో ఔచిత్యైక నికేతనుడైన కవియొక్క అభిప్రాయము ఏమిటో ఎంతగా ఆలోచించినా మాకు గోచరము కావడములేదు. మదించిపోయి ఏదో పనిచేసే ఇతరజంతువులకుకూడా

ఇంకా "నిశ్శేషచ్యుతచందనం స్తనతటం" మొదలయిన అవాంతర వాక్యార్థాల కన్నిటికీ వాపీస్నానరూపార్థసంబంధము లేకుండాచేసి కేవల సంభోగరూపార్థమందే సంబంధమును కలుగజేసి అసాధారణ్యము సంపాదింపవలసినంత అవసరము ఏమివచ్చింది? అని దీక్షితుని

---

స్వజాతి సముచిత చరితమును విడిచిపెట్టి ఏదో అప్రసిద్ధమును వర్ణించడమును రసభంగభీరువులయిన కవులు ఆదరించరు. జగద్విదిత వ్యాపారము కలిగిన కేసరి విషయములో చెప్పేదేమిటి? అనౌచిత్య నిబంధనము గొప్ప రసభంగకారణ మని కవులంటున్నారు కాబట్టి "దృప్త ఋక్షేణ" అనే పాఠము బాగుంటుంది. "వ్యక్తివివేకము"

ఈ పైని చూపించిన వ్యక్తివివేకములోని మహిముని అనుమానవాదమును మమ్మటుడు తన కావ్యప్రకాశలో రెండు వాక్యములలో అనువదించుతున్నాడు. ఆ వాక్యములు—"అత్ర గృహే శ్వనివృత్త్యా భ్రమణం విహితం గోదావరీ తీరే సింహోపలబ్ధే రభ్రమణ మనుమాపయతి. యద్యద్భీరు భ్రమణం తత్తద్భయకారణనివృత్త్యుపలబ్ధి పూర్వకం. గోదావరీతీరే సింహోపలబ్ధి రితి వ్యాపకవిరుద్ధోపలబ్ధిః" అని. వీని భావము ఈ "భ్రమ ధార్మిక!" అనే పద్యములో శునకము లేకపోవడముచేత వాచ్యముగా చేయబడిన భ్రమణము గోదావరీ తీరములో సింహము ఉన్నది కాబట్టి అభ్రమణమును అనుమింప చేస్తున్నది. ఎక్కడ నయినా భయస్వభావము కల వ్యక్తి భ్రమించుట ఉన్నది అంటే "భయకారణము లేదు" అనే నిశ్చయోపలబ్ధి ఉన్నపుడే ఉంటుంది. ప్రకృతము గోదావరీ తీరములో భయకారణనివృత్త్యుపలబ్ధి లేదు. భయకారణము అయిన సింహోపలబ్ధి ఉన్నది. భయకారణము లేకపోవుట భ్రమణ యోగ్యతలో వ్యాపకము. ఇక్కడ వ్యాపకవిరుద్ధోపలబ్ధి ఉన్నది".

ఈ వాదమును మమ్మటుడు ఖండించినాడు. చూడండి. మహిముని వాదము యుక్తము కాదు. భయస్వభావము కల మానవు డయినా గురు వాదేశించినపుడు భయకారణము ఉన్నప్పటికీ భ్రమించవచ్చును. అట్లాగే ప్రభుశాసనము వలన భ్రమించవచ్చును. ప్రియురాలిపై అనురాగమువలన భ్రమించవచ్చును. కాగా "భయకారణము ఉండగా భీరుజనుడు భ్రమించడు" అనేమాట ఎట్లా కుదురుతుంది? ఉత్కటమైన భయకారణము లేకపోవడము దీనిలో ఉపాధి. అందువలన భయకారణోపలబ్ధి ఉండుట అనే హేతువు అనైకాంతికము అవుతున్నది. ఇంకా శునకస్పర్శ ధార్మికునకు నిషిద్ధము. వీరుడయినా ఈ భావముతో శునకానికి భయపడవచ్చు. శునకానికి భయపడేవాడు కూడా వీరత్వము వలన సింహానికి భయపడడు. కాబట్టి "గోదావరీతీరము భీరు భ్రమణ యోగ్యము కాదు. సింహము ఉండుటవలన" అనే హేతువు వ్యభిచారి అవుతున్నది. వీరు డయినందువలన సింహమును వేటాడాలి అనే ఔత్సుక్యము కలిగి ఉన్నాడు అని నిశ్చయించితే, హేతువు విరుద్ధముకూడా అవుతున్నది. ఇంకా

ప్రశ్నించాలి. వ్యంగ్యవ్యంజనానికి ఆవిధముగా చేయాలి అని అనడము సమంజసము కాదు. వ్యంజకములలోని అసాధారణత వ్యంగ్యములో ఏమీఉపాయముకాదు. వ్యంగ్యార్థమును వ్యక్తముచేసే సందర్భములో- వ్యంజకములు వ్యంగ్యముతోనే సంబంధించి ఉండాలి కాని ఇతరములతో సంబంధించి ఉండరాదు——అనే నియమములేదు. అది ఆవశ్యకము కూడా కాదు. వ్యంజకములకు సాధారణత్వమే అంతటా ప్రదర్శింపబడుతున్నది

ఔన్నిద్ర్యం దౌర్బల్యం చింతా అలసత్వం సనిశ్వసితం
మమ మందభాగిన్యాః కృతే సఖి ! త్వామ ప్యహహ పరిభ్రమతి.

సఖి ! మందభాగిని అయిన నాకొరకు నిన్నుకూడా జాగరణము, దుర్బలత్వము, చింత, ఆలస్యము, నిట్టూర్పు పుచ్చుట అహహా!! పరిభవించు తున్నవికదా ! నీవుకూడా దుఃఖపడవలసి వచ్చిందిగదా ! *

---

గోదావరీతీరములో సింహము ఉన్నట్లు ప్రత్యక్షమువలన గాని అనుమానమువలన గాని నిశ్చితము కాలేదు. కేవలము వచనమువలన నిశ్చయింపబడుతున్నది. వక్తయందు ఆప్తత్వనిశ్చయము ఉంటేనే వచనానికి ప్రామాణ్యము ఉంటుంది. ఇక్కడ వచనమును పలుకుతున్నది కులట. ఆమె ఆప్తురాలు అవునా? కాదా? అనే సందేహము ఉన్నది. ఈ సందేహము వలన ఆ వచనజన్యజ్ఞానమందు ప్రామాణ్య నిశ్చయము ఉండదు. కాబట్టి హేతువు సందిగ్ధముకూడా అవుతున్నది. ఈవిధముగా హేతువు అనైకాంతికము అయినపుడు, వ్యభిచారి అయినపుడు, సందిగ్ధము అయినపుడు సాధ్యసిద్ధి కలుగదు. అది అనుమాన పరిపాటికాదు. హేతువు అనైకాంతికమయినా, వ్యభిచారి అయినా, సందిగ్ధమయినా వ్యంగ్యసిద్ధి కలుగవచ్చును. అటువంటి స్థలములోకూడా వ్యంజన ప్రసక్తము కావచ్చును. "కావ్యప్రకాశ"

* ఉపభోగకాంక్ష కలిగిన ఒక నాయిక తన దూతికను తన నాయకుని తీసికొని రావడానికై పంపింది. ఎన్నినాళ్లనుంచో కోరికలను ఊరబెట్టుకొని ఉన్న ఆ దూతి ఆ నాయకునితో యథేచ్ఛావిహార మొనర్చి వచ్చింది. అప్పటి నిర్దయరత్యుపమర్దమువలన ఉపభోగచిహ్నము లన్నీ దూతిలో ఉండడమును తెలిసికొనిన నాయిక ఈ విధముగా పలుకుతున్నది. దీనిలో అనేక విధములుగా వ్యంగ్యార్థమును గ్రహించుటకు అవకాశ మున్నది. సఖీ ! నీవు నాకు అన్నిపనుల్లోనూ ఉపయోగపడుతున్నావు. నేను నాయకవిరహతంతప్యమానమానసను అయినాను. అందుకొరకై నిన్ను నాయకుని ఇంటికి ఈ విధముగా త్రిప్పవలసి వచ్చింది. నీవుకూడా గతా

ఈ పద్యములోని జాగరణాదిధర్మాలు సాధారణములే. జాగరణము మొదలయినవి నాయికలో ఉన్నవి. దూతిలోకూడా ఉన్నవి. ఇవి రోగాదికమువలనకూడా కలుగవచ్చును. అందువలన అసాధారణాలు కావు. ఈ విధముగా సాధారణము లయిన ఉన్నిద్రతాదులే అర్థవిశేష వ్యంజనము చేయగలుగుతవి. ఈ వాక్యాలను పలికినది ఎవరు? ఏ సమయములో, ఎందుకొరకు ఈ వచనములు చెప్పబడినవి? ఏస్థలమున పలుకబడినవి? అని ఈ విధముగా ఉన్నిద్రతాదులను పరిశీలించినపుడు —దూతినాయకునితో కూడి సంభోగము చేయుటను మనస్సులో ఉంచుకొని నాయిక ఈ మాటలను పలికింది—అని స్పష్టమవుతున్నది. వక్త్రాదివైశిష్ట్యమువలన అర్థవిశేషవ్యంజకత్వము ఇక్కడ ఉన్నదని అంగీకరించుతున్నారు.

వాక్యార్థాలు సాధారణములు కాని అసాధారణములు కాని అయినంత మాత్రాన వ్యంగ్యమురాదు. అవి చెప్పేది ఎవరు? ఎందుకొరకు చెప్పుతున్నారు? మొదలయిన వానిని భావించినప్పుడే వ్యంగ్యము వెలువడుతుంది. అప్పుడు వ్యంజకములు సాధారణము లయినా ఒకటే, అసాధారణములు అయినా ఒకటే అని ఫలితార్థము. అదికాక ఏదో ఒక

---

గతాయాసము పొందినావు. అయ్యో! మందభాగిని అయిన నాకొరకై నీవుకూడా జాగరణము. దుర్బలత, చింత, అలసత్వము, నిట్టూర్పులు అనుభవింపవలసి వచ్చిందికదా! నేను ఎట్లాగూ అనుభవింపక తప్పడంలేదు. పాపము! నీవుకూడా అనుభవించుతున్నావే? ఇది సామాన్యముగా వాచ్యార్థము. దూతీ! నీవు దూతివికావు, సఖివీకావు. నా దౌర్భాగ్యము ఈ విధముగా ఉన్నది. నేను నాయకుని అప్రాప్తిచింతాఖిన్నను అవుతున్నాను. నీవు వానితో రమించి వచ్చినావు. ఆ లక్షణములు నీలో కన్పడుతున్నవి. నిద్రను విడిచి సురతానంతరసురతమును పొందినావు. రతిగ్లాని నీలో ఉన్నది. ఆ సురతవిశేష ప్రక్రియలనే మాటిమాటికీ భావించుతున్నావు. అదే నీ నిరంతరచింతనము. ఆ విషయభావనము చేసి చేసి మళ్ళా ఆ రతఫలము కలుగుతుందో కలగదో అని నిట్టూర్చుతున్నావు. నీ భావన అంతా ఎక్కడో లగ్నమయింది. మనోనుభూతిలో ఆ సురతవిధానమునే భావింప చేసికొంటూ పరవశురాలవు అవుతున్నావు. అందువలననే అప్పటి ఆయాసమును నిట్టూర్పులతో తీర్చికొంటున్నావు. నిరంతరతన్మయత్వములో మునిగి పోయినావు కాబట్టి కర్తవ్యములలో చురుకుగా ప్రవర్తింపవు. నీకు కల భాగ్యము నాకులేదు. నీవిట్లు చేయుదువా? ఇది దూతీధర్మమా? చెలికత్తె ఇట్లా చేయవచ్చునా? ఇత్యాది.

విశేషవస్తువుతో సంబంధించి ఉండుట అనే అసాధారణ్యము అను మానరచనకు అనుకూలము. వ్యంజనకు ప్రతికూలమూను. ఈ అసాధారణ్యానికే న్యాయశాస్త్రపరిభాషలో వ్యాప్తి అని పేరు. వ్యాప్త్య పరపర్యాయమైన అసాధారణత్వమువలన వ్యంజనసిద్ధి కాకపోగా అనుమానసిద్ధి అవుతున్నది. అనుమానము సిద్ధమై వ్యంజనను నిరాకరించుతున్నది.

తడిసిన ముదుకవస్త్రముతో రుద్ది తుడిచినప్పుడు కూడా స్తనోపరి భాగాల (తట) చందనము నిశ్శేషచ్యుతము కావచ్చు. కాబట్టి తటాది పదాలు ఉన్నప్పటికీ "నిశ్శేషచ్యుత చందనం" మొదలయిన వాక్యార్థాలు అసాధారణములు కావు, అనేటట్లయితే-

ఈ విషయమును నిక్కచ్చిగా అడగాలి. వాపీస్నానమును వ్యావృత్తము చేయడములో పురుషార్థము ఏమి వచ్చింది? దానివలన ఏమిలాభమున్నది? అనైకాంతికత్వ మనేది అనుమితికి ప్రతికూలము. వ్యక్తికి ప్రతికూలము కాదు. మీదుమిక్కిలి వ్యక్తికి అనుకూలమే. ఒకచోట ఉన్న అనైకాంతికత్వము (వ్యభిచరించుట) అనుమితిప్రతికూలమైనట్లే అనేకస్థలాలలో అనైకాంతికము అగుటకూడా అనుమితిప్రతికూలము. వ్యంజనకు అనుకూలమూను. అందువలన ఈ ప్రయాస వ్యర్థమని తలచవలసివస్తున్నది.

ఈ విషయాన్నికూడా ఇక్కడ భావించాలి. నాయికాకథనము వలన —— నీ వాతని సమీపానికి రమించుటకు వెళ్ళినావు అనేది వ్యంగ్యముగా వెలువడుతున్నది. ఈ వ్యంగ్యశరీరమును పరిశీలించితే రెండు విషయములు ఇందులో గోచరములు అవుతున్నవి. నాయకుని సమీపానికి వెళ్ళుట ఒకటి. అక్కడికి వెళ్ళడములో ఫలీభూతమైన రమణము రెండు. వీటిలో తదంతికగమనరూపమైన అంశానికి వారి మతానుసారముగా వ్యంగ్యత్వమును సిద్ధింపచేయడము శక్యముకాదు. దీక్షితరీత్యనుసారముగా చూస్తే "నిశ్శేషచ్యుతచందనం" మొదలయిన వానిచేత ప్రతిపాదింపబడే విశేషణవాక్యార్థాలు వాచ్యార్థ

మైన వాపీస్నానములో సరిగా సమన్వయము పొందడము లేదు. యోగ్య సమన్వయములో బాధ కలుగుతున్నది. వాచ్యకక్ష్యలో — వాపీ స్నానానికి వెళ్ళితివి, నాయకసన్నిధికి వెళ్ళలేదు, అనేవి రెండూ ప్రధాన వాక్యార్థములు అవుతున్నవి. వెళ్ళితివి విధి, వెళ్ళలేదు నిషేధము. వాచ్యార్థము బాధితము అయినందువలన ఇక్కడ విపరీత లక్షణను అనుసరించాలి. కాగా "వాపీస్నానానికి వెళ్ళలేదు. అతని సమీపానికే వెళ్ళినావు" అనే అర్థములు లభ్యములు అవుతున్నవి. వాచ్యములోని "వెళ్ళితివి" వలన "వెళ్ళలేదు" అని, "వెళ్ళలేదు" వలన "వెళ్ళితివి" అని స్పష్టములు అవుతున్నవన్న మాట. విధివలన నిషేధము, నిషేధమువలన విధి వ్యక్తముగా విపరీతలక్షణ వలన గోచరములు అవుతున్నవని భావము. "తత్సమీపమునకు వెళ్ళితివి" అనే అర్థము విపరీతలక్షణవలననే గోచరము అవుతూఉంటే వ్యంగ్యత్వము దురుపపాదమేకదా ?

వాచ్యార్థము బాధితమైన తరువాత ప్రకటము అయ్యే అర్థము వ్యంజనము వలన బోధింపబడుతున్నదని గాని, వ్యంగ్యము అని కాని అనడము సముచితము కాదు. అటువంటిది లక్షణావిషయము కాని వ్యంజనావిషయము కాదని గ్రహించాలి.

"అహో పూర్ణం సరో యత్ర లుఠంతః స్నాంతి మానవాః"

ఆహా! సరస్సు ఎంత నిండుగా ఉన్నది. మానవులు పొర్లాడుతూ స్నానము చేస్తున్నారు అనే వాక్యములో పూర్ణత్వాభావము గోచరము అవుతున్నది. ఇది లక్షణాలభ్యము. వ్యంగ్యముకాదు. ఇక్కడ స్నానము చేసే మానవులకు పొర్లాడుట (లుఠంతః) విశేషణముగా ప్రయోగింపబడింది. సరస్సులో పూర్ణత్వము లేనప్పుడే లుఠనము ఉపపన్నమవుతుంది. 'సరఃపూర్ణం' అనే వాచ్యార్థములో లుఠనము ఉపపన్నము కాదు. ఆ లుఠనానుపపత్తిని ఆధారముగా చేసికొని పూర్ణత్వాభావము సముల్లాసము పొందుతున్నది. ఇటువంటిది లక్ష్యమేకదా! విపరీత లక్షణచేత పూర్ణత్వాభావము సాధింపబడినప్పుడు వ్యక్తివేద్యత్వము కుద

రదు కదా! కాబట్టి పూర్వోక్తవ్యంగ్యములోని ఏకాంశము అయిన తదంతికగమనము వ్యంగ్యము అనడము ఉచితముకాదు.

అంతికగమనము లక్షణావేద్య మయినప్పటికీ రమణరూపఫలాంశము వ్యంగ్యమే అవుతుంది. నాయకసమీపగమనరూపార్థములోని సామర్థ్యమును ఆధారముగా చేసికొనిన వ్యంజనము రమణమును వ్యంగ్యము చేయవచ్చునుకదా!

అని అనుటకూడా సముచితముకాదు. దీక్షితులవారే చిత్రమీమాంసలో—"అధమత్వము అనగా అపకృష్టత్వము. అది జాతిచేగాని కర్మచేగాని కలుగుతుంది. ఉత్తమనాయిక నాయకునకు జాత్యపకర్షమును చెప్పదు. ఇచటి హీనకర్మ దూతీసంభోగమే కావాలి"—అని అంటున్నారు. ఈ గ్రంథసందర్భమువలన రమణాంశము * అర్థాపత్తివేద్యము అవుతున్నది అని స్ఫుటముగా చెప్పినట్లయింది. అర్థాపత్తిలభ్యమును వ్యంగ్యము అనరాదు. ఇతరవిధముగా వచ్చే అర్థమును శబ్దార్థమునుగా ఎవరూ స్వీకరించరాదు. "అనన్యలభ్యః శబ్దార్థః" అని నియమము. అన్యలభ్యము కాకుండా ఉండేదే శబ్దార్థముగా పరిగణింపబడుతున్నది. శబ్దార్థము అనన్యలభ్యమే కావాలి.

ఇచటి రమణ రూపార్థము వ్యంగ్యము అని ఏదోవిధముగా ప్రకృతములో వ్యంజనావ్యాపారమును అంగీకరించినా దీక్షితులవారికి ఇష్టసిద్ధి కలుగదు. కుచోపరిభాగాల చందనము పోవుట, అధమత్వము అనేవి

---

* ఈ అర్థాపత్తి ఒక ప్రమాణము. ఒక అర్థము అనుపపన్నమై తన ఉపపత్తి కొరకు అర్థాంతరమును గోచరింపచేస్తే ఆ అర్థాంతరము అర్థాపత్తిలభ్యము అంటారు. 'చైత్రుడు బలిసి ఉన్నాడు, పగలు అన్నము తినడు' అనే వాక్యములో అన్నముతినని వాడు బలిసి ఉండడము అసంభవము కాబట్టి బలిసి ఉండుట అనేది అనుపపన్నమై తన ఉపపత్తి కొరకు రాత్రి భోజనమును వ్యక్తము చేస్తుంది. ఇది అర్థాపత్తి. ఆ విధముగానే ప్రకృతములో అధమత్వము వేరొక విధముగా కుదురుపాటును పొందడములేదు. కాబట్టి అనుపపన్నమై తన ఉపపత్తి కొరకు సంభోగరూపమైన అర్థాన్ని స్పష్టము చేస్తున్నది. అందువలన రమణరూప ఫలాంశముకూడా అర్థాపత్తి ప్రమాణలభ్యము అని దీక్షితులు అంగీకరించినట్లయింది.

దీక్షితుడు చెప్పినట్లుగా చూస్తే వేరొకవిధముగా కుదరవు. కేవలము దూతీసంభోగము వలననే సిద్ధములు కావాలి. కాగా గుణీభూతవ్యంగ్యమే అవుతున్నది. కాని ధ్వన్యుదాహరణము కావడములేదు. ఇచటి ఈ వ్యంగ్యము వాచ్యసిద్ధిలో అంగము అవుతున్నది. అందువలన వాచ్యములో గుణీభూతము అయినట్లే. ఈ విధముగా దీక్షితాడంబరము ఉపపత్తి విరుద్ధము అనికూడా స్ఫుటతర మవుతున్నది.

అందువలన అతిచతురమతి కలిగిన నాయిక నిరూపించిన విశేషణ వాక్యార్థాలకు సాధారణ్యము చెప్పడమే సముచితముగా ఉంటుంది. ఆ విశేషణాలు వాపీస్నానరూపార్థములోనూ సంభోగరూపార్థములోనూ సంబంధము కలిగిఉన్నవనే నిర్ణయించాలి. ఈ క్రిందివిధాన వాని సాధారణ్యమును ఊహించవచ్చును.

దూతీ! నీకు నేను బంధుజనముపంటిదానను. నాకుకలిగిన పీడను నీవు తెలిసికొనకుండా స్వార్థతత్పరురాలవు అయినావు. నీవు స్నానపువేళ దాటిపోతుంది అనే భయముతో నదికీ వెళ్లలేదు. మదీయప్రియుని సన్నిధికీ వెళ్లలేదు. నా దగ్గరనుండి ఇక్కడికి దగ్గరగా ఉన్న దిగుడుబావి స్నానానికి వెళ్లినావు. నాయకునికి ఇతరుల వేదన ఎటువంటిదో తెలియదు. దుఃఖమును కూర్చుతున్నాడు. అందువలన అధముడు. అటువంటి ఆ నాయకునిసన్నిధికి కూడా నీవు వెళ్ళలేదు. ఈ విషయములంతా నీ ఈ దశవలన విశద మవుతున్నది. చూడు దిగుడుబావిదగ్గరకు చాలామంది యువకులు స్నానానికై వచ్చిఉంటారు. వారిని చూచి నీవు సిగ్గుపడి ఉంటావు. ఆ త్రపాపారవశ్యాన భుజలతాయుగళమును అంసద్వయమునందు లగ్నముచేసి అటు ఇటూ అస్తవ్యస్తముగా కంఠానికి తగిలించుకొని స్వస్తికవిధానముతో కూర్చి కుచద్వయమును బాహుకండరాలతో ఒకిపిడి కలుగునట్లుగా రుద్దుకొని ఉంటావు. కుచతటములు పొంగి ఉబ్బెత్తుగా ఉండడమువలన అధికముగా ఆమర్శమును పొందిఉంటవి. అందువలన స్తనతటమే నిశ్శేషచ్యుతమయింది. ఉరఃస్థలము ఆవిధముకాలేదు. ఇట్లాగే త్వరత్వరగా బాగా తోముకొనకపోవడము మూలాన పై పెదవిరాగము పోలేదు. ఉత్తరోష్ఠముకంటె అధరానికి గండూషజలమువలన దంతధావ

నము చేసేటప్పుడు అంగుళ్యాదులసమ్మర్దము అధికముగా ఉన్నందువల
ననే అధరరాగము నిర్మృష్టము అయింది. బాగా క్షాళనముచేయకపోవ
డము మూలాన కేవలమూ నీటిబిందువులసంబంధమువలన నేత్రాలకు
ఉపరిభాగములోనే అనంజనత్వము కలిగింది. నీవు ఈవిధముగా దుర్బల
వైనావు. శీతవశాన కృశత్వమువలన నీ తనువు పులకరించింది.

ఈ విధముగా విదగ్ధనాయికావచనాల నిగూఢార్థతాత్పర్యమును నిర్ణ
యించుట సముచితపద్ధతి కాకపోతే వైదగ్ధ్యము నష్టము అయినట్లే,
నాయికాచతురత చివికిపోయినట్లే.

ఈ విధముగా వాక్యార్థములను ఉభయసాధారణములనుగా భావించితే
ముఖ్యార్థములో ఏవిధమైన బాధకూడా కలుగదు. అప్పు డిది లక్షణా
స్థానము కానక్కరలేదు. తాత్పర్యార్థము ఏమిటో వెంటనే ఆకలితము
కానపుడు లక్షణకు అవకాశము ఏమి ఉన్నది? విదగ్ధురాలయిన ఆ
నాయికయొక్క వచనము నిగూఢతాత్పర్యము కలిగిఉన్నది. అందు
వలన తాత్పర్యార్థము త్వరగా భాసింపదు. లక్షణ తాత్పర్యానుపపత్తిని
ఆశ్రయించి కాని బయలుదేరదు. కాబట్టి ఇక్కడ లక్షణ ఎట్లా వస్తుంది?
అబాధితముగా వాచ్యార్థప్రతిపత్తి కలిగిన అనంతరము వక్తృబోద్ధవ్య
నాయకాదుల వైశిష్ట్యప్రతీతి కలుగుతుంది. అటువంటి ప్రతీతి కలిగిన
తరువాత సాధారణరూపముగా ఉన్న ధర్మాలు వ్యంగ్యరూపపర్యవసాన
మును పొందుతవి. ఈ పద్ధతి సముచితముగా ఉంటుంది.

ప్రకృతపద్యము నాయకుని విషయమై చెప్పబడిన దని మనము వైశిష్ట్య
స్ఫూర్త్యనంతరము గ్రహింపగలము. అప్పుడు ఈ అర్థము గోచర మవు
తుంది. నాయకుడు దుఃఖదాయి కాబట్టి అధముడు. ఈ అధమశబ్దము
వాచ్యవ్యంగ్యార్థములలో సమానరూపముగా సమన్వితమవుతున్నది.
నాయకుడు సామాన్యముగా దుఃఖదాత అయినాడు. అందువలననే దుఃఖ
దాతృత్వధర్మము అధమపదప్రవృత్తిలో నిమిత్త మవుతున్నది. ఆతడే
అధముడు అని అనడములో ఆతనివలన దుఃఖము కలగడమే హేతువు
అని భావము.

ఒక విషయమును ప్రస్తుతములో గమనించాలి. దుఃఖదాయిత్వధర్మము సామాన్యాత్మకము అయినప్పటికీ వాచ్యార్థములో ఒక విధముగానూ వ్యంగ్యార్థములో వేరొకవిధముగానూ భాసించుతుంది. నాయకుడు మొదట ఏదోవిధమయిన అపరాధము చేసినవా డగుటవలన దుఃఖప్రదాత అవుతున్నాడని, అందువలననే అధముడు అయినాడని వాచ్యార్థదశలో భావించవచ్చును. ఆ దుఃఖదాయితాధర్మమే వ్యంజనావ్యాపారద్వారముగా దూతీసంభోగము చేయుట కారణముగా కలిగినదుఃఖదాతృత్వరూపముగా పరిణామము పొందుతున్నది. (అధములు అనేక విధాల ఉంటారు. అందరిఅధములలోనూ అధమపదప్రవృత్తినిమిత్తము ఏకవిధముగా ఉండదు. అందువలన అక్కడ ఏయే ధర్మాలు ఉంటవో వానినే అక్కడ ప్రవృత్తినిమిత్తములనుగా స్వీకరించాలి. ప్రకృతములో దుఃఖదాతృత్వరూపధర్మమే అధమతాసంపాదకము. ఆ యా ప్రకరణ ధర్మాలనుబట్టి వాచ్యకక్ష్యలో అపరాధాంతరనిమిత్తమైన దుఃఖము భాసించుతుంది. వ్యంగ్యకక్ష్యలో దూతీసంభోగనిమిత్తమైన దుఃఖము భాసించుతుంది. ఆయా వైశిష్ట్యప్రభావమువలన వాచ్యవ్యంగ్యసాధారణమైన అర్థము చమత్కారముఖముగా పర్యవసానము పొందుతుందని ఆలంకారిక సిద్ధాంతనిష్కర్ష. దీనివలన—

"అధము డనగా హీనుడు. హీనత్వము రెండువిధాల కలుగుతుంది. ఒకటి జాతివలన, రెండు కర్మవలన. ఉత్తమనాయిక తన ప్రియుని జాత్యధమునిగా పలుకదు. కాబట్టి ఇచటి అధమత్వము కర్మకృతమే, ఆ కర్మకూడా తన (నాయకుడు) అపరాధములో పర్యవసానము పొందే దూతీసంభోగరూపమే అవుతుంది గాని ఇంతకు అతిరిక్తముగా ఏదీ కాదు. దూతిని పంపుటకు పూర్వము ఏదైనా హీనత్వమును సంపాదించే కర్మ ఉంటే అది సహింపబడినదే అవుతుంది కాబట్టి ఉద్ఘాటనార్హము కాదు. ఇతరములను అన్నిటినీ త్రోసిపుచ్చి సంభోగరూపమైన కర్మయే అధమత్వసంపాదకముగా పర్యవసన్నము అవుతున్నది."

అని దీక్షితులు వ్రాసినది అంతా ఖండితమైపోతున్నదని గ్రహించాలి.)
ఏమంటే:—చతురోత్తమనాయిక తన సఖీసమక్షములో దూతీసంభోగ

రూపమయిన తన నాయకుని అపరాధమును స్పష్టముచేయుట సర్వథా అత్యంతమూ అనుచితము. తాను ఏయే పూర్వపు అపరాధాలను సహించిందో వానినే ప్రస్తుతము అసహ్యాముగా దూతిని ఉద్దేశించి చెప్పదలచింది కాని నూతనముగా ప్రతిపాదింపదలచలేదు. ఇతి దిక్.

## ఉత్తమ కావ్యము

యత్ర వ్యంగ్య మప్రధానమేవ సచ్చమత్కారకారణం తద్. ద్వితీయం.

వ్యంగ్యము అప్రధానమై చమత్కారకారణ మైనప్పుడు ఉత్తమకావ్యము. ఇది ఉత్తమకావ్యలక్షణము. దీనిలో వ్యంగ్యము అప్రధానమే కావాలి. ఏ దృష్టిలో కూడా ప్రధానము కారాదు. ఒకొ్కక చోట వ్యంగ్యము వాచ్యముకన్న ప్రధానము అయినప్పటికీ ఇతర వ్యంగ్యాపేక్షయా గుణీభూతము (అప్రధానము) కావచ్చును. అటువంటి వ్యంగ్యములో ఈ లక్షణానికి అతివ్యాప్తి లేదు. అందుకొరకే "వ్యంగ్యము అప్రధానమే కావాలి" అని లక్షణములో చేర్పబడు తున్నది. అట్లాగే "చమత్కారకారణం" అనేదికూడా సార్థకము. వాచ్యచిత్రకావ్యములో వ్యంగ్యము లీనము అవుతుంది. దాని చమత్కారము అక్కడ ఏమీ ఉండదు. అటువంటిచోట ఉపమాద్యర్థాలంకారములకే ప్రాధాన్యము ఉంటుంది. అటువంటి కావ్యములో ఈ లక్షణానికి అతివ్యాప్తి రాకుండా ఉండడానికే చమత్కారకారణము అనేది ఆవశ్యకము అవుతున్నది.

అతాదృశి గుణీభూతవ్యంగ్యం వ్యంగ్యేతు మధ్యమం.

అని కావ్యప్రకాశలక్షణము. వ్యంగ్యార్థము వాచ్యార్థాతిశయిత రమణీయత్వము కలది కానపుడు "గుణీభూతవ్యంగ్యము" అనే మధ్యమ కావ్యము అని దాని భావము. ఈ లక్షణవ్యాఖ్యానము చేసేటప్పుడు టీకాకారులు "చిత్రకావ్యభిన్నము" అని వ్రాశారు. అది సరికాదు. పర్యాయోక్తి సమాసోక్త్యాదికావ్యాలు చిత్రకావ్యములు అవుతవి, గుణీభూతవ్యంగ్యకావ్యములూ అవుత వని సకలాలంకారికులకూ సమ్మతమే. టీకాకారుల అభిప్రాయానుసారముగా అయితే వానిలో

ఈ లక్షణము అవ్యాప్తము అవుతున్నది. చిత్రకావ్యము అయితే గుణీభూతము కారాదన్న నియమము లేదు. ఉత్తమకావ్యోదాహరణము :

> రాఘవవిరహజ్వాలాసంతాపితసహ్యశైలశిఖరేషు
> శిశిరే సుఖం శయానాః కపయః కుప్యంతి పవనతనయాయ.

(శ్రీరాముని విరహజ్వాలాసంతప్తము లయిన సహ్యపర్వతశిఖరభాగములలో శిశిరకాలమున సుఖముగా శయనించుతున్న కపులు, పవనతనయుడైన హనుమంతుని కోపించుతున్నారు.) *

"హనుమంతుడు సీతాకుశలమును రాఘవునకు నివేదించినాడు. అది వినగా రాఘవుని విరహతాపము శమించింది. ఆతడు శిశిరీకృతుడు అయినాడు. శిశిరములో శైలశిఖరాలు మళ్లీ శీతలములు అయినవి" అనేది వ్యంగ్యార్థము. అన్ని కోతులకూ హనుమంతునిపై కోపము ఉదయించింది అని వాచ్యార్థము. రామచంద్రుని విరహము శమించగా సహ్యాచలము చల్లబడింది. చలివలన శిశిరర్తువులో బాధపడిన కోతులు హనుమంతుని కోపించుట ఉచితముగానే ఉన్నది. దీనిలో వ్యంగ్యార్థము

---

* శ్రీరామచంద్రుడు సీతావిరహి అయినాడు. అతని విరహాగ్ని దుస్సహముగా ఉన్నది. ఆవిరహాగ్నిజ్వాలల చేత పరిసరమంతా సంతాపితమవుతున్నది. విరహవివశుడైన రాముడు సహ్యాద్రిపై శయనించగా పర్వతభాగ ప్రవిభాగములన్నీ సంతప్తము లయినవి. ఆ సహ్యాద్రి వెచ్చదనము శిశిరశీతాపనోదనసమర్థము కాగా కపులు సుఖశాయితు లయినారు. శిశిరబాధ వారికి వ్యథాపాదకము కాలేదు. లంకనుండి హనుమంతుడు వచ్చి సీతావార్తను చెప్పగా రాముని విరహతాపము శమించింది. ఇక సహ్యశైలమున ఆసహ్యవిరహజ్వాలలు లేవు. చల్లని శ్రీరాముడు సహ్యతాపకుడు కాలేదు. శిశిరశిశిరీకృతశిఖరిశిఖరాలు కోతులను గజగజలాడించినవి. వణుకుబాధను వహించలేని వానరులు "ఇంతకూ కారణము ఆంజనేయుడే" అని అతనిపై కోపించుతున్నారు. ఆ సమయములో శీతపవనుడు బాధ పెట్టుతున్నాడు. అతనికి తగినట్లు పవనతనయుడు ప్రవర్తించుట కోపకారణము. ఇప్పుడీతడు రాకపోయినట్లయితే రామవిరహము శమించేది కాదు. పర్వతశిఖరాల వెచ్చదనము పోయేది కాదు. తమకు వజవజ వణకవలసిన అవసరము వచ్చేది కాదు. అంతకూ కారణము హనుమంతుడు. అందువలన కపులు కోపించారు.

ద్వారా వాచ్యార్థము సిద్ధమగుటవలన (వాచ్యార్థసిద్ధిలో వ్యంగ్యార్థము ఉపకరించుటవలన) వ్యంగ్యము గౌణము అయినది. ప్రధానము కాలేదు. వాచ్యార్థమును ఉపపాదించే వ్యంగ్యము గౌణమే అని నియమము. వ్యంగ్యము ఆకస్మికకపికోపాన్ని ఉపపాదించేది అయినప్పటికీ దౌర్భాగ్యమువలన దాస్యమును అనుభవించే రాజాంగన మాదిరి కమనీయత్వమునే సంపాదించుట సహృదయులకు అనుభవసిద్ధము. రాజకన్య దాసి అయినా ఆమె అనుపమసౌందర్యము మెరుస్తూనే ఉంటుంది. వ్యంగ్యము గుణీభూతము అయినా అనిర్వచనీయ సుందరత దృష్టి గోచరమవుతూనే ఉంటుంది.

పై విషయ భావనానంతరము ఈ శంక కలుగవచ్చును. ప్రతీయమాన వ్యంగ్యార్థము వాచ్యార్థానికి ఉపపాదకము అయినప్పుడు ("గుణీభూత వ్యంగ్యము" అనే ఉత్తమకావ్యము) అవుతుందని ఇప్పటికి తేలిన అర్థము. కాగా "తల్పగతాపిచ సుతనుః" అనే పూర్వపు (ఉత్తమోత్తమ కావ్య) ఉదాహరణములో "మంద మాక్షిపతి" అనే ఆక్షేపగత మాంద్యము నవవధూస్వభావవిరుద్ధము. నవోఢా ప్రకృత్యనుసారముగా ఛట్టున తీయడము ఉండాలి. అట్లా లేదు. ఉన్న విధానము అనుపపన్నము అవుతున్నది. ఇటువంటి ఈ అర్థము వ్యంగ్యముచేతనే ఉపపాదింపబడి సిద్ధ మవుతున్నది. నాయికకు పతిమీద ఉన్న ప్రేమ వ్యంగ్యము. ఆ నవోఢకు ప్రేమ ఉన్నది కాబట్టి "మంద మాక్షిపతి". వ్యంగ్యము వాచ్యానికి ఉపపాదక మయినది అన్నమాట. అందువలన ఇదికూడా ఉత్తమకావ్యోదాహరణమే కావాలి. కాని ఉత్తమోత్తమము అనుట ఉచితముకాదు అని.

ఈ శంకకు ఇది సమాధానము. వాచ్యార్థము వ్యంగ్యార్థమువలననే కాక ఇతరార్థములవలనకూడా ఉపపన్నమై సిద్ధమైనపుడు గుణీభూతవ్యంగ్యమనరాదు. కేవలము వ్యంగ్యమే వాచ్యార్థాన్ని ఉపపాదించేది అయినపుడు ఉత్తమకావ్య మని వ్యవహారము. "తల్పగతాపి" అనే పద్యములోని మందాక్షేపము ప్రేమరూపవ్యంగ్యమువలననే కాక ఇతర విధాన కూడా ఉపపాదింపబడడానికి అవకాశము ఉన్నది. విశేష

చమత్కారము కలుగజేయనటువంటి ప్రతిదినము చెలికత్తెలు చేసే ఉపదేశాలుకూడా మందాక్షేపమును సిద్ధము చేయవచ్చును. కాబట్టి దానిసిద్ధిలో వ్యంగ్యమైన ప్రేమయే ఆవశ్యకముకాదు.

ఇంకా ఈపద్యములో విప్రలంభరతి ప్రకాశింపబడినపుడే నిరవధికనిర్వృతి చర్వణ కలుగుతుంది. విప్రలంభరతిని ప్రకాశింప చేయకుండా, స్వతంత్రముగా కేవలమందాక్షేపము పరమానందాస్వాదవిషయము కాలేదు. "నిశ్శేషచ్యుతచందనం" అనే పద్యములో కూడా ఈ విధముగానే భావించాలి. వానిలో అధమత్వము మొదలయిన వాచ్యార్థాలు సామాన్యముగా వ్యంగ్యాతిరిక్తార్థమువలననే ఉపపాదింపబడుతున్నవి. ఆవిధముగానే అవి వ్యంజకములు అవుతున్నవి. అందువలననే అక్కడ కూడా గుణీభూతశంకకు అవకాశము లేదు.

ఉత్తమోత్తమకావ్యము ఉత్తమకావ్యము అనే ఈ రెండుభేదాలలోనూ చమత్కారము ప్రకటముగానే ఉన్నది. ఏ ఒకదానిలోకూడా రమణీయత కప్పబడి పోవటములేదు. అయినప్పటికీ మొదటిదానిలో వ్యంగ్యానికి ప్రధానత్వము ఉన్నది. రెండవదానిలో వ్యంగ్యము అప్రధానము అవుతున్నది. ఇదే ఈ రెండు కావ్యాలకూ విశేషము. (దీనిని సహృదయులు మాత్రమే తెలిసికొంటారు.)

చిత్రమీమాంసాకర్త ఈ కావ్య విషయములో:

> ప్రహరవిరతౌ మధ్యేవాహ్న స్తతోపి పరేణవా
> కిముత సకలేయాతే వాహ్ని ప్రియః త్వమిహైష్యసిః
> ఇతి దినశతప్రాప్యం దేశం ప్రియస్య యియాసతః
> హరతి గమనం బాలాఽలాపైః సబాష్పగలజ్జలైః.

అని ఉదాహరించినాడు. ప్రియుడు దూరదేశము వెళ్లబోతున్నాడు. విరహభావనావివశురాలైన ప్రియురాలు ఈ విధముగా పలుకుతున్నది. "ప్రియా! జాము గడిచినతరువాత వస్తావా? మధ్యాహ్నము వత్తువా? ఆ తరువాత వచ్చెదవా? లేక పగలంతా గడిచినతరువాత వస్తావా?" అశ్రుధారాసహితములయిన ఇటువంటి పేశలాలాపములతో దినశత

గమ్యమైన దేశమునుగురించి వెళ్లదలచిన ప్రియునిగమనమును బాల హరించుతున్నది. తన మాటలతో ఆతని ప్రయాణాన్ని అడ్డుపెట్టు తున్న దని భావము. *

ఈ పద్యములో పగలంతా పరమావధి. ఈలోపుగా వచ్చినట్లయితేనే ప్రాణములను నిలుపగలుగుతాను. అటుపిమ్మట ప్రాణాలను ధరింపలేను (జీవింపలేను) అని వ్యంగ్యము. ప్రియగమననివారణము వాచ్యము. పగలు గడిచినట్లయితే ప్రియురాలు జీవింపదని ప్రియుడు తెలిసికొన్న ప్పుడే ఆతని గమనము నివృత్తమవుతుంది కాబట్టి వ్యంగ్యార్థము వాచ్య సిద్ధిలో అంగ మవుతున్నది. అందువలన ఇది గుణీభూతవ్యంగ్యము అని అప్పయ్యదీక్షితుడు తలచుతున్నాడు.

ఈ విషయములో పండితరాజ పరిశీలనము ఈ విధముగా ఉన్నది. ఈ పద్యము గుణీభూత వ్యంగ్యోదాహరణము అని అనడము బాగా లేదు. దీక్షితుడు చెప్పిన వ్యంగ్యమే గౌణమై వాచ్యసిద్ధి చేయవలసిన

---

*ప్రియుడు దేశాంతరము ప్రస్థానింపబోతున్నాడు. ముగ్ధ అయిన నవనాయికకు దుఃఖము పొంగి పొంగి వస్తున్నది. "మీరు దూరదేశానికి వెళ్లవద్దు" అని వాచ్యంగా ఆమె చెప్పలేదు. ప్రియగమనానంతరము తనకు కలుగబోయే అవస్థను భావించుకొంటూ విరహావిదూన అవుతున్నది. "నాథా! యిప్పుడు మీరు వెళ్లేటట్లయితే ఒక జాము అయినతరువాత వస్తారా?" అని ఆమె మొదట అంటుంది. ప్రియవిరహాము‌ను జాముసేపు అనుభవింపగలగడమే? అని మొదట అభిప్రాయము. ప్రియుని కర్తవ్యాన్ని కూడా భావించి "మధ్యాహ్ననికి వస్తారా? పోనీ, తరువాత వస్తారా? అంతగా కాకపోతే ఈ పగలల్లా గడిచిన తరువాత సాయంకాలానికి వస్తారా? అని నాయిక అంటుంది. మీ రీ స్థలమునుండి కదలి వెళ్లేటట్లయితే నేను అత్యంతమూ ఖిన్నఖిన్న నవుతాను. పోనీ, ఎట్లాగయినా సాయంకాలందాకా ఓపికపట్టుతాను. ఇక నా తరువాత మట్టుకు ప్రాణాలు నిలవవు. నేను జీవించాలనుకుంటే ఈ లోపుగానే రావాలి అని ఆ పలుకులభావము. దినశతం ప్రయాణం చేస్తేనేగాని ప్రియుడు తన గమ్యదేశాన్ని పొందలేడు. నూరుదినాలు వెళ్లాలి. నూరుదినాలు రావాలి. ఈసంగతి ఆ బాలకు తెలిసినా తెలియకపోయినా కన్నీళ్లతో కలిపి పైవిధంగా పలికేటప్పటికి ఆయన ప్రయాణం ఆగిపోయింది. ఇటువంటి స్నిగ్ధహృదయంకల ప్రియురాలి మధుర మధుర ప్రేమకంటె ఆ ప్రియునకు ఇతరములు ఏవీ అధికం కావు. ఆ నాయికా నాయకులపరస్పరప్రేమ చాలా ప్రశంసనీయంగా ఉన్నది,

ఆవశ్యకత్వము లేదు. పూర్వార్థములో ఉన్న ప్రియురాలియొక్క సబాష్పగళజ్జలసంలాపములే ప్రియగమననివారణరూప వాచ్యసిద్ధ్యంగములు అవుతున్నవి. వ్యంగ్యానికి గుణీభావమే లేదు. "ఆలాపైః గమనం హరతి" ఆలాపములతో గమనమును హరించుతున్నది అనే చోట తృతీయావిభక్తి కరణార్థములో ప్రయోగింపబడినది. అదే గమన నివారణసాధకము. "ఆలాపైః" అనే పదమే స్ఫుటముగా కరణార్థమును చెప్పేటప్పుడు వ్యంగ్యానికి గుణీభావము చెప్పరాదు. వ్యంగ్యముకూడా వాచ్యసిద్ధిలో ఉపకరించినంతమాత్రాన వ్యంగ్యము వాచ్యసిద్ధ్యంగమని అనరాదు. ఇట్లాగే అయితే "నిశ్శేషచ్యుతచందనం స్తనతటం" అనే పద్యములోకూడా దూతీసంభోగరూపమైన వ్యంగ్యము అధమత్వ స్వరూప వాచ్యసిద్ధ్యంగ మవుతున్నది కాబట్టి గుణీభూతవ్యంగ్యమే అనవలసి వస్తుంది. కాబట్టి వ్యంగ్యము వాచ్యములో ఉపకరించేది అయినా గుణీభూత మనరాదు.

ఇక్కడ ఈ విధముగా సమీక్ష చేయవచ్చును. కేవలాలాపములు ప్రియగమననివారణము చేయలేవు. పైని చెప్పిన వ్యంగ్యసహితములు అయినప్పుడే వాచ్యసిద్ధి సమర్థములు అవుతవి. నాయికయొక్క అశ్రుధారా సహితములయిన వచనాలు "ప్రియా? దూరదేశము వెళ్ళినతరువాత చిరకాలము ఉంటావేమో! ఎక్కువకాలము అక్కడ ఉండవద్దు" అనే అర్థములోకూడా చరితార్థములు కావచ్చు. అందువలన వ్యంగ్యసహితములు అయినపుడే అవి గమననివారణము చేయగలుగుతున్నవి. కాబట్టి గుణీభూతత్వమును చెప్పుట సముచితముగానే ఉంటుంది అని.

అటుపై జీవింపలేను అనే వ్యంగ్యము ఏదో విధముగా వాచ్యసిద్ధ్యంగ మని అంగీకరించినా, గుణీభావము చెప్పినా, "ప్రహారవిరతౌ" అనే పద్యము ధ్వనిలక్ష్యము కాకుండా ఎవరూ నివారించలేరు. ఈపద్యములో విప్రలంభశృంగారము ప్రధానముగా ధ్వనించుతున్నది. నాయకుడు విభావము. బాష్పాదులు అనుభావములు. మనస్సుకు కలిగిన ఆవేగాదులు వ్యభిచారిభావాలు. వీని సంయోగమువలన విప్రలంభరతి

వ్యజ్యమాన మవుతున్నది. అందువలన ఇది ధ్వనికావ్య మనుటలో సందేహము లేదు. *

## మధ్యమకావ్యము

**యత్ర వ్యంగ్యచమత్కారాసమానాధికరణో వాచ్యచమత్కార స్త త్తృతీయమ్.**

ఇది మధ్యమకావ్యలక్షణము. వాచ్యార్థచమత్కారము వ్యంగ్యార్థ చమత్కారముతో కలిసి ఉండకపోయి నట్లయితే తృతీయకావ్యము. దీనిలో వ్యంగ్యము ఏదోవిధాన ఉంటుంది కాని దాని చమత్కారము స్పష్టము కాదు. వాచ్యచమత్కారమే స్పష్టముగా గోచరము అవుతుంది. వ్యంగ్యచమత్కారముకన్న వాచ్యచమత్కారమే ఉత్కృష్ట ముగా ఉంటుందని భావము.

ఉదాహరణము:—యమునావర్ణనములో :

> తనయమైనాకగవేషణలంబీకృతజలధిజఠరప్రవిష్ట
> హిమగిరిభుజాయమానాయా భాగీరథ్యాః సఖీ.

యమున భాగీరథీనదికి సఖి. భాగీరథీనది, కుమారుడైన (సముద్రములో మునిగి ఉన్న) మైనాకుని వెదకుటకై పొడవుగా చేయబడిన జలధి జఠరమును ప్రవేశించిన హిమవానుని భుజముగా అయిన ట్లున్నది. భాగీరథి భుజముగా అయిన ట్లున్నది అనుట ఉత్ప్రేక్షాలంకారము. దీనిలో వాచ్యోత్ప్రేక్ష చమత్కారహేతువు.

---

* కవివివక్షను అనుసరించి పద్యభావాన్ని నిర్ణయము చేయుట సముచితముగా ఉంటుంది. పద్యములోని వస్తుఘటన కవివివక్షను సూచించుతుంది. అందువలన కవి తాత్పర్యానుసారముగానే వస్తుసమన్వయము చేయాలి. "ప్రహారవిరతౌ"అనే పద్యములోని వస్తుఘటన విప్రలంభశృంగారమును లక్ష్యముగా చేసికొని ఉన్నట్లు సహృదయులు గ్రహింపగలుగుతారు. ఆ వచనాలు విప్రలంభసమన్వయము పొందినపుడే స్వరూపచమత్కారము కలవి అవుతవి. సన్నివేశచతురత్వమును బట్టి ప్రకృతము విప్రలంభమున్నే పరిగణించాలి. అవాంతరములుగా ఉండే అర్థములను బట్టి వ్యపదే శించరాదు. కవి వివక్షావిశ్రాంతి లేని అర్థాన్ని గ్రహించి నిరూపించ కూడదు. వివక్షాతిరిక్తముగా గ్రహించిన అర్థము అధికచమత్కారి కాకపోతే దాన్ని బట్టి వ్యప దేశము చేయరాదు.

పరిశీలింపగా గంగానది హిమవత్పర్వతభుజముగా ఉత్ప్రేక్షింపబడుట వలన శ్వేతత్వమును, తనయుని వెదకుటకై సముద్రోదరమును ప్రవేశించినది అనుటవలన పాతాళచుంబిత్వమును వ్యంగ్యముగా గోచరమవుతున్నది. ఆ వ్యంగ్యము కొంత చమత్కారకముకూడా కావచ్చు. ఆ చమత్కారము లేశముగా ఉన్నప్పటికీ అది ఉత్ప్రేక్షాచమత్కారజఠరవిలీనము అవుతున్నది. గ్రామీణనాయిక అలముకొనిన కాశ్మీరద్రవాంగరాగములో కప్పబడిపోయిన నిజాంగగౌరిమ మాదిరిగా ప్రతీయమానము ప్రకాశము కావడము లేదు. ఏ మాత్రమైనా ప్రతీయమానార్థసంబంధము లేకుండా తనంతట తాను రమణీయత్వమును సంపాదింపగల వాచ్యార్థము ఉండదు అనడములో సందేహము లేదు. వాచ్యార్థములో రమణీయతాసంపత్తి సముత్పత్తికి వ్యంగ్యార్థసంబంధము ఆవశ్యకము.

ఈ ద్వితీయతృతీయభేదాలలో నిఖిలమైన అలంకారప్రధాన కావ్యము అంతర్భవించుతుంది. ఉత్తమకావ్యములో వ్యంగ్యార్థము తళుకుతళుకుమంటూ ప్రకాశించుతుంది. వ్యంగ్యము కొంత జాగరూకముగా ఉన్నా గుణీభూతము అవుతుంది అన్నమాట. మధ్యమకావ్యములో వ్యంగ్యము మిణుకుమిణుకుమంటూ ఉంటుంది. సాధారణముగా ఇది అజాగరూకవ్యంగ్య మన్నమాట. వ్యంగ్యకృతమైన శోభ దీనిలో ఏమీ ఉండ దన్నమాట.

## అధమకావ్యము

యత్రార్థచమత్కృత్యుపస్కృతా శబ్దచమత్కృతిః ప్రధానం తదధమం చతుర్థం।

అర్థచమత్కారముచేత పోషింపబడిన శబ్దచమత్కారము ప్రధానమయినపుడు అధమము అనే చతుర్థకావ్యము. అర్థమువలనకూడా చమత్కారము ఉదయింపవచ్చునుగాని అది అంతా శబ్దచమత్కృతినే పోషింపచేస్తుంది. కాగా అర్థనిబంధనములోకంటె శబ్దనిబంధనములోనే కవివివక్ష ఉన్నపుడు అధమకావ్య మని వ్యపదేశము చేయాలి. ఉదా:—

మిత్రాత్రిపుత్రనేత్రాయ త్రయీశాత్రవశత్రవే
గోత్రారిగోత్రజత్రాయ గోత్రాత్రే తే నమోనమః.

ఇది హరిహరులను అభిమానించే ఒకభక్తుని వచనము. సూర్యచంద్రులు నేత్రాలుగా కలవానికి, వేదత్రయశత్రువుల శత్రువునకు, ఇంద్రగోత్రజ పరిత్రాతకు, గోత్రాణకర్తకు నీకు నమస్కారము.* దీనిలోని అర్థ చమత్కారము శబ్దచమత్కారములో విలీనము అయింది. పద్యము వినగానే ప్రధానముగా శబ్దచమత్కారమే ప్రతీత మవుతున్నది. అర్థచమత్కారానికి ప్రత్యేకముగా ఇక్కడ స్వరూపములేదు. ఇచట కవికి అర్థములో కంటె శబ్దనిబంధనములోనే ముఖ్యవివక్ష ఉన్నదని భావము.

"ఏమాత్రమూ అర్థచమత్కారము లేక శబ్దచమత్కారమే ఉన్నపుడు అది అధమాధమమనే పంచమకావ్య" మని కావ్యభేదాలలో పరిగణించవచ్చును.♦ఏకాక్షరపద్యము, అర్థావృత్తి యమకము, పద్మబంధము మొదలయినవి ఇటువంటివే అని తలచవచ్చును. కాని రమణీయార్థ ప్రతిపాదకరూప కావ్యసామాన్యలక్షణము వానిలో లేనందువలన

---

*. మిత్రుడు-సూర్యుడు, అత్రిపుత్రుడు-చంద్రుడు, త్రయి - వేదత్రయము, గోత్ర-పర్వతాలకు, అరి-శత్రువు-ఇంద్రుడు-అతని గోత్రజాలు. వంశజాలు-ఇది సాధారణార్థము. శివపక్షములో: త్రయీశాత్రవ- వేదత్రయమున శత్రుత్వము కలవాడు మన్మథుడు, శివుడు మన్మథశత్రువు. గోత్రాత - వాహనమైన వృషభపాలకుడు. హరిపక్షములో: త్రయీశాత్రవులు-రాక్షసులు. హరి రాక్షస శత్రువు. గోత్రాత-కృష్ణావతారమున హరి గోపాలకుడు-మిగిలినది స్పష్టము.

♦ ఏకాక్షరపద్యము. శిశుపాలవధ. ౧౯—౧౧౪

దాదదో దుద్దదుద్దాదీ దాదాదో దుదదీదదోః
దుద్దాదం దదదే దుద్దే దదా దదదదోఽదదః॥

కిరాతార్జునీయము. ౧౫—౧౪.

ననో ననున్నో నున్నోనో నాఽనా నానాననా నను
నున్నోఽనున్నో ననున్నేనో నాఽనేనా నున్ననున్ననుత్॥

ద్వ్యక్షరము - ఈశ్వరశతకము ౭౭.

వేద వేదవిదాం వాదవిద్దేవో దివి దావదః
వాదో వాదేవదే వాది విద్యో వాదివదే విదమ్॥

శ్రీ దేవీ శతకము ౯౫

యతోఽయాతి తతోఽత్యేతి యాతాం తాయతాం యస్తైః
మాతామితోత్తమ తమా తమోఽతీతాం మతిం మమ॥

అటువంటివి వాస్తవముగా కావ్యాలే కావు, ప్రాచీనపరంపరను అనుసరించిన మహాకవులు అక్కడక్కడ తమ కావ్యాలలో ఏకాక్షరపద్య అర్థావృత్తి యమక పద్మబంధాదులను నిబంధించారు. వాస్తవికస్థితిని అనుసరించడమే ముఖ్యము కాని కండ్లు మూసికొని ప్రాచీనపంథలో పడిపోవడము మంచిది కాదు. అందువలన అటువంటిభేదాలను కావ్యాలలో మేము పరిగణించడము లేదు.

కొందరు ఈ కావ్యభేదాల చతుష్ట్వమును అంగీకరించరు. ఉత్తమ కావ్యము-మధ్యమకావ్యము-అధమకావ్యము అనే మూడు భేదాలను అభిమానించుతున్నారు. శబ్దచిత్రము అర్థచిత్రము అనే రెంటినీ కలిపి వారు అధమకావ్యమని ఒకటిగా పరిగణనము చేయడము ఉచితము కాదు. రెండిటికీ తారతమ్యము విశదముగా గోచర మవుతున్నది. ఏ సహృదయుడు కూడా ఈ రెండిటినీ కలుపడు. కావ్యప్రకాశలో అర్థచిత్రోదాహరణము:

> వినిర్గతం మానద మాత్తమందిరాత్
> భవత్యుపశ్రుత్య యదృచ్ఛయాపి యం
> ససంభ్రమేంద్రద్రుతపాతితార్గళా
> నిమీలితాక్షీవ భియాఽమరావతీ.

హయగ్రీవరాక్షసుని వర్ణనము. మిత్రులకు సమ్మానదాత, శత్రువులకు దర్పనాశకుడు అయిన హయగ్రీవుడు విలాసంగా తన మందిరమునుండి వెలువడినట్లు తెలిసికొని గాభరాపడిన ఇంద్రునిచేత శీఘ్రముగా పడ వేయబడిన గడియ కల అమరావతీపట్టణము భయముతో కండ్లు మూసికొనినట్లు ఉన్నది. దీనిలో ఉత్ప్రేక్షాలంకారము. అచేతనమైన అమరావతీపట్టణముకూడా హయగ్రీవునిభయమువలన నిమీలితాక్షి అయిందని అర్థచిత్రతను భావించాలి.

అప్పయ్య దీక్షితుని అర్థచిత్రోదాహరణము.

> సచ్ఛిన్నమూలః క్షతజేన రేణుః
> తస్యోపరిష్టా త్పవనావధూతః

అంగారశేషస్య హుతాశనస్య
పూర్వోత్థితో ధూమ ఇవావభాసే.

ఇది రఘువంశములోని రణవర్ణనము. అశ్వఖురక్షుణ్ణము అయిన భూపరాగము రుధిరమువలన ఛిన్నమూలముగా అయింది. రక్తానికి పైపైన పవనవిధూతమై ప్రసరించుతున్నది. అగ్నికణము మిగులుగా ఉన్న అగ్నికి ముందుగా వెలువడిన ధూమము మాదిరిగా ధూళి ప్రకాశించుతున్నది. దీనిలో ఉపమాలంకారము అర్థచిత్రముగా ఉన్నది. ఇటువంటి కావ్యాలతోపాటు,

స్వచ్ఛందోచ్ఛలదచ్ఛకచ్ఛకుహరచ్ఛాతేతరాంబుచ్ఛటా
మూర్ఛన్మోహమహర్షిహర్షవిహితస్నానాహ్నికాహ్నాయ వః
భింద్యా దుద్యదుదారదర్దురదరీ దీర్ఘాదరిద్రద్రుమ
ద్రోహోద్రేకమహోర్మిమేదురమదా మందాకినీ మందతాం.

స్వేచ్ఛగా ఎగురుతున్న స్వచ్ఛమైన జలప్రాయప్రదేశముయొక్క కుహర (బిల) మందు బలము కలిగిన ఉదకపరంపరలచేత నశించిపోతున్న అజ్ఞానము గల మహర్షులచేత సంతోషముగా చేయబడు స్నానరూపమయిన మధ్యాహ్నకృత్యము కలిగినటువంటిన్ని, ప్రకాశించుచున్న గొప్పవయిన కప్పల బొరియలు కలిగినటువంటిన్ని, దీర్ఘములు అదరిద్రములు అయిన వృక్షములయొక్క ద్రోహాతిశయము గల మహాతరంగములచే నిబిడమదముకలిగిన మందాకినీనది మీ మందత్వమును శీఘ్రముగా నశింపచేయుగావుత.

ఇటువంటి సాధారణజనశ్రేణి మెచ్చుకొను శబ్దచిత్రకావ్యాలకూ ఏ సహృదయుడుకూడా అవిశేషమును చెప్పడు. తారతమ్యము ఉన్నప్పటికీ ఈ రెండిటినీ ఒకే భేదముగా అంగీకరించినట్లయితే ప్రధానతాప్రధానతాకృతమైన కొంచెపుపాటి భేదమే ఉన్న "ధ్వని—గుణీభూత వ్యంగ్యకావ్యాలు వేరువేరు భేదాలు" అని అనడములో దురాగ్రహము ఎందుకు? అందువలన నాలుగుభేదాలు ఉన్నవని అనడము యుక్తియుక్తము.

ఒకే కావ్యములో శబ్దార్థచమత్కారములు కలిసి ఉన్నప్పుడు శబ్ద చమత్కారము ప్రధానమయితే అధమకావ్యమనీ, అర్థచమత్కారము ప్రధానమయితే మధ్యమకావ్యమనీ, వ్యవహరించాలి. శబ్దార్థ చమత్కారములు సమప్రధానములయితే మధ్యమకావ్యమే. ఉదాహరణము:

> ఉల్లాసః ఫుల్లపంకేరుహపటలపతన్మత్త పుష్పంధయానాం
> నిస్తారః శోకదావానలవికలహృదాం కోకసీమంతినీనాం
> ఉత్పాతస్తామసానా ముపహతతమసాం చక్షుషాం పక్షపాతః
> సంఘాతః కోపి ధామ్నా మయ ముదయగిరిప్రాంతతః ప్రాదురాసీత్.

వికసించిన పద్మసమూహాలలో పడుతూ ఉన్న మదించిన మగతుమ్మెదలకు ఆనందము ఇచ్చునటువంటిన్ని, శోకమనే దావానలముచేత వికలమైన హృదయము కలిగిన చక్రవాకాంగనలకు దుఃఖమును పోగొట్టునటువంటిన్ని, తేజస్సును పోగొట్టిన అంధకారసమూహాలకు నాశకమున్నూ, నేత్రాలకు సహకారిన్నీ అయిన ఒకానొక తేజోరాశి ఉదయగిరిప్రాంతమునుండి ప్రాదుర్భవించినది. *

దీనిలో వృత్త్యనుప్రాస ప్రచురముగా ఉన్నది. రచన సామాన్యముగా

---

* ఉదయాచల ప్రాంతమునుండి మహామహిమ కల తేజస్సంఘాతముగా చెప్పతగిన సూర్యభగవానుడు ఉదయించుచున్నాడు. పై పాదత్రయంలో సూర్యదేవుని విశేషాలు వర్ణింపబడుతున్నవి. ఉద్యత్సూర్యగభస్తిప్రసారంవలన పంకేజములుకూడా ప్రఫుల్లములయినవి. ఆ పంకజమధుధారల పానాసక్తితో మత్తపుష్పంధయాలు (మదించిన మగతుమ్మెదలు) ప్రసరించుచున్నవి. వికసత్పద్మాల మాధుధార మనోహరము. సూర్యుడు తదనుభవానందభాగ్యవిధాత అయినాడు. భాస్కరుడు అస్తంగతుడయితే చక్రవాకాలు విఘటితములవుతవి. ఆ విఘటనమువలని వియోగభరము కోకాంగనలకు అధికము. అబలలు విరహాసహలుకదా! ఆ కోకాంగనల వియోగదవవహ్ని వారి సుకుమారహృదయాలను వికలముచేసింది. అట్టి వ్యథాదోదూయమాన మానసలయిన కోకసీమంతినులకు ఈ తేజోరాశి సమాగమసంపద్విభూతి నిచ్చి దుఃఖమును నశింపచేస్తున్నది. మహాఃప్రణాశముచేసిన తమఃప్రసారములు అహస్కరకరములచేత నిస్సారితములవుతున్నవి. కాబట్టి ఈ తేజోభూమ తామసములకు ఉత్పాతము. ఇంకా దివ్యభావనాశకులయిన అసురప్రకృతులకుకూడా ఇవి ఉత్పాతము. చీకటిలో చక్షుఃప్రసారము ఉండదు. సూర్యకిరణాలు చక్షురున్మీలనముచేసి పక్షపాతమును ప్రదర్శిస్తున్నవి. నేత్రాలు సర్వతఃప్రసారము కలవి అయినవన్నమాట.

ఓజోగుణప్రకాశకము. అందువలన శబ్దచమత్కారము ఉన్నది. ప్రసాద గుణసహితము అగుటవలన రూపకాలంకారముకాని హేత్వలంకారము కాని కూడుకొని ఉన్నట్లు వెంటనే స్పష్ట మవుతున్నది. తేజోరాశి విషయము. ఉల్లాసము, నిస్తారము, ఉత్పాతము, పక్షపాతము అనేవి విషయి పదార్థాలు. ధామసంఘాతము ఉల్లాసము అని ముఖము చంద్రుడు అనేస్థలములోవలె అభేదము గోచరమవుతున్నది. ఇట్లాగే ఇతరములలో కూడాను. ఉల్లాసాద్యభేదము గోచర మవుతున్నందువలన 'రూపకము' అని గ్రహించవలెను. ఉల్లాసాదులు తేజోరాశికార్యములు. కారణ మయిన తేజోరాశికి కార్యభూతోల్లాసాద్యభేదము దీనిలో విశద మవుతున్నది. హేతువును హేతుమత్తు (కార్యము)తో పాటు వర్ణించితే హేత్వలంకారము కాబట్టి ప్రకృతములో కార్యకారణములు రెండూ వర్ణింపబడినందువలన హేత్వలంకార మవుతుంది అని ఏకావళీకారా దుల మతము. ఒక విధముగా చూస్తే రూపకాలంకారము; వేరొక విధముగా చూస్తే హేత్వలంకారము. ఈ రెండూ ఇక్కడ విస్పష్ట ముగా ఉన్నవి. మొత్తముమీద ఈ పద్యములో ఈ విధముగా శబ్దార్థ చమత్కారములు రెండూ సమప్రధానత్వము కలిగి ఉన్నవి. రెండుచమ త్కృతులూ తుల్యస్కంధములు అన్నమాట. కాబట్టి దీనిని మధ్యమ కావ్య మని అనడము సముచితముగా ఉంటుంది.

## ౫ రసవాదము

ఉత్తమోత్తమ కావ్యము ధ్వని. దానిభేదాలు అసంఖ్యేయములుగా ఉన్నవి. సామాన్యముగా కొన్ని భేదాలను మాత్రము నిరూపించు తాము. ధ్వని రెండువిధాలు: అభిధామూలము, లక్షణామూలము అని. ఈ రెండిటిలో మొదటిది అయిన అభిధామూలధ్వని మూడువిధాలు: రసధ్వని, అలంకారధ్వని, వస్తుధ్వని అని. రసధ్వనికి అసంలక్ష్యక్రమధ్వని అనిపేరు. దీనిలో వ్యంజకములకూ వ్యంగ్యములకూ మధ్యఉన్న ప్రతీతి క్రమము గోచరము కాదు. ఈ రసధ్వని అనేది ఉపలక్షణము. అందు వలన రసము, భావము, రసాభాస, భావాభాస, భావశాంతి, భావో దయము, భావసంధి, భావశబలతలనుకూడా రసపదముచే గ్రహించాలి.

లక్షణామూలకధ్వని రెండువిధాలు. అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని, అత్యంత తిరస్కృత వాచ్యధ్వని అని. ఈ విధముగా ధ్వనికావ్యము పంచాత్మకము. వీనిలో రసధ్వని సర్వాధికరమణీయము. అందువలన రసధ్వనికి ఆత్మగా ఉన్న రసము నిరూపింపబడుతున్నది.)

సముచితలలిత సన్నివేశచారుణా కావ్యేన సమర్పితైః, సహృదయ హృదయం ప్రవిష్టైః తదీయసహృదయతాసహకృతేన భావనావిశేషమహిమ్నా విగళిత దుష్యంతరమణీత్వాదిభిః, అలౌకికవిభావానుభావవ్యభిచారిశబ్దవ్యపదేశ్యైః శకుంతలాదిభి రాలంబనకారణైః చంద్రికాదిభి రుద్దీపనకారణైః, అశ్రుపాతాదిభిః కార్యైః, చింతాదిభిః సహకారిభిశ్చ సంభూయ ప్రాదుర్భావితేన, అలౌకికేన వ్యాపారేణ, తత్కాలనిర్వర్తితానందాంశావరణాజ్ఞానేన అతఏవ ప్రమృష్టపరిమితప్రమాతృత్వాదినిజధర్మేణ ప్రమాత్రా స్వప్రకాశతయా వాస్తవేన నిజస్వరూపానందేన సహ గోచరీక్రియమాణః ప్రాగ్వినివిష్ట వాసనారూపః రత్యాదిరేవ రసః *)

---

* రసవాదమునకు సంబంధించిన ఈ సిద్ధాంతసూత్రము భావగర్భితముగా జటిలముగా ఉన్నది. ఈ సూత్ర భావార్థమును నానాముఖముగా గ్రహించుట సముచితముగా ఉంటుంది. సముచిత లలిత సన్నివేశ మధురమైన కావ్యము. విభావానుభావ వ్యభిచారి భావములను సమర్పించుతుంది. ఆ విభావాదులు సహృదయహృదయమును ప్రవేశించుతవి. సహృదయునకు అనుసంధానాత్మకమయిన ఒక భావనావిశేషము ఉన్నది. అది అపూర్వము. దానికి అసాధారణసమర్థమహిమ ఉన్నది. అది అతని సహృదయతాసహకృతము. తత్ప్రభావము వలన దుష్యంతునిలోని దుష్యంతత్వము, శకుంతలలోని శకుంతలాత్వము, దుష్యంతకాంతాత్వము విగలితము అవుతవి. వారు సహృదయునకు సాధారణస్వరూపముతో గోచరించుతారు.

సామాన్యముగా లోకపరిస్థితిలో శకుంతలాదులు ఆలంబనకారణాలు, చంద్రికాదులు ఉద్దీపన కారణాలు, అశ్రుపాతాదులు కార్యములు, చింతాదులు సహకారులు. అవి భావనామాత్రగోచరములు అయినపుడు లోకసిద్ధరూపమును విడనాడి (అలౌకిక రూపమును పొందును.) లోకసిద్ధరూపములో కార్యకారణాదిరూపమును ధరించి ఉన్నప్పటికీ అలౌకికరూపమును ధరించినపుడు కార్యకారణాది శబ్దవ్యపదేశ్యములు కావు. కావ్యనాట్య పరిభాషలో అలౌకికములుగా వ్యవహరింపబడేటప్పుడు ఆలంబన కారణములు ఆలంబనవిభావములనీ, ఉద్దీపనకారణములు ఉద్దీపనవిభావములనీ, కార్య

సుందరమును ఉచితమును అయిన రచనాది సన్నివేశము కలిగిన సుందరకావ్యముచేత బోధితములు అయిన పదార్థాలు సహృదయ హృదయములో గోచరము లగును. అనగా ఆయా పదార్థాకారము

---

ములు అనుభావములనీ, సహకారులు వ్యభిచారిభావములనీ వ్యపదేశము పొందుతున్నవి. సహృదయుడు తన అసాధారణభావనావిశేషమహిమవలన వీనిని ఆస్వాద్యమానములనుగా చేసికొంటాడు.) బాగా చర్వ్యమాణములు అవుతూ ఉన్న వీని సంవలనమువలన ఒక అలౌకికవ్యాపారము ఆవిర్భవించుతున్నది.ఆ అలౌకికవ్యాపారమే వ్యంజన. (ఇప్పుడు) సామాజికునకు ప్రమాత అని పేరు. ప్రమాతయొక్క నిత్యసహజస్వరూపానందాంశానికి అజ్ఞానము ఆవరణముగా ఉన్నది. చర్వణాసమకాలములో అజ్ఞానము తొలగిపోతుంది. ఈ ఆవరణము ఈవిధముగా నివృత్తమైపోయినందువలన సహృదయునిలోని పరిమితప్రమాతృభావము నిశ్శేషముగా ప్రమార్జితము అవుతుంది. సహజమైన స్వరూపధర్మము ఆవిర్భవించుతుంది. ఇటువంటి ఈ ప్రమాత స్వప్రకాశస్వభావము కలిగిన వాస్తవ నిజస్వరూపానందముతో పాటుగా రత్యాది భావమును గోచరము చేసికొంటాడు. సహృదయుని హృదయములో రత్యాదిభావము ప్రాక్కాలమందే ప్రవేశము పొంది వాసనా (సంస్కార) రూపాన ఉంటుంది. ఇట్లా గోచరీకృతమైన రత్యాదికమే రసము.)

నిగూఢమైన రసభారతీ నిష్యందమును భావకులు ఈ విధముగా కూడా భావించవలయును. సహృదయుడు ప్రపంచములో రతి శోకాదిభావములను అనుభవించుతాడు. ఆతడు కొందరిని ప్రేమించును. మరి కొందరిని ద్వేషించును. ఇంకా కొందరిని గురించి శోకించుతాడు. ఈ రతిశోకాదిభావానుభూతివలన సహృదయుని హృదయమందు ఒక సంస్కారము ఉదయించుతుంది. ఆ భావములు ఆతని హృదయములో వాసనాస్వరూపమున ఉంటవి. ఆ యా భావాలకు సన్నివేశ సంబంధ విశేషము వలన స్థాయిత్వము కలుగుతుంది. ఈ వాసనారూపముగా ఉన్న రత్యాదిస్థాయి భావాలు చిత్తవృత్తి రూపములు. వీని స్వరూపము ముస్ముందు విస్పష్టము చేయబడును. స్వభావసిద్ధముగా ఉండి స్వతః ప్రకాశమానము అయిన ఆత్మానందముతో పాటుగా ఆ రత్యాదిభావములు అనుభవానికి వచ్చినప్పుడు "రసములు" అనే వ్యవహారము కలుగుతుంది. కాని మానవుని ఆనందమయాత్మకు అజ్ఞానము ఆవరణముగా ఉన్నది. ఆ అజ్ఞానముచేత ఆనందాంశము కప్పబడి పోయినది. ఆ ఆత్మానందము భాసించనంతవరకూ వాసనారూపము లయిన రత్యాదుల అనుభవము కలుగదు. ఆ ఆవరణ భంజనము చేయడానికి ఒక అలౌకికక్రియ ఉత్పన్నము కావలసి ఉన్నది. ఆ క్రియా ద్వారాన ఆ అజ్ఞానము ఆ ఆనందాచ్ఛాదకము దూరదూరమై పోయింది అనుభవము పొందు సామాజికునిలోని అల్పజ్ఞత విలుప్తమై పోతుంది. ఆ అల్పజ్ఞత ఉన్నందువలన కొన్ని పదార్థముల యొక్క బోధమాత్రమే కలుగుతుంది కాని మరికొన్ని పదార్థములబోధ కలుగదు; సకలవిషయకజ్ఞానము కలుగదు.

లయిన చిత్తవృత్తులు కలుగును అని భావము. ఈ వృత్తులు దుష్యంత రమణ్యాది రూపముగా ఉండును. అప్పుడు సహృదయుని పునః పునరను సంధానవిశేషమహిమవలన ఆయా పదార్థములందు ఉన్న దుష్యంత రమణీత్వాదికము పోవును. అది సామాన్యముగ సహృదయనిష్ఠరత్యా

---

ఈ ఆవరణభంగము కలుగగా సాంసారిక భేదభావము కూడా నశించిపోతుంది. ఇది నాది, ఇది పరునిది, అనే భేదభావము లుండవు. అప్పుడు ఆత్మానందసహితరత్యాది స్థాయీభావములయొక్క అనుభవము కలుగుతుంది. విభావానుభావ వ్యభిచారిభావములు పూర్వము చెప్పిన అలౌకిక క్రియను కలుగజేస్తున్నవి. ఆ మూడింటి సంయోగము వలన అలౌకికవ్యాపారము ఉత్పన్న మవుతున్నదని భావము.

విభావానుభావవ్యభిచారుల స్వరూపము లెటువంటివో తెలియవలసి ఉన్నది. రత్యాదిచిత్త వృత్తులు ఆత్మానందముతో పాటు అనుభవములోనికి వచ్చిన పిమ్మట రసరూపాన పరిణతము లవుతున్నవి. అవి ఏ కారణాలవలన కలుగుతున్నవో ఆ కారణాలు రెండు విధములుగా ఉన్నవి. కొన్ని కారణాలు భావాలను ఉత్పన్నము చేయును. కొన్ని ఉద్దీప్తములనుగా చేయును. ఉత్పాదకము లయిన కారణాలు ఆలంబనములనీ, ఉద్దీపకము లయినవి ఉద్దీపనకారణాలనీ వ్యవహరింపబడుతున్నవి. వీనివలన రత్యాది చిత్తవృత్తులు కలిగిన తరువాత శరీరముయొక్క అంగోపాంగములలో కొన్ని భావాలు ఉత్పన్నములు అవుతున్నవి. అవి పైవాని కార్యరూపములు. మొదటి విధముగా ఉత్పన్నములు అవుతూ ఉన్న రత్యాది చిత్తవృత్తులతో పాటు మరికొన్ని ఇతరచిత్తవృత్తులు కూడా ఉత్పన్నము లవుతవి; రత్యాది చిత్తవృత్తులకు ఇవి సహాయకములు. అందువలన 'సహకారులు' అనబడుచున్నవి. వీనిని ఉదాహరణములలో సమన్వయించి తెలిసికొనుట ఉచితముగా ఉంటుంది.

శకుంతలావిషయకముగా దుష్యంతుని అంతరాత్మలో రతి ఉత్పన్నమైనది అనుకొనండి. ఆ విషయములో శకుంతల రత్యుత్పాదనము చేసింది కాబట్టి శకుంతల దుష్యంతుని ప్రేమలో ఆలంబన కారణము. "వెన్నెల విరచిమ్ముతున్నది. మలయమారుతము వీచుతున్నది" ఇటువంటి ఈ సన్నివేశము ఉద్దీపన కారణము. ఇవి శకుంతలపై దుష్యంతునకు కలిగిన ప్రేమను ఉద్దీపింపచేసినవికదా! ఇప్పుడు దుష్యంతుని ప్రేమ దృఢమైనది. కాని శకుంతల లభించలేదు. అందువలన అతనికి విప్రలంభము కలిగింది. అతని నేత్రాలనుండి అశ్రువులు రాలినవి. ఈ అశ్రువులు ప్రేమకార్యములు. ఈవిధముగా ఆ ప్రేమతో పాటుగా చింత, ఔత్సుక్యము మొదలయిన సహకారి భావాలు ఉత్పన్నము లయినవి. "ఆ శకుంతలా ప్రాప్తి నాకు ఏ విధముగా కలుగుతుంది? నేను ఆమెను నదీతీరలతానికుంజములో చూచుటకు వెళ్లుతాను." ఇట్లా దుష్యంతునకు అనేకవిధములయిన భావాలు ఉత్పన్నములు అయినవి. ఇవి ప్రేమకు సహకారకములు. ఈ విధముగా శోకాదిభావాలు కలిగినప్పుడుకూడా సమన్వయించి చూచుకోవాలి.

ద్భోధకు అనుకూలమయిన అలౌకికరూపము ధరించును.) అప్పుడు అలౌకికములగు విభావానుభావవ్యభిచారిశబ్దములచే వ్యవహరింపబడును. అట్టి శకుంతలాదులు ఆలంబనవిభావములు అను పేరుతో కారణములు, అట్టి రూపము కల చంద్రికాదులు ఉద్దీపన విభావములు అనుపేరుతో ఉద్దీపనకారణములు అగును. అట్టి అశ్రుపాతాదులు అను భావములు అనుపేరుతో కార్యము లగును. అట్టి చింతాదులు వ్యభిచారి భావములు అను పేరుతో సహకారి కారణములు అగును. ఇవి అన్నీ కలిసి ఒక అలౌకికవ్యాపారమును పుట్టించుతవి. ఇవితత్కాలములో ప్రమాతకు ఆనందాంశావరకముగా ఉన్న అజ్ఞానమును నివర్తింపచేయును. అప్పుడు అజ్ఞానము నివర్తించిన తోడనే ఈ ప్రమాతలోఉన్న ప్రమాతృత్వము మొదలయిన నిజధర్మములు నశించును. అప్పుడు ప్రమాతృత్వఘటిత త్రిపుటి నశించును. ఆ సమయములో ప్రమాత స్వప్రకాశ రూపు డగుటవలన,(స్వప్రకాశ మగు దీపము తాను ప్రకాశించుతూ సన్నికృష్టపదార్థములను భాసింపచేస్తూ ఉన్నట్లు స్వస్వరూపానందమూ తత్సన్నికృష్టమగు వాసనారూపరతిన్నీ భాసించును. అట్టి రత్యాదికము రస మనబడుతుంది.)

ఈ ? విషయములో మమ్మటాచార్యుడు తన కావ్యప్రకాశములో—

---

ఇప్పుడు ఈ చెప్పిన సర్వవిషయాలనూ మనము ఈ ప్రాపంచిక గోష్ఠిలో చూడగలుగుతూనే ఉన్నాము. పూర్వోక్తప్రక్రియానుసారముగా ఈ రత్యాది భావాలకు ఏ శకుంతలాద్యాలంబనములు కలవో, ఏ చంద్రికాద్యుద్దీపనకారణములు కలవో, వానివలన ఏ అశ్రుపాతాదికార్యములు ఉత్పన్నములు అవుతున్నవో, ఏ చింతాదులు సహకారిభావములు అవుతున్నవో అవి ఆ యా రసవర్ణనానికి సముచిత లలిత మధురశబ్దముల రచనలవలన మనోహరము అయిన కావ్యము ద్వారా ఉపస్థితములై సహృదయుని హృదయములో ప్రవేశము పొందుతున్నవి. అప్పుడు ఆ భావకుని సహృదయతతోపాటు ఏకప్రకారకమైన భావనవలన అనగా మరల మరల కావ్యానుసంధానప్రభావము వలన శకుంతల దుష్యంతునకు సంబంధించిన యువతి అనేభావము తొలగిపోతున్నది. అవి అన్నీ అలౌకికములు అవుతున్నవి. వానిలోని ప్రాపంచికత్వముపోతున్నది. కాగా వానిలోని కారణములు విభావములనీ, కార్యములు అనుభావములనీ సహకారులు వ్యభిచారులనీ చెప్పబడుతున్నవి. వీనిద్వారాపూర్వము చెప్పిన అలౌకిక క్రియాద్వారకముగా రసాభివ్యక్తి కలుగుతున్నదని భావము.

"వ్యక్తః స తైర్విభావాద్యైః స్థాయిభావో రసః స్మృతః।" అని పలుకుతున్నాడు. రత్యాదిస్థాయిభావము విభావాదులవలన వ్యక్తమైనప్పుడు రసము అని వ్యవహరింపబడుతున్నది. వ్యక్తమనగా వ్యక్తి విషయీకృతమగుట అని అర్థము. అజ్ఞానరూపమైన ఆవరణము నష్టమైపోగా చైతన్యమునకు విషయమగుట. ఆ చైతన్యముద్వారా ప్రకాశమగుట అని భావము. భగ్నావరణమైన చిదంశమునకే వ్యక్తి అని వ్యవహారము.

శరావాదికము (మూకుడు)చే కప్పబడిన దీపము ఇతరములను ప్రకాశింపజేయదు. అప్పుడు దాని ప్రకాశముకూడా మనకు తెలియదు. ఆ ఆవరణముగా ఉన్న శరావాదికమును తీసివేయగా దీపము సన్నిహిత పదార్థాలను ప్రకాశింపచేస్తుంది. తాను కూడా ప్రకాశించుతుంది. ఈ విధముగానే ఆత్మచైతన్యము ఆవరణము పోగా విభావాదికముతో కూడుకున్న రత్యాదికమును ప్రకాశింపచేస్తుంది. స్వయముగా తాను కూడా ప్రకాశించుతుంది. రత్యాదులు అంతఃకరణ ధర్మాలు. ఎన్నిఎన్ని అంతఃకరణధర్మాలు ఉన్నవో అవి అన్నీ కూడా సాక్షిభాస్యములు అని చెప్పబడుతున్నవి.* సాక్షి అనగా ఆత్మచైతన్యము. ఆత్మచైతన్యమువలన

* సాక్షిభాస్యములు, కాంతాద్యాలంబన విభావములు, చంద్రికాద్యుద్దీపన విభావములు బాహ్యము లయినప్పుడు ప్రత్యక్షము మొదలయిన ప్రమాణములచేత తెలియబడుట ప్రసిద్ధము. అవియే స్వప్నగతము లయినపుడు. మనోరాజ్యస్థములు అయినప్పుడు ఆంతరములు అని చెప్పబడుతున్నవి. అప్పు డవి సాక్షి చిన్మాత్ర భాస్యములు కావలసినదే. సాక్షాదాత్మచేత భాసింప చేయబడేవి కాబట్టి సాక్షిభాస్యములు అనబడుతున్నవి. కేవలమూ విభావములే కాక అనుభావాలుకూడా స్వప్న మనోరథములలో సాక్షిభాస్యములే. ఆలంబన విభావాది బాహ్యపదార్థాలకు చక్షురాదీంద్రియములకూ సన్నికర్ష కలిగినప్పుడు ప్రత్యక్షము కలుగుతుంది. వస్తువునకూ ఇంద్రియమునకూ సన్నికర్ష కలుగగా అంతఃకరణముతో కూడుకొనిన ఆత్మచైతన్యము చక్షురాదిద్వారా వెలుపలికి వెడలి ఆయా వస్తువుల ఆకారము పొందుతున్నది. ఆత్మ అంతఃకరణముతో సంయోగము పొంది ఆంతరికధర్మాలకంటె ఇతరములయిన ఘటపటాదిపదార్థములను ప్రకాశింప చేస్తుంది. రత్యుత్సాహాద్యంతఃకరణధర్మాలను సాక్షాత్తుగా ఈ ఆత్మయే ప్రకాశింపచేస్తున్నది. అందువలన ఇవి సాక్షిభాస్యములు. ఈ విధముగా ఆంతర భావాలుకూడా సాక్షిచైతన్యముచే ప్రత్యక్షము లవుతున్నది. కాబట్టి అంతఃకరణ ధర్మాలు సాక్షిభాస్యములు.

అవి ప్రకాశింపబడును అని భావము. ప్రపంచమున ఏ యే పదార్థములు ఉన్నవో వానిని అంతఃకరణముతో కూడుకొనిన ఆత్మ అవభాసింప చేస్తుంది. అంతఃకరణములోని రత్యాదిధర్మాలు సాక్షాద్ద్రష్ట అయిన ఆత్మద్వారా ప్రకాశితములు అవుతున్నవి. ఇతరపదార్థములు ఆత్మ ద్వారా ప్రకాశింపబడుట ఉన్నది కాని ఆత్మ ఇతరములవలన అవ భాసింపబడవలసిన అవసరము లేదు. అందువలననే అది సాక్షి అనీ సాక్షాద్ద్రష్ట అనీ చెప్పబడుతున్నది.

ఈ విషయములో ఒక శంక కలుగవచ్చును. రత్యాదిభావాలు వాసనా రూపముగా అంతఃకరణములో ఉన్నవి. అవి ఆత్మచైతన్యముద్వారా అవభాసింపబడవచ్చును. కాని శకుంతలాది విభావపదార్థాలు ఆత్మ చైతన్యముద్వారా అవభాసింపబడుట ఎట్లు? విభావాదిపదార్థములు బాహ్యావస్తువులుకదా! అవి అంతఃకరణముతో సంబంధించి లేవే! ఏ విధ ముగా ఇవి సాక్షిభాస్యములు కాగలుగుతవి? అని.

ఈ శంకకు ఇది సమాధానము. స్వప్నములో కనపడే తురగము సాక్షి భాస్యము అవుతున్నది. ఆ విధముగా భ్రాంతి కలిగినప్పుడు జాగ్ర దవస్థలోకూడా రంగమందు (తగరము) రజతము సాక్షిభాస్యము అవు తున్నది. కేవలము ఆత్మద్వారా వాని భాసము కలుగుతున్నది. ఆ విధముగా భాసింపబడే అవి ప్రత్యేకపదార్థాలు కావు. కేవలమూ కల్పనాప్రసవములు. ఈ విధముగా కల్పనలో గోచరించు ఏ పదార్థ మైనా సాక్షిభాస్యము కావచ్చును. అట్లే శకుంతలాది విభావాదులు (విభావాదిరూపముగా ఉన్న శకుంతలాదులు) బాహ్యపదార్థములు కావు. స్వప్నతురగాదులవలె సహృదయునకు తన సహృదయతాసహ కృతభావనావిశేషమువలన అంతఃకరణమందు కల్పితములయిన అంతః పదార్థములే. అందువలన సాక్షిభాస్యములు అని తలచుటలో విరో ధము లేదు.

ఒక శంక. వాసనారూపములయిన రత్యాదులు రసమని చెప్పినట్లయినది. కాగా రసము చైతన్యరూపము. దానికి ఉత్పత్తివినాశములు లేవు

అటువంటప్పుడు రసము ఉత్పన్నమైనది, రసము నష్టమైనది అనే వ్యవహారము ఏ విధముగా కుదురుతుంది? అని.

సమాధానము-రసీభూతమైన రతి వాసనారూపముగా స్థిరమే. అయినా వ్యంజకములయిన విభావాదులలో ఉత్పత్తివినాశములు ఉన్నవి. విభావాదుల సంయోగమువలన కలుగుతూఉన్న అజ్ఞానరూపావరణము యొక్క భంగానికికూడా ఉత్పత్తివినాశములు ఉన్నవి. అందువలన విభావాదుల ఉత్పత్తి వినాశములను అనుసరించి కాని, ఆవరణభంగము యొక్క ఉత్పత్తి వినాశములను అనుసరించికాని రసము ఉత్పన్నము అయినదనీ వినష్టము అయినదనీ అనవచ్చును.

వర్ణములు నిత్యములని వైయాకరణులూ మీమాంసకులూ అంగీకరించుతారు. కాగా "గకారము పుట్టింది. గకారము నశించింది" అనే వ్యవహారము ఏ విధముగా కుదురుతుంది? అని వారు శంకించుకొని ఈ విధముగా సమాధానించుకొన్నారు. వర్ణములను వ్యక్తము చేయునటువంటి తాల్వాదివ్యాపారములయొక్క ఉత్పత్తిని అనుసరించి శబ్దమందు ఉత్పత్తినీ, వినాశమును అనుసరించి శబ్దమందు వినాశమునూ ఉపచారరూపముగా అంగీకరించవలెను అని. ఇట్లాగే "రస ఉత్పన్నః, రసో నష్టః" అనే వ్యవహారమును ఆరోపితవ్యవహారముగా కుదురుపాటు చేసికోవచ్చును.

ఎంతవరకు విభావాదిచర్వణ ఉంటుందో, వాని అనుభవము ఉంటుందో, ఆనందాంశావరణభంగము అంతవరకే ఉంటుంది. ఆవరణభంగము కలుగగా రత్యాదిభావములు ప్రకాశింపబడుతవి. విభావాదిచర్వణ నివృత్తమైనపుడు ఆత్మ చైతన్యము సంవృతమవుతున్నది. ఆత్మప్రకాశము ఆవరింపబడగానే స్థాయి ఉన్నప్పటికీ ప్రకాశముకాదు. మనకు దాని అనుభవము కలుగదు. పిధానము ఉన్నపుడు దీపము ప్రకాశించదు; ప్రకాశింపచేయదు.

## మతాంతరము

ఇప్పటికి ఈ వాదములో విభావాది సంయోగము వలన ఒక అలౌకిక

క్రియ ఉత్పన్నము అవుతుందనీ, దాని ద్వారా పూర్వము చెప్పినట్లు రసాస్వాదము కలుగుతున్నదనీ అంగీకరించినట్లు అయింది.) కాని ఈ అలౌకిక క్రియను అంగీకరించకపోయినా రసాస్వాదము కలుగ వచ్చును అనే అభిప్రాయముతో వేరొకవాదము చెప్పబడుతున్నది.

సహృదయుడు విభావాదులను ఆస్వాదించుతాడు. ఆతనిలో సహృదయత్వము కారణముగా ఒక ప్రభావప్రసృతి కలుగుతున్నది. దీని వలన అసాధారణభావన ఉదయించుతున్నది. అప్పటి చర్వణాప్రభావ మహిమవలన, తన సహృదయతాసము స్నేషమువలన, సహృదయునకు ఒక అపూర్వమైన చిత్తవృత్తి కలుగుతున్నది. ఆ చిత్తవృత్తి ఆ యా స్థాయిభావములతో కూడుకొన్న తన స్వరూపానందరూపముగా ఉంటుంది. స్వరూపానందములో అది విషయమై తన్మయీభావమును పొందుతుంది రత్యాద్యుపహితస్వస్వరూపానందాకారమైన చిత్తవృత్తి సముత్పన్నము అవుతుంది అన్నమాట. యోగీశ్వరులకు* సవికల్పకసమాధిలో అటువంటి చిత్తవృత్తియే కలుగుతున్నది. చిత్తవృత్తి ఆనందమయము. ఆనందముకంటె ఇది భిన్నముగా ఉండదు. అట్టి చిత్తవృత్తి గోచరమగు స్థాయ్యుపహితానందమే రసము. సహృదయుని అప్పటి చిత్తవృత్తిలో స్థాయిభావముతో కూడుకొనిన ఆత్మానందము కంటె అతిరిక్తముగా ఏమీ గోచరముకాదు. 'పూర్వవాదములో చెప్పిన అలౌకిక క్రియ లేకపోయినప్పటికీ విభావాదుల ఆస్వాదన ప్రభావమువలన రతి సహిత చిదంశమును చిత్తవృత్తి అనుభవించుతుందని సారాంశము.

ఈ రసస్వరూపానందము ఇతరప్రాపంచికసుఖాలవంటిది కాదు. ఇతర ప్రాపంచికసుఖములు ఏవి అయినప్పటికీ అవి అన్నీకూడా అంతఃకరణ

---

* యోగము ఎనిమిది విధములు. యమము నియమము ఆసనము ప్రాణాయామము ప్రత్యాహారము ధ్యానము ధారణము సమాధి అని. వీని అభ్యాసము కలవానికి యోగి అని పేరు. సమాధి రెండువిధములు. సంప్రజ్ఞాత సమాధి. అసంప్రజ్ఞాత సమాధి అని. ఇవే సవికల్పకసమాధి, నిర్వికల్పక సమాధి అనబడుతున్నవి. సవికల్పక సమాధిలో జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము అనుసంధింపబడుతుంది. నిర్వికల్పకములో ద్వైతములేదు, త్రిపుటిలేదు.

వృత్తులతో కూడుకొనిన చైతన్యరూపములే. ఆయా అనుభవ సమయములో చైతన్యమునకూ అంతఃకరణవృత్తులకూ సంబంధము ఉంటుంది. అందువలననే అంతఃకరణవృత్త్యవచ్ఛిన్న చైతన్యరూపములు అనబడుతున్నవి. రసము అంతఃకరణ వృత్త్యవచ్ఛిన్న చైతన్యాత్మకము కాదు. కేవలము శుద్ధ చైతన్యాత్మకము. దీనినే నిరవచ్ఛిన్న చిద్రూపము అంటారు. ఈ రసానుభవ సమయములో చిత్తవృత్తి ఆనందమయము అవుతుంది. ఈ ఆనందము అనవచ్ఛిన్నము. ఏ అంతఃకరణవృత్తుల ద్వారా కూడా ఈ ఆనందానికి అవచ్ఛేదము (పరిమితి) కలుగదు.

ఈ విధముగా అభినవగుప్తపాదాచార్య - మమ్మటభట్టాది గ్రంథ స్వారసతానుసారముగా "భగ్నావరణచిద్విశిష్టో రత్యాదిః స్థాయిభావో రసః'' అని సిద్ధమైన అర్థము. (అజ్ఞానరూపావరణరహితమగు చైతన్యముతో కూడుకొనిన స్థాయిభావమే రసము అని పర్యవసితార్థము.)

## పైమతముల సవరణ

వాస్తవముగా చెప్పబోవు శ్రుతిని అనుసరించి రత్యాది యుక్తమైన నిరావరణ చైతన్యమే రసము అని చెప్పుట సముచితవాదము. ఈ పక్షములోనే ముందు చెప్పబోవు శ్రుతి సరస మవుతుంది. ఏవిధముగా నైనప్పటికీ — జ్ఞానరూపమయిన ఆత్మద్వారముగా ప్రకాశింపబడు రత్యాదికమే రసమని తలచినా రత్యాది విషయముగా ఉన్న చైతన్యమే రస మని తలచినా రెండువాదములలోనూ రసస్వరూపమందు రతి - చైతన్యము రెండూ కలిసి ఉన్నవని గ్రహించాలి. ఇది విశిష్టస్వరూపము. ఈ రెండిటిలోనూ ఈ భేదమున్నది. ఒక పక్షములో చైతన్యము విశేషణముగానూ రత్యాదికము విశేష్యముగానూ ఉన్నది. రెండవ పక్షములో రత్యాదికము విశేషణముగానూ చైతన్యము విశేష్యముగానూ ఉన్నది. ఈ రెండు పక్షాలలోనూ విశేషణ రూపముగా గాని విశేష్యరూపముగా గాని ఉన్న చైతన్యాంశమును బట్టి రసానికి నిత్యత్వము స్వప్రకాశత్వము సిద్ధమవుతుంది. రత్యాద్యంశమును బట్టి అనిత్యత్వమును ఇతరములచే ప్రకాశింపబడుటను ఊహించాలి. రస

చర్వణ అంటే ప్రథమమతమునుబట్టి ఆత్మచైతన్యముయొక్క ఆవరణము నివృత్తమైపోవుట, అచటి అజ్ఞానము నశించి పోవుట అని గ్రహించాలి. రెండవమతమునుబట్టి "అంతఃకరణవృత్తి ఆనందమయత్వమును పొందుట అని తెలుసుకోవాలి. చిదాకారాంతఃకరణవృత్తి అన్నమాట.

ఈ చర్వణ పరబ్రహ్మాస్వాదనరూపసమాధికంటె విలక్షణము. ఈ చర్వణకు విభావాది సంవలితమైన చిదానందము ఆలంబనము. సమాధిలోని ఆత్మానందములో విషయములు కూడుకొని ఉండవు. ఇటువంటి ఈ చర్వణ కేవలము కావ్యవ్యాపారమయిన వ్యంజనవలన సముత్పన్నమవుతున్నది. కాబట్టి కావ్యవ్యాపారమాత్రముననే దీనిని భావించాలి.

"ఈ రసాస్వాదనలో సుఖాంశము గోచరించుతున్నది" అని అనడములో ప్రమాణము ఏమిటి? అని ప్రశ్నించితే, "సమాధిలో సుఖభానము ఉన్నది" అనడములో ప్రమాణము ఏమిటి ? అని కూడా ప్రశ్నింపవచ్చును. పర్యనుయోగము రెండిటిలోనూ సమానమే. "సుఖమాత్యంతికం యత్తత్ బుద్ధిగ్రాహ్య మతీంద్రియం" సమాధిలోని ఆత్యంతికసుఖము అతీంద్రియము; అది బుద్ధి గ్రాహ్యాము" అనే గీతా వచనమును సమాధిసుఖభానములో శబ్దప్రమాణమునుగా గ్రహించితే రసాస్వాదన విషయములో కూడా ప్రమాణద్వయము ఉన్నదని నిరూపించగలము.

రసోవై సః। రసం హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి

ఆ ఆత్మ రసరూపము. జీవుడు రసమును పొంది ఆనందరూపుడు అవుతున్నాడు * అను ఈ శ్రుతి ప్రమాణము. సకలసహృదయప్రత్యక్షము కూడా రెండవ ప్రమాణము.

---

* చత్వారిశృంగాః మొదలైన మంత్రాలకు మహాభాష్యకారాదులు శబ్దస్వరూప విషయకముగా తాత్పర్యమును వర్ణించుకొన్నారు. ఆవిధముగా పదసమన్వయబలాన ప్రతీయమానము అవుతూఉన్న అర్థాన్ని గ్రహించవచ్చును. జీవుడు రసరూపమయిన బ్రహ్మానందమును పొంది అనగా నిరస్తకాముడు ఆప్తకాముడు అగుటవలన అంతర్ముఖమైన మనస్సులో స్పష్టముగా ప్రతిబింబించిన ఆత్మతత్వమును తెలుసుకొని ఆనందమయుడు అవుతున్నాడు అని అర్థము.

ఈ రసస్వరూపములో ఆనందము ఉన్నదో లేదో సహృదయులే చెప్పగలుగుతారు. "చిత్తవృత్తి ఆనందమయముగా అగుట" అనే రస చర్వణ ద్వితీయపక్షములో చెప్పబడినది. అది శబ్దవ్యాపారమైన వ్యంజన వలననే భావింపదగినది. శబ్దప్రమాణముద్వారా విజ్ఞాతము అవుతున్నందువలన పరోక్షము అనవచ్చును. అపరోక్షసుఖాలంబనము అగుట వలన అపరోక్షము అని కూడ అనవచ్చును. "శాబ్దము పరోక్షమే కావలయును" అను నియమము లేదు. శాబ్దత్వము, అపరోక్షత్వము విరుద్ధములు కావు. "తత్త్వమసి" అను మహావాక్యమువలన కలిగిన బ్రహ్మజ్ఞానము శాబ్దమనీ అపరోక్షమనీ వేదాంతులు అంగీకరించి ఉన్నారు. అట్లాగే ప్రకృతములో రసముకూడా శాబ్దమూ కావచ్చును, అపరోక్షమూ కావచ్చును. "తత్త్వమసి" అనేది వేదాంతమహావాక్యములలో ఒకటి. తత్ - ఆ పరమాత్మ, త్వం - నీవు, అసి - అయితివి. నీవా బ్రహ్మవు అని జీవేశ్వరుల అభేదమును ఈ మహావాక్యము బోధించుచున్నది. ఇచటి ఈ అభేదజ్ఞానము మొదట శాబ్దము. అనుసంధాన వశాన అపరోక్షానందము కలిగినప్పుడు ఇదే అపరోక్షముకూడా అవుతున్నదని వేదాంతనిర్ణయము.

రసవాదవిషయములో సిద్ధాంతార్థమును ఆవిష్కరించిన శ్రీమదభినవ గుప్తాచార్యపాదులు పైవిధముగా తమ భావమును సూచించుచున్నారు.

## II భట్టనాయకమతము

భట్టనాయకుడు ప్రాచీనసాహిత్యకారులలో ఒకడు. ఆతని వాదము ఈ విధముగా ఉంటుంది. రసము ముగ్గురిని సంబంధించి ఉండవచ్చు. వారు నాయక నట సామాజికులు. అందులో రామాదినాయకుడూ నటుడూ తటస్థులు అనబడుతారు. రసము నటనాయకులను సంబంధించి ఉంటుంది అనేటట్లయితే సహృదయునకు రసముతో ఏమీ సంబంధము ఉండదు. తటస్థముగా రసము ప్రతీత మవుతుంది. ఇట్లా తటస్థముగా రసప్రతీతిని అంగీకరించితే సహృదయునకు రసాస్వాదనము కలుగదు. పోనీ 'రసము మనకు సంబంధించి ఉన్నది' అని ఆత్మగతముగా (సామాజికగతముగా) ప్రత్యయము కలుగుతుంది అనుకుందామా అంటే ఆ విధముగా ప్రత్య

యము కలుగుట దుర్ఘటము. శకుంతలాదులు సామాజికున కు విభావములు కారుగదా! సామాజికప్రేమలో వారు ఆలంబనము కారు. విభావము లేకుండా నిరాలంబనముగా రసము ఎన్నడూ ప్రతీతము కాదు. మనము ఎవరిని ప్రేమపాత్రముగా తలచుతామో వారితో మనకు కొంత సంబంధము ఉండుట ఆవశ్యకము. మన ప్రేమపాత్రము కాగలుగునట్టి యోగ్యత వారిలో ఉండాలి.

శకుంతలాదులందు శకుంతలాత్వాదికము తొలగిపోగా కాంతాత్వరూపమైన సాధారణధర్మమే గోచరించుతుంది గదా! అటువంటి సాధారణ రూపము లయిన విభావములు ఉన్నవి కావా? వారు విభావముగా సామాజికరతి రసీభావము పొందగూడదా?

ఇట్లనుట ఉచితముకాదు. శృంగారరసములో విభావముగా ఉండే కాంత "అగమ్య" అనే జ్ఞాన విషయము కారాదు. "ఆ కాంత అగమ్య కాదు. ఆమెతో ప్రేమ ఉండవచ్చును" అనేజ్ఞానము విభావముగా తలచేవారి విషయమై ఉండాలి. మొదట 'అగమ్య' అనే జ్ఞానము కలిగినా ఆ జ్ఞానము భ్రమాత్మకజ్ఞానమయితే అటువంటి జ్ఞానగోచరమగునది విభావము కావచ్చును. 'ఈమె నాకు అగమ్యకాదు' అనే జ్ఞానము కూడా అప్రామాణికము కారాదు. ఏమాత్రమైనా అది అప్రామాణ్య నిశ్చయముతో కూడుకొని ఉన్నట్లయితే విభావము కావడానికి వీలులేదు. అంటే 'ఈ యువతి నాకు అగమ్య కాదు' అనే ప్రామాణిక నిశ్చయము ఉన్నప్పుడే శృంగారరసములో కాంతకు విభావత్వము ఉంటుంది అని భావము. మన సోదరికూడా యువతియే అయినా మన ప్రేమలో విభావము కాదు. ఆమె విషయమై కలిగే అగమ్యాత్వప్రకారకజ్ఞానాభావము ప్రామాణికనిశ్చయముతో ఉండదన్నమాట. ఒక్కొక్కప్పుడు ప్రామాణ్యానిశ్చయము లేనందువలన అగమ్యాయువతి గమ్యాయువతిగా కన్పడవచ్చును. ఆలంబనవిభావముగా ఉండతగిన పదార్థము అగమ్యమని,మనకు పొందరానిదని తలంపు కలుగరాదు. ఈ జ్ఞానము ఏమాత్రమూ విభావకోటిలో ఉండరాదు. ఇది శృంగారవిషయము.

ఈ విధముగానే కరుణాదిరసాలలో కూడా ఊహించ వలసి ఉన్నది. ఎవరి విషయమై మనము శోకాదికమును పొందుతామో వారి యందు అశోచ్యత్వ ప్రమ ఉండరాదు. కాపురుషత్వ ప్రమ ఉండరాదు. బ్రహ్మజ్ఞాని శోకింప తగినవాడుకాడు. అక్కడ శోకము అనుచితము. నిందిత పురుషుడు మరణించినపుడు ఎవరికీ కష్టము కలుగదు.

మనము విభావముగా తలచువారి విషయమై అటువంటి జ్ఞానము ఉత్పన్నము కాకపోవుటలో ఏదైనా ప్రతిబంధకము ఉండాలి. ఏమీ ప్రతిబంధకము లేనిదీ అది కుదరదు. ఎవరి విషయమై అయినా అగమ్యాత్వ జ్ఞానమూ అశోచ్యత్వజ్ఞానమూ కలుగలేదంటే అక్కడ ఏదో ప్రతిబంధకము ఉన్నదన్నమాట. తనయందు దుష్యంతాద్యభేదబుద్ధి అక్కడ ప్రతిబంధక మని తలచరాదు. మనకు అటువంటి అభిన్నజ్ఞానము కలుగదు. శకుంతలానాయకుడైన దుష్యంతుడు పృథ్వీపతి. ధీరపురుషుడు. మనము క్షుద్రమానవులము. కాపురుషులము. వారు ఎప్పటివారో; మనము ఆధునికులము. ఇటువంటి విధర్మాలు అనేకములు ఉన్నవి. ఈవిధముగా విరోధము స్పష్టప్రతీతము అవుతున్నపుడు దుష్యంతాభేదబుద్ధి దుర్లభము.

ఇంకా ఈ విషయములో చర్చింపవలసిఉన్నది. మనకు కలుగునటువంటి రసప్రతీతి ఏమిటి? వేరొక ప్రమాణము లేదు కాబట్టి కావ్యశ్రవణము వలననే కలుగుతున్నదికాబట్టి శబ్దప్రమాణము వలననే కలుగుతున్నందువలన "ఈ రసప్రతీతి శాబ్దము" అనడము ఉచితము కాదు. రాత్రిందివము మనకు వ్యవహారములో గోచరములు అవుతూ ఉన్న అన్యాన్యశబ్దాలద్వారా నానా నాయికానాయక వృత్తాంతములు మనకు గోచరములు అవుతూ ఉన్నవి. వానిలో ఏమాత్రమూ చిత్తాకర్షకత లేదు. అవి హృద్యములుగా ఉండడము లేదు. ఆ ప్రతీతిలో ఏమాత్రమూ లోకానికి సరసత్వము గోచర మగుట లేదు. ప్రత్యక్షముగా నాయక మిథునమును చూచినపుడు ఒకరికి లజ్జ, వేరొకరికి జుగుప్స, మరియొకరికి స్పృహ, ఇంకొకనికి కోపతాపములు కలుగుతున్నవి. శబ్దానుమానాదుల వలన రసప్రతీతి కల్గినపుడు కూడా

ఈ చెప్పిన దశ కలుగక తప్పదు. ఈ రసప్రతీతి మానసము కాదు. నిరంతర చింతాసముపనీతములైన ఆ యాపదార్థాలకూ మానస ప్రతీతికీ చాలా వైలక్షణ్య మున్నది. ఇది స్మృతికూడా కాదు. ఈ పదార్థాలు ఎన్నడూ అనుభవములో లేవుకదా. అనుభవములో లేని వస్తువు ఎన్నడూ స్మృతిపథమునకు రాదు.

కాబట్టి ఇక్కడ ఈ విషయమును భావించాలి. కావ్యములోని అభిధాశక్తి ద్వారా పదార్థముల జ్ఞానము కలుగగానే వానియందు భావకత్వ వ్యాపారము భావన అనే క్రియ ఉత్పన్న మవుతున్నది. అది కార్యతత్పరము కాగలుగుతుంది. అప్పుడు రసప్రతీతికి విరోధి అయిన అగమ్యాత్వాది జ్ఞానము కలుగదు. అటువంటి జ్ఞానమునకు ప్రతిబంధము కలుగుతున్నది. ఆ జ్ఞానప్రతిబంధముద్వారా కాంతాత్వాది రసానుకూలధర్మాలు మన సమక్షములోనికి తీసికొని రాబడుతవి. ఈ విధముగ ఆ భావనాక్రియ దుష్యంతుడు, శకుంతల, దేశము, కాలము, వయస్సు, స్థితి, మొదలైన సర్వపదార్థములను సాధారణముగ చేయగలుగుతుంది. ఇంతవరకు భావకత్వపు వ్యాపారముయొక్క మహిమ ప్రసరించుతుంది. ఈ సాధారణీకృతిలో రసచర్వణయందు ఏవిధమైన విశేషమూ ఉండదు. ఈ విధముగ ఆ వ్యాపారము కుంఠితము కాగా అనంతరము మూడవక్రియ ఉత్పన్న మవుతున్నది. "భోగకృత్వము" అని దానిపేరు. ఆ భోగకృత్వవ్యాపారముయొక్క ప్రభావమువలన మన రజస్తమోగుణములు విలయము పొందుతవి. సత్వగుణము అభివృద్ధిని పొందుతుంది. దానివలననే మనము మన చైతన్య రూపమైన ఆనందమును పొంది ప్రాపంచికవిషయములనుండి విశ్రాంతిధామమును చేరుకొనగలము. ఈసమయములో మనకు ఏవిధమైన పదార్థముల బోధకూడ ఉండదు. రజస్తమోగుణములు తిరస్కృతములైనపుడు ఉద్రిక్తమైన సత్వగుణమువలన రసాత్మ సాక్షాత్కారము కలుగుతున్నది. దానినే నిజచిత్స్వరూపనిర్వృతివిశ్రాంతి అని అంటాము. పూర్వము భావనాక్రియాబలమువలన సాధారణములుగా చేయబడిన రత్యాదిభావాలు రససాక్షాత్కారమునకు విషయములుగ

అయినపుడు రసమని చెప్పబడుచున్నవి. సత్వగుణాభివృద్ధి కలిగినపుడు ప్రకాశించిన ఆనందముతో అభిన్నమైన చైతన్యమునకు "భోగము" అని పేరు. రత్యాది స్థాయిభావములు ఆ భోగవిషయములు అవుతున్నవి.

ఈ పక్షములో కూడా, మమ్మటాదుల పక్షములో మాదిరిగ, రెండు పద్ధతులను గ్రహించవచ్చును. భుజ్యమాన మగు రత్యాదికమే రసమని ఒకటి—చైతన్యయుక్తమగు రతియే రసమని దీని అర్థము. రత్యాదుల భోగమే రస మని రెండవది—రత్యుపహితచైతన్యమే రసము అని దీని యర్థము. ఈ ఉభయమే రసము.

ఈ రసాస్వాదము అనగా ఈ భోగము రత్యాదిభోగములతో మిశ్రితమై ఉన్నది. కాబట్టి బ్రహ్మానందాస్వాదమునకు సమీపవర్తి అని, సహోదరమని చెప్పబడుతున్నది. కాని బ్రహ్మానందరూపమే కాదు. బ్రహ్మానందములో అతిరిక్త విషయములు ఎప్పుడూ మేళనము పొంది ఉండవు.

ఈ రీత్యనుసారముగ కావ్యానికి మూడు అంశము లున్నవి. ఒకటి అభిధ. దీనివలన కావ్యగతవిజ్ఞానము కలుగుతుంది. రెండవది భావన. ఇది వ్యక్తిగతత్వమును పోగొట్టి సాధారణీకరణమును సంపాదించుతుంది. మూడవది భోగీకృతి. దీనికే భోజకత్వవ్యాపార మని పేరు. దీనివలన ఆత్మాస్వాదనము కలుగుతుంది. ("అభిధా భావనా చైవ తద్భోగీకృతి రేవచ" అనే కారికార్థము ఈ విషయమునే చెప్పుచున్నది.)

ఈ మతములో మొదటి మతముకన్న భావన అనబడు భావకత్వవ్యాపారానంతరము స్వీకరించుటయే విశేషము. భోగము వ్యక్తి ఒకటే. ఇది ఆవరణరహితమైన చైతన్యరూపము. ఆవరణభంగమును సంపాదించే భోగీకృతి వ్యంజనకన్న అతిరిక్తమే కాదు. భోగకృత్వము ధ్వనితముచేయుట*. ఈ రెండిటిలో అంతరమేమీ లేదు. మిగిలిన పద్ధతి అంతా పూర్వసదృశమే.

* పూర్వము చెప్పిన అభినవగుప్తాదుల మతములో కంటె నవీనముగా భావకత్వ వ్యాపారమును స్వీకరించడమే ఈ మతములో విశేషము. భోగము వ్యంజనకన్న అతి

## నవ్యమతము

కావ్యములో కవి విభావాదులను ప్రకాశింపచేస్తాడు. నాట్యములో నటునిద్వారా విభావాదులు ప్రకాశితము లవుతున్నవి. అవి సహృదయుని సమక్షములో ఉపస్థితము లయినప్పుడు వ్యంజనావృత్తి ద్వారకముగా – "దుష్యంతుడు శకుంతలావిషయక మగు రతి కలిగిఉన్నాడు–" అని ఆతని రతి గ్రహింపబడుతున్నది. శకుంతలా దుష్యంతులకు పరస్పరమూ ప్రేమఉన్నదని మనము గ్రహింపగలము. అనంతరము సహృదయతవలన ఒక భావనావిశేషము సముల్లాసము పొందుతున్నది. అది దోషరూపము. ఈ దోషప్రభావమువలన మన అంతరాత్మ కల్పితమైన దుష్యంతత్వముతో ఆచ్ఛాదిత మవుతున్నది. ఆ దోషము కారణముగా మనము సర్వాత్మనా దుష్యంతుల మైపోతాము. దుష్యంతాభేదమునే భావించుతాము. అపుడు అజ్ఞానమువలన శుక్తికాశకలమందు రజతఖండము ఉత్పన్నమయినట్లుగా కల్పిత (దుష్యంతత్వాచ్ఛాదితము అయిన మన ఆత్మయందు శకుంతలావిషయక మగు రత్యాది చిత్తవృత్తి కలుగుతున్నది. ఇది అనిర్వచనీయము. సదసద్విలక్షణము. కాబట్టి దీని స్వరూపమును నిర్ణయించలేము. శకుంతలాదులతో ప్రేమాదికము సముత్పన్న మవుతున్నది. ఇది వ్యావహారికముగా అసత్యమే. ఈ చిత్తవృత్తులు ఆత్మచైతన్యము ద్వారా ప్రకాశింపబడుతున్నవి. ఇటువంటి ఈ విలక్షణచిత్తవృత్తులకే రసము అని పేరు. ఇక్కడ భాసించునట్టి రత్యాదికము సాక్షిభాస్య మని అందరూ అంగీకరింపవలసినదే.

ఈ రసము దోషముయొక్క కార్యము. దోషము నశించినపుడు నశించుతుంది. మనపై దోషప్రభావము ప్రసరించినపుడే రసప్రత్యయమును

---

రిక్తముకాదు. వ్యంజన అజ్ఞానావరణమును అపసరింపచేసి సత్త్వోద్రేకమువలన భగ్నావరణ చిద్విశిష్ట రత్యాదికమునుగాని భగ్నావరణచిదంశమునుగాని రసముగా ఆస్వాద విషయము చేస్తున్నట్లు భోజకత్వ వ్యాపారముకూడా సత్త్వవృద్ధికలిగినపుడు నిజచిత్స్వభావ నిర్వృతి (చైతన్యావరణభంగ) రూపమైన సాక్షాత్కారముతో విషయీకరించికొనిన రత్యాదికమును రసముగా చేస్తున్నది. ఈ మతములో ఈవిధముగానే అంగీకరింపబడుతున్నదిగదా! కాబట్టి భోజకత్వము అనేది వ్యంజనాస్థానీయమే. కేవలము విభావాదులను సాధారణీకరించే భావనావ్యాపారము మాత్రము నవీనము.

పొందగలుగుతున్నాము. సామాన్యముగా ఈ రసము సుఖరూపము కాదు; వ్యంగ్యమూ కాదు. దీని వర్ణనము కూడా కుదరదు. అయి నప్పటికీ ఈ రసప్రతీతికి అనంతరము కలుగునట్టి లోకోత్తరాహ్లాదముతో రతికి ఏమాత్రమూ భేదము మనకు గోచరము కావడము లేదు. కాబట్టి సుఖపదముతో వ్యపదేశింపవచ్చును. 'రసము సుఖరూపము' అని వ్యవ హరింపవచ్చును. ఈ విధముగా ఇంతకు పూర్వము వ్యంజనావృత్తి ద్వారా జ్ఞానగోచరము అయిన శకుంతలా విషయక దుష్యంత రతికి అనిర్వచనీయరతికీ ఉండే భేదము విదితము అగుటలేదు. కాబట్టి వ్యంగ్య మనీ వర్ణనీయమనీ కూడా అనవచ్చును. "అది వ్యంజనావృత్తిచేత ప్రకాశితమైనది. కవి వర్ణించినాడు" అని మనము తలచవచ్చును. దుష్యంతాదిరతితో అనిర్వచనీయరతికి ఏకత్వనిశ్చయము ఉన్నందు వలనకూడా వ్యంగ్యత్వమును వర్ణనీయత్వమును చెప్పవచ్చును.

దుష్యంతాదిరతి అనిర్వచనీయమైనట్లు సహృదయాత్మను ఆచ్ఛాదితము చేసిన దుష్యంతత్వము కూడా అనిర్వచనీయమే. దాని స్వరూపమును కూడా యథాతథముగా నిర్ణయము చేయలేము. అనిర్వచనీయమైన ఆ దుష్యంతత్వము ఏవిధముగా మన ఆత్మాచ్ఛాదనము చేస్తున్నదో దానిని ఈవిధముగా గ్రహించవచ్చును. మనము మనలను దుష్యంతరూప ముగా తలచినపుడు 'ఆ రత్యాదులు మనవే కాని ఇతరులవి కావు' అని అనుకుంటాము. మన ఆత్మ దుష్యంతత్వముతో ఆచ్ఛాదితము కావడమంటే ఇదే. "నేను శకుంతలావిషయకరతి కలిగిన దుష్యంతు డను" అనే భావనలో దుష్యంతుడు విశేష్యముగానూ రతి విశేష ణముగానూ ఉంటుంది. అట్టి విశేష్యములో ఉన్న ధర్మము అగుటయే అవచ్ఛాదకత్వము. దుష్యంతునియందు దుష్యంతత్వము అనే ధర్మము ఉన్నది. అదే అవచ్ఛాదకము. మొత్తానికి "ఈ రత్యాదులు నాకు సంబం ధించే ఉన్నవి" అని రత్యాదులకు తనయందు విశేష్యత్వమును కల్పిం చడమును అవచ్ఛాదక మని గ్రహించాలి.

ఈ విధముగా అంగీకరించినందువలన—"దుష్యంతాదుల రత్యాది భావాలను మనము ఆస్వాదింపజాలము. ఆస్వాద్యములు కానప్పుడు

అవి రసములు కావు. శకుంతలాదులతో ఏమీ సంబంధము లేనందు వలన సామాజికులందు ఉండే రతికి అభివ్యంజనము కలుగదు. దుష్యంతాదులతో అభేదబుద్ధి కలిగితే అది కుదరవచ్చునేమో కాని తనయందు ఆదుష్యంతాభేదబుద్ధికూడా గలుగదు. ఆతడు రాజు, మనము సామాన్య మానవులము. ఇటువంటి బాధకబుద్ధి ఉన్నప్పుడు అభేదము కలుగదు" — ఈ మొదలయిన భట్టనాయకుని శంకలన్నీ నిరస్తము లవుతున్నవి. ఈ పక్షములో వారి మతానికి ఏమాత్రమూ అవకాశము లేదు.

ప్రాచీనాచార్యులు రత్యాదులకు సాధారణ్యమును చెప్పినారు. విభావాదులకు ఏ విశేషవ్యక్తితోనూ సంబంధము ఉండదని లిఖించినారు:ఆసాధారణ్యముకూడా దోష విశేషకల్పన లేకుండా కుదరదు. ఎట్లాగంటే— కావ్యములో వర్ణింపబడిన శకుంతలాదివర్ణనమును దుష్యంతునకు సంబంధించిన శకుంతలాదియువతుల పరముగానే మనము గ్రహించుతున్నాము. అట్లే బోధ కలుగుతున్నది. కేవల యువతిపరముగా బోధ కలుగుట లేదు. అటువంటి శకుంతలాదులలో కూడుకొనిన విశేషమును నివర్తింపచేయడానికి దోషవిశేషకల్పన చేయవలసి ఉన్నది. ఇట్లు దోషకల్పన ఆవశ్యకమై ఉండగా ఆ దోషము ద్వారా మనయందు దుష్యంతాదులతో అభేదబుద్ధి సహజముగా సిద్ధమవుతున్నది. ఈ విధముగా ఇది నూపపాదితము కావచ్చును.

ఇక్కడ ఒక శంక కలుగుతుంది.— "అనిర్వచనీయరత్యాద్యనంతరము సుఖము కలుగుతున్నది. ఆ సుఖానికీ రత్యాదికమునకూ భేదజ్ఞానము లేనందువలన రతి సుఖరూపము అని చెప్పబడుతున్నది" అని ఇంతకు పూర్వము ఉపపాదించుట వలన — "రత్యాద్యనంతరము కేవలము సుఖము మాత్రమే కలుగుతున్న"దని అంగీకరించినట్లు అవుతున్నది. అది యుక్తము కాదు. రత్యనుభవములో ఒకవిధ మగు సుఖము ఉత్పన్నము కావచ్చును. దీనిలో విప్రతిపత్తి లేదు. కాని, కరుణాది రసాలకు సంబంధించిన శోకాది స్థాయిభావాలు దుఃఖాదికమును కలుగజేయునట్లుగా సర్వప్రసిద్ధము. రతి దుష్యంతాదులకు సుఖవిశేషమును కలుగ

జేస్తున్నట్లుగా సహృదయునకు కూడా సుఖవిశేషమునే సంపాదింప
వచ్చును గాని దుఃఖప్రదమైన శోకము సహృదయులకు ఆనందమును
ఏవిధముగా కలుగజేయగలదు? ప్రత్యుత శోకాదికము రామాదులకు
దుఃఖమును కలుగజేయునట్లుగా సహృదయునకు కూడా దుఃఖమునే
కలుగజేయాలి కదా !

"సత్యశోకమే దుఃఖమును కలుగజేస్తుంది కాని కల్పితశోకము దుఃఖ
మును కలుగజేయదు. దాని కా శక్తి లేదు. దుష్యంతాదులకు సత్య
శోకము ఉన్నది. అందువలన వారికి దుఃఖము కలుగవచ్చును. సహృద
యులు కల్పితశోకానుభవకర్తలు. కాబట్టి వీరికి దుఃఖము కలుగదు."

అని అనడముకూడా ఉచితము కాదు. రజ్జువును చూడగా సర్పభ్రమ
కలుగుతున్నది. ఈ సర్పము కల్పితమే కాని సత్యముకాదు. "కల్పి
తము కార్యకారి కాదు'' అనేటట్లయితే, ఈ కల్పితసర్పమువలన
భయకంపాదులు కలుగకూడదుగదా ! కాని లోకము చాలా కంగారు
పడి భయకంపాదులను పొందుతున్నది. అట్లాగే కల్పితశోకము
కూడా దుఃఖజనకము కాక తప్పదు. మీరు తలచినట్లు కల్పితము
కార్యకారియే కాకపోతే సహృదయుల అనుభవములో ఉండే రతికూడా
కల్పితమే కాబట్టి దానివలనకూడా సుఖము కలుగరాదు.

మొత్తముమీద "శోకము దుఃఖజనకము కాబట్టి సహృదయాహ్లాద
హేతువు కాజాలదు. అన్నీ ఆనందప్రదములనుట ఎట్లా కుదురుతుంది?"
అని శంకాగ్రంథము.

ఈ విషయములో ఇక ఇది సమాధాన గ్రంథము. శృంగార ప్రధానము
లయిన కావ్యాలవలన ఆనందము కలుగుతున్నట్లు కరుణరసప్రధాన
కావ్యాలవలన కూడా కేవలానందమే కలుగుతున్నదనీ సహృదయుల
హృదయము ప్రమాణమే అయితే లోకోత్తరకావ్యవ్యాపారమ
ఆహ్లాదప్రయోజకమైనట్లు దుఃఖప్రతిబంధకమనీ కూడా అంగీకరిం
కార్యానుసారముగా కారణమును కల్పించాలి కదా! అన
ఏ యే విధముగా ఉంటుందో తదనురూపముగా
యించుకోవాలి.

కావ్యాలవలన ఆనందము కలుగుతున్నట్లు దుఃఖము ఉత్పన్నమగుట కూడా ప్రమాణసిద్ధమే అయితే కావ్యక్రియకు దుఃఖప్రతిబంధకత్వము కల్పించనక్కరలేదు. కావ్యములోని అలౌకికవ్యాపారమువలన ఆనందము కలుగవచ్చును. శోకనిమిత్తముగా దుఃఖమూ కలుగవచ్చును. సుఖదుఃఖాలు రెండూకూడా తమతమ కారణాలవలన ఉత్పన్నములు కావచ్చును.

ప్రశ్న:— కరుణాదిరసాలవలన దుఃఖమే కలుగుతున్నట్లయితే కావ్యరచనకై కవి, కావ్యశ్రవణకై సహృదయుడూ ఏల ప్రవర్తించుతారు? "ఇది నాకు ఇష్టమును కలుగజేస్తుంది" అనే జ్ఞానమున్నప్పుడుకాని ప్రవృత్తి కలుగదు. "ఇటువంటి కావ్యము అనిష్టసాధనము" అనే జ్ఞానము ఉంటుంది కాబట్టి నివృత్తి కలుగుట ఉచితము కదా! అని.

సమాధానము:— చందనలేపమువలన శీతలతాజన్యమైన సుఖము అధికము. ఎండిన బెరడులను ఊడదీసేటప్పుడు కొంత దుఃఖము కూడా ఉన్నది. కాని అది సుఖాపేక్షయా స్వల్పము. చందనలేపములో కొంత దుఃఖము ఉన్నప్పటికీ జనులు ప్రవర్తించుతున్నారు. ఆ విధముగానే ఇష్టము అధికమై అనిష్టము స్వల్పమైనప్పుడు ప్రవృత్తి కలుగవచ్చును. కరుణాదిరసాలలో వాంఛనీయము అధికముగా ఉన్నది. అవాంఛనీయము తక్కువగా ఉన్నది. అందువలన కవులూ సహృదయులూ వానిలో ప్రవర్తించుతున్నారు. కావ్యములో శోకాదికమువలన కూడా ఆనందమే కలుగుతుందని అనే వారి మతములో ప్రవృత్తి నిర్బాధమే.

కరుణరసము మొదలయిన వానివలన కేవలమూ ఆనందమే కలుగుతున్నప్పటికీ తదనుభవములో అశ్రుపాతాదికము కలుగుట అస్వాభావికముకాదు. ఆనందానికికూడా అశ్రుపాతమును కలుగజేసే స్వభావమున్నది. అక్కడ కలిగే అశ్రువులు దుఃఖమువలన కలగడములేదు. ...గవద్గుణాకర్ణనము చేసేటప్పుడు భగవద్భక్తులు ఆనందాతిరేకము ...తడిపెట్టుకొనడమే కాక అశ్రుధారలను ప్రవర్తింపచేయడము ... అప్పటి వారి అవస్థలో కించిన్మాత్రమైనా దుఃఖాను... ఎవరూ అనరు. అట్లాగే ప్రకృతములో కూడా.

ఒక ఆశంక ఈవిధముగా కలుగవచ్చును. కరుణరసాదులలో శోకాది సహితులయిన దశరథాదుల అభేదమును భావించినప్పుడు ఆనందమే కలుగుతుందని మీరంటున్నారు. అట్లాగే అయితే స్వప్నములో, సన్నిపాతజ్వరములో తన ఆత్మయందు శోకాదిసహితులయిన దశరథాదుల అభేదమును ఆరోపించుకొన్నప్పుడుకూడా ఆనందమే కలుగవలెకాదా ? కాని ఆ అవస్థలో మానవులు కేవలమూ దుఃఖమునే అనుభవించుతున్నారు. కాబట్టి ఆ అనుభవమును అనుసరించి కావ్యములోకూడా కరుణాదిసన్నివేశములలో దుఃఖాదికమే అనుభవింపబడుతున్నదని అంగీకరింపవలసినదే అని.

ఇది సమాధానము కావ్యముయొక్క అలౌకికవ్యంజనవ్యాపారప్రభావమువలన కావ్యవ్యాపారప్రయోజ్యములయిన శోకాదిపదార్థములు సుందరతారహితము లయినప్పటికీ అలౌకికానందమును ఉత్పాదింపచేయగలవు. కావ్యవ్యాపారజన్యమైన కమనీయాస్వాదము ఇతర ప్రమాణములవలన కలిగే అనుభవముకంటె విలక్షణము. కాబట్టి ఆనందము కలుగవచ్చును.

ఇక్కడ ఈ విషయమునుకూడా తెలుసుకోవాలి. "కావ్యవ్యాపారజన్యమైన కమనీయాస్వాదము" అనే అంశానికి ఇది అర్థము. కావ్యవ్యాపారమువలన భావన కలుగుతుంది. ఆ భావనవలన రత్యాదులు కలుగుతవి. ఆ రత్యాదులను విషయముగా చేసికొని ఆస్వాదము పుట్టుతుంది. అందువలన రసాస్వాదము కావ్యవ్యాపారమువలన ఉత్పన్నము కాకపోయినప్పటికీ కావ్యముయొక్క పునఃపునరనుసంధానమువలన కలుగుతున్నది కాబట్టి హాని ఏమీ లేదు. సహృదయులు స్వాత్మయందు దుష్యంతాభేదబుద్ధి కలిగినవారు అగుటవలన శకుంతలాదులందు అగమ్యాత్వప్రతీతి కలుగదు. అభేదబుద్ధి ఆ జ్ఞానమును ప్రతిబంధించుతుంది. రసవాదములో ఇది సపసమతము.

## ప ర మ త ము

ప్రాచీనులు అంగీకరించిన వ్యంజనాక్రియనుగాని నవీను లంగీకరించిన

అనిర్వచనీయఖ్యాతిని గాని అంగీకరించవలసిన అవసరములేదు. రసము వ్యంగ్యమూ కాదు; అనిర్వచనీయమూ కాదు. శకుంతలాదివిషయక మైన ఏ రతి కలదో ఆ రత్యాదికముతో కూడుకొన్న వ్యక్తితో మనః కల్పితమైన అభేదజ్ఞానమే రసము. అంటే రసము ఒక భ్రమ, అసత్యమైన దుష్యంతతాదాత్మ్యమును సామాజికులు పొందుతున్నారు. పూర్వము చెప్పిన దోషమహిమవలన సామాజికులమైన మనయొక్క ఆత్మయందు దుష్యంతతాదాత్మ్యము అవగాహింప బడుతున్నది. శకుంతలారతిమ దభేదబోధ కలుగుతున్నది. కావ్యపదార్థములను పునఃపునరను సంధానము చేయుటవలన, అనుశీలన మొనర్చుటవలన ఈ మానస భ్రమ కలుగుతున్నది. శకుంతలా దుష్యంతులు ఈ మానసభ్రమలో విషయ మవుతున్నారు. వారు విషయముగా ఈ భ్రమ కలుగుతున్న దని భావము. ప్రపంచములోని వ్యావహారిక వస్తువులతో దీనికి సంబంధము లేదు. అందువలన ఇది విలక్షణము.

ఈ మానసజ్ఞానమే రసము. స్వప్నసన్నిపాతములలో కూడా మానస కల్పనలు ఉండవచ్చును. దుష్యంతాదుల తాదాత్మ్యజ్ఞానము ఉండ వచ్చును. కాని ఆ జ్ఞానము రసముకాదు. కావ్యార్థభావనమువలన కలిగినది అయితేనే రసముకాని ఇతరవిధాల కలిగేది రసముకాదు. స్వప్నసన్నిపాతబోధలలో పరమాహ్లాదము లేదు.

ఈ రత్యాదులు మనలో లేవు. అయినప్పటికీ ఆహ్లాదము కలుగవచ్చును. తదనుభవము గోచరము కావచ్చును. కావ్యచింతనవలన కలుగుతూ ఉన్న ఈ రత్యాదులఅనుభవము లౌకికముకాదు. లౌకికానుభవము లోనే నిజవస్తువు లుండవలసిన ఆవశ్యకత్వము ఉన్నది. కాని ఇది భ్రమ.

ఒకశంక:— రసము భ్రమ రూపమే అయితే "రసము ఆస్వాదింపబడు తున్నది" అనే వ్యవహారము ఏ విధముగా కుదురుతుంది? ఆస్వాదన ములో రసము విషయముగా ఉండడము ఎట్లా కుదురుతుంది? భ్రమ కూడా జ్ఞానరూపమేకదా! దానికి ఆస్వాదనము ఏమిటి? అని.

సమాధానము:— రత్యాదులు ఆస్వాదింపబడడము అనేది అనుభవ సిద్ధమేకదా! ఇపుడు ప్రకృతములో స్వాత్మయందు శకుంతలాదిరతి

భ్రమ కలుగుతున్నది. కాబట్టి రతివిషయకాస్వాదవ్యవహారమును అనుసరించి రసానికికూడా ఆస్వాదము ఉంటుం దని వ్యవహరించ వచ్చును. ఈ మతానుసారముగా ఈ జ్ఞానము మూడువిధాల ఉంటుంది— శకుంతలావిషయకరతియుక్తుడ నయిన నేను దుష్యంతుడను అని ఒకటి. శకుంతలావిషయకరతిసహితదుష్యంతుడు నేనే అని రెండు. నేనుశకుంతలావిషయకరతిసహితుడనూ, దుష్యంతుడనూ అని మూడు. ఈ మూడు విధములయిన జ్ఞానములే రసమని వీ రంగీకరించుతారు.

"శకుంతలావిషయకమైన ఏరతి ఉన్నదో ఆ రతితో కూడుకొన్న నేను దుష్యంతుడుగా ఉన్నాను" అని సహృదయనిజాత్మలో మానస ప్రథమ బోధ కలుగుతుంది. ఇచటి శకుంతలారతివైశిష్ట్యములో దుష్యంతుడు ధర్మిగా ఉంటాడు. దుష్యంతత్వము ధర్మితావచ్ఛేదకముగా ఉంటుం దన్నమాట. "శకుంతలావిషయకమైన ఏరతి కలదో ఆ రతివిశిష్టుడైన ఏదుష్యంతుడు కలడో ఆదుష్యంతుడు నేనుగా ఉన్నాను" అనిస్వాత్మలో మానసద్వితీయబోధ కలుగుతుంది. ఇందులోని ఈజ్ఞానము అటువంటి దుష్యంతతాదాత్మ్యావగాహిగా ఉంటుంది. "నేను దుష్యంతత్వముతోనూ శకుంతలావిషయకరతితో నున్నూ విశిష్టుడనై ఉన్నాను" అని స్వాత్మలో మానసతృతీయబోధ కలుగుతుంది. ఈ జ్ఞానము తనయందు దుష్యంతత్వమునకూ శకుంతలా విషయకరతికీ వైశిష్ట్యమును ప్రతిపాదించుతుంది. ఇటువంటి ఈ మూడుబోధలలో కూడా తాత్పర్యము ఒకటే. కాని మొదటిదానిలో "అహం దుష్యంతః" అని అహంపదార్థమును ఉద్దేశించి దుష్యంతత్వము విధింపబడుతున్నది. "దుష్యంతః అహ మస్మి" అనే ఆకారము కలిగిన రెండవ జ్ఞానములో దుష్యంతత్వమును ఆధారీకరించుకొని అహంత్వము విధింపబడుతున్నది. మూడవ జ్ఞానములో స్వాత్మయందు రతీ, దుష్యంతత్వమూ రెండూ విధింపబడుతున్న వని గ్రహించాలి.

ఈ మూడుజ్ఞానములలోనూ రతి విశేషణరూపముగా కూడుకొని ఉన్నది. ఆ రతి శబ్దాలచేత ప్రతిపాదింపబడడానికి శక్యము కాదు. కావ్యములో రత్యాదులను చెప్పునట్టి శబ్దాలు ఉండవుగదా! ఇంకా

రత్యాదిబోధను కలుగజేసే వ్యంజనను ఈ మతవాదులు స్వీకరించరు. కాబట్టి నటాదుల చేష్టలు హేతువులుగా విశేషణీభూతమైన రతి జ్ఞానము కొరకు అనుమానమును స్వీకరించాలి. (అనుమానముతో దుష్యంతునియందు శకుంతలాది రతిని సాధించాలి.) తరువాత దోష విశేష మాహాత్మ్యము వలన భేదప్రతీతిని కప్పిపుచ్చుకోవాలి. పిమ్మట అటువంటి రతి కలిగిన దుష్యంతునితోపాటు తనకు ఐకాత్మ్యమును సంపాదించాలి. ఇట్లు సాధించిన తరువాత మానసంగా కలిగే రతివిషయక భేదబోధయే రసమవుతుంది అని పరుల మతము. (రతికే ఆస్వాదము ఉంటుంది కాని వాస్తవముగా రసానికి ఆస్వాదము లేదని వీరి అభిప్రాయము.)

## భట్టలోల్లట మతము

ప్రధానముగా దుష్యంతాదులయిన నాయకులందు ఉన్న రతియే రసము. నాట్యములో కమనీయవిభావాదులను అభినయింపగలిగిన, ప్రదర్శింపగలిగిన, సమర్థుడైన దుష్యంతాదులను అనుకరించునట్టి నటునియందు ఆరోపించుకొని మనము రతిని అనుభవించుతాము. ఈ మతములో కూడా పూర్వమతములో మాదిరిగా రసానుభవము మూడువిధాలుగా ఉంటుంది.

("శకుంతలావిషయకరతి కలిగిన నటుడు దుష్యంతుడు. ఈ నటుడు శకుంతలావిషయకరతిసహితదుష్యంతుడు.) ఈ నటుడు శకుంతలా విషయకరతిసహితుడు, దుష్యంతుడూను అని. ఈ మతానుసారముగా పైనిచెప్పిన బోధలో రెండంశము లున్నవి. ఒకటి నటవిషయకము. వేరొకటి దుష్యంతవిషయకము. నటుడు విశేష్యము: ధర్మి అన్న మాట. ఈ రసబోధ ధర్మి అయిన నటునివిషయములో లౌకికము. ధర్మి నటుడు ప్రత్యక్షముగా ఉపస్థితుడై ఉన్నందువలన రససాక్షాత్కారము లౌకిక మవుతుంది. దుష్యంతుడు ఆరోప్యాంశము. ఆ దుష్యంతపక్షము లో సాక్షాత్కారము అలౌకికము అని గ్రహించాలి.

ఈ మతంలో మొదటగా చేష్టాదులద్వారా దుష్యంతునిలో రతిని అను

మింప చేసికోవాలి. దుష్యంతానుకర్త అయిన నటునియందు అభినయ పాటవము ఉన్నందువలన దుష్యంతారోపము చేయాలి. తరువాత దోషవిశేషమాహాత్మ్యమును అనుసరించి ఏదోవిధముగా తనయందు అటువంటి ఆ నటునితో ఏకాత్మతను సంపాదించాలి. పిమ్మట సహృదయుడు రత్యాదులను ఆస్వాదింపవలసి ఉన్నది. ఇట్టి ఈ రత్యాది పరిణతి రస మవుతుందని గ్రహించాలి.)

## శ్రీ శంకుకమతము

దుష్యంతాదులలో రత్యాదికము ఉన్నది. నటుడు దుష్యంతుడుగా గ్రహింపబడుతున్నాడు. అందువలన నటునిలో ఆ రతి అనుమితము అవుతున్నది. ఇదియే రసము. నటుడు పక్షము. ఆతడు ప్రదర్శించు చేష్టలు హేతువు. ఆ చేష్టలనుబట్టి ఆతనిలో రతిని ఊహింపవచ్చును. అదియే రసము. నాటకాదులలో గోచరములవుతూఉన్న విభావాదులు కృత్రిమములేకాని అవి కృత్రిమములుగా తలపబడవు. నటుడు దుష్యంతుడుగా తలచబడుతున్నాడు. కాబట్టి ఆ విభావాదు లన్నీ స్వాభావికములుగానే గోచరములు అవుతున్నవి.

ఇచట అనుమితి సామగ్రి ఉండడమువలన నటునియందు రత్యనుమితి కలుగవలసి ఉన్నది. నాటకరూపశాబ్దసామగ్రినిబట్టి "దుష్యంతుడు శకుంతలావిషయకరతి కలవాడు" అని శాబ్దబోధకూడా కలుగవలసిఉన్నది. కాబట్టి ఇక్కడ నాటకమువలన "దుష్యంతుడు శకుంతలా-విషయక రతికలవాడు" అని శాబ్దజ్ఞానము కలుగుతుందా? లేక నటపక్ష రత్యనుమితి కలుగుతుందా? జ్ఞానయౌగపద్యము ఉండదుకదా! ... స్పరప్రతిబంధమువలన ఏ జ్ఞానమూకూడా కలుగక ఉ... ప్రతిబంధము లేనపుడు సమూహాలంబనజ్ఞానము కలుగు... శంక.

దీనికి ఇది సమాధానము:—అనుమితిసామగ్రి, శాబ్దసా... ఉన్నపుడు అక్కడ విషయభేదము ఉన్నట్లయితే అను... బలవత్తర మని శాస్త్రకర్తలు నిర్ణయించి ఉన్నార...

కానుమితి మాత్రమే కలుగుతుంది కాని దుష్యంత ధర్మిక శాబ్దబోధ కలుగదు అని శ్రీశంకుకాదుల భావము.

## ఇతర మతములు

విభావానుభావవ్యభిచారిభావాలు మూడూ సమ్మిళితములై రసము అవుత వని కొందరి మతము. ఈ విభావాదులలో ఏది చమత్కారి అవుతుందో అదే రసము. చమత్కారము కలుగజేసేది కాకపోయి నట్లయితే ఈ మూడింటిలో ఏదీ రసముకాదు అని కతిపయవాదము. విశేషముగా భావింపబడు విభావమే రస మని కొందరు, ముహుర్ముహుః చింతనము చేయబడు అనుభావమే రస మని కొందరు, భావాలలో మాటిమాటికీ అనుసంధానము చేయబడు వ్యభిచారిభావమే రసముగా పరిణమించుతుం దని మరికొందరూ చెపుతున్నారు.

రసవిషయములో ఇటువంటి మతభేదములు ఉన్నవి. సాధారణముగా ఈ వాదముల కన్నింటికీ భరతసూత్రము మూలము. "విభావానుభావవ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః" అని భరతసూత్రము. ఈ సూత్రమును పైనిచెప్పిన మతవాదములను అనుసరించి వ్యాఖ్యానము చేయుట సముచితముగా ఉంటుంది. ప్రథమ మతానుసారముగా విభావానుభావ వ్యభిచారులచే-సంయోగాత్ -ధ్వనితమగుటవలన- ఆత్మానందముతో కూడుకొనిన స్థాయిభావ రూప మగు రసముయొక్క నిష్పత్తి కలుగును. వాస్తవరూపముగా ప్రకాశము కలుగును అని అర్థము.

…మతములోనే వేదప్రామాణ్యమును అనుసరించిన వాదానుసార …విభావానుభావవ్యభిచారులద్వారా ధ్వనిత మగుటవలన స్థాయి … కూడుకొనిన ఆత్మానందరూపరసము ప్రకాశించును అని …యమతానుసారముగా విభావానుభావవ్యభిచారిభావముల …్యక్ యోగః - సంయోగః) సమ్యక్ - సాధారణ రూప …గాత్ - భావకత్వ వ్యాపారద్వారముగా భావనచేయుట …రూపమయిన ఉపాధితో కూడుకొనిన సత్వగుణాభి

వృద్ధిచేత ప్రకాశితము చేయబడు తన ఆత్మానందరూపరసానికి నిష్పత్తి కలుగుతుంది. భోగ మనే పేరు కలిగిన సాక్షాత్కారముద్వారా అనుభవము కలుగుతుంది అని అర్థము. మూడవ మతములో - విభావాదుల యొక్క సంయోగాత్ - భావనారూపదోషమువలన, అనిర్వచనీయమైన దుష్యంతాదుల రత్యాదిరూపమయిన రసానికి ఉత్పత్తి కలుగుతుంది అని అర్థము. నాల్గవమతములో విభావాదుల జ్ఞానమువలన జ్ఞానవిశేషరూపరసానికి ఉత్పత్తి కలుగుతుంది అని అర్థము. అయిదవ మతములో విభావాదులయొక్క సంయోగాత్ - సంయోగమువలన రసానికి నిష్పత్తిః - ఉపపత్తి కలుగుతుంది. నటాత్మలందు ఆరోపము కలుగుతుంది అని అర్థము. ఆరవ మతానుసారముగా, కృత్రిమములు అయినప్పటికీ అకృత్రిమంగా గ్రహింపబడిన విభావాదులతో సంయోగాత్ - సంయోగమువలన రసానికి నిష్పత్తిః - అనుమితి కలుగుతుంది. దుష్యంతరూపముగా గ్రహింపబడిన నటుని యందు రసము అనుమితమవుతుంది అని అర్థము. సప్తమమతానుసారముగా విభావాదులయొక్క సంయోగమువలన రసనిష్పత్తిః- రస మనే వ్యవహారము కలుగుతుంది అని భావము. ఎనిమిదవ మతానుసారముగా విభావాదులలో సంయోగాత్ - చమత్కారమువలన రస వ్యవహారము కలుగుతుందని భావము. మిగిలిన మూడు మతాలలోనూ సూత్రార్థము సంగతము కాదు. వానిలో సూత్రవిరోధము పర్యవసితమవుతున్నది. అవి స్వతంత్రమతములు.

విభావానుభావ వ్యభిచారి భావాలలో కేవల విభావము కాని కేవలానుభావము కాని కేవల వ్యభిచారిభావాలు గాని నియతముగా రసవ్యంజనము చేయలేవు. విభావాదులు ఒకే రసానికి నియతములు కావు. అవి రసాంతరములకు కూడా సాధారణములు కావచ్చును. వ్యాఘ్రము భయానక రసానికి విభావము అయినట్లు వీరాద్భుతాలకు రౌద్రానికి కూడా విభావము కావచ్చును. అశ్రుపాతాదులు శృంగార రసానికి అనుభావాలయినట్లు కరుణభయానకాలకు కూడా అనుభావాలు కావచ్చును. చింతాదివ్యభిచారిభావాలు శృంగారరసమునకు వ్యభిచారు

లయినట్లుగా కరుణ వీర భయానక రసాలలో కూడా వ్యభిచారులు కావచ్చును. అందువలననే భరతసూత్రములో విభావానుభావ వ్యభిచారి భావాలు మూడూ సమ్మిళితరూపముగా గ్రహింపబడినవి. కాని వేరువేరుగా గ్రహింపబడలేదు. అందువలన ఈ మూడూ సమ్మిళితములు అయినప్పుడే రసము ధ్వన్యమానమవుతుంది కాని ఏ ఒకదానివలన రసవ్యంజనము కలుగదు అనే అర్థము ప్రమాణిత మవుతున్నది.

ఎక్కడయినా ఒక్కొకచోట అసాధారణరూపముగా గ్రహింపబడిన విభావము రసోద్బోధ కలుగచేస్తున్నది.* అట్లాగే అనుభావము వ్యభిచారిభావము అసాధారణముగా ఉండి రసప్రత్యయము కలుగజేయడము ప్రసిద్ధముగానే ఉన్నది. ఈ విధముగా విభావాదులు ప్రత్యేక ప్రత్యేకముగా రసాభివ్యంజకము లవుతూనే ఉన్నవి. అయినప్పటికీ ఆయాస్థలాలలో ఇతర ద్వయము ఆక్షేపింపబడుతుంది. అసాధారణ విభావము వలననే రసోద్బోధ కలుగుతున్నప్పుడు అనుభావ వ్యభిచారులను, అనుభావము వలన రసోద్బోధ కలుగుతున్నపుడు విభావ వ్యభిచారులను, వ్యభిచారిభావమువలన రసాభివ్యక్తి కలుగుతున్నపుడు విభావానుభావములనూ ఆక్షేప్యములను చేసికొనవచ్చును. అందువలననే మూడింటి యొక్క సమ్మేళనము లేనిదీ రసోద్బోధ కలుగ దని నిశ్చయించాలి.

---

* విభావమే రసవ్యంజక మగుట కుదాహరణము.

వియదలిమలినాంబుగర్భమేఘం, మధుకరకోకిలకూజితైర్దిశాంశ్రీః
ధరణిరభినవాంకురాంకటంకా ప్రణతిపరే దయితే ప్రసీద ముగ్ధే!

దీనిలో నాయిక ధారారూఢమాన. ఏ సమయంలో ప్రసన్నతతో ఉండాలో తెలియదు. నాయకునిమీద కోపంకలిగింది. ముగ్ధ. సఖి వచ్చి ఈ విధముగా కోపము పోగొట్టడానికి బతిమాలుతున్నది. దీని తాత్పర్యమును ఈ విధముగా గ్రహించాలి. అవసరానభిజ్ఞురాలయిన ఓ ముగ్ధా! నీవు ప్రసన్నురాలవు కావలెను. ఇదే ప్రసాదావసరము. ఎందుకంటే ఆకాశము ఇప్పుడు మధుపశ్యామలములయిన జలగర్భ జలదాలతో దంతురితమై ఉన్నది. ఇది చాలా ఉద్దీపకముకదా! దిశాశ్రీ తుమ్మెదల కోకిలల కూజితాలతో శోభాయమానముగా ఉన్నది. ధరణికూడా నవాంకురములనే టంకాలతో (రాళ్లు బద్దలుచేసే సాధనము)వ్యాపించిఉన్నది. అందువలన ఆకాశాన,దిక్కుల, భూమిపైకూడా చూపు ఓపటానికైనా వీలులేకుండా ఉన్నది. ఇంకా ప్రాణధారణకథ ఏమున్నది? "ప్రాణాలుపోయినా సరేకాని నేనుమట్టుకు ప్రియుణ్ణికూడను?" అన

ఈ విధముగా మనీషివరేణ్యులు నానాజాతీయములయిన బుద్ధివిశేషములతో రసమును అనేకరూపాలలో నిర్ణయించినారు. ఇప్పటికీ ఈ విషయములో పరిశీలనము జరుగుతూ ఉన్నది. అయినప్పటికీ రసము ఒక సౌందర్యమయ మగు వస్తువు కావడము వలన పరమాహ్లాదముతో నిత్యసంబద్ధమై ఉండడమువలన పరమానందమయముగా ప్రతీతమవుతున్నది. ఈ విషయములో ఎవరికీ ఏవివాదమూ లేదు.

---

లేమో! అది తగదు, చూడు పాపము! ప్రియుడు ప్రణతి పరుడై ఉన్నాడు ఇట్లా ఈ పద్యములో దయితు డాలంబనవిభావము. ఆ కాలాదులు ఉద్దీపన విభావములు. ఇవే ఉన్నవి. కాని అనుభావ వ్యభిచారులు లేవు. అయినా రసాభివ్యక్తి పుష్కలంగా ఉన్నది. అందువలన విభావమాత్రానికి రసాభివ్యంజకత్వము ఉన్నట్లు కనబడుతున్నది.

అనుభావ నిబంధ నోదాహరణము :

> పరిమృదిత మృణాళీమ్లాన మంగం ప్రవృత్తిః
> కథమపి పరివారప్రార్థనాభిః క్రియాసు
> కలయతిచ హిమాంశో ర్నిష్కలంకస్య లక్ష్మీం
> అభినవ కరిదంతచ్ఛేద కాంతిః కపోలః.

మాలతీమాధవములో మకరందునితో మాధవుడు మాలతిని వర్ణించి చెప్పుతున్నాడు. దీనిభావమును ఈ విధముగా గ్రహించాలి. మాలతి శరీరమంతా అవిరత సంతాపవశాన అంతటా మృదితమృణాలికవలె మ్లానమైనది. దీనివలన వైవర్ణ్య మనే అనుభావము వ్యక్తమవుతున్నది. ఆహారాది సముచిత క్రియలలోకూడా పరివారము ప్రార్థించితేనే ప్రవృత్తి కలుగుతున్నది. స్వతః ప్రవృత్తిలేదు. దీనివలన స్తంభము ప్రళయము అనే అనుభావములు గోచరము లవుతున్నవి. ఇంకా సద్యఃకృత్తదంతి దంతఖండ ధవళమైన గండము (కపోలము) నిష్కలంక హిమకర శోభతో ఒప్పారుతున్నది. దీనివలన వైవర్ణ్యము నిబద్ధమైనట్లు. ఇట్లు ఇక్కడ అనుభావ మాత్ర నిబంధనమువలన గూడా రసాభివ్యక్తి అవికలముగా ఉన్నది. విభావ వ్యభిచారులు లేవు గదా!

వ్యభిచారిమాత్ర వ్యంజ్యకత్వమునకు:—

> దూరా దుత్సుక మాగతే వివలితం సంభాషిణి స్ఫారితం
> సంశ్లిష్యత్యరుణం గృహీతవసనే సంకుంచితభ్రూలతం
> మానిన్యా శ్చరణానతివ్యతికరే బాష్పాంబుపూర్ణం క్షణాత్
> చక్షు ర్జాత మహో! ప్రపంచచతురం జాతాగసి ప్రేయసి॥

దీని భావము. దూరాన ప్రియుడు కనపడగా నాయికానయనము ఉత్సుకమయింది. దగ్గరకు రాగా వలనము కూడుకొన్నది, సంభాషించుతూ ఉంటే విస్ఫా

ఇటువంటి ఈ రసము

> శృంగారః కరుణః శాంతో రౌద్రో వీరోద్భుతస్తథా
> హాస్యో భయానకశ్చైవ బీభత్సశ్చేతి తే నవ॥

శృంగారము కరుణము శాంతము, రౌద్రము వీరము అద్భుతము హాస్యము భయానకము బీభత్సము అని తొమ్మిది విధాలు. భరతముని వచనము ఈ రసవచన సంఖ్యానములో ప్రమాణము.

కొందరు శాంతమును రసముగా అంగీకరింపరు.

> శాంతస్య శమసాధ్యత్వా న్నటేచ తదసంభవాత్
> అష్టా వేవ రసా నాట్యే న శాంత స్తత్ర యుజ్యతే।

శమమును స్థాయిగా చేసికొని శాంతమును సాధింపవలసి ఉన్నది. ప్రాపంచిక వ్యవహారవ్యాపృతుడై ననటునకు ఆ శమము సంభవించదు. కాబట్టి నాట్యములో ఎనిమిదే రసాలు. నాట్యములో శాంతరసము ఉండడానికి అవకాశములేదు అని వారి భావసారాంశము.

శాంతరసములేదు అనే ఈ విషయాన్ని కొందరు క్షమించరు. శాంత రసము ఉండదు అనడంలో నటునిలో శమము లేకపోవడమును హేతువుగా చెప్పడము అసంగతము. నటునిలో రసము అభివ్యక్తమవుతుందని ఎవరూ అంగీకరించడము లేనేలేదు. నటునిలో రసమే ఉండనపుడు శమము ఉండదని చెప్పడము ఏమాత్రమూ సముచితముకాదు. నటుడు

---

రితము. ఆలింగనము చేసికొంటూ ఉంటే అరుణము. నీవీమోచనముచేస్తూ ఉంటే భ్రూలతలు సంకుంచితము లయినట్లుగా అయింది. ఆ నాయిక కోపన. ఆ మానాపనోదనానికి అపరాధముచేసిన ప్రియుడు పాదపతనము చేసినవాడు కాగా క్షణములో నేత్రము బాష్పాంబుపూర్ణ మయింది. ఒకే చక్షువు క్షణక్షణానికి వివిధభావ ప్రపంచచతుర మయినది. దీనిలో ఔత్సుక్యము లజ్జ హర్షము కోపము అసూయ మఱి అనే వ్యభిచారి భావాలు మాత్రము నిబంధింపబడినవి. విభావము కాని అనుభావముకాని లేదు. అయినా రసాభివ్యక్తి కలుగుతున్నది. అందువలన ఇటువంటి స్థలములలో ఇతరములను ఆక్షిప్తములనుగా చేసికోవాల. దీనివలన కష్టకల్పనతో అభివ్యక్తి ఉన్నదే అనుకోనక్కరలేదు. ఇచ్చటి ఆక్షేప మనేది సంభృతసామగ్రి. అందువలన సులువుగానే ఇతర ప్రతీతి కలుగుతుంది. కాబట్టే రసప్రతీతిలో ఏమీ విలంబనము ఉండదు.

"కావ్యదర్పణము"

శాంతుడు కావచ్చుగాక. అశాంతుడు కావచ్చుగాక. సామాజికులకు శమము ఉన్నప్పుడు రసోద్బోధ కలగడములో ఏమీ బాధలేదు. శాంతరసాస్వాదము నిర్బాధముగా కలుగవచ్చును. నటునిలో శమము లేకపోతే శాంతరసాభినయప్రకాశము చేయుట ఉపపన్నము కాదని అనడము కూడా ఉపపన్నముకాదు. నటునిలో భయక్రోధాదులు కూడా లేవు. అయినా భయానకరౌద్రరసాభినయాలను ప్రకాశింప చేస్తూనే ఉన్నాడు. ఆ భావము లేనిదీ ఆ అభినయము కుదరదూ అంటే భయానకరౌద్రాద్యభినయప్రకాశముకూడా అసంగతము కావాలి.

"నటునిలో క్రోధాదులు లేనందువలన వాస్తవకార్యములు అయిన వధబంధాదులఉత్పత్తి అసంభవమయినా కృత్రిమము లయిన వధబంధాదులు శిక్షాభ్యాస పాటవమువలన ఉత్పన్నములు కావడములో ఏమీ అభ్యంతరములేదు" అని అనేటట్లయితే ప్రకృతములో కూడా ఆ విధముగానే అనవచ్చు. శిక్షాపాటవము వలన కృత్రిమశమక్రియలను నటుడు ప్రదర్శింపగలడు. అందువలన శాంతరసాభినయప్రకాశము సూపపన్నము కావచ్చును. నాట్యములో శాంతరసము ఉన్నదని అంగీకరించేవారు నాట్యగీతవాద్యాదులను విరోధులనుగా తలచరు. అవి విరోధులే అయితే ఫలీభూతమైన శాంతరసముయొక్క ఉదయమే లేదుగదా! అవి విరోధులు కావు కాబట్టి విషయనైముఖ్యరూపమైన శాంతము సామాజికులలో ఉద్రేకం పొందవచ్చును. సామాన్యరూపమైన విషయచింతనము శాంతానికి విరోధికాదు. 'ఏవిషయచింతనమైనా విరుద్ధమే, అని అంటే, శాంతరసములో ఆలంబనము అయిన సంసారము యొక్క అనిత్యత్వము, ఉద్దీపనము అయిన పురాణశ్రవణము, సత్సంగము, పవిత్రములయిన వననదీతీర్థాదుల దర్శనమూ మొదలయినవి కూడా విషయములే కాబట్టి విరోధులు కావలసి వస్తుంది.

విరక్తులయినవారు హరిహరగీతములను స్వీకరించుతారు. భజనకీర్తనాదులను ఆచరించుతారు. తదుపయోగివాద్యములను గ్రహించుతారు. అవి వారి విరాగానికి ఉద్దీపకములే కాని విరోధులు కావు. ఆ విధముగానే నాట్యములో శాంతాభినయసమయములో కూర్పబడే గీతవాద్యా

దులు కూడా అంగత్వమునే పొంది ఉద్దీపకములే అవుతవి కాని విరుద్ధములు ఏ మాత్రమూ కావని గ్రహించవచ్చును.

అందువలననే సంగీతరత్నాకరము అంతిమాధ్యాయములో

అష్టావేవ రసా నాట్యే ష్వితి కేచి దచూచుదన్
తదచారు యతః కంచి న్న రసం స్వదతే నటః.

నాట్యములో ఎనిమిదే రసము లున్నవని కొందరనడము ఉచితముకాదు. నటుడు ఏ రసమునుకూడా ఆస్వాదనము చేయడు అని ఈ మొదలయిన గ్రంథముతో నాట్యములో కూడా శాంతరసము ఉన్నదని సిద్ధాంతము చేయబడినది. నాట్యములో శాంతరసము ఉన్నదని అంగీకరింపనివారు కూడా కావ్యములో శాంతరసమును అవశ్యముగా స్వీకరించాలి. అందులో వారి కేమీ బాధకము లేదు. మహాభారతాది ప్రబంధాలు శాంతరసప్రధానకములని సకలసహృదయానుభవసిద్ధము. అందువలననే రాజానక మమ్మటభట్టు కూడా మొదట- "అష్టౌ నాట్యే రసాః స్మృతాః" అని ఉపక్రమించి, "శాంతము కూడా రసమే, అది తొమ్మిదవది" అని అర్థము వచ్చేటట్లు "శాంతోపి నవమో రసః" అని ఉపసంహారము చేసినాడు. అందువలన రసాలు తొమ్మిది. దీనిలో సందేహము లేదు.

## ౬. స్థాయిభావము

వెనుక చెప్పిన శృంగారాదిరసాలకు క్రమముగా,

రతిః శోకశ్చ నిర్వేద క్రోధోత్సాహాశ్చ విస్మయః
హాసో భయం జుగుప్సాచ స్థాయిభావాః క్రమా దమీ.

అన్నట్లుగా రతిశోకనిర్వేదక్రోధోత్సాహ విస్మయ హాసభయ జుగుప్సలు స్థాయిభావాలు. అంటే శృంగారానికి రతి, కరుణానికి శోకము, శాంతానికి నిర్వేదము, రౌద్రానికి క్రోధము, వీరానికి ఉత్సాహము, అద్భుతానికి విస్మయము, హాస్యానికి హాసము, భయానకరసానికి భయము, బీభత్సమునకు జుగుప్స స్థాయిభావాలు.

రసాలకంటె స్థాయిభావాలకు ఈ చెప్పబోవు భేదమును ఊహించాలి. ఘటాదులకూ ఘటాదులలోఉండే ఆకాశానికీ ఏ భేదముఉన్నదో అటు వంటి భేదమును మమ్మటాభినవగుప్తుల మతములలో, భట్టనాయకమతము లోనూ (ప్రథమ ద్వితీయమతాలలో) గ్రహించాలి. మూడవది అయిన నవ్యమతములో సత్యరజతముకంటె అనిర్వాచనీయరజతానికి ఉన్న భేద మును గ్రహించాలి. నాల్గవది అయిన పరమతములో జ్ఞానముకన్న విష యము అనబడే జ్ఞానగమ్యపదార్థానికి ఉన్న భేదాన్ని గ్రహించాలి. మొత్తముమీద రసాత్మకు రత్యాదులు విషయములుగా ఉన్నవని గ్రహించవచ్చును.

ఈ రత్యాదిభావాలు కావ్యాదులలో సమాప్తిపర్యంతము స్థిరముగా ఉండేవి అగుటవలన స్థాయిభావములు అనబడుతున్నవి. స్థాయిభావవిష యములో ఈ విధముగా శంకించవచ్చును. "ఈ రత్యాది భావాలు కూడా చిత్తవృత్తిరూపములే. కాబట్టి తత్కాలము నశించిపోవు పదా ర్థాలతో సమానములు. ఇటువంటి వీటియందు స్థిరత్వము దుర్లభము. ఇట్టివి ఏ విధంగా స్థిరములు కాగలుగుతవి? వాసనారూపముగా ఉండ డమే స్థిరత్వముఅని అనేటట్లయితే నిర్వేదాది వ్యభిచారిభావాలుకూడా మన అంతఃకరణములో వాసనా(సంస్కార)రూపముగా ఉండేవే కాబట్టి స్థాయిభావాలే కావలసివస్తుంది'' అని.

ఈ చెప్పబోయేది సమాధానము. వాసనారూపము లయిన ఈ భావా లకు మాటిమాటికి అభివ్యక్తికలగడమే స్థిరపదార్థముగా చెప్పబడు తున్నది. వ్యభిచారిభావాలకు ఈ ముహుర్ముహురభివ్యక్తి ఉండదు. వాని అభివ్యక్తి మెరుపుమెరుము వంటిది. కాబట్టి అవి అస్థిరాలు. అందువలన స్థాయులుకావు.

> విరుద్ధై రవిరుద్ధైర్వా భావై ర్విచ్ఛిద్యతే న యః
> ఆత్మభావం నయ త్యాశు స స్థాయీ లవణాకరః
> చిరం చిత్తేఽవతిష్ఠంతే సంబధ్యంతేఽనుబంధిభిః
> రసత్వం యే ప్రపద్యంతే ప్రసిద్ధాః స్థాయినోఽత్ర తే

సజాతీయ విజాతీయై రతిరస్కృతమూర్తిమాన్
యావద్రసం వర్తమానః స్థాయిభావ ఉదాహృతః.

ఏభావము విరుద్ధభావాలచే గాని అవిరుద్ధభావాలచే గాని విచ్ఛేదము పొందదో, విరుద్ధభావాలకు కూడా శీఘ్రముగా స్వస్వభావమును సంపాదించి పరిణామమును కలుగజేస్తుందో దానికి స్థాయి అనిపేరు. అది లవణాకరముతో సమానము. సముద్రము తనలో ప్రవేశించే ప్రవాహములకు అన్నిటికీ ఆత్మభావాన్ని సంపాదించుతుంది. అన్నిటిని తనలో ఇముడ్చుకొంటుంది. ఆ విధముగానే స్థాయిభావము తనతో కూడుకొనిన సర్వభావాల కూతన రూపమును సంపాదించి తనలో విలీనములనుగా చేసికొంటుంది. అవి అన్నీ తద్రూపము లవుత వన్నమాట.

ఏ భావాలు చిరకాలము చిత్తములో నివాసము పొందుతవో, విభావాదులతో (అనుబంధులతో) సంబద్ధములు అవుతవో, రసరూపమును పొందుతవో, అవి సాహిత్యశాస్త్రములో స్థాయిభావాలని ప్రసిద్ధిని పొందుతున్నవి. వ్యభిచారిభావాలు చిరకాలము చిత్తములో నివాసము పొందవు. ఏ భావముయొక్క స్వరూపము సజాతీయభావాలచే గాని విజాతీయభావాలచేగాని తిరస్కారము పొందదో, రసాస్వాదనపర్యంతము ఉంటుందో అది స్థాయిభావ మని చెప్పబడుతున్నది అని ప్రాచీనులు స్థాయిభావస్వరూపమును నిర్వచిస్తున్నారు.

రత్యాది నవభావాలలో ఏదో ఒకటికావడమే స్థాయిభావస్వరూపమని కొందరంటున్నారు. అది ఉచితముకాదు. రత్యాదిభావాలలో ఏదోఒక భావము బాగాపరిపోషము పొంది ప్రరూఢమైనపుడు, పరిపోషము పొందకుండా ఉన్న ఇతర భావము వ్యభిచారి భావమే అవుతుం దని ఆలంకారికులు అంగీకరించుతున్నారు. అనేక విభావాదులవలన ఉత్పన్నమైనప్పుడు ప్రరూఢమైనదనీ, స్వల్ప విభావాదులవలనఉత్పన్నమైనపుడు అప్రరూఢమైనదనీ వ్యభిచారిఅనీ గ్రహించాలి. ఈ విషయమే సంగీతరత్నాకరములో ఈ విధముగా చెప్పబడింది.

రత్యాదయః స్థాయిభావాః స్యు ర్భూయిష్ఠ విభావజాః
స్తోకై ర్విభావై రుత్పన్నా స్త ఏవ వ్యభిచారిణః॥

అనేకవిభావములవలన ఉత్పత్తిని పొందిన రత్యాదులు స్థాయిభావములు అగును. అల్పవిభావసముత్పన్నము లయిన రత్యాదులు వ్యభిచారు లగును అని. వీరము ప్రధానమైనపుడు క్రోధమూ, రౌద్రము ప్రధానమైనపుడు ఉత్సాహమూ, శృంగారము ప్రధానమయినపుడు హాస్యమూ వ్యభిచారులు అవుతవి. ఆయా రసాలలో ఆయా భావాలు ఉండడము అవసరము. అవి లేకపోయినట్లయితే ఆయా రసాలు సరిగా సిద్ధములుకావు. అందువలననే వ్యభిచారులు నాంతరీయకములు. ప్రధాన రసాన్ని పరిపోషింప చేయడానికి అంగభూతములయిన క్రోధాది భావాలుకూడా బహువిభావముల వలన అభివ్యక్తములు చేయబడినపుడు రసాలంకారములు అవుతవి.

## స్థాయి భావ లక్షణాలు

స్త్రీపురుషయో రన్యోన్యాలంబనః ప్రేమాఖ్యశ్చిత్తవృత్తివిశేషో రతిః స్థాయిభావః

స్త్రీపురుషులలో పరస్పరావలంబనము కలిగిన ప్రేమ అనబడే చిత్తవృత్తివిశేషానికి రతిస్థాయిభావము అని పేరు. ఈ ప్రేమ గురుదేవ పుత్త్రాదులను అవలంబనముగా చేసికొని ఉత్పన్న మయినట్లయితే వ్యభిచారిభావ మవుతున్నది.

పుత్త్రాదివియోగ మరణాది జన్మా వైక్లవ్యాఖ్య శ్చిత్తవృత్తివిశేషః శోకః

పుత్త్రాదుల వియోగమువలనగాని మరణాదులవలన గాని ఉత్పన్నమయినట్టి చిత్తవృత్తి శోక మవుతుంది. దీనికే వైక్లవ్యము అని పేరు. స్త్రీపురుషుల వియోగములో ప్రేమపాత్రమైన వ్యక్తి జీవించి ఉన్నట్లు జ్ఞానము ఉంటే అప్పటి వైక్లవ్యముచేత రతిభావమే పోషింపబడుతుంది. కాబట్టి రతియే ప్రధానమవుతుంది. ప్రేమపాత్రమైన వ్యక్తి చనిపోయినట్లు జ్ఞానము ఉన్నప్పుడు వ్యాకులత ప్రధానమవుతుంది. రతి అప్రధానమవుతుంది. రతిచేత వైక్లవ్యము పోషింపబడుతుంది. కాబట్టి అది కరుణరసమే అని గ్రహించాలి. ప్రేమపాత్రమైన వ్యక్తి మరణించింది అనే జ్ఞాన మున్నప్పటికీ దేవతా ప్రసాదాదులవలన ఏదో విధంగా మళ్లా జీవింపవచ్చును అనే జ్ఞానము ఉన్నప్పుడు ప్రేమాలంబనమయిన వ్యక్తికి

ఆత్యంతికనాశము లేదు కాబట్టి దీర్ఘకాలపరదేశనివాసము మాదిరిగా విప్రలంభశృంగారమే అవుతుంది గాని అది కరుణము కాదు. * బాణుని కాదంబరీ గ్రంథంలో చంద్రాపీడునితో చెపుతూ ఉన్న మహాశ్వేతా వాక్యాలలో విప్రలంభశృంగారమే కాని కరుణము కాదని స్పష్టము. కొందరీ విషయంలో 'కరుణవిప్రలంభము' అనే రసాంతరమును అంగీకరించుతున్నారు. ఇదివరకు చెప్పినవిధంగా కుదురుతున్నపుడు దీనిని వేరొక రసాంతరంగా అంగీకరించవలసిన ఆవశ్యకత లేదు.

---

* మహాశ్వేత గంధర్వపుత్రిక. మహాముని శ్వేతకేతువు కుమారు డయిన పుండరీకుని ప్రేమించినది. పుండరీకుని స్నేహితుడు కపింజలుడు. మహాశ్వేతకు పుండరీకావస్థను చెప్పి వెళ్లినాడు. మహాశ్వేత పండువెన్నెలలో పుండరీకాభిసారిక అయింది. ఇంతలో పుండరీకుడు గతాసువు అయినాడు. మహాశ్వేత శోకసాగరములో మునిగిపోయింది. చంద్రమండల వినిర్గత మహాపురుషుడు పుండరీక శరీరమును తీసికొనిపోతూ మహాశ్వేతను ఓదార్చినాడు. అప్పటినుండి మహాశ్వేత వ్రతదీక్షను పట్టింది. మహాప్రభువు తారాపీడుని కుమారుడు చంద్రాపీడుడు మృగయావినోది అయి దారితప్పి మహాశ్వేతాగుహానికేతనమునకు రాగా మహాశ్వేత తన చరిత్రనంతా విశదంగా చెప్పి విలపించింది. చంద్రాపీడుని గురించిన మహాశ్వేత వాక్యాలలో కరుణము కాదు. విప్రలంభ శృంగారమే.

♦ శృంగారప్రకాశ మనే గ్రంథంలో భోజదేవుడు:

"ప్రరూఢ స్నేహయో రేకవినిపాతే అన్యస్య దుఃఖాతిరేకః హృదయదారుణః కరుణవిప్రలంభః ॥"

"ప్రేమపరిపాకం కలిగిన నాయికా నాయకులలో ఒకవ్యక్తి మరణించితే ఇతర వ్యక్తికి కలుగునట్టి హృదయదారుణ మయిన దుఃఖాతిరేకము కరుణవిప్రలంభ మవుతుంది" అని అంటున్నాడు.

"తయోరేవాదృష్టవిశేషాదిసంపదా తదున్మజ్జనజన్మా
మనః ప్రమోదాతిశయః విశేషవాన్ కరుణానంతరః సంభోగః"

ఆ వ్యక్తులకే అదృష్ట విశేషాదిసంపదచేత అనురాగోన్మజ్జనమువలన కలిగిన మనః ప్రమోదాతిశయము కరుణానంతరసంభోగము అనబడుతుంది. అని ఆ స్థలంలోనే నిరూపించుతున్నాడు. భోజుడు కరుణవిప్రలంభమును రసాంతరముగా పరిగణించకపోయినా ఈ భావాన్ని గ్రహించిన విశ్వనాథుడు తన సాహిత్యదర్పణములో – కరుణవిప్రలంభము రసాంతరము–అని తలచినట్లు స్పష్టమవుతున్నది.

"యూనో రేకతరస్మిన్ గతవతి లోకాంతరం పునర్లభ్యే
విమనాయతే యదైకస్తదా రసః స్యాత్కరుణవిప్రలంభాఖ్యః"

నిత్యానిత్యవస్తువిచారజన్మా విషయవిరాగాఖ్యో నిర్వేదః

నిత్యానిత్య వస్తువులయొక్క విచారణవలన కలుగునట్టి విషయవిరాగము నిర్వేదము అనబడును. గృహకలహామువలన కలిగిన నిర్వేదము వ్యభిచారి భావమే కాని స్థాయికాదు.

గురుబంధువధాది పరమాపరాధజన్మా ప్రజ్వలనాఖ్యః క్రోధః

గురుబంధువధాదులవలన క్రోధము కలుగును. దీనికి ప్రజ్వాలనమని పేరు. ఈ క్రోధము శత్రువినాశాదులలో హేతువుగా ఉంటుంది. క్షుద్రాపరాధమువలన కలిగిన క్రోధమైతే దుర్భాషలు కలుగుతవి. మానము ఉంటుంది. ఇదే అమర్ష అనే వ్యభిచారిభావ మవుతున్నది. క్రోధామర్షాలకు ఈ భేదమును ఊహించాలి.

పరపరాక్రమదానాది స్మృతిజన్మా ఔన్నత్యాఖ్య ఉత్సాహః

ఉత్సాహము శత్రుపరాక్రమ స్ఫురణము వలన ఇతరులదానాది శ్రవణమువలన కలుగుతుంది. దీనికి ఆశ్చర్య మని పేరు.

వాగంగాదివికారదర్శనజన్మా వికాసాఖ్యో హాసః

భాషావేషచేష్టాదులవలన వికాసము అనేపేరు కలిగిన హాసము కలుగుతుంది.

---

యువతీయువకులలో యువతికాని యువకుడుకాని లోకాంతరము పొందినట్లయితే, చనిపోయిన తర్వాత మళ్లీ పొందటానికి శక్యమయితే (ఆ శరీరముతోనే తిరిగి సంప్రాప్త మయితే అన్న మాట) తదితర వ్యక్తి విమనస్కతతో విలపించుచున్నపుడు కరుణవిప్రలంభమనే రసమవుతుంది'' అని. కరుణరసము శోకస్థాయికము. విప్రలంభము రతిస్థాయికము. ఈ రతి మరల సమాగమానికి హేతు వవుతుం దనే భావముతో ఆతడే,

> ''శోకస్థాయితయా భిన్నో విప్రలంభా దయం రసః
> విప్రలంభే రతిః స్థాయీ పునః సంభోగహేతుకః॥''

అని అంటున్నాడు. కరుణ విప్రలంభానికి:— కాదంబర్యాం పుండరీకమహాశ్వేతావృత్తాంతే - ఉదాహరణమును దర్శించ మని కూడా విశ్వనాథుడు అంటున్నాడు.

**వ్యాఘ్రదర్శనాది జన్మా పరమానర్థవిషయకో వైక్లవ్యాఖ్యః స భయం**

వ్యాఘ్రాదిదర్శనమువలన భయము కలుగుతుంది. ఈ భయము ప్రబలానర్థ విషయకముగా ఉంటుంది. వ్యాకులత్వము అని దీనికి పేరు. ఈ వ్యాకులత్వము పరమానర్థ విషయకము కాకపోయినపుడు త్రాస మనే వ్యభిచారిభావ మవుతున్నది. కొందరు ఉత్పాతములను కలుగ జేసే వానిద్వారా వ్యాకులత్వము కలిగినప్పుడు త్రాసమనీ, తన అప రాధము ద్వారా కలిగిన వ్యాకులతానికి భయమనీ భయత్రాసము లకు భేదమును చెప్పుతున్నారు.

కదర్యవస్తువిలోకనజన్మా విచికిత్సాఖ్యః చిత్తవృత్తివిశేషో జుగుప్సా

ఘృణితములయిన వస్తువులను చూచినప్పుడు విచికిత్సానామకమయిన చిత్తవృత్తి కలుగుతుంది. అదియే జుగుప్స. దీనికే విచికిత్స అని పేరన్న మాట.

## ౭. రసధ్వని

ఈవిధముగా ఈ స్థాయిభావాలను ఆయా నాయకులలో ప్రపంచము నందు మనము చూస్తూనే ఉన్నాము. ఆయా స్థానాలలో ఈ చిత్త వృత్తులకు ఆలంబనములుగా గాని ఉద్దీపనములుగా గాని ఉండే కారణ ములుగా ప్రసిద్ధ వ్యవహారమును పొందుతూ ఉన్నట్టివి కావ్యనాట్యా లలో స్థాయిభావాలను అభివ్యక్తము చేసినపుడు "విభావములు" అని అనబడుతున్నవి. "విభావయంతీతి విభావాః" అని విభావపదవ్యుత్పత్తి. విశేషముగా రత్యాదిస్థాయిభావాలను భావింపచేసేవి కాబట్టి విభావ ములు అని అర్థము. ఈ స్థాయిభావాలవలన రోమాంచాది కార్య ములు కలుగుతున్నవి ఆ కార్యములు కావ్యనాట్యాలలో అనుభావాలని పిలువబడుతున్నవి. ("అను - పశ్చాత్, భావః - ఉత్పత్తిర్యేషాం" "అనుభావయంతీతి వా") అని అనుభావ పదవ్యుత్పత్తి. స్థాయిభావానికి అనంతరము ఇవి పుట్టుటవలన, వానిని అనుభవింపచేయుటవలన అనుభావపదము సార్థకము. స్థాయిభావములతో పాటు సంచరించునట్టి చిత్తవృత్తులు లోకములో సహకారులు లవుతున్నవి. అట్టి ఆ చింతాది

చిత్తభావాలు కావ్యనాట్యాలలో వ్యభిచారిపదముతో వ్యవహరింపబడుతున్నవి. "విశేషేణ అభితః చరంతీతి" అని వ్యభిచారిపదవ్యుత్పత్తి. అంతటా ఇవి ఉన్మగ్ననిమగ్నము లవుతూ సంచరించుతూ ఉంటవన్నమాట.

శృంగారరసానికి స్త్రీ పురుషులు ఆలంబన విభావములు. చంద్రిక, వసంతర్తువు, నానావిధోద్యానములు, పవనాంకురములు, రహఃస్థానము మొదలయినవి ఉద్దీపనవిభావములు. ప్రియాముఖావలోకనము, ప్రియాగుణశ్రవణము, కీర్తనము మొదలయినవిన్నీ, కంపము మొదలయిన సాత్త్వికభావాలున్నూ అనుభావములు. స్మృతి చింత మొదలయినవి వ్యభిచారిభావాలు.

కరుణరసానికి బంధునాశాదులు ఆలంబనవిభావములు. ఆ బంధువులకు సంబంధించిన గృహాతురగభూషణవసనాదుల దర్శనము మొదలయినవిన్నీ వారి కథాశ్రవణాదులున్నూ ఉద్దీపనవిభావములు. శరీరపాతము, అశ్రుపాతము మొదలయినవి అనుభావాలు. గ్లాని, క్షయము మోహము విషాదము చింత ఔత్సుక్యము దీనత జడత ఇత్యాదులు వ్యభిచారులు.

శాంతరసానికి అనిత్యముగా తెలియబడిన ఈ ప్రపంచము ఆలంబనము. వేదాంతశ్రవణము-తపోవనగమనము - తాపసదర్శనము మొదలయినవి ఉద్దీపనవిభావములు. ఆ యా పదార్థాలయందు అరుచి, శత్రుమిత్రాదులందు ఉదాసీనభావము, నిశ్చేష్టత్వము, నాసాగ్రదృష్టి మొదలయినవి అనుభావాలు. హర్షోన్మాద స్మృతిమత్యాదులు వ్యభిచారులు.

రౌద్రరసానికి అపరాధముచేసిన పురుషాదులు ఆలంబన విభావములు. వారొనర్చిన అపరాధాదులు ఉద్దీపనవిభావములు. వధబంధాదులు ఫలముగా కల్గిన కన్నెఱ్ఱచేయుట, పండ్లుకొఱుకుట, పరుషము భాషించుట, శస్త్రము గ్రహించుట, మొదలయినవి అనుభావాలు. అమర్షము వేగము ఉగ్రత చాపలము మొదలయినవి వ్యభిచారిభావాలు.

ఈ విధముగా ఏ యే చిత్తవృత్తికి ఏదియేది విషయముగా ఉంటుందో

అది దానికి ఆలంబనవిభావము అవుతుంది. నిమిత్తములుగా ఉండేవి ఉద్దీపనవిభావములు అవుతవని గ్రహించాలి.

## శృంగారభేదములు

ఈ రసాలలో శృంగారము ద్వివిధము. సంయోగశృంగారము. విప్రలంభశృంగారము అని. ప్రేమ అనబడే రతి స్త్రీ పురుషుల సంయోగ. సమయములో కూడుకొనినది అయితే సంయోగశృంగారము అవుతుంది. వియోగసమయములో కూడుకొనినది అయితే విప్రలంభ శృంగారము అవుతుంది. దంపతుల సంయోగము అంటే ఒక స్థానములో ఉండడము కాదు. నాయికా నాయకులు ఒక శయ్యపై శయనించిన వారయినా ఈర్ష్యాదులు ఉన్నట్లయితే విప్రలంభమే వర్ణింపబడుతున్నది. ఈ విధముగానే వియోగము అంటే నాయికా నాయకులు విడివిడిగా ఉండడమూ కాదు. పైని చెప్పిన దోషము ఇక్కడకూడా కలుగుతుంది. వారు విడివిడిగా ఉన్నా ఈర్ష్యాదులు లేకపోయినట్లయితే సంభోగమే వర్ణింపబడుతున్నది. కాబట్టి సంయోగ వియోగములనే ఈ రెండూ అంతఃకరణవృత్తివిశేషాలు. "నేను ప్రియవ్యక్తితో కూడుకొని ఉన్నాను" అనే అభిప్రాయము ఉంటే సంయోగము, "నేను ప్రియవ్యక్తితో వియోగము పొంది ఉన్నాను" అనే అభిప్రాయము ఉంటే వియోగము అని గ్రహించాలి. సంయోగశృంగారానికి ఇది వరలో ఉదాహరించిన "శయితా సవిధేఽప్యనీశ్వరా" అనే పద్యమును సమన్వయించుకోవాలి.

చిత్రమీమాంసలో,

> వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
> జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ.

"శబ్దార్థములవలె నిత్యమూ కూడుకొన్నట్టి ప్రపంచానికి తల్లిదండ్రులయిన పార్వతీ పరమేశ్వరులను శబ్దార్థముల విజ్ఞానము కొరకై నమస్కరించెదను" అను అర్థము కలిగిన కాళిదాసీయ రఘువంశ శ్లోకములో రసధ్వని ఉన్నదని అప్పయ్యదీక్షితుడు తెలుస్తున్నాడు. ఉమామహేశ్వరులు వాగర్థములవలె నిత్యసంబంధము కలవారని దీనిలో వర్ణిం

బడుటవలన పార్వతీపరమేశ్వరుల యొక్క నిరతిశయ పరస్పరప్రేమ శాలిత్వము మహామహిమత్వము మొదలయినవి వ్యంగ్యము లవుతున్న వని దీక్షితాశయము.

ధ్వనిమార్గము సరిగా తెలియకపోవుటవలన దీక్షితుడు ఈ విధముగా అనవలసి వచ్చింది. ఈ శ్లోకములో పార్వతీపరమేశ్వరులను విషయముగా చేసికొన్న కవిరతి ప్రధానము. ఆ పార్వతీపరమేశ్వరుల పారస్పరికప్రేమ కవిరతికన్న అప్రధానము. కవిరతిలో అది గుణీభావము పొందుతున్నది. అందువలన గుణీభూతమైన రత్యాదికమునకు రసధ్వనిత్వము చెప్పుట సముచితము కాదు. కాబట్టి భావధ్వని అనాలి. రసధ్వని అనరాదు. ("భిన్నో రసాద్యలంకారా దలంకార్యతయా స్థితః") అని ఆలంకారికసిద్ధాంతము. అసంలక్ష్య క్రమవ్యంగ్యము రసవదాద్యలంకారాలకంటె భిన్నము. అలంకారాదులచేత రసభావధ్వని అలంకరింపబడుతుంది. అందువలన అలంకార్యము.

విప్రలంభ శృంగారోదాహరణము:

హా చో మాంగలికీః ప్రయాణసమయే జల్పత్యనల్పం జనే
కేళీమందిరమారుతాయనముఖే విన్యస్త వక్త్రాంబుజా
నిశ్వాసగ్లపితాధరోపరి పతద్బాష్పార్ద్రవక్షోరుహా
బాలా లోలవిలోచనా శివ శివ ప్రాణేశ మాలోకతే. *

---

* అవసర కార్యనిర్వాహానికి దూరదేశము ప్రయాణించుతూ ఉన్న నాయకుని ప్రయాణసమయంలో ప్రజ లందరూ మంగళవాక్యాలు పల్కుతున్నారు. వారు చేసే అనేకవిధములయిన మంగళాశంసనములు ఆతని సుభగత్వ సౌకుమార్యములను విశదము చేస్తున్నవి. నాయిక ముద్దరాలు. పల్లెత్తి ఎదురాడలేదు. ప్రయాణము వద్దు అనలేదు. ఎడబాటు సహించలేని ఆ నూతనవధువు ఆతనిమీదనే ప్రాణాలను నిలబెట్టుకుని ఉన్నది. ఏ ప్రదేశాన ఆతని సంబంధము పొంది దుఃఖాలను విడిచి ప్రపంచమును మరచిపోయినదో ఆ కేళీమందిరమును కలయచూచి వివశురాలయింది. ఆ ప్రదేశస్థితి తనకు దుర్భరము కాగా కిటికీలో కూర్చొని శూన్యభావన చేస్తున్నది. భావివిరహవిధురత్వము ఆమెను అవశురాలినిగా చేసింది. ఉబికిన హృదయములోనుండి నిట్టూర్పులు వేడిగా వెలువడి వచ్చినవి. పండువంటి మధురాధర పల్లవము నిట్టూర్పుల తాకుడువలన వాడిపోయింది. కన్నీళ్లు కపోలాలపై చారలు కట్టి ధారలుగా వచ్చి సుకుమారాధరతాడనము చేసి ఉబ్బెత్తు హృదయాన వక్షోజాలను

ఒకసఖి ఒకనవోఢను గురించి తన చెలితో చెప్పుతున్నది. ప్రియుని ప్రయాణసమయమందు జనులు అధికముగా మాంగళిక వచనములను పలుకుతూ ఉండగా ఆ చంచలనయన రతిమందిరగవాక్షముఖములో తన ముఖకమలమును ఉంచుకొని ఉన్నది. అత్యంతనిశ్వాసాల వలన వాడిపోయిన ఆమె అధరముమీద అశ్రువులు జారుతున్నవి. కన్నీటితో కుచములు తడిసినవి. శివ! శివ! ఈ దశను పొందిన ఆబాల తన ప్రాణనాథుని చూస్తూ ఉన్నది. ఆ ముగ్ధకు ప్రయాణసమయములో అశ్రువులు విడువరాదని తెలియదు అది అపశకునమని ఆమె అనుకోదు.

ఈ పద్యములో నాయికాప్రేమపాత్రుడయిన నాయకుడు ఆలంబన విభావము. నిశ్వాసము, అశ్రుపాతము మొదలయినవి అనుభావాలు. విషాదము, చింత, ఆవేగము మొదలయినవి వ్యభిచారి భావాలు. వీని సంయోగమువలన నాయికారతి అభివ్యక్తమవుతున్నది. ఈరతి వియోగకాలీనము అగుటవలన విప్రలంభమని వ్యపదేశింపబడుతున్నది.

మరి ఒక ఉదాహరణము:

> ఆవిర్భూతా యదవధి మధుస్యందినీ నందసూనోః
> కాంతిః కాచిన్నిఖిలనయనాకర్షణే కార్మణజ్ఞా
> శ్వాసో దీర్ఘస్తదవధి ముఖే పాండిమా గండయుగ్మే
> శూన్యా వృత్తిః కులమృగదృశాం చేతసి ప్రాదురాసీత్

మధువును స్యందింపచేయునట్టిన్ని, నిఖిలమానవనయనాలను ఆకర్షించుటలో మంత్రతంత్రాదులను తెలిసినట్టిన్ని, నందనందనుని అనిర్వచనీయమైన కాంతి ఎపుడు ఆవిర్భవించిందో అప్పటినుండీ కులాంగనల ముఖాలలో శ్వాసము దీర్ఘమయినది. కపోలములలో పాండిమ కలిగింది. చిత్తములో శూన్యవృత్తి ఉత్పన్నమైంది.*

---

తడిసినవి. ఆ నాయిక నాయకుడు ఇటు వెళ్లుతాడో అటు వెళ్లుతాడో అని ఆలోచన లోచనలోల అయినది. పాపము, ఆ కన్య హృదయము ఎంతగా వంత పొందుతున్నదో! శివ! శివ! శివ!

* నందనందనుడు చూచినాడంటే అందరి కన్నులూ ఆటువైపే ఆకర్షింపబడుతవి, కులయువతుల చిత్తాలలోకూడా శూన్యవృత్తి కల్గుతుంది. ఆయన నీలకాంతి

ఇంకొక ఉదాహరణము:

> నయనాంచలావమర్శం యా న కదాచిత్పురా సేహే
> ఆలింగితాపి జోషం తస్థౌ సా గంతుకేన దయితేన

ఏ నాయిక ఒకప్పుడైనా నేత్రాంచలములు కలసికొనుటకు కూడా సహింపలేదో ఆమె ఈ వియోగసమయంలో పరదేశము వెళ్లబోవు ప్రియునిచే గాఢముగా ఆలింగింపబడి కూడా ఏమీ అనలేదు. ఊరకనే ఉన్నది.

ఈ పద్యములో స్వాభావికమైన చంచలత్వముయొక్క నివృత్తి అను భావము. జడత్వము వ్యభిచారి. ఈ విప్రలంభశృంగారమును ప్రాచీనులు అయిదు విధాలుగా తలుస్తున్నారు. ప్రవాసము - అభిలాష - విరహము - ఈర్ష్య - శాపము* అని. ఆ పంచవిధవిప్రలంభాలలో విశే

తేనెవాక పదుచులు అందరూ అతని కాంక్షించుతారు. అది కారణంగా దీర్ఘదీర్ఘ శ్వాసములు బయలుదేరుతవి. విరహభావన అధికమవుతుంది. కపోలాదులు తెల్లబడుతవి. ఆతడు మహామోహమంత్రము. బయటనుండి హృదయాల ప్రవేశించుతాడు. కులాంగనలనుకూడా వెతబెట్టడానికి ఎటువంటి సామర్థ్యము కావాలో అది అంతా ఆ నందసూను కాంతిలో కూడుకున్నది.

నాయిక ముద్దరాలు. ఇదివరలో నాయకుడు సానురాగంగా ప్రణయదృక్కులను ప్రసరింపజేస్తే ఒకప్పుడైనా సహించేది కాదు, తృష్ణతో కూడుకున్న ఆమె చూపులు గ్రుచ్చుకొన్నట్లు ఉండేవి. ఇపుడు ప్రియుడు ప్రవాసింపబోతున్నాడు. మళ్లా ఎన్నాళ్లకు వస్తాడో. మళ్లా తాను అతని సంబంధసుఖమును ఎప్పుడు పొందగల్గుతుందో! అందువలన ఆమె గట్టిగా కౌగలించుకొన్నప్పటికి ఏమీ అనడములేదు. తనచురుకుదనమును విడిచి ఆలింగనానందపారవశ్యమును అనుభవించుతూ కదలకుండా ఉన్నది.

* ౧. ప్రవాసము:

> ప్రస్థానం వలయైః కృతం ప్రియసఖై రస్రై రజస్రం గతం
> ధృత్యా న క్షణమాసితం వ్యవసితం చిత్తేన గంతుం పురః
> యాతుం నిశ్చితచేతసి ప్రియతమే సర్వైః సమం ప్రస్థితం
> గంతవ్యే సతి జీవిత ప్రియ! సుహృత్సార్థః కిముత్సృజ్యతే?

నాయకుడు ప్రయాణోన్ముఖు డయినాడు. నాయిక దిగులుతో చిక్కిపోయింది. ఆమెకు జీవితంమీద నిరాశ పుట్టింది. ఇట్లా సోపాలంభంగా పలుకుతున్నది. ఓ జీవితమా! ప్రియతముడు ప్రస్థానించా లని మనస్సులో మాత్రం అను

షము అంతగా ఉపలబ్ధము కానడములేదు. అందువలన మేము ఇక్కడ విస్తరించలేదు సామాన్యముగా అవి అన్నీ సమానముగా ఉన్నవి.

---

కున్నాడు. ఇంతట్లోనే కంకణాలు ప్రయాణించినవి. జీవిత ప్రియసఖము లయిన అశ్రువులుకూడా జీవితంతోపాటు ప్రయాణం చేసినవి. స్నేహధర్మం అటువంటిదే కదా! ధైర్యం క్షణమైనా ఉండలేదు. చిత్తము ముందుగానే వెళ్లాలని నిశ్చయించుకున్నది. ఈ విధంగా అందరూ వెళ్లుతూఉంటే నీవుకూడా వెళ్లవలసి ఉన్నది కదా! నీ సుహృద్వర్గ మంతా ఇట్టి నిశ్చయంతో ఉంటే వారిని నీవు అనుసరించడముయుక్తము. ప్రియసుహృత్సమూహము ను నీవు ఎందువలన విడిచిపెడుతున్నావు? నీవు ఒంటరిగా వెళ్లుదా మనుకొన్నావా! అది యుక్తము కాదు.

౨. అభిలాష :

ప్రేమార్ద్రాః ప్రణయస్పృశః పరిచయా దుద్గాఢరాగోదయాః
తా స్తా ముగ్ధదృశో నిసర్గమధురా శ్చేష్టా భవేయు ర్మయి
యా స్వంతః కరణస్య బాహ్యకరణవ్యాపారరోధ క్షణాత్.
ఆశంసా పరికల్పితాస్వపి భవంత్యానందసాంద్రో లయః.

మాలతీమాధవంలో మాలతీభావన చేస్తూ ఉన్న మాధవుని వచనము. ఆ ముగ్ధనయన మాలతియొక్క ఆ యా కటాక్షరూపము లయిన, నే నిదివరలో అనుభవించిన చేష్టలు నాపై ప్రసరింమనా? ఆ చేష్టలు స్వభావ మనోహరములు ప్రేమార్ద్రములు. ప్రేమవశీకృతిస్పృష్టి కలవి. పరిచయవిశేషమువలన అతిసాంద్ర మయిన రాగోదయము కలవి అటువంటిభావ్యమానసుందరము లయినవానిని విశేషించి చెప్పడము శక్యము కాదు. ఏ చేష్టలు మనోరథప్రకల్పితములు అయినా బాహ్యేంద్రియవ్యాపారములను అడ్డుపెట్టునటువంటి, ఆనందసాంద్ర మయిన తన్మయీభావమును అంతఃకరణానికి కలుగ చేస్తవో ఆవి ఆచేష్టలు మళ్లా నామీద ప్రసరించునా అని అభిశంసనము.

3. విరహము :

అన్యత్ర వ్రజతీతి కాకలుకథా నాప్యస్య తాదృక్సుహృత్
యో మాం నేచ్ఛతి నాగతశ్చ హహాహ! కోఽయం విధేః ప్రక్రమః
ఇత్యల్పేతరకల్పనాకవలితస్వాంతా నిశాంతాంతరే
బాలా వృత్తవివర్తనవ్యతికరా నాప్నోతి నిద్రాం నిశి

రావాలని అనుకొన్నప్పటికీ నాయకుడు రాలేదు. అతని అనాగమనవిరహమువలన వ్యథితురా లయిన నాయికస్వాంత మంతా నానావిధకల్పనాకవలిత మయింది. ఆ బాల గృహాభ్యంతరంలో అటూఇటూ పొర్లుతూ రాత్రి సమయంలో ఏమీ నిద్ర పోవడం లేదు. ఆ నానావిధ కల్పనలూ ఏవంటే నానాయకుడు అన్యనాయికాభవనానికి వెళుతాడని అనుకోవడానికి ఏమీ అవకాశము లేనే లేదు. పోనీ ఎవరైనా స్నేహితుడు తనయింటికి తీసుకుపోయినా డనుకుందామా! అంటే, నామీద ద్వేషం ఉండి

కరుణరసోదాహరణము:

> అపహాయ సకలబాంధవ చింతాం, ఉద్వాస్య గురుకుల ప్రణయం
> హా ! తనయ ! వినయశాలిన్, కథమివ పరలోకపథికోభూః

---

నాయింటికి నాప్రియుడు రాకుండా చేసే సుహృత్తు ఎవడూ లేడే! కాబట్టి తత్కృత నివారణము సంభావ్యము కాదు. అయ్యయ్యో! నా నాథుడు యింకా రానేలేదే అబ్బా! ఈ దైవఘటన ఏమిటో గదా! ఎన్నడూ ఈవిధముగా లేదే అని.

౪. ఈర్ష్య:

> సాపత్న్యాః ప్రథమేఽపరాధసమయే సఖ్యోపదేశం వినా
> నో జానాతి సవిభ్రమాంగవలనా వక్రోక్తిసంసూచనం
> స్వచ్ఛై రచ్ఛకపోలమూలగలితైః పర్యస్తనేత్రోత్పలా
> బాలా కేవలమేవ రోదితి లుఠల్లోలాలకై రశ్రుభిః

నాయిక ముగ్ధ, నాయకుడు రసికుడు. ఆతడు అన్యాంగనాసంగమాపరాధి. సహించడానికి శక్యము గాని ఆ భర్తయొక్క మొదటి అపరాధసమయంలో సౌహార్దంతో చెలికత్తెలు ఉపదేశములు చేయకపోతే సవిలాసంగా అంగవలనము చేయడము కాని వక్రోక్తులతో తన కోపమును సూచించడము గాని ఏమీ తెలియదు. స్వచ్ఛముగా అచ్ఛకపోలమూలమునుండి అశ్రుకణలు బయలు దేరినవి. ఆముగ్ధానేత్రములు కన్నీళ్లతో నిండినవి. ఆమె అలకలు అటూఇటూ చెదిరిపోతున్నవి. ఈ విధంగా ఆబాల కేవలము రోదనము చేస్తున్నది. ఆ నాయకుడు తనను విడచి వేరొక స్త్రీని గ్రహించడమువలన ఈర్ష్య కలిగిన ఆపిల్ల ఏమీచేయలేక ఈ విధంగా ఏడుస్తున్నది.

౫. శాపము :

> త్వా మాలిఖ్య ప్రణయకుపితాం ధాతురాగైః శిలాయా
> మాత్మానం తే చరణపతితం యావ దిచ్ఛామి కర్తుం
> అస్రైస్తావన్ముహు రుపచితై ర్దృష్టి రాలుప్యతే మే
> క్రూర స్తస్మిన్నపి న సహతే సంగమం నౌ కృతాంతః

మేఘసందేశంలో యక్షుడు తన ప్రియురాలి విషయమై ఈ విధంగా మేఘుడితో చెపుతున్నాడు. నా వచనాలుగా నా ప్రియురాలితో ఈవిధంగా చెప్పు. "ఓ ప్రియురాలా! నీవు ప్రణయకుపితవైనట్లుగా భావించి గైరికాదిధాతువులతో శిలాఫలకంమీద నిన్ను చిత్రించుకున్నాను. అటువంటి నిన్ను నేను బతిమాలుకోవాలిగా! అందువలన నన్ను నీ పాదాలమీద పడియున్నట్లుగా చిత్రించాలని అనుకుంటూ ఉంటే కన్నీరు పొంగిపొంగి వచ్చింది. దృష్టిఅంతా అలుముకు పోయింది. ఇక నేంచెయ్యను? ఆ క్రూరుడైన విధి చిత్రంలోకూడా మన సమాగమాన్ని సహించడం లేదుకదా! దీనిలో నాయకుడు "శాపేనాస్తంగమితమహిమా." కాబట్టి శాప హేతుకంగా వియుక్తుడైనాడు.

అత్యంతము సుశీలుడవయిన తనయా! సకలబంధువుల చింతను విడిచి గురుకులప్రేమను త్రోసిపుచ్చి ఎట్లు పరలోకపథికుడ వయితి వయ్యా!*
దీనిలో చనిపోయిన పుత్రుడు ఆలంబనవిభావము. ఆ సమయములో వచ్చిన బాంధవుల దర్శనము మొదలయినవి ఉద్దీపనవిభావాలు. రోదనము అనుభావము. దైన్యాదులు. వ్యభిచారిభావాలు.

శాంతరసోదాహరణము:—

bewitched dangerous

మలయానిలకాలకూటయోః రమణీకుంతలభోగిభోగయోః
శ్వపచాత్మభువో ర్నిరంతరా మమ జాతా పరమాత్మని స్థితిః

మలయానిలకాలకూటాలలో కాంతాకుంతలసర్పభోగాలలో చండాల బ్రహ్మామూర్తులలో భేదభావము లేని నా స్థితి నిరంతరంగా పరమాత్మ యందు కూడుకొన్నది.

దీనిలో నిఖిలప్రపంచమూ ఆలంబనవిభావము. సకలవస్తువులలో సమానత్వము అనుభావము. మత్యాదులు వ్యభిచారులు. ఈపద్యము పూర్వార్ధములో ఉత్తమాధమముల ఉపక్రమము ఉన్నది. ఉత్తరార్ధములో అధమోత్తమములవచన మున్నది. మలయానిలము కాలకూటము, రమణీకుంతలము భోగిభోగము అని మొదట ఉత్తమము, తరువాత అధమము ఉండేటట్లు ఉపక్రమము చేయబడింది. ఉత్తరార్ధములో మొదటగా శ్వపచుడు తరువాత ఆత్మభూ అని ఉన్నది కాబట్టి అధమోత్తమవచనము ఉన్నదని భావము. ఈ విధముగా వర్ణనము ఉంటే ప్రక్రమభంగమనే దోషము వాటిల్లుతుంది. ఏక్రమముతో ప్రారంభము చేయబడు

---

ఈ ఉదాహరణలు అన్నిటిలోకూడా ప్రియవ్యక్తి విరహవివశత్వ మనేది సమానంగా కనిపిస్తున్నది. ఆ విషయంలో ప్రత్యేకంగా ఎన్నతగిన విషయమంటూ కనిపించదని పండితరాజభావము.

* బాంధవుల నందరినీ అభిమానించుతూ గురుకులంలో చక్కగా విద్యాభ్యాసం చేసి అనంతరకాలంలోకూడా గురుభక్తిని ప్రదర్శించుతూ ఉన్న వినయశీలుడయిన కుమారుడు చనిపోయినాడు. పరలోకములో అతని అతిథిని ఆదరించినట్లుగా ఆదరించుతారు. ఇటువంటి సుగుణములతో కూడుకున్న ఉత్తమపుత్రుడు నిరంతర చింతాసంతతిని కూర్చాడు.

తుందో సమాప్తి పర్యంతమూ ఆ క్రమానికే నిర్వాహము ఉండాలి. అట్లా లేకపోతే పై శ్లోకములో మాదిరి ప్రక్రమభంగము తప్పదు. కాని ఇందులో వక్త బ్రహ్మీభావము పొందినవాడు కావడము మూలాన ఆతనికి ఉత్తమాధమజ్ఞానవైకల్యము సంప్రాప్తమైనదని ఈ క్రమ భంగము ద్యోతనము చేస్తున్నది. అందువలన ఇది దోషము కాక పోవడమే కాక రసపోషక మవుతూ ఉన్నందువలన గుణమే.

ఈ క్రింది పద్యాన్ని శాంతరసానికి ఉదాహరింప రాదు.

> సురస్రోతస్విన్యాః పులిన మధితిష్ఠ న్నయనయోః
> విధాయాన్తర్ముద్రా మథ సపది విద్రావ్య విషయాన్
> విధూతాన్తర్ధ్వాంతో మధురమధురాయాంచితి కదా
> నిమగ్నః స్యాం కస్యాంచన నవనభస్యాంబుదరుచి

గంగానది సైకతముపై కూర్చొని నేత్రాలు మూసికొని సాంసారిక విష యాలను ఆ సమయములో దూరముచేసి అంతఃకరణముయొక్క అంధ కారములను పోగొట్టుకొని నవీన భాద్రపదమాస మేఘసమానకాంతి యుక్తమైన అనిర్వచనీయమైన మధురమధుర చైతన్యములో ఎప్పుడు నిమగ్నుడను అవుతానో కదా! ఆ తన్మయత్వము ఎపుడు కలుగు తుందో కదా?

విచారించితే, ఈ పద్యములో విషయములు ఆలంబనములు, గంగా తటాదులు ఉద్దీపన విభావాలు. నేత్రనిమీలనాదికము అనుభావము. వాని సంయోగమువలన నిర్వేదస్థాయి ప్రతీతమవుతూనే ఉన్నది. అయినప్పటికీ ఆ నిర్వేదము వాసుదేవునిపై అనన్యప్రేమ కలిగిన, కవీశ్వ రునిరతిలో గుణీభూత మవుతున్నది. అందువలన 'శాంతరసధ్వని' అని వ్యపదేశింపరాదు. ఈ పద్యము నా (పండితరాజు) కరుణాలహరి పుస్తకములోనిది. ఆ కరుణాలహరి భగవద్భక్తి ప్రధానకము కాబట్టి ఈ పద్యములో కూడా అదే భక్తి ప్రధానము కావాలి. ఇంకా ఈ పద్యములో ఓజస్వి అయిన రచన ఉన్నది. అది శాంతరసానికి ప్రతి కూలము. అందువలన కూడా ఇది ఉదాహార్యము కాదు. పూర్వ పద్య

ములో—పరమాత్మనిస్థితిః- అని అనడముచేత ఆత్మతాద్రూప్యము గోచర మవుతున్నది. కాని భగవత్ప్రేమ ప్రతీతము కావడము లేదు. భగ వానుడికన్న వేరుగా గోచరించినపుడే ప్రేమ భాసించుతుంది. ఐక్య జ్ఞానములో గోచరముకాదు.

### రౌద్రరసోదాహరణము

సీతాస్వయంవరములో విరిగిపోయిన శివధనుష్ఖండాలను చూస్తూ ఉండ లేక పరశురాముడు ఈ విధముగా పలుకుతున్నాడు. దీనిలో పరశు రామునిక్రోధము వ్యక్తమవుతున్నది.

> నవోచ్ఛలితయౌవనస్ఫురదఖర్వగర్వజ్వరే
> మదీయగురుకార్ముకం గలితసాధ్వసం వృశ్చతి
> అయం పతతు నిర్దయం దలితదృప్తభూభృద్గల
> స్ఖలద్రుధిరఘస్మరో మమ పరశ్వధో భైరవః॥

బాగా సముచ్ఛలితమైన నవయౌవనముచేత అమందగర్వజ్వరము కలిగి సాధ్వసము లేకుండా, నాగురువైన శివుని ధనువును విరిచిన ఈతని (శ్రీరాము) పై నా యీ భయంకరమైన, నిర్దయముగా ఖండితము లయిన రాజకంఠములనుండి స్రవించే రక్తమును పానముచేసిన పర శువు ప్రసరించు గావుత.

ఈ పద్యములో పరశురామునకు రాముడుగా తెలియబడని శివధను ర్భంజకుడు ఆలంబన విభావము. అందువలననే విశేషవిధముగా నామ గ్రహణము చేయలేదు గురుద్రోహినామమును ఉచ్చారణము చేయడము అనుచిత మని కూడా సంప్రదాయము. క్రోధాధిక్యమువలన నామ గ్రహణము చేయలేదనికూడా గ్రహించవచ్చు. అందువలననే విశేషణము మాత్రమే చెప్పబడింది. కాని విశేష్యము చెప్పబడ లేదు. భువనవ్యాపి మహాధ్వని వెలువడడమువలన నిశ్శంకముగా ధనువును విరిచినాడని అనుమిత మవుతున్నది. ఇది ఉద్దీపనవిభావము. పరుషోక్తులు అను భావాలు. గర్వము ఉగ్రత మొదలగునవి వ్యభిచారిభావాలు. ధనుర్భంగ ధ్వనివలన సమాధి భగ్నము కాగా దీనిని పరశురాముడు పలికాడు.

ఈ పద్యరచన అత్యంతమూ ఉద్ధతముగా ఉంది. ఇది రౌద్రముయొక్క ఓజస్వితను పోషించుచున్నది.

ఇతరస్థలాలలో, గురువు స్మరణకు రాగా అహంకారము నివృత్త మగుట ఆవశ్యకము. ప్రకృతములో అటువంటి అవసరము వచ్చినా పరశురాముని గర్వోత్కర్ష ప్రకాశిత మవుతున్నది. దీనివలన ఆతని వివేకరహితత్వము స్పష్టముగా ప్రతీత మవుతున్నది. తద్ద్వారా క్రోధముకూడా అధికముగా గోచర మవుతున్నది. ఈ అర్థమున్ను పద్యములో ఉన్న "మదీయ" పదము తెలియ జేస్తున్నది. అది అజహత్స్వార్థలక్షణామూలకమైన ధ్వని. "నేను ఇరువదియొక్క పర్యాయములు భూమిని నిఃక్షత్రియంగా చేశాను. తండ్రి ఆజ్ఞానుసారంగా మాతృకంఠమును కూడా నరికాను" అని దీనివలన గోచర మవుతున్నది. ఇది లక్ష్యార్థము. ఈ లక్ష్యము గర్వోత్కర్ష ప్రకాశనపూర్వకముగా వివేక శూన్యత్వముచేత క్రోధాతిశయమును వ్యంగ్యము చేస్తున్నది. దీనినే ప్రాచీనులు ఉపాదాన లక్షణ అంటారు. అస్మచ్ఛబ్దము స్వార్థాన్ని సూచించుతూ లక్ష్యార్థ మును బోధించుచున్నది. తద్ద్వారా వ్యంగ్యసిద్ధి స్పష్టము.

ఇది రౌద్రానికి ఉదాహార్యముకాదు.

ధనుర్విదలనధ్వనిశ్రవణతత్క్షణావిర్భవ
న్మహాగురువధస్మృతిః శ్వసనవేగధూతాధరః
విలోచన వినిస్సరద్బహులవిస్ఫులింగవ్రజః
రఘుప్రవర మాక్షిపన్ జయతి జామదగ్న్యోమునిః

ధనువును బద్దలుచేసే సమయములోని ధ్వనిని వినడముచేత, ఆ క్షణ ములో ఆవిర్భవించిన మహాగురు వగు జమదగ్నియొక్క వధస్మరణము కలవాడై నిట్టూర్పులవేగమువలన కదిలిన అధరము కలవాడై నేత్రాలనుండి వెలువడు బహుళములయిన విస్ఫులింగాల సమూహము కలవాడై, జామదగ్న్యముని అయిన యీ పరశురాముడు రఘువీరు డయిన శ్రీరామచంద్రుని ఆక్షేపించుతూ (నిరసించుతూ) సర్వోత్కర్షగా ఉన్నాడు.

దీనిలో అపరాధాస్పదుడైన రఘునందనుడు ఆలంబనవిభావము. ధనుర్విదలనధ్వనిశ్రవణము ఉద్దీపన విభావము. శ్వాసము నేత్రజ్వలనమూ అనుభావాలు. మహాగురువధస్మృతి, గర్వము, ఉగ్రత మొదలయినవి వ్యభిచారి భావాలు. వీని సంయోగమువలన క్రోధము అభివ్యంగ్యమవుతున్నది. అయినప్పటికీ పరశురాముని ప్రభావవర్ణనలో కవిగత రతిభావము బీజభూతము కాబట్టి ఆ రతిలో ఈ క్రోధము గుణీభావము పొందుతున్నది. మున్యాలంబనకమైన రతియే ప్రధానము. క్రోధస్థాయికమైన రౌద్రము రతిపరిపోషకముగా ఉన్నది కాబట్టి ప్రధానము కాదు. అందువలన ఇక్కడ రౌద్రరసవ్యపదేశమును చేయరాదు.

ఈ స్థలములో ప్రసంగవశప్రాప్తమైన ఈ విషయమును తెలుసుకోవాలి. కావ్యప్రకాశలో వేణీసంహారములోని ఈ పద్యము రౌద్రరసానికి ఉదాహరింపబడింది.

> కృత మనుమతం దృష్టంవా యై రిదం గురుపాతకం
> మనుజపశుభి ర్నిర్మర్యాదై ర్భవద్భి రుదాయుధైః
> నరకరిపుణా సార్ధం తేషాం సభీమకిరీటినాం
> అయ మహమసృఙ్మాంసైః కరోమి దిశాం బలిం.

ద్రోణవధకుపితుడైన అశ్వత్థామ అర్జునాదులను ఉద్దేశించి దీనిని పలుకుతున్నాడు. ఆయుధములను ధరించిన మర్యాదారహితులయిన పశువులయిన ఏ మీచేత ఈ మహాగురుపాతకము చేయబడిందో, అంగీకరింపబడిందో, చూడబడిందో, ఆ శ్రీకృష్ణునితో కలిపి భీమార్జునులతో కూడుకొనినవారి అసృఙ్మేదోమాంసాదులతో నేను దిక్కులకు బలి ఇస్తాను. ఈ పద్యములో రచన రౌద్రరసవ్యంజనసమర్థముకాదు. పద్యము వినగానే "ఇది రౌద్రరసవర్ణనముతో ఉన్నది" అనే అర్థమును చెప్పేశక్తి కలిగి ఉన్నట్లు స్ఫురించదు. అది కవియొక్క అశక్తి.

## వీ రో దా హ ర ణ ము

వీరరసము నాలుగు విధాలు. దానవీరము, దయావీరము, యుద్ధవీరము,

ధర్మవీరము అని. వీరానికి స్థాయి అయిన ఉత్సాహము నాలుగు విధాలుగా ఉండడమే హేతువు. దానవీరోదాహరణము :

> కియ దిద మధికం మే యద్ద్విజాయార్థయిత్రే
> కవచ మరమణీయం కుండలే చార్పయామి
> అకరుణ మవకృత్య ద్రాక్ కృపాణేన నిర్యత్
> బహులరుధిరధారం మౌళి మావేదయామి

నా కిది అంతగా అధికంకాదు. యాచనము చేసే ద్విజునకు సాధారణమైన కవచాన్ని కుండలాలను అర్పించుతాను. ఆ యాచకుడే అడిగితే కృపాణంతో ఖండించి వెలువడు రక్తధారలతో ఉన్న శిరమును నివేదించుతాను.

ఇంద్రుడు బ్రాహ్మణవేషమును ధరించి రాగా కవచకుండలాలను దానము చేయడానికి కర్ణుడు ఉద్యుక్తుడై తద్దానవిస్మితులయిన సభ్యులను ఉద్దేశించి పలుకుతున్నాడు. దీనిలో యాచనము చేసే ఇంద్రుడు ఆలంబన విభావము. ఆతడు పలికిన స్తుతి ఉద్దీపన విభావము. కవచాదులను దానము చేయడము వానియందు లఘుత్వబుద్ధి మొదలయినవి అనుభావాలు. గర్వము, తండ్రి అయిన భువనభాస్కరునివలన తాను జన్మించుటను స్మరించుట వ్యభిచారిభావాలు. దీనిలో 'మే' అనేది అర్థాంతరసంక్రమితావివక్షితవాచ్యధ్వని. దీనివలననే గర్వము గోచర మవుతున్నది.

ఈ పద్యములోని రచన ఆయా అర్థాలకు తగినట్లుగా ప్రారంభ సమాసాలతో కూడుకొని ఉన్నది. ఓజస్సు, మృదుత ఈ రెండింటితోనూ కూడుకొన్నది అగుటవలన సహృదయుల అంతఃకరణములో చమత్కారమును కలుగజేస్తున్నది. పూర్వార్థములో కవచకుండల సమర్పణము తేలిక అయినదే అని నిరూపించడమువలన ఉత్సాహము పోషింపబడుతున్నది. అందుకొరకే తదనుకూలముగా మృదురచన శిథిల బంధము స్వీకరింపబడింది. ఉత్తరార్థములో "మౌలిం" అనేవరకు వక్త

యొక్క గర్వోత్సాహములను పోషించడానికి ఉదాత్తరచన స్వీకరింప బడింది. ఆ తరువాత బ్రాహ్మణ విషయములో వినయయుక్తతను ప్రకాశింపచేయడానికి, దానికి మూలభూతమైన గర్వరాహిత్యమును ధ్వనింపచేయడానికి మృదువయిన శిథిలరచన స్వీకరింపబడింది. అందు వలననే "ఆవేదయామి" అని చెప్పబడింది. కాని "దదామి" అని కాని "వితరామి" అని కాని చెప్పబడలేదు.

ఇది ఉదాహార్యముకాదు.

> యస్యోద్దామదివానిశార్థివిలసద్దానప్రవాహప్రథా
> మాకర్ణ్యావనిమండలాగతవియద్వందీంద్రబృందాననాత్
> ఈర్ష్యానిర్భరపుల్లరోమనికరవ్యావల్గదూధఃస్రవ
> త్పీయూషప్రకరైః సురేంద్రసురభిః ప్రావృట్పయోదాయతే.

కామధేనువు, భూమండలమునుండి వచ్చిన స్వర్గీయస్తుతి పాఠకముఖ్యుల ముఖమునుండి రాత్రిందినము యాచకులలో శోభించు భూపాలుని అతిశయితదానప్రవాహకథను విని, ఈర్ష్యాకారణముగా బాగా పులకలు పొంది, పొదుగునుండి స్రవించు క్షీరసుధాప్రసారము కలదై వర్షామేఘమువలె అవుతున్నది.

దీనిలో ఇంద్రసభలోని నిరీక్షకులు ఆలంబనవిభావము. భూమండలము నుండి వచ్చిన స్వర్గీయవందిజన వదనాలనుండి వెలువడిన రాజదానవర్ణనము ఉద్దీపనవిభావము. పొదుగునుండి స్రవించు పీయూషప్రసరము అనుభావము. అసూయాదులు వ్యభిచారులు. వీని సంయోగమువలన కామగవీగతోత్సాహము అభివ్యక్త మవుతున్నది. అయినా అది రాజస్తుతిలో గుణీభూత మయింది కాబట్టి రసముగా వ్యపదేశము పొందతగదు.

ఈ కారణమువలననే ఇదికూడా ఉదాహార్యము కాదు.

> సాబ్ధిద్వీపకులాచలాం వసుమతీ మాక్రమ్య సప్తాంతరాం
> సర్వాం ద్యామపి సస్మితేన హరిణా మందం సమాలోకితః
> ప్రాదుర్భూతపరప్రమోదవిదలద్రోమాంచితస్తత్క్షణం
> వ్యానమ్రీకృతకంధరోఽసురవరో మౌలిం పురో న్యస్తవాన్

సముద్రములు ద్వీపములు కులాచలములతో కూడుకొనిన భూమిని, సప్తప్రాకారములతో ఉన్న సర్వస్వర్గమును ఆక్రమించిన తరువాత వామనుడు చిరునగవుతో నెమ్మదిగా బలిచక్రవర్తిని చూచినాడు (మూడవ పాదమును ఎక్కడ ఉంచాలి ? అనేభావముతో). ఆ విధముగా చూడబడిన అసురవరేణ్యుడైన బలి అపరిమితానందము కలుగుట వలన పులకితుడై ఆ సమయములో మెడనువంచి ఎదుట శిరమును ఉంచినాడు, ఒక పాదమును ఈ శిరముపై కూడా ఉంచి స్వీకరించ వలసినదని.

ఈ పద్యములో వామనుడు ఆలంబన విభావము. వామనుడొనరించిన మందనిరీక్షణము ఉద్దీపనవిభావము. రోమాంచాదులు అనుభావాలు. హర్షాదులు వ్యభిచారులు. వీని సంయోగమువలన ఉత్సాహము వ్యజ్యమాన మవుతున్నది. అయినా అది అప్రధానము. పూర్వపద్యములో కామధేనూత్సాహము రాజస్తుతిలో ఉత్కర్షాధాయకమైనట్లు దీనిలో కూడా బలిచక్రవర్తి ఉత్సాహము రాజస్తుతిలో ఉత్కర్షను కలుగజేసేది అవుతున్నది. స్తుతి ప్రధానమైనది; ఉత్సాహము గౌణమైనది.

దీనివలన కావ్య పరీక్ష అనేగ్రంథమును రచించినసారబోధిని అనే కావ్యప్రకాశటీకాకారుడయిన శ్రీవత్సలాంఛనుడు వీరరసానికి ఉదాహరించిన :

> ఉత్పత్తి ర్జమదగ్నితః స భగవాన్ దేవః పినాకీ గురుః
> శౌర్యం యత్తు నతత్ గిరాంపథి ననువ్యక్తంహి తత్కర్మభిః
> త్యాగః సప్తసముద్రముద్రితమహీనిర్వ్యాజదానావధిః
> క్షత్రబ్రహ్మతపోనిధేః భగవతః కింవా న లోకోత్తరం

అనేదికూడా పరాస్తమయింది. భవభూతి మహావీరచరిత్రలో ధనుర్భంగమువలన కోపించిన పరశురాముని చూచి శ్రీరాముడు ఈవిధంగా పలుకుతున్నాడు: భగవన్! పరశురామా! మీ మహిమ లోకోత్తరము. మహర్షి అయిన జమదగ్ని మీ తండ్రి. ఆ భగవానుడు, మహాదేవుడు, పినాకి మీకు ధనుర్వేదగురువు. ఆ మీ శౌర్యము వాచా

తీతము. అది మీ కర్మలచే వ్యక్తము. సప్తసముద్రముద్రితమైన మహీమండలమే మీ నిర్వ్యాజదానానికి అవధి. క్షాత్రబ్రాహ్మతపస్సా నిధి అయిన భగవానుడగు పరశురామునికి సంబంధించినది ఏది లోకోత్తరము కాదు ? అనే భావము కలిగిన ఈ పద్యము నిరస్తమయింది. ఇది గుణీభూతవ్యంగ్యము కాబట్టి రసధ్వని ప్రసంగములో ఉదాహరింప దగినది కాదు.

“అకరుణ మవకృత్య” అనే పద్యములో కూడా వ్యంగ్యమవుతూ ఉన్న దానవీరము కర్ణుని స్తుతిలో అంగభూతమైనది కాబట్టి, దానిలో కూడా కర్ణునిప్రశంస సూచితమవుతున్నది. కాబట్టి అది కూడా ధ్వని కావ్యముకాదు” అని శంకించవచ్చును కాని అది పరమార్థము కాదు. ఆ పద్యములో కవికి కర్ణస్తుతిలో తాత్పర్యములేదు. కర్ణునివచనాలను అనువదించడములోనే కవికి అభినివేశ మున్నది. కర్ణునిస్తుతిని ప్రతిపాదించాలని ఆతని అభిప్రాయము కాదు. కర్ణుడు గొప్పవాడు. మహాశయుడు. తన స్తుతిలో ఆతనికి తాత్పర్యములేదు. తనను గొప్పగాచెప్పుకొనడము క్షుద్రులభావము. కాబట్టి * ఆపద్యములో స్తుతి వాక్యార్థము కాదు.

* స్తుతి అవాక్యార్థము అంటే వాక్యప్రతిపాద్యముగా లేదన్నమాట. దీని భావమును ఈ విధముగా గ్రహించాలి. స్తుతిలో కవికి తాత్పర్యములేదు ఉదారాశయము కలిగిన కర్ణునకుగూడా స్వస్తుతిలో తాత్పర్యములేదు. ఇట్లా అతాత్పర్యభూతమైన స్తుతివిషయమై వీరోత్సాహము అంగ మెట్లా అవుతుంది? “కియదిద మధికం మే” అనే పద్యములో మహాశయత్వనిబంధనకమైన కర్ణునిస్తుతి ప్రతీయమాన మవుతూనే ఉన్నది. అయినా ఆ స్తుతిని వాక్యార్థ మనరాదు. ఉత్సాహము హేతువుగా అది శ్రోతయొక్క హృదయములో అనుమీయమాన మవుతున్నది. “ఈ కర్ణుడు స్తుతిపాత్రుడు. అటువంటి ఉత్సాహము కలవాడు కాబట్టి” అని అక్కడి అనుమాన ప్రక్రియ. అంతేకాని అది శబ్దాలచేత ప్రతిపాదింపబడడంలేదు. “యస్యోద్దామ దివానిశం” “సాబ్ధిద్వీపకులాచల” అనే రాజవర్ణన పద్యములోనయితే రాజస్తుతి వర్ణనీయముగానే ఉన్నది. అందువలన అది ప్రధానము. కాబట్టి ఉత్సాహాదులకు అక్కడ గుణీభూతత్వమునే చెప్పాలి అని మొత్తముమీద ఇక్కడి ప్రఘట్టక తాత్పర్యమును భావించాలి.

వీరరసప్రతీతి కలిగిన తరువాత అటువంటి ఉత్సాహము ఉన్నందువలన అది హేతువుగా రసజ్ఞులహృదయములో స్తుతి అనుమితమవుతుంది. ఇంతకుపూర్వము ఉదాహరించిన రాజవర్ణనపద్యములో రాజస్తుతి చెయ్యాలని కవికి తాత్పర్యము ఉన్నందువలన స్తుతికి వాక్యార్థత్వము ఉన్నదని తెలుసుకోవాలి.

దయా వీరోదాహరణము:

న కపోత! భవంత మణ్వపి, స్పృశతు శ్యేనసముద్భవం భయం
ఇద మద్య మయా తృణీకృతం, భవదాయుఃకుశలం కళేబరం

ఓ పావురమా! డేగవలన కలిగే భయము నిన్ను లేశమైనా స్పృశించకుండా ఉండుగాకుత. నీ జీవనకుశలమును ఇచ్చే ఈ శరీరము నాచే తృణముగా చేయబడినది. నేను నా ఈ శరీరాన్ని తృణప్రాయముగా తలచి నీకు అడ్డుపడి డేగవలన నీకు ఏమాత్రమూ భయములేకుండా చేస్తాను.

పై పద్యాన్ని ఈవిధంగాకూడా విన్యసించవచ్చు.

న కపోతకపోతకం తవ స్పృశతు శ్యేన! మనాగపి స్పృహా!
ఇద మద్య మయా సమర్పితం భవతే చారుతరం కళేబరం.

ఓ శ్యేనమా! నీ ఇచ్ఛ కొంచెమైనా కపోతకిశోరాన్ని స్పృశించకుండా ఉండుగాకుత. ఇప్పుడు నీకు మనోహరమైన ఈ కళేబరము నాచే సమర్పణ చేయబడినది. మమతారహితముగా నేను శరీరసమర్పణము చేస్తున్నాను.

మొదటిపద్యములో శిబిచక్రవర్తి కపోతమును గురించి పలుకుట ఉన్నది. రెండవపద్యములో శ్యేనమును గురించి పలుకుట ఉన్నది. కపోతము ఆలంబనవిభావము. కపోతములోని వ్యాకులీభావము ఉద్దీపనవిభావము. పావురానికై తన శరీరార్పణ చేయడము అనుభావము.

ఈ పద్యములో శరీరమును దానముచేయుట గోచర మవుతూ ఉన్నప్పటికీ దానవీరధ్వని కాదు. డేగకు పావురము తినదగిన పదార్థము.

ఆ శ్యేనకపోతాలు రెండూ భక్ష్యభక్షకభావాపన్నములై ఉండడము ప్రసిద్ధమే కదా! శ్యేనము కపోతమును యాచించుతున్నది గాని రాజశరీరమును అర్థించడము లేదు. కాబట్టి దానవీరము గోచరము కాదు. కపోతశరీరరక్షణానికి శిబి తన శరీరాన్ని డేగకు నివేదించుతున్నాడు. అది దానము కాదు. ఇచ్చి పుచ్చుకొనుట అనే వినిమయము అవుతుంది. ఇందువలనకూడా దానవీరధ్వని కాదు.

శ్యేనానికి కపోతము భక్ష్యము. అందువలననే అది కపోతశరీరాన్ని అర్థించుతున్నది. కాని శిబిశరీరాన్ని కోరడము లేదుగదా! శ్యేనము శిబిశరీరాన్ని అర్థించకపోవడమువలన దానవీరమని వ్యపదేశించరాదు. కపోతశరీరాన్ని రక్షించాలని శిబిచక్రవర్తి దానికి మారుగా తన దేహాన్ని నివేదించుతున్నాడు. ఇది ద్రవ్యవినిమయమే కాని దానము కాదని భావము.

యుద్ధవీరోదాహరణము :

> రణే దీనాన్ దేవాన్ దశవదన! విద్రావ్య వహతి
> ప్రభావప్రాగల్భ్యం త్వయి తు మమ కోయం పరికరః
> లలాటోద్యజ్జ్వాలాకవలితజగజ్జాలవిభవో
> భవో మే కోదండచ్యుతవిశిఖవేగం కలయతు

రావణా! యుద్ధములో దేవతలను పరుగెత్తింపచేసి ప్రభావప్రగల్భతను పొందిన నీ విషయమై నాకు పరికర మేమిటి? నీలెక్క ఏమిటి? ఫాలాగ్ని జ్వాలలతో జగత్సమూహవైభవాన్ని కబళించిన మహాదేవుడు నాధనుర్నిర్ముక్తబాణవేగమును తెలుసుకొనుగాత.

ఇది రావణాసురుని గురించిన భగవానుడు శ్రీరాముని వచనము. దీనిలో పరమేశ్వరుడు ఆలంబనవిభావము. యుద్ధదర్శనము ఉద్దీపన విభావము. దశవదనావజ్ఞ అనుభావము. గర్వము సంచారిభావము. వీనివలన రామగతమైన ఉత్సాహము రసీభావమును పొందుతున్నది. ఈ పద్యమున దేవతల ప్రస్తావనలో రచన ఉద్ధతముగా లేదు. అట్లా

అనుద్ధతముగా ఉండడము దేవతల కాతర్యప్రకాశనద్వారా "దేవతలు ప్రకృత వీరరసానికి ఆలంబనము కారు" అనే అర్థమును అవగమింప చేస్తున్నది. శ్రీరాముడు దేవతలను వీరరసానికి ఆలంబనముగా తలచడము లేదు. అందువలననే అది అనుద్ధతముగా ఉన్నది. రావణుని ప్రస్తావములో, దేవతల దర్పమును దమనము చేసే రావణాసురుని వీరత్వమును ప్రతిపాదింపవలసి ఉన్నది. కాబట్టి రచన కొంత ఉద్ధతముగా ఉన్నది. అయినా రావణుడు కొంత అవజ్ఞ చేయబడుతున్నాడు. రామగతోత్సాహములో రావణుడు ఆలంబనము కాడు. 'దశవదనుడు తనకు సాటి' అని రాముడు తలచడములేదు. అందువలననే రావణాలంబనకమైన రసము ప్రతీతిపథములో భాసించడము లేదు. కాబట్టి రచనలో ప్రకర్ష లేదు. ఉద్ధతత్వానికి ఆధిక్యములేదు. భగవానుడైన భవుడు పరమోత్తమాలంబనవిభావము. కాబట్టి పరమేశ్వర ప్రస్తావములో పరమేశ్వరుడు ఆలంబనముగా ఉన్న ఓజస్వి అయిన వీరరసము నిష్పన్నము అవుతున్నది. అందువలన రచన ఉద్ధతముగా ఉన్నది. ప్రకర్ష యోగిగా కూడా ఉన్నది.

నాల్గవది అయిన ధర్మవీరోదాహరణము:

> సపది విలయ మేతు రాజ్యలక్ష్మీః
> ఉపరి పతంత్వథవా కృపాణధారాః
> అపహరతుతరాం శిరః కృతాంతో
> మమతు మతి ర్న మనా గపైతి ధర్మాత్.

తత్కాలములో రాజ్యలక్ష్మి విలయము పొందుగావుత. కాక, కృపాణధారలు మీాద పడుగావుత. యముడు శిరస్సును అపహరించు గావుత. నా బుద్ధి ధర్మమునుండి కొంచెమైనా తొలగిపోదు.

అధర్మముతోనయినా సరే శత్రువును జయింపవలసిందే అని పలికే వానిని గురించి ఇది యుధిష్ఠిరవచనము. దీనిలో ధర్మవిషయము ఆలంబనము.

"న జాతు కామా న్నభయా న్న లోభాత్, ధర్మం త్యజే జ్జీవితస్యాపి హేతోః"

"కామమువలన గాని భయమువలన గాని లోభమువలన గాని తుదకు జీవితముకొరకైనా గాని ఒకప్పుడైనా ధర్మమును త్యజించరాదు" అనే శాస్త్రీయవాక్యాలోచనము ఉద్దీపనవిభావము. శిరశ్ఛేదనాదులనుకూడా అంగీకరించుట అనుభావము. ధృతి వ్యభిచారిభావము. వీనివలన ధర్మరాజు ధర్మోత్సాహము రసత్వమును పొందుతున్నది.

ఈ విధముగా ప్రాచీనాచార్యుల అనురోధమును బట్టి వీరరసముయొక్క నాలుగు భేదాలు వివరింపబడినవి. శృంగారరసానికి అనేకప్రకారములు ఉన్నట్లుగా వీరరసానికి కూడా అనేకప్రభేదా లున్నవి. వానిని గూడా నిరూపించవచ్చును. చూడండి. "సపది విలయ మేతు" అనే పూర్వపద్యములో "మమతు మతిః న మనాగపైతి సత్యాత్" అని నాల్గవపాదమును వ్యత్యాస మొనర్చి పద్యాంతరముగా చేస్తే సత్యవీరముకూడా కావచ్చు. "సత్యము కూడా ధర్మాంతర్గతమే కాబట్టి ధర్మవీరరసములోనే సత్యవీరముకూడా అంతర్భవించుతుం దని అనరాదు. దానవీరము దయావీరముకూడా ధర్మవీరములో అంతర్భవించవచ్చునుగా! వానిని ధర్మవీరముకన్న పృథక్కుగా ఎందుకు పరిగణించాలి? వానిని వేరుగా పరిగణించినట్లే సత్యవీరమును కూడా వేరుగానే పరిగణించడము సముచితము. ఈ విధముగా పాండిత్యవీరము గూడా ప్రతీతమవుతూనే ఉన్నది. ఉదాహరణము:

> అపివక్తి గిరాంపతిః స్వయం యది తాసా మధిదేవతాపివా
> అయమస్మి పురో హయాననస్మరణోల్లంఘితవాఙ్మయాంబుధిః.

"స్వయముగా గీష్పతి పలికినా, ఆ వాక్కుల కధిదేవత వాగీశ్వరీదేవి పలికినా, శ్రీ హయగ్రీవస్మరణమున వాఙ్మయాంబుధిని ఉల్లంఘించిన నేను ఎదట నిలువబడుతున్నాను. మీ ఇచ్ఛానుసారముగా మాట్లాడండి. ఏమీ భయము వద్దు" అని సభలో ఉన్న ఒక వీరపండితుని ధీరవచనము. దీనిలో బృహస్పతి సరస్వత్యాదులు ఆలంబనవిభావము. సభాదిదర్శనము ఉద్దీపన విభావము. నిఖిలవిద్వత్తిరస్కృతి అనుభావము. గర్వము వ్యభిచారిభావము. వీనివలన క్రమముగా విభా

వితము అనుభావితము పరిపోషితము అయిన వక్తయొక్క ఉత్సాహము రసీభావము పొందుతున్నది.

ఒక శంక: దీనిలో యుద్ధవీరమే. "యుద్ధము" అనే శబ్దము వాదవివాదలనుకూడా సంగ్రహించి చెప్పగలుగుతుంది. వాదముకూడా ఒకవిధమైన యుద్ధమే. ఈ పద్యములో వాగ్వివాదము తలచూపుతున్నది. కాబట్టి ప్రత్యేకముగా పాండిత్యవీర మని అనకపోతే ఏమి?

సమాధానము: ఈ పాండిత్యవీరమును యుద్ధవీరములో అంతర్భవింపజేసినప్పటికీ క్షమావీరములో ఏమి చెపుతారు?

> అపి బహలదహనజాలం, మూర్ధ్ని రిపుర్మే నిరంతరం ధమతు
> పాతయతు వాఽసిధారాం, అహ మణుమాత్రం న కించి దాభాషే

శత్రువు నాశిరస్సుపై బహలాగ్నిసమూహమును నిరంతరమూ మండింపచేయనీ, ఖడ్గధారను పడవేయనీ, నేను అణుమాత్రమైనా ఏమీ పలకను. ఇది ఓర్పుకలవాని వచనము.

బలవీరములో ఏమి సమాధానించుతారు? ఉదా:

> పరిహరతు ధరాం ఫణివీరః
> సుఖమయతాం కమఠోపి తాం విహాయ
> అహమిహ పురుహూత ! పక్షకోణే
> నిఖిల మిదం జగదండకం వహామి

సర్వశ్రేష్ఠుడయిన ఆదిశేషుడు భూమిని పరిహరించుగాక. ఆదికూర్మము కూడా ఆ భూమిని విడిచి సుఖముగా ఉండుగాక. ఓ ఇంద్రా! నేను ఇక్కడ నిఖిలజగత్తును శ్రమలేకుండా పక్షకోణములో ధరించుతాను. ఇది ఇంద్రునిగురించి గరుత్మంతుని వచనము. ఇటువంటి వీరరసప్రభేదాలను ప్రతిక్షేపము చేయడము శక్యముకాదు. సహృదయహృదయాలలో వీని ప్రత్యేకత్వము గోచరమవుతూనే ఉన్నది. క్షమాబలములను ఏవిధముగానూ ధర్మవీరములో అంతర్భవింపజేయడము కుదరదు. కాబట్టి ప్రత్యేకముగా అంగీకరించాలి. వీనిని అంగీకరించినప్పుడు పాండిత్యవీరమును ఎందుకు అంగీకరించరాదు?

"అపి వక్తి గిరాంపతిః స్వయం" అనే పద్యములోనూ "పరిహరతు ధరాం ఫణివీరః" అనే పద్యములోనూ గర్వమే ధ్వనితమవుతున్నది కాని ఉత్సాహము ధ్వనితము కావడములేదు. "అపి బహలదహనజాలం" అనే మధ్యస్థపద్యములో ధృతి ధ్వన్యమానమవుతున్నది. కాబట్టి ఇవి అన్నీ భావధ్వనులే కాని రసధ్వనులు కావు.

అని తలచడము యుక్తముకాదు. అట్లాగే అయితే యుద్ధవీరాదులలో కూడా గర్వాదులే వ్యంగ్యము లవుతున్నవని ఎందు కనరాదు? రసధ్వని సామాన్యమునంతా వాని వ్యభిచారిధ్వననముతో ఎందుకు గతార్థము చేయరాదు? రసధ్వనిస్థలంలో అంతటా వ్యభిచారి భావధ్వనినే సాధించి రసధ్వనులను అన్నింటినీ వ్యభిచారిధ్వనులే అని అనరాదా?

"రసధ్వని స్థలంలో వ్యభిచారులకంటె వేరుగా స్థాయిభావప్రతీతి ప్రబలముగా ఉన్నది. వాటిని కప్పిపుచ్చలేము. అందువలన రసాలను వేరుగా పరిగణింపవలసి వచ్చింది. స్థాయిభావప్రతీతికృతంగా ఉన్న రసధ్వని వ్యవహారము దురపహ్నవముగా ఉన్నది"

అని అనేటట్లయితే ప్రకృతంలో కూడా ఆవిధముగానే చెప్పవచ్చును. సత్యబలవీరాదులలో కూడా స్థాయిప్రతీతి బలీయముగా ఉన్నది. కాబట్టి వీరరసధ్వని వ్యవహారము ఎట్లా ప్రతిబంధనీయ మవుతుంది? అందువలన వీనికీ రసమనే వ్యవహారము యుక్తము.

"ఇంతకు పూర్వము చెప్పిన పద్యాలలో ఉత్సాహము ప్రతీయమానము కావడములేదు. దయావీరాద్యుదాహరణాలలోనే ఉత్సాహము ప్రతీతమవుతున్నది" అని అనడము కేవలము రాజాజ్ఞగా ఉన్నది. వీనిలో కూడా ఉత్సాహము ప్రతీయమాన మవుతున్నదని సహృదయత్వముతో భావించి తెలుసుకోవాలి. అందువలన "వీరరసము నాలుగు విధాలే" అని అనడము అసమగ్రముగా ఉన్నది. ఔచిత్యానుసారంగా ఇతరభేదాలను కూడా పరిగణించడము యుక్తముగా ఉంటుంది.

అద్భుత రసోదాహరణము:

> చరాచరజగజ్జాలసదనం వదనం తవ
> గలద్గగనగాంభీర్యం వీక్ష్యాస్మి హృతచేతనా

స్థావరజంగమాత్మక ప్రపంచాలకు నిలయమైన, ఆకాశగాంభీర్యమును కూడా నిర్గలితము చేయునట్టి నీ వదనమును చూచి వీతచేతననైనాను. ఇది భగవానుడయిన వాసుదేవుని వదనమును ఒకప్పుడు చూచిన యశోద వచనము. దీనిలో వాసుదేవుని వదనము ఆలంబన విభావము. వదనాంతర్గతములయిన చరాచరజగజ్జాలముల దర్శనము ఉద్దీపన విభావము. హృతచేతనత్వము, దానివలన వ్యంగ్యము లవుతూ ఉన్న రోమాంచనేత్రస్ఫురణాదులు అనుభావాలు. త్రాసము మొదలయినవి వ్యభిచారి భావాలు. వీని సంయోగమువలన యశోదావిస్మయము రసీభావము పొందుతున్నది. అందువలన అద్భుతరసము.

ఈ పద్యములో యశోదకు పుత్రప్రేమ ఉన్నది. వ్యంజకములు లేక పోవడము మూలాన అది ఉన్నా గోచరము కావడము లేదు. ఈ పద్యములో ఏ శబ్దముకూడా ఆ పుత్రప్రేమను చెప్పడములేదు. ఒకప్పుడు ప్రకరణాది పర్యాలోచనమువలన ఆ పుత్రప్రేమ ప్రతీతమైనా విస్మయము దానికన్న ఏమాత్రమూ గౌణముకాదు. విస్మయమే ఉత్కటముగా ఉన్నది. 'హృతచేతనా' అనే పదము విస్మయానికే ప్రాధాన్యమును ప్రకటము చేస్తున్నది. పుత్రప్రేమ అనుత్కటముగా ఉన్నది. కాబట్టి అదే గౌణము.

ఈతడు నా పుత్రుడని నా బాలుడని యశోదకు నిశ్చయమున్నది. అది ప్రతిబంధక మగుటవలన "ఈత డొక మహాపురుషుడు" అనే భక్తికూడా ఉత్పన్నముకాదు. ఒకప్పుడు భక్తి గోచర మయినా ఆశ్చర్యముకన్న ప్రధానముకాదు. అందువలన భక్తిలోకూడా విస్మయానికి గుణీభావమును ఊహించరాదు.

సహృదయశిరోమణు లయిన ప్రాచీనాచార్యులు అద్భుతరసానికి ఈ విధముగా ఉదాహరించారు:

చిత్రం మహా నేష బతావతారః, క్వ కాంతి రేషాభినవైవభంగిః
లోకోత్తరం ధైర్య మహో ప్రభావః, కా ప్యాకృతి ర్నూతన ఏష సర్గః

వామనుని చూచి బలి పలుకుతాడు. ఈ మహనీయమైన మీ అవతారము లోకోత్తరము. ఈ కాంతి ఇంకా ఎక్కడ దొరుకుతుంది? ఈ భంగి అభినవముగా ఉన్నది, కదలుట కూర్చొనుట అన్నీ నవీనముగా ఉన్నవి. ధైర్యము లోకోత్తరముగా ఉన్నది. ప్రభావమా! విలక్షణము. ఆకారమా! అనిర్వచనీయము. ఇది ఒక నూతనసృష్టి. ఇదివరలో ఇటువంటివాడు పుట్టలేదు అని.

ఇక్కడ ఈ విషయమును ప్రశ్నించాలి. ఈ పద్యములో విస్మయము ప్రతీయమానము అవుగాత. కాని అది ధ్వనివ్యపదేశహేతువు ఎట్లా అవుతుంది? దీనిలో మహాపురుషుడు ప్రతిపాద్యుడు. ఆతని వర్ణనమే ఉన్నది. తద్విషయకముగా స్తోతకు భక్తి ఉన్నది. అదే దీనిలో ప్రధానము. ఆ భక్తికి విస్మయము ప్రకర్షను కలుగజేస్తున్నది. అందువలన విస్మయము గుణీభూతమే కదా!

మహాభారతములోని శ్రీమత్ భగవద్గీతలో విశ్వరూపమును చూచిన అర్జునుడు:

పశ్యామి దేవాం స్తవ దేవ! దేహే, సర్వాం స్తథాభూతవిశేషసంఘాన్.

"దేవా! నీ శరీరములో దేవతలను చూస్తున్నాను. సర్వభూత విశేష సంఘాలను దర్శించుచున్నాను" అని ఈ మొదలయిన వాక్యసందర్భములను పలుకుతున్నాడు. వానిలో కూడా ఆశ్చర్యము ప్రతీత మవుతున్నది కాని భగవద్గీత అర్జునగతభక్తిప్రధాన మగుటవలన ఆశ్చర్యము గౌణమే అవుతున్నది. అందువలన రసాలంకారమని చెప్పడము సముచితముగా ఉంటుంది. కాని 'రసధ్వని' అని అనడము మట్టుకు సముచితము కాదు. ఈ పద్యములో భక్తి ప్రధానము కాదు అని అనేటట్లయితే సహృదయులు నేత్రాలను దరముకుళితములనుగా జేసికొని ఆలోచించండి. ఆ భావనలో భక్తి ప్రతీత మవుతున్నదో లేదో చూడండి.

హాస్యరసానికి ఉదాహరణము:

శ్రీతాతపాదై ర్విహితే నిబంధే, నిరూపితా నూతనయుక్తి రేషా
అంగం గవాం పూర్వ మహో పవిత్రం, నవా కథం రాసభధర్మపత్న్యాః.

తాము కూర్చిన నిబంధములో శ్రీ తాతపాదులవారిచేత ఈ నూతన యుక్తి నిరూపింపబడినది. గోవుల పూర్వాంగము పవిత్రమయితే రాసభ మహాశయునిధర్మపత్నిగారి అంగముమాత్రము ఎందుకు పవిత్రము కాదు ? ఇదే ఆశ్చర్యముగా ఉన్నది. గోవూ గర్దభమూ ఒకటే.

దీనిలో యుక్తులను ఆలోచనము చేసే తార్కిక పుత్రుడు ఆలంబన విభావము. ఆతని నిశ్శంకవచనము ఉద్దీపనవిభావము. దంతాలను వెలుపలికి పెట్టుట మొదలయినవి అనుభావాలు. ఉద్వేగాదులు వ్యభిచారిభావాలు. వీని సంయోగమువలన హాసము రసీభావము పొందుతున్నది. ధర్మశాస్త్రాలలో గోవుయొక్క పశ్చార్ధమే (వెనుకటిభాగమే) పవిత్రముగా చెప్పబడినది. శ్రీ తాతపాదమహాశయులు పూర్వాంగ పవిత్రతను నిరూపించుట నూతనము. అందువలననే అది హాస్యావహముగా ఉన్నది.

హాస్యరసము విషయములో ప్రాచీనాచార్యు లీ విధముగా చెప్పుతున్నారు:

ఆత్మస్థః పరసంస్థశ్చే త్యస్య భేదద్వయం మతం
ఆత్మస్థో ద్రష్టు రుత్పన్నో విభావేక్షణమాత్రతః
హసంత మపరం దృష్ట్వా విభావ శ్చోపజాయతే
యోసౌ హాస్యరస స్తజ్ఞైః పరస్థః పరికీర్తితః

ఉత్తమానాం మధ్యమానాం నీచానా మప్యసౌ భవేత్
త్ర్యవస్థః కథిత స్తస్య షడ్భేదాః సంతి చాపరే
స్మితంచ హసితం ప్రోక్తం ఉత్తమే పురుషే బుధైః
భవేద్విహసితం చోపహసితం మధ్యమే నరే
నీచేఽపహసితం చాతిహసితం పరికీర్తితం
ఈషత్ఫుల్లకపోలాభ్యాం కటాక్షై రప్యనుల్బణైః

అదృశ్యదశనో హాసో మధురః స్మిత ముచ్యతే
వక్త్రనేత్ర కపోలైశ్చే దుత్ఫుల్లై రుపలక్షితః
కించిల్లక్షితదంతశ్చ తదా హసిత మిష్యతే
సశబ్దం మధురం కాయగతం వదనరాగవత్
ఆకుంచితాక్షిమంద్రంచ విదు ర్విహసితం బుధాః.
నికుంచితాక్షిశీర్షశ్చ జిహ్మాదృష్టి ర్విలోకవః
ఉత్ఫుల్లనాసికో హాసో నామ్నోపహసితం మతం
అస్థానజ స్సాశ్రుదృష్టి రాకంపస్కంధమూర్ధజః
శార్ఙ్గదేవేన గదితో హాసోపహసితాహ్వయః
స్థూలకర్ణకటుధ్వానో బాష్పపూరప్లుతేక్షణః
కరోపగూఢపార్శ్వశ్చ హాసోతిహసితం మతం

ఆత్మస్థము పరస్థము అని హాస్యానికి భేదద్వయ మున్నది. హాస్యరసవిషయమైన విభావమును సూచించినంతమాత్రాన ద్రష్టకు కలిగేది ఆత్మస్థము. నవ్వుతూఉన్న వేరొకని చూచినపుడు విభావము కలుగుతుంది. అప్పుడు కలిగే హాస్యరసాన్ని పరస్థము అని హాస్యరసవేత్తలు పలుకుతారు. వేరొకడు నవ్వుతూ ఉండగా కలిగే హాసము పరస్థమవుతుందని గ్రహించాలి. ఈ హాసము ఉత్తములకు మధ్యములకు అధములకూ కూడా కలుగుతుంది. ఈ విధముగా హాస్యానికి మూడు అవస్థలు ఉన్నవి.

ఇంకా ఈ హాస్యానికి వేరొకవిధంగా ఆరు భేదా లున్నవి. ఉత్తమ పురుషునిలో స్మితము హసితము, మధ్యమ మానవునిలో హసితము ఉపహసితము, నీచనరునిలో అపహసితము అతిహసితము ఉంటవి.

కపోలములు కొంచెముగా వికసితములయితే కటాక్షములు బాగా ప్రకాశితములు కానపుడు, పలువరుస కనపడకుండాఉంటే, మధురముగా ఉన్న హాసము "స్మితము" అని అనబడుతుంది. నవ్వుతూ ఉన్నపుడు ముఖ నేత్రాలు కపోలాలు వికసితము లయినట్లయితే, కొంచెము కొంచెముగా దంతాలు కనపడితే "హసిత"మని అనడము సమ్మతము.

నవ్వేటప్పుడు శబ్దము పుట్టితే, హాసము మధురమయితే, శరీరావయవా లలో కూడా అది కూడుకొంటే, ముఖరాగము కలదయితే, నేత్రాలు కొంచెము కొంచెము కుంచితములయితే, హాసధ్వని కొంత గంభీరముగా నున్నప్పుడు "విహసిత" మవుతుంది. నవ్వేటప్పుడు భుజాలు శిరస్సూ వంగబడి పోయినట్లయితే, చికిలింతతో ఉన్నదృష్టి ఉన్నప్పుడు, ముక్కు పుటాలు వికసించినప్పుడు "ఉపహసిత" మవుతుంది.

హాసము అస్థానములో కలిగితే, నేత్రాలలో బాష్పాలు పుట్టితే, భుజాలు కేశములు కదళిక పొందితే "అపహసిత" మనే హాసమవుతుందని శార్ఙ్గ దేవుడు అంటున్నాడు. స్థూలముగా ఉండి కర్ణకటువయిన ధ్వని కలిగి కండ్లనిండా గిర్రున నీళ్ళు తిరిగితే, చేతులతో పార్శ్వభాగాలను పట్టుకో వలసివస్తే "అతిహసితము" అనే హాసము అవుతుంది.

భయానకరసోదాహరణము:

> శ్యేన మంబరతలా దుపాగతం, శుష్యదాననబిలో విలోకయన్
> కంపమానతను రాకులేక్షణః, స్పందితుం నహి శశాక లావకః.

ఆకాశతలాన ఉండివచ్చిన డేగను ముఖబిలము ఎండిపోతూ ఉన్న లావ కము చూస్తూ శరీరము కంపింపగా ఆకులేక్షణాలతో కదలుటకయినా సమర్థము కాలేదు.

దీనిలో డేగ ఆలంబనవిభావము, వేగముతో వచ్చుట ఉద్దీపనము, ముఖము ఎండిపోవుట అనుభావము, దైన్యాదులు వ్యభిచారిభావాలు. వీని సంయోగమువలన భయము రసీభావమును పొందుతున్నది.

బీభత్సరసోదాహరణము:

> నఖై ర్విదారితాంత్రాణాం శవానాం పూయశోణితం
> ఆననే ష్వనులింపంతి హృష్టా వేతాలయోషితః.

రణాంగణములో కాని శ్మశానములో కాని దృశ్యమును చూస్తూ ఒకడు వర్ణించుతున్నాడు. హర్షముతో కూడుకొన్న వేతాలయువతులు నఖ

ములతో చీల్చిన ప్రేవులుగల శవములయొక్క పూయశోణితమును ముఖములందు అనులేపనము చేసికొనుచున్నారు.

దీనిలో శవాలు ఆలంబనవిభావములు. ప్రేవులను బద్దలుతీయుట మొదలైనవి ఉద్దీపనవిభావాలు. ఆక్షిప్తములయిన రోమాంచ మీాలనాదులు అనుభావాలు. ఆవేగాదులు వ్యభిచారిభావాలు. వీని సంయోగమువలన జుగుప్స రసత్వము పొందుతున్నవి.

ఇక్కడ ఒక శంక బయలుదేరుతున్నది: * పూర్వము ఉదాహరించిన రతి, క్రోధము, ఉత్సాహము, భయము, శోకము, విస్మయము నిర్వేదములలో ఆలంబనము ఆశ్రయము అనే రెండిటియొక్క ప్రతీతి కలుగుతున్నది. ఉదా: శకుంతలావిషయమైన దుష్యంతునకు ప్రేమ కలిగితే అక్కడ శకుంతల ప్రేమకు ఆలంబనము, దుష్యంతుడు ఆశ్రయము. ఆ విధముగా పైన చెప్పిన వానిలో రెండింటి ప్రతీతి ఉన్నది.

ఈ విధముగా హాసము జుగుప్సలలో ఆలంబనము ఆశ్రయమూ రెండూ ప్రతీతము కావడములేదు. ఆలంబనము ఒక్కటే ప్రతీత మవుతున్నది. ఆశ్రయవర్ణనము లేదు. పద్యశ్రోత వానికి ఆశ్రయము కావచ్చునని తలచడము యుక్తము కాదు. శ్రోత రసాధికరణము. ఆతనిలో అలౌకిక

---

* విరూపపురుషుడు హాసాలంబనము. ఘృణితమానవుడు జుగుప్సకు ఆలంబనము. అటువంటివారిని ఆశ్రయించి హాసము జుగుప్స ఉదయించుచూ ఉంటవి. ఆశ్రయమంటే బోద్ధ తెలుసుకొనేవాడు. ఆతని హృదయంలోనే రసోద్బోధ కలుగుతుంది. హాస్యబీభత్స రసాశ్రయ పద్యాలలో ఆలంబనప్రతీతిమాత్రమే కలుగుతున్నది గాని ఆశ్రయప్రతీతి లేదు. పద్యశ్రోత ఆశ్రయము కాదగడు. ఆతడు అలౌకిక రసాస్వాదాధారము. ఈ లౌకికహాసజుగుప్సలకు ఆశ్రయము కాడు అని శంకాగ్రంథము.

హాస్యబీభత్సస్థలములో ఆశ్రయంగా ఒకానొక ద్రష్టృపురుషుణ్ణి ఆక్షేపించుకొని ఆశ్రయపూర్తిని సంపాదించాలి. ఇట్లా ఆక్షేపము లేకపోయినా స్వకాంతావర్ణన పద్యశ్రోత ఏవిధంగా శృంగారరసానుభవమును పొందుతున్నాడో, (అంటే లౌకిక రసానికి ఆశ్రయంగా ఉండే శ్రోత) ఆతడే అలౌకికరసానుభవిత కూడా అవుతున్నట్లు, లౌకిక భావానికి అలౌకిక రసానికీ ఆశ్రయైక్యం ఉన్నప్పటికీ ఏమీ విరోధములేదు. అని ఈ మొత్తము గ్రంథాశయము సమాధానము.

రసాస్వాదము ఉంటుంది. ఆతడు లౌకికము లయిన హాసజుగుప్సలకు ఆశ్రయము కాడు. ఆ ఆశ్రయత్వము ఉపపన్నము కూడా కాదు'' అని.
సమాధానము: సత్యమే. అక్కడ రెండు భావాలకూ ఆశ్రయంగా ఒకానొక ద్రష్ట అయిన పురుషుణ్ణి ఆక్షేపించుకోవాలి. అట్లా కల్పిత పురుషాశ్రయంగా రసాస్వాదము చెయ్యవచ్చు. ఒకప్పుడా విధంగా ఆక్షేపము చేసికొనకపోయినా ఇబ్బంది లేదు. శ్రోతకు స్వీయకాంతా వర్ణన పద్యమువలన రసోద్బోధ కలుగుతున్నట్లుగా ప్రకృతంలో గూడా సమన్వయించుకోవచ్చును. తన కాంత వర్ణింపబడిన పద్యములో తాను లౌకికరతికి ఆశ్రయ మవుతున్నాడు. రసానుభవకర్త కూడా అవుతున్నాడు. ప్రకృతములో కూడా లౌకిక భావానికీ రసానికీ ఒకడే ఆశ్రయ మయినా ఏ బాధా కలుగదు.

ఇట్లు సంక్షేపముగా రసాలు నిరూపితము లయినవి.

## ౮. రసవిశేషాలు

### రసాలంకారత

ఈ రసాలు ప్రధానములయితే "రసధ్వని" అని వ్యపదేశము పొందుతున్నవి. గుణీభావము పొందితే రసాలంకారము లవుతున్నవి. అప్పుడు కావ్యములో అటువంటివి వర్ణింపబడినా రసధ్వని అని పేరు రాదు.

కొందరీవిధముగా అంటారు - "రసములు ప్రధానము లయినప్పుడే రసత్వము ఉంటుంది. అపుడు వానికి రసము అనే వ్యపదేశము పొందే అర్హత లేదు. అయినా అటువంటివానిని కొందరు రసాలంకారము లని అంటున్నారు. అంటే అది బ్రాహ్మణశ్రమణన్యాయమును అనుసరించి కుదురుపాటును పొందుతుందని అనుకోవాలి. ఆ న్యాయమును అనుసరించి *అలంకారధ్వని వ్యపదేశమును కుదుర్చుకొన్నట్లు దీనిని సరిపుచ్చు

*వేరొకదానిని శోభింపజేసేది అలంకారము అవుతుంది. "అలంక్రియతేఽనేనేత్యలంకారః" అనే అలంకార పదవ్యుత్పత్తి ఈ అర్థమునే చెప్పుతున్నది. శోభితమయ్యేది అలంకారము కాదు. ధ్వనితమయ్యే అర్థము దీనినే శోభింపచెయ్యదు. దానికి ఒక ఉపకరణము శోభనిచ్చేది ఉండాలి. ధ్వనితమవుతూ ఉండే అర్థాన్ని అలంకార

కోవాలి. బ్రాహ్మణశ్రమణన్యాయమంటే ఈ విధముగా గ్రహించాలి. ఒక బ్రాహ్మణుడు బౌద్ధమతదీక్షను స్వీకరించి శ్రమణుడయినాడు. శ్రమణుడు బౌద్ధ భిక్షుకుడు. ఆతనికి అప్పుడు బ్రాహ్మణత్వము లేదు. కాని ఆతడు మొదట బ్రాహ్మణుడు కావడముమూలాన శ్రమణావస్థలో కూడా "బ్రాహ్మణశ్రమణుడు" అనబడుతున్నాడు. ఆ పద్ధతినే ఇక్కడ గ్రహించాలి.

ఉపమాలంకారధ్వని అన్నప్పుడు కూడా ధ్వన్యమానావస్థలో ఉపమ ముఖ్యమగు అలంకార్యమే అగుటవలన అలంకారము కాకపోయినా ఒకప్పుడు అది అలంకారముగా ఉన్నది కాబట్టి ఇప్పుడుకూడా ఆ పదముతో వ్యవహరింపబడుతున్నదని గ్రహించాలి. ఆ విధముగానే 'రసాలంకారము' అన్నప్పుడు అలంకారావస్థలో రసత్వము లేకపోయినా ప్రధానముగా ఉన్నప్పుడు రసత్వము ఉన్నది. కాబట్టి ఇప్పుడుకూడా ఆ పదముతో వ్యవహరింపబడుతున్నదని భావము. ఏదైనా అవస్థలో రస-అలంకారపదములతో వ్యవహరింపబడినప్పుడు ఇతరావస్థలో కూడా రస-అలంకారపదములతో వ్యవహృతము కావచ్చును.

ఇంకా ఇవి (రసములు) అసంలక్ష్యక్రమవ్యంగ్యరూపముతో ఉన్నప్పుడే "రసము" అని వ్యవహారము. సంలక్ష్యక్రమములు అయినట్లయితే వస్తుమాత్రమే, అప్పుడు రసమనే వ్యవహారము లేదు.

## అసంలక్ష్యత్వము

ఈ రసాలకు అసంలక్ష్యక్రమవ్యంగ్యము లని పేరు. సహృదయులలో సహసా రసాస్వాదము కలుగుతున్నది. ఆ సమయములో విభావానుభావవ్యభిచారిభావాల విమర్శక్రమము ఉన్నది. అయినా అది గోచరముకాదు. నూరుదళాలు కల పద్మముయొక్క పత్రాలను వరుసగా బొత్తిగా పెట్టి క్రొత్తగుండుసూదితో గ్రుచ్చినప్పుడు పత్రశతముకూడా

---

రూపముగా తలచి "అలంకారధ్వని" అని పేరు పెట్టడము సముచితముకాదు. "అలంకార్యధ్వని" అని అనడమే బాగుంటుంది. అయినప్పటికీ "అలంకారధ్వని" అని అంటున్నారు. కుదురుపాటులేని దీన్ని కుదర్చడానికి బ్రాహ్మణశ్రమణన్యాయమును స్వీకరించాలి.

ఒకేసారి గ్రుచ్చబడుతున్నది. మొదట దేనికి వేధ కలిగింది? తరువాత దేనికి కలిగింది? అనే విచారణకు అవసరములేదు. ప్రథమంలో మొదటిది, తరువాత రెండవది, పిమ్మట మూడవది ఇట్లా క్రమముగానే శతపత్ర పత్రశతానికి వేధ కలిగింది. ఈ క్రమము గోచరము కాదు. ఈ విధముగానే శీఘ్రతాకారణంగా రసక్రియాక్రమముకూడా విదితము కాదు. విషయమిది. కాని రసాలు క్రమములేకుండా వ్యంగ్యము లయినవని అక్రమవ్యంగ్యాలని తలచరాదు. ఇవి క్రమరహితములే అయితే రసాభివ్యక్తికీ అభివ్యంజకములకూ ప్రసిద్ధమైన హేతుహేతుమద్భావము (కార్యకారణభావము) కుదరదు. 'విభావాదులు రసాలకు కారణములు' అని అనడము నిర్మూల మవుతుంది. కారణము అవశ్యముగా కార్యానికి పూర్వకాలములో ఉండాలి అని నియమము. /

## రసాలు తొమ్మిదేనా ?

రసాలు ఈ చెప్పినన్నే ఎందుకు కావాలి? ఇంతకు అధికంగా అంగీకరించితే హానిఏమిటి? భగవద్భక్తులయిన వాళ్ళు భాగవత పురాణాది శ్రవణ సమయంలో భక్తిరసమును అనుభవించుతున్నారు. దానిని ఏవిధముగా కప్పిపుచ్చుతారు? అది దురపహ్నవనీయముగా ఉన్నది. భక్తి రసములో భగవానుడు ఆలంబనవిభావము. భాగవతాది శ్రవణము ఉద్దీపన విభావము. రోమాంచాశ్రుపాతాదులు అనుభావాలు. హర్షాదులు సంచారిభావాలు. భగవానుని విషయమైన ప్రేమరూపమైన భక్తి దీనిస్థాయిభావము. ఇదిమట్టుకు రసీభావమును పొందదా? ఈ భక్తి రసము శాంతరసములో అంతర్భావము పొందదు. అనురాగము (భక్తి) వైరాగ్యముకన్న విరుద్ధము. కాబట్టి భక్తి అనేరసము ఉన్నది అని శంక.

దీని కిది సమాధానము: దేవాదివిషయమైన రతికి 'భక్తి' అనిపేరు.అది భావాలలో పరిగణింపబడుతున్నది. కాని అది రసముకాదు.

> రతి ర్దేవాదివిషయా వ్యభిచారీ తథాంచితః
> భావః ప్రోక్తః తదాభాసా హ్యనౌచిత్యప్రవర్తితాః

(దేవగురుపుత్రాదులను విషయముగా చేసికొనిన రతీ వ్యంజనాద్వారా ధ్వనితమైన వ్యభిచారిభావమూ 'భావము' అనబడును.) రసభావాలు అనుచితంగా ప్రవర్తించినవి అయినపుడు "రసాభాస భావాభాస" అన బడుతున్నవి అని ప్రాచీనసాహిత్యాచార్యుల సిద్ధాంతము.

దేవగురుపుత్రాది విషయమైన ప్రేమ, కామినీ విషయమైన ప్రేమ, రెండూకూడా ప్రేమయే కాబట్టి కామినీ విషయమైన ప్రేమకూడా భావమే కాకూడదా ? దీనికీ దానికీ భేదము ఏమి ఉన్నది ? కాకపోతే భగవద్భక్తినే స్థాయిభావమనండి. కామినీ రతినే భావ మనండి. దీనిలో వినిగమకము ఏమిటి ? దీనినే స్థాయిభావ మనాలి, దానిని స్థాయి అన రాదు అనడములో యుక్తి లేదుకదా ! అని అవాంతరశంక.

ఇది ఉచితముకాదు. సాహిత్యశాస్త్రములో రసభావాది వ్యవస్థ భర తాది మునివచనానుసారముగా ఉన్నది. ఈ విషయములో ఇతరు లకు స్వాతంత్ర్యము తగదు. అట్లా కాకపోతే పుత్రాది విషయమైన రతికూడా స్థాయిభావము ఎందుకు కారాదు ? జుగుప్సా శోకాదులే భావాలు ఎందుకు కారాదు ? ఈ విధముగా చర్చ చేస్తే అఖిలసాహితీ దర్శనము వ్యాకులపాటు పొందుతుంది. భరతమునివచనానుసార ముగ నియతమైన రసాల నవత్వగణనము భంజితమవుతుంది. ఒకప్పుడా సంఖ్య తగ్గిపోవచ్చు. ఒకప్పుడధికము కావచ్చు. కాబట్టి యథాశాస్త్ర ముగా తలచుట యుక్తము.

## రసముల పరస్పర విరోధావిరోధాలు

ఈరసాలలో పరస్పరము కొన్నిటికి కొన్ని రసాలతో అవిరోధ మున్నది. కొన్నిటితో విరోధమున్నది. వానిలో వీరశృంగారములకు, శృంగార హాస్యములకు, వీరాద్భుతములకు, వీరరౌద్రములకు, శృంగారాద్భుతము లకు పరస్పరవిరోధము లేదు. శృంగార బీభత్సములకూ, శృంగార కరుణములకూ, వీరభయానకములకూ, శాంతరౌద్రములకూ రౌద్ర శృంగారములకూ పరస్పరము విరోధ మున్నది.

ఇందులో కవి ప్రకృతరసమును బాగా పోషించాలని తలచినట్లయితే, తన కావ్యములో రసానికి మంచి పరిపాకము ఉండాలని భావించితే, దానికి అభివ్యంజకమైన కావ్యములో విరుద్ధరసాంగములను నిబంధించ రాదు. విరుద్ధరసాంగములను వర్ణించినట్లయితే, దానికి అభివృద్ధి ఉన్న ట్లయితే ప్రస్తుతరసమును బాధించుతుంది. లేక సుందోపసుందన్యాయ ముగా రెండిటికీ హానికలుగుతుంది. ప్రకృతానికి పరిపోషము ఉండదు. అప్రకృతమునకూ శోభ ఉండదు.

విరుద్ధ రసాలకు కూడా ఒకచోట సమావేశమును వర్ణించాలని కవి అభిలాషపడితే ముందుగా వాని విరోధమును పరిహరించి వర్ణించాలి. విరోధమును ఏవిధముగా పరిహరించాలో ఈ క్రిందివిధాన తెలుసుకో వాలి. విరోధము రెండు విధాలు. ఒకటి స్థితివిరోధము, రెండవది జ్ఞాన విరోధము. స్థితివిరోధ మనగా ఒక ఆధారమందు రెండూ ఉండకపోవుట. జ్ఞానవిరోధ మనగా ఒకజ్ఞానమువలన రెండవజ్ఞానము బాధింపబడుట, అంటే ఏ రెండురసముల జ్ఞానములో ఒకటి రెండవదానికి ప్రతిద్వంద్విగా ఉంటుందో దానిలో జ్ఞాన విరోధ మున్నదని భావము.

వీనిలో విరోధిరసమును రెండవ ఆధారములో స్థాపించినట్లయితే మొదటివిరోధము నివృత్త మైపోతుంది. నాయక గతముగా వీరరసము వర్ణింపబడవలసి ఉన్నప్పుడు ప్రతినాయకగతముగా విరోధిరసమైన భయానకరసమును వర్ణించి విరోధమును నివర్తించాలి.

ఈ ప్రకరణములో రసపదముతో రసానికి ఉపాధిభూతమయిన స్థాయి భావమును గ్రహించాలి. రసము ప్రేక్షకులయిన సహృదయ సామాజిక వ్యక్తులందు ఉంటుంది కాని నాయికా నాయకులందు ఉండదు. రసము అద్వితీయానందమయము. రసప్రతీతి కలిగినప్పుడు ఇతరప్రతీతి ఏ మాత్రమూ కలుగదు. ఆ సమయములో విరోధప్రతీతి ఏమాత్రమూ సంభవింపదు.

విరుద్ధ రసాలకు స్థితివిరోధము ఏవిధముగా పోతుందో ఈ ఉదాహరణ మును చూడాలి.

కుండలీకృతకోదండదోర్దండస్య పుర_స్తవ
మృగారాతే రివ మృగాః పరే నై వావతస్థిరే

రాజునుగురించి కవివచనము. కుండలాకారముగా చేసిన కోదండము దోర్దండములో ఉన్న నీ యెదుట, సింహము ఎదుట మృగాలవలె శత్రువులు ఉండలేకపోయినారు.

దీనిలో నాయకునియందు వీరరసమూ ప్రతినాయకునియందు భయానక రసమూ వర్ణింపబడినవి.

రెండురసాలకు విరుద్ధము కానట్టి రసాంతరమును ఆ రెండురసాల అంత రాళములో వర్ణించినట్లయితే జ్ఞానవిరోధము నివృత్తమైపోతుంది. సంధిసంధాత విరోధుల మధ్య ఉన్నప్పుడు విరోధము నివృత్తమైపోవు నట్లుగా ప్రకృతములోకూడా ఊహించాలి. నేను (పండితరాజు) రచించిన ఆఖ్యాయికలో కణ్వాశ్రమములో ఉన్న శ్వేతకేతు మహర్షి యొక్క శాంతరస ప్రధానకమైన వర్ణనము ప్రస్తుతము.

"కిమిద మనాకలితపూర్వం రూపం
కోయ మనిర్వాచ్యో వచన రచనాయా మధురిమా"

ఈ రూపము ఎంతబాగున్నది ? ఇటువంటి రూపసంపద ఇంతవరకూ అనుభవగోచరము కాలేదు. ఈ వచనరచనామధురత్వము అనిర్వాచ్యముగా ఉన్నది. అని అద్భుత రసమును అంతరాళములో అవస్థాపనము చేయడముచేత అవిరోధమును "వరవర్ణిని" అనేపేరు కలిగిన నాయికనుగురించి అనురాగ వర్ణనము చేయడములో భావనము చేయాలి. దీనిలో శాంత శృంగారముల మధ్య అద్భుతసన్నివేశమువలన విరోధము నశించిపోతున్నది. ఉదా:

సురాంగనాభి రాశ్లిష్టా వ్యోమ్ని వీరా విమానగాః
విలోకంతే నిజాన్ దేహాన్ ఫేరునారీభి రావృతాన్

దేవాంగనలచే ఆలింగితులై ఆకాశములో విమానములమీద ఉన్న

వీరులు ఆడగుంటనక్కలచే ఆవృతములయిన తమ దేహములను దర్శించుతున్నారు.

దీనిలో శృంగారమునకు సురాంగన ఆలంబనము. బీభత్సమునకు మృతశరీరము ఆలంబనము. ఈ విధముగా శృంగార బీభత్సములు రెండూ ఇందులో వర్ణింపబడినవి. వీని అంతరాళములో వీరరసము నివిష్టమైనది. విరుద్ధములయిన శృంగార బీభత్స రసములకు విరోధమును పరిహరించే వీరరసము స్వర్గప్రాప్తివర్ణనమువలన ఆక్షిప్తమవుతున్నది. అంతరాళములో నివేశింపచేయబడుట అంటే పరస్పర విరుద్ధాలయిన రసాలయొక్క ఆస్వాదన సమయము ఏదిఉన్నదో వాని మధ్యసమయములో ఆస్వాదన కలుగునట్లుగా చేయుట అని అర్థము. ప్రకృత పద్యములో పూర్వార్థములోనే శృంగార వర్ణనానంతరము వీరరసచర్వణము ఉన్నది, అనంతరము ఉత్తరార్థములో బీభత్సరసచర్వణ ఉన్నది, అని స్పష్టముగా గోచర మవుతున్నది.

> భూరేణుదిగ్ధాన్ నవపారిజాత
> మాలారజోవాసితబాహుమధ్యాః
> గాఢం శివాభిః పరిరభ్యమాణాన్
> సురాంగనా శ్లిష్ట భుజాంతరాళాః
>
> సశోణితైః క్రవ్యభుజాం స్ఫురద్భిః
> పక్షైః ఖగానా ముపవీజ్యమానాన్
> సంవీజితా శ్చందనవారిసేకైః
> సుగంధిభిః కల్ప లతాదుకూలైః
>
> విమాన పర్యంకతలే నిషణ్ణాః
> కుతూహలావిష్టతయా తదానీం
> నిర్దిశ్యమానాన్ లలనాంగుళీభిః
> వీరాః స్వదేహాన్ పతితా నపశ్యన్.

రణాంగణ వర్ణనము. కవి ఈ విధముగా చెప్పుతున్నాడు. భూపరాగము చేత అభివ్యాప్త మయినట్టిన్నీ, గాఢముగా ఆడునక్కలచే ఆశ్లేషింప

బడుచున్నట్టిన్ని, మాంసభక్షణము చేస్తున్న పక్షులయొక్క సశోణితస్ఫురత్పక్షములచేత విసరబడునటువంటిన్ని, లలనల వ్రేళ్లచే నిర్దిశ్యమానము లవుతూ ఉన్న రణాంగణ పతితము లయిన తమ దేహములను నవపారిజాతమాలలలోని పరాగములచేత పరిమళితములయిన వక్షఃపీఠి కలిగిన, గాఢముగా దేవాంగనాలింగితులయిన, చందనోదక సంసిక్తములు కావడముచేత సుగంధయుతము లయిన, కల్పలతా దుకూలములచేత చక్కగా వీజితులయిన వీరులు విమాన పర్యంకతలములలో ఉపవిష్టులై ఆసమయములో కుతూహలము కలిగినవారు కావడముచేత చూచినారు. రణరంగములో ప్రచండయుద్ధముచేసి నిహతులై వీరస్వర్గము పొంది అప్సరఃకన్యాపరివృతు లయిన వీరులు విమానాలలో నుండి లలనలు చూపించుతూ ఉంటే యుద్ధభూమిలో పడి ఉన్న తమ దేహాలను సాశ్చర్యంగా చూస్తున్నా రన్నమాట.

ఈ మొదలయిన కావ్యప్రకాశపద్యకదంబములో మొదట బీభత్సరససామగ్రి స్ఫుట మవుతున్నది. అందువలన బీభత్సరసాస్వాదన కలుగుతున్నది. దాని అనంతరము బీభత్సరససామగ్రీవశమువలన వీరరససామగ్రి ఆక్షిప్త మవుతున్నది. "నిశ్శంకముగా వీరులు ప్రాణత్యాగము చేసినారు" ఇత్యాదికమును వీరరససామగ్రిగా గ్రహించాలి. దాని ద్వారా వీరరసచర్వణ కలుగగా శృంగారరసాస్వాదనము కలుగుతున్నది. ఈ విధముగా ప్రకృతమైన "సురాంగనాభిః" అనే ఉదాహరణమునకూ కావ్యప్రకాశగతోదాహరణమునకూ అంతరమును గ్రహించాలి. అనగా మాపద్యములో క్రమముగా శృంగార వీరబీభత్స రసాల ఆస్వాదనము కలుగుతున్నది. కావ్యప్రకాశపద్యములో బీభత్స వీర శృంగారములకు ఆస్వాదము కలుగుతున్నది.

విరుద్ధరసముల మధ్యలో రెండిటికీ అవిరుద్ధమైన రసముయొక్క ఆస్వాదము ఉండడమువలన ప్రతిబంధము కలుగజేసే జ్ఞానము నివృత్తమై పోతున్నది. అందువలన ప్రతిబంధింపబడిన రసముయొక్క ఆస్వాదనము నిర్విఘ్నముగా కలుగుతున్నది. దాని చర్వణలో ఏ విధమైన అడ్డంకి కూడా లేదు అని ఫలితార్థము.

ఒక రసము ఇతర రసభావాలకు అంగమైనప్పుడు, అనగా అంగాంగి భావము పొంది ఉన్నప్పుడు కాని, రెండు విరుద్ధరసములు అంగిగా ఉన్న వేరొక రసములో అంగభావము పొంది ఉన్నప్పుడు కాని విరోధము ఉండదు. ప్రధానవిరుద్ధము లయినవి అంగములుకావుగదా - ఉదాహరణము:

ప్రత్యుద్గతా సవినయం సహసా సఖీభిః
స్మేరైః స్మరస్య సచివైః సరసావలోకైః
మామద్య మంజురచనై ర్వచనైశ్చ బాలే!
హా! లేశతోఽపి న కథం బ్రత! సత్కరోషి?

హా! ప్రియా? నీవు చెలికత్తెలతో సవినయముగా త్వరగా నన్ను ఎదుర్కొని మన్మథమిత్రములయిన చిరునగవుల సరసావలోకనములతో మంజురచనలు కల వచనాలతో నేడు నాకు లేశముగా నయినా సత్కారము చేయవేమి? చెప్పూ.

ఇది ఎదట పడిఉన్న చనిపోయిన నాయికను గురించి నాయకుని వచనము. దీనిలో నాయికాలంబనముగా అశ్రుపాతాదులు అనుభావములుగా ఆవేగనిర్వేదాదులు వ్యభిచారులుగా నాయికావిషయమైననాయకగతరతి వ్యజ్యమానమవుతున్నది. ఈ చెప్పబడినవే విభావానుభావ వ్యభిచారులుగా నాయకగతమైన శోకము గోచర మవుతున్నది. ఇట్లా సమానసామగ్రీ న్యకమైన శోకము ప్రకృతము అగుటవలన ప్రధానము. రతి ఈ శోకమును అతిశయింపజేస్తున్నది. అందువలన శోకములో రతి అంగము.

దీనిలో నాయకప్రేమ ప్రతీతము కావడములేదు. పూర్వము చెప్పిన సామగ్రిద్వారా నాయకుని శోకమే ప్రతీతమవుతున్నది. అదియే ప్రస్తుతము. ఆ వరాకునికి ప్రేమ ఎట్లావచ్చింది? ఆతడా అవస్థలో శోకము పొందవలసి ఉన్నాడు. అని అండములో అభినివేశము ఉన్నట్లయితే-

నాయకుడు ఆలంబనముగా ప్రత్యుద్గమాదులు అనుభావములుగా హర్షాదులు వ్యభిచారులుగా నాయక విషయకమైన నాయికారతియే గోచర

మవుతున్నది. కాబట్టి అదే అంగము కావచ్చు. నాయికాగతమైన రతి నాయకుని శోకమును అతిశయింపజేస్తుందని సర్వసమ్మతము

"నాయిక నశించిపోయింది. ఆమె ప్రేమకూడా ప్రకృతంలో లేదు. అటువంటి రతి శోకానికి అంగమెట్లా అవుతుంది? అనే ఆశంక అవసరము కాదు. అంగముగా అగునట్టిది "ఉండితీరాలి" అనే నియమము లేదు. నాయికారతి సన్నిధానము అంగత్వము పొందడములో తంత్రము కాదు. స్మరింపబడునట్టి ఆ ప్రేమ అంగము కావచ్చును.

అన్యాంగములయిన విరుద్ధరసాలకు విరోధము లేకపోవడములో ఉదాహరణము:

> ఉత్క్షిప్తాః కబరీభరం వివలితాః పార్శ్వద్వయం న్యక్కృతాః
> పాదాంభోజయుగం రుషా పరిహృతా దూరేణ చేలాంచలం
> గృహ్ణంతి త్వరయా భవత్ప్రతిభటక్ష్మాపాలవామభ్రువాం
> యాంతీనాం గహనేషు కంటకచితాః కే కే న భూమీరుహాః

ఇది రాజస్తుతిపరమైన పద్యము. రాజా! కంటకములతో వ్యాప్తము లయిన ఏయే వృక్షములు అరణ్యములలో వెళ్ళుతూ ఉన్న నీ శత్రురాజయువతులయొక్క పైకి ఎత్తబడినవై కబరీభరమును, అటూ ఇటూ సర్దబడినవై పార్శ్వద్వయమును, తిరస్కరింపబడినవై పాదపద్మద్వంద్వమును, కోపముతో దూరముగా పరిహరింపబడినవై చీర చెరగును త్వరగా గ్రహించడము లేదు? అరణ్యాలలో వెళ్లుతూ ఉన్నప్పుడు కంటకి వృక్షాలు బాధపెట్టుతున్నవని భావము. పరకీయలయిన యువతులు నిర్జన భాగాలలో పోతూ ఉంటే కొంటెతనపు కోడెగాండ్రు ఎంత వామవామంగా ఉన్నా అనుభవానికి అనేక విధాల అనుసరించుతున్నారని కూడా దీనిలో గోచరము అవుతున్నది.

ఈ పద్యములో సమాసోక్త్యలంకార మున్నది. రెండు విధములయిన వ్యవహారములు ఆ సమాసోక్తికి అంగములుగా ఉన్నవి ఒకటి ప్రస్తుతము, వేరొకటి అప్రస్తుతము. వృక్షములు స్త్రీల కేశపాశాదులను పట్టుకొనుట ప్రస్తుత వ్యవహారము. కాముకులు కామినీమణీకబరీ

గ్రహణము చేయుట అప్రస్తుతమయిన వ్యవహారము. ఈ రెండు వ్యవహారముల వలనా కరుణ శృంగారములు రెండూ అభివ్యక్తము లవుతున్నవి. ఆవిధముగా గోచరీకృతము లవుతున్న రెండు రసములూ పరస్పర విరుద్ధము లయినప్పటికీ ప్రకృతపద్యములో ప్రధానభూత మైన రాజవిషయకమైన కవిప్రేమలో అంగభూతము లవుతున్నవి. ఆ ప్రేమకే పరిపోషకములుగా ఉన్నవి. అందువలననే కరుణ శృంగారము లకు దీనిలో విరోధములేదు.

## విరోధి రసవర్ణనావశ్యకత

"ప్రకృత రసాన్ని పోషించాలి" అని కవి తలచిన విరోధి రసమును బాధింపబడునట్లుగా నిబంధించాలి. విరోధిరసము బాధితము అగుట ఉచితము కాబట్టి దాని వర్ణనము ఆవశ్యకము. ఈవిధముగా చేసి నప్పుడు వర్ణింపదలచిన రసానికి వైరివిజయకృతముగా అనిర్వాచనీయ మైన శోభ కలుగుతుంది. విరోధిరసాంగములు ప్రబలములు అగుట వలన తన అంగము లున్నప్పటికీ రసాభివ్యక్తి లేకపోవడమును 'రసము బాధింపబడుట'నుగా తెలుసుకోవాలి. ఏదయినా ఒక రసము అభి వ్యక్తము కావడానికి సామగ్రి ఉన్నప్పటికీ తదితర సామగ్రి ప్రబల మగుటవలన మొదటి రసము అభివ్యక్తము కాదు. అదే "రసము బాధింపబడుట" (బాధ్యత్వము) అని గ్రహించాలి. వ్యభిచారి భావాలు బాధింపబడుట అంటే వానిద్వారా ఏరసముయొక్క అభివ్యక్తిని ఆకాం క్షించుతున్నామో ఆ అభివ్యక్తి లేకపోవుట అన్నమాట. అంతే కాని వ్యభిచారిభావాలు అభివ్యక్తములు కాకపోవుట కాదు. వ్యభిచారి భావాలు అభివ్యక్తములు కావచ్చును. వాని అభివ్యక్తిలో బాధక మేమీ లేదు. వ్యభిచారిభావాలు ఆ విధముగా అభివ్యక్తి పొందినా ఏమీ ఇబ్బంది లేదు.

"విరోధి రసానికి సంబంధించిన అంగరూపములయిన వ్యభిచారి భావాలు బాగా అభివ్యక్తి పొందితే ప్రతిబంధము కలుగుతుందికదా! అందు వలన ప్రస్తుతభావానికి అభివ్యక్తి కలుగదే—

అని తలచ నవసరము లేదు. ప్రస్తుత భావాలను అభివ్యక్తము చేసే శబ్దార్థముల జ్ఞానము ఏ సమయములో కలుగుతున్నదో ఆ సమయంలో విరోధి రసానికి సంబంధించిన అంగరూపములయిన భావాలను అభివ్యంజనము చేయునట్టి శబ్దార్థముల జ్ఞానము ఉండదు. విషయము ఈవిధముగా ఉండగా కొన్ని భావాలు ప్రతిబధ్యములనీ కొన్ని ప్రతిబంధకములనీ వీనికి ప్రతిబధ్య ప్రతిబంధక భావమును కల్పనము చేయడములో ప్రమాణము లేదు. ఈ విధముగానే తలచితే భావశబలతకు అవకాశమే ఉండదు. అది ఉచ్ఛిన్నము కావలసి వస్తుంది. ఒక పద్యములో అనేక విరుద్ధభావాలను సమావేశపరచడము భావశబలత అంటున్నారు. అటువంటి భావశబలత ఉన్నట్లు అందరికీ సమ్మతమే. రసాభివ్యక్తి అడ్డుపెట్టబడుట అనుభవసిద్ధము. కాబట్టి రసాభివ్యక్తిలోనే విరోధిరసాలకు సంబంధించిన ప్రబలాంగముల అభివ్యక్తి ప్రతిబంధకము అవుతుందని అంగీకరించడము న్యాయ్యముగా ఉంటుంది. అంతేకాని వ్యభిచారిభావవిషయములో కాదు.

విశేషణముల ప్రభావమువలన రెండు విరుద్ధరసముల అభివ్యక్తి కలిగినప్పుడు విరోధము నివృత్తమైపోతుంది. ఉదా:

> నితాంతం యౌవనోన్మత్తాః గాఢరక్తాః సదాహవే
> వసుంధరాం సమాలింగ్య శేరతే వీర! తేఽరయః॥

దీనిలో సాధారణవిశేషణముల ద్వారా కరుణశృంగారముల ప్రతీతి కలుగుతున్నది. ఇది దీనిభావము. "మిక్కిలి యౌవనోన్మత్తులై గాఢరక్తులై వసుంధరను ఆలింగనముచేసికొని, *వీర! నీ శత్రువులు శయనించుతున్నారు." ఈ విశేషణములు మూడూ రెండర్థములలోనూ సమన్వయము పొందుతవి.

---

* వీరప్రభూ! మిక్కిలి యౌవనముచేత ఉన్మత్తులయినట్టిన్ని, యుద్ధములో నిత్యమూ గాఢముగా అభిమానము కలిగినట్టిన్ని నీ శత్రువులు భూమిని ఆలింగనము చేసికొని శయనించుతున్నారు. దీనిలో విశేషణ ప్రభావం వలన అన్యార్థముకూడా గోచరమవుతున్నది. "నితాంతమూ యౌవనోన్మత్తులయిన, కామసంగరంలో నిత్యమూ గాఢరక్తులయిన నీ శత్రువులు వసుంధర అనే నాయికను బాగా కౌగిలించుకొని శయనించుతున్నారు" అని.

## రసవర్ణనలో దోషాలు

ఈ చెప్పిన విధముగా విరోధమును పరిహరించికూడా నిబంధింపబడిన రసము "రసము" అనే శబ్దముచేగాని "శృంగారాది" శబ్దములచేగాని చెప్పబడుట ఉచితము కాదు. స్వశబ్దోక్తిఉంటే రసము ఆస్వాద్యము కాదు. ప్రకటమయినప్పుడు దాని అభిరుచి తగ్గుతుంది. రసాస్వాదము కేవలము వ్యంజనావృత్తిచేత సిద్ధముకావాలని ఇదివరలో చెప్పబడినది. విభావాదులచేత అభివ్యక్తమైన రసము స్వశబ్దముచేత చెప్పబడినపుడు "వమనా"ఖ్య దోషము కలుగుతుందని చెప్పబోతున్నాము. వ్యంగ్యము వాచ్యమయినప్పుడు సామాన్యముగా ఈ దోషమే కలుగుతుంది. ఆయా రసాల నామాలను గ్రహించి వాచ్యవృత్తిని ఆశ్రయించితే, ఏ రూపముతో రసానికి ఆస్వాద్యత్వము ఉంటుందో (ఏ రూపములో రసమును ఆస్వాదింపదలచినామో) వాచ్యవృత్తి ఆ రూపముతో ప్రత్యయమును సంపాదింపలేదు. తద్రూపంగా బోధను జనింప చేయలేదన్నమాట. రసముల వర్ణన విషయములో వాచ్యవ్యాపారము క్రామేయకల్పము (కోతి చేష్టతో సమానము). కపి అస్థానంలో చేష్టించుతుంది. ఈ వ్యవసాయముకూడా అటువంటిదే అని భావము.

ఈ విధముగానే స్థాయి వ్యభిచారి భావాలకుకూడా స్వశబ్ద వాచ్యత్వము దోషమే. విభావానుభావాలు బాగా ప్రతీతములు కానపుడూ విలంబముగా ప్రతీతములయినపుడున్నూ రసాస్వాదము కలుగదు కాబట్టి దోషమున్నది. బాగా ప్రతీతము కాకపోవుట, విలంబముగా ప్రతీతమగుట అనేవి దోషములని భావము. ప్రస్తుతరసాంగములకంటె విరోధి రసాంగములకు సంబంధించిన అంగాలను సమబలము కలవానినిగా వర్ణించినా ప్రబలములయిన వానినిగా వర్ణించినా దోషమే. ఆ విధముగా వర్ణించుట, నిబంధించుట ప్రకృత రసపరిపోషానికి ప్రతికూలము. ఒక ప్రబంధములో ఏరసమును వర్ణించుతామో అది రెండవ ప్రసంగమువలన విచ్ఛిన్నమయినపుడు దానిని మరల దీపింప చేయరాదు. ఆ విధముగా చేస్తే సామాజికులకు సమగ్రముగా రసాస్వాదము కలుగదు. కాబట్టి ఈ విచ్ఛిన్నదీపనము దోషము. అట్లాగే రసము

ఏ సమయములో ప్రస్తావించుటకు అర్హమయినది కాదో అటువంటి అనర్హమైన అవసరములో ప్రస్తావము చేయుటకూడా దోషము. రసానికి ఏసమయములో విచ్ఛేదము కలుగజేయరాదో అటువంటి విచ్ఛేదానర్హమైన సమయములో విచ్ఛేదము కలుగజేయుటకూడా దోషము. సంధ్యావంధన, దేవయజన, దేవీవరివస్యాది ధర్మకర్మ వర్ణనము ప్రసక్తముకాగా ఆ సమయములో ఒక కామినితో పాటు ఒక కాముకునకు అనురాగమును వర్ణించుట దోషము. మహాయుద్ధములో మదమత్తశత్రువీరులు ఉద్ధతులు కాగా మర్మభేదనము చేసే వచనాలను పలుకుతూ ఉండగా ఆ సమయములో నాయకుడు సంధ్యావందనాదులను చేస్తూ ఉన్నట్లు వర్ణించడముకూడా అనుచితమే.

ప్రధానుడు కానట్టి ప్రతినాయకాదుల యొక్క నానా ప్రకారము లయిన చరిత్రలకు ప్రధాన నాయక చరిత్రముకంటె ఆధిక్యమును వర్ణించరాదు. ప్రతినాయకుని నానాసంపదలకు నాయకసంపదకంటె అతిశయమును వర్ణించరాదు. ఆ విధముగా చేసినపుడు వర్ణింపవలసిన నాయకుని ఉత్కర్ష సిద్ధింపదు. నాయకోత్కర్ష హేతువుగా కలుగవలసిన పరిపోషముకూడా కలుగదు.

"ప్రతినాయకుని ఉత్కర్ష ఆతని తిరస్కరించునట్టి నాయకుని ఉత్కర్షలో అంగము అవుతుంది కాబట్టి ప్రతినాయక విశేషము వర్ణనీయము కాకూడదా ?

అని శంకించ నవసరములేదు. ప్రతినాయకుని ఎట్టి ఉత్కర్ష ఆతని నిరాసముచేసే నాయకుని ఉత్కర్షకు అంగము అవుతుందో అటువంటి ఉత్కర్షను వర్ణించడము ఇష్టమే. నాయకుని ఉత్కర్షకు విరుద్ధమయినట్టి ప్రతినాయకుని ఉత్కర్ష మాత్రము నిషేధింపబడుతున్నది.

ప్రకృత నాయకునికంటె ప్రతిపక్షి ఉత్కర్ష వర్ణనము చేసినా అటువంటి ప్రతిపక్ష నాయకుని హననము చేసినందువలననే ప్రకృతములో ఉత్కర్ష అతిశయింపవచ్చును. కాని అంత మాత్రాన ప్రతిపక్ష విశేషమును అధికముగా వర్ణించవచ్చునని అనుకోరాదు. అట్లాగే అయితే

ఒక మహారాజవీరుని విషాక్తబాణమును విసిరి ఒక నీచుడయిన భిల్లుడు చంపితే ఆతనికి ఏమీ ఉత్కర్ష లేనట్లుగా ప్రకృత నాయకునకు కూడా ఏమీ ఉత్కర్ష ఉండదు. కేవలము ప్రతిపక్ష నాయకుని చంపినంత మాత్రాన ఉత్కర్ష రాదు. కాబట్టి ప్రకృతనాయకుని కంటె ప్రతినాయకుని సంపదాదులకు అతిశయమును వర్ణింపరాదు. రసానికి సంబంధించిన ఆలంబనమును ఆశ్రయమును మధ్యమధ్యలో అనుసంధానము చెయ్యాలి. అట్లు చేయకపోతే దోషము. రసానుభవ ధార ఆలంబనాశ్రయములయొక్క అనుసంధానమును అధీనముచేసి కొని ఉంటుంది. వానికి సరిగా అనుసంధానము లేకపోతే అనుభవ ధార నివృత్తమైపోతుంది. ఇట్లాగే ప్రకృత రసానికి సంబంధించనట్టి, ఏమాత్రమూ లాభము సంపాదించనట్టి వస్తువునుకూడా వర్ణించరాదు. అది ప్రస్తుత రసవిరామహేతువవుతుంది. ఆ దోషమును పరిత్యజించాలి.

## అనౌచిత్యము

అనౌచిత్యము రసభంగ హేతువు. కాబట్టి దానిని పరిహరించాలి. పానకరసములో కరకర మనే ఇసుక మొదలయినవి పడినప్పుడు రసానుభవములో బాధకలిగినట్లుగా రసాస్వాదములో వ్యథ కలుగుట "రసభంగము" అని తెలుసుకోవాలి. జాతి, దేశము, కాలము, వర్ణము, ఆశ్రమము, వయస్సు, అవస్థ, ప్రకృతి, వ్యవహారము మొదలయిన ప్రాపంచిక పదార్థముల విషయములో ఏయే లోకశాస్త్ర సిద్ధములయిన ద్రవ్యగుణ క్రియాదులు ఉన్నవో వానికంటె భిన్నముగా ఉన్నప్పుడు రసములో భంగపాటు కలుగుతుంది.

జాత్యాదుల అనుచిత వ్యవహారానికి ఈ క్రింది ఉదాహరణములను భావించ వచ్చును.

(గోవు మొదలయిన వానికి తేజోబల కార్యములయిన పరాక్రమాదులను వర్ణించుట, సింహాదులకు సాధుభావము మొదలయినవానిని వర్ణించుట జాతివిరుద్ధము.)

స్వర్గములో జరావ్యాధు లున్నవనుట, భూలోకములో సుధాసేవనము ఉన్నదనుట దేశ విరుద్ధము. (౨)

శిశిరఋతువులో జలవిహారాదివర్ణనము, గ్రీష్మఋతువులో అగ్ని సేవ మొదలయినవి కాలవిరుద్ధములు. (౩)

బ్రాహ్మణునకు వేటను వర్ణించుట, క్షత్రియునకు ప్రతిగ్రహము చెప్పుట, శూద్రునకు నిగమాధ్యయనమూ వర్ణవిరుద్ధము. (౪)

బ్రహ్మచారికి యతికీ తాంబూలచర్వణము చెప్పుట, స్త్రీ సేవనమును వర్ణించుట ఆశ్రమ విరుద్ధము. (౫)

బాలుడూ వృద్ధుడూ స్త్రీని సేవించినట్లు చెప్పుట, యువకునకు వైరాగ్యము ఉన్నదనుట అవస్థావిరుద్ధము. (౬)

దరిద్రునకు ధనికాచరణమూ ధనికులకు దరిద్రాచరణమూ స్థితివిరుద్ధము.

## ప్రకృతి

ప్రకృతులు మూడువిధములు దివ్యప్రకృతి, అదివ్యప్రకృతి, దివ్యాదివ్య ప్రకృతి అని. దేవతారూపులయిన ఇంద్రాదులు దివ్యులు, మానవు లయిన దుష్యంతాదులు అదివ్యులు, స్వర్గీయులయిన అవతారరూపముగా వచ్చిన మానవులు దివ్యాదివ్యులు.

సాహిత్యశాస్త్రానుసారముగా ఈ ప్రకృతులకు వేరువిధాల భేదాలను కూడా ఊహించవచ్చును. ధీరోదాత్త నాయకునిలో ఉత్సాహము ప్రధానముగా ఉంటుంది. ధీరోద్ధతునిలో క్రోధము ప్రధానము. ధీరలలిత నాయకునిలో కామినీరతి ముఖ్యము. ధీరశాంతునకు నిర్వేదము ముఖ్యము. ఇటువంటి ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరలలిత, ధీరశాంతభే దాన్నిబట్టి పైనిచెప్పిన ప్రకృతిత్రయమును ద్వాదశవిధముగా ఊహించ వచ్చును. ఇటువంటి నాయకుడు ఉత్తముడని, మధ్యముడని, అధముడని మూడువిధాలు. ఈ విధముగా ముప్పదిఆరు విధములను ఊహించాలి.

ఈ నాయకులలో భయాతిరిక్తములయిన స్థాయిభావాలు అందరి

లోనూ సమానములే. అయినా సంభోగరూపమయిన రతిని మానవులలో మాదిరిగా ఉత్తమదేవతలలో స్ఫుటముగా ఉండేటట్లు వర్ణించడము ఉచితముకాదు. ఉత్తమదేవతలలో సర్వవిధాశ్లేష చుంబనాది వ్యవహారాలను వర్ణించరాదు.

లోకభస్మీకరణ సమర్థములయిన, రాత్రిందినములను మార్చగల శక్తి కలిగిన అనేకాశ్చర్యములను కలుగజేసే క్రోధమును దివ్యనాయకులలో వర్ణించినట్లుగా అదివ్యనాయకులలో వర్ణించుట అనుచితము. దివ్యాలంబనములలో మనకు పూజ్యతాబుద్ధి ఉన్నది. అదివ్యాలంబనములలో పూర్వోక్తానుభావములు అసత్యము లని గోచరమయినపుడు రసానికి సముల్లాసము కలుగదు. సహృదయులకు రసోద్బోధ ఎక్కడ ప్రామాణికంగా భాసించుతుందో అక్కడే సాధారణీకృతి కలుగుతుంది గాని ఇటువంటి అప్రమాణసిద్ధవిషయాలలో సాధారణీకృతి కలుగదు. అందువలననే మనకు పూజ్యతాబుద్ధి కలుగుతుంది. రసోద్బోధ ప్రమాణసిద్ధము కాకపోయినా సాధారణీకరణము ఉంటుంది అనేటట్లయితే తన మాతృవిషయకమయిన తన పితృరతివర్ణనములో కూడా సాధారణీకృతి కలిగి సహృదయులకు రసోద్బోధ కలుగవలసివస్తుంది. ఆ విధముగా కలగడము ఎవరికీ అనుభవములో లేదు.

జయదేవుడు మొదలయినవారు తాము రచించిన గీతగోవిందాది ప్రబంధాలలో సకలసహృదయ సమ్మతమైన ఈ సమయమును మదోన్మత్త మతంగజాల మాదిరిగా భిన్నము చేశారు. వారిని నిదర్శనంగా పెట్టుకొని ఇప్పటివారు ఆ విధముగా వర్ణించడము సముచితము కాదు.

ఈ చెప్పిన ఔచిత్యానుసారముగానే విద్యావయోఽవస్థాతపోయుక్తులయిన గొప్పవారు తమకన్న చిన్నవారిని సమ్మానయుక్తవచనాలతో వ్యవహరించరాదు. అపకృష్టులయిన (తక్కువ) వారు ఉత్కృష్టులయిన వారిని ఆ విధముగా వ్యవహరించాలి. సబహుమానవచనాలతో సంభాషించాలి. అందులోకూడా "తత్రభవన్-భగవన్" మొదలయిన

సంబోధనాలతో మునిగురు దేవతా ప్రభృతులనే వ్యవహరించాలి కాని రాజులను సంబోధించరాదు. దానిలోకూడా జాత్యుత్తములయిన బ్రాహ్మణ క్షత్రియ వైశ్యు లనబడే ద్విజులే ఇటువంటి సంబోధనలను ప్రయోగించాలి. కాని శూద్రాదులు ఇట్టి ఈ సంబోధనలను స్వీకరించరాదు. చక్రవర్తులు మొదలయినవారినే "పరమేశ్వర" మొదలయిన పదాలతో సంబోధించాలి. మునులు మొదలయినవారిని ఆ విధముగా సంబోధించరాదు. ఈ విషయమును విచారధారతో విమర్శించి ఆనందవర్ధనుడు ఈ విధముగా అంటున్నాడు.

> అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగస్య కారణం
> ప్రసిద్ధౌచిత్యబంధ స్తు రసస్యోపనిషత్పరా.

రసభంగానికి అనౌచిత్యముకంటె ఇతరకారణములేదు. ప్రసిద్ధమైన ఔచిత్యనిబంధనము నిరతిశయ మగు రసోపనిషత్తుగా చెప్పబడుచున్నది. ఉపనిషత్తువలన బ్రహ్మ ప్రతిపాదనము ఉన్నట్లుగా ఔచిత్యమువలన రసప్రతిపాదనము ఉన్నదని భావము. కాబట్టి ఔచిత్యరక్షణము సర్వథా కర్తవ్యము.

## అనౌచిత్యమువలన రసపుష్టి

ఎంతటి అనౌచిత్యమువలన రసపరిపుష్టి కలుగుతుందో అంతటి అనౌచిత్యమును వర్ణించవచ్చును. అందులో నిషేధములేదు. రసప్రతికూలమైన అనౌచిత్యమే నిషేధ్యము. అందువలననే:

> బ్రహ్మన్! అధ్యయనస్య నైష సమయ స్తూష్ణీం బహిః స్థీయతాం
> స్వల్పం జల్ప బృహస్పతే! జడమతే! నైషా సభా వజ్రిణః
> వీణాం సంహర నారద! స్తుతికథాలాపై రలం తుంబుర!
> సీతారల్లకభల్లభగ్నహృదయః స్వస్థో న లంకేశ్వరః.

బ్రహ్మా! వేదాధ్యయనానికి ఇది సమయముకాదు. తూష్ణీంభావముతో నీవు బయట ఉండాలి. బృహస్పతీ! నీవు చెప్పవలసినది ఏమయినా ఉంటే స్వల్పముగా చెప్పు. మూఢమతి! ఇదేమీ ఇంద్రుని సభకాదు,

బక బక పలకడానికి. నారదా! వీణ వాయించుటను మానెయ్యి. తుంబురా! స్తుతికథాసంలాపాలు చాలులే, సీతయొక్క నేత్ర పక్ష్మ పంక్తి (రల్లక) అనే భల్లముచే భగ్నహృదయుడయిన లంకాప్రభువు రావణుడు స్వస్థముగా లేడు.

ఇది ఒక నాటకములోని పద్యము. బ్రహ్మాదులను తిరస్కరించడానికి రావణ ద్వారపాలకులు ఉపయోగించిన వచనము కాబట్టి అనౌచిత్యము దోషము కాదు. దీనివలన రావణుని పరమైశ్వర్యానికి పరిపుష్టి కలుగుతున్నది. తద్ద్వారా వీరరసాక్షేపము కలుగుతున్నది. అది విప్రలంభశృంగారానికి అంగమవుతున్నది. ఈ విధముగానే,

ప్రాకృతము:—"అలే! లే! సద్దస్సముప్పాడిఅ హరిఅ కుసగ్గంథి మయాచ్ఛమాలా పఇవిత్తి విస్సంభిఅ బాలవిహవంతఃకఅణా బ్రహ్మణా"

సంస్కృతము:—అరే! రే! సద్య స్సముత్పాటిత హరిత కుశగ్రంథి మయాక్షమాలా పరివృత్తి విస్రంభిత బాలవిధవాంతఃకరణా! బ్రాహ్మణాః" (ఛాయా)

అప్పుడే సముత్పాటనము చేసిన, హరిత కుశ గ్రంథులు కలిగిన జప మాలలను త్రిప్పుటచేత బాలవిధవాంతఃకరణములను విశ్వసింపజేసిన బ్రాహ్మణులారా!

ఈ మొదలయిన వచనాలలో అనౌచిత్యము దోషము కాదు. అది హాస్యరసానుకూలము. విదూషకుడు హాస్యపోషకుడు. అందువలననే, "రే! రే!" ప్రయోగము అనౌచిత్యదోషదుష్ట మనుకోనక్కరలేదు. ఈ విధముగా అనౌచిత్యమును తెలుసుకొనడానికి గతి కొంతగా సూచింపబడినది. సుబుద్ధు లయినవారు ఈ రీతిని అనుసరించి ఇతరము లనుకూడా ఊహించుకోవాలి.

## ౯. గు ణ ము లు

ఈ చెప్పబడిన రసాలలో మాధుర్యము ఓజస్సు ప్రసాదము అనే మూడు గుణా లున్నట్లుగా కొందరు చెపుతున్నారు. సంభోగశృంగార

ములో మాధుర్యము ఎంతగా ఉంటుందో అంతకన్న అది కరుణములో అతిశయితముగా ఉంటుంది. ఆ రెండిటికంటె కూడా విప్రలంభ శృంగారములో అధికము. వీనికంటెకూడా శాంతరసములో అధికముగా ఉంటుంది. పూర్వాపూర్వ రసాలకంటె ఉత్తరోత్తరరసాలలో చిత్తద్రుతి సవిశేషముగా కలుగుతూ ఉంటుందని కొందరు విద్వాంసులు మాధుర్యము విషయములో చెప్పుతున్నారు.

సంభోగశృంగారములోకంటె కరుణశాంతాలలో మాధుర్యము అధికము. వానికంటెకూడా విప్రలంభశృంగారములో అధికమని కొందరు చెప్పుతున్నారు. మరికొందరు సంభోగశృంగారముకంటె కరుణ విప్రలంభ శృంగార శాంతాలలో మాధుర్యము అతిశయిత మవుతుందే కాని ఆ మూడింటిలో ఏమీ తారతమ్యము ఉండదు; అన్నిటిలోనూ మాధుర్యము సమానముగానే ఉంటుందని పలుకుతున్నారు.

వీనిలో మొదటిమతము చివరిమతములలో "కరుణే విప్రలంభే తచ్ఛాంతే చాతిశయాన్వితం" - మాధుర్యము కరుణములో విప్రలంభములో శాంతములోనూ అతిశయముతో కూడుకొని ఉంటుంది. అనే ప్రాచీనాచార్యుల సూత్రము అనుకూలముగా ఉంటుంది. ఈ సూత్రానికి ఉత్తర సూత్రములో "క్రమేణ" అనే పదము ఉన్నది. దానిని ఈ ప్రథమ సూత్రములోనికి అపకర్ష చేసికొని ఒకవిధముగా వ్యాఖ్యానము చేయవచ్చును. అపకర్ష లేకుండా వేరొకవిధముగా వ్యాఖ్యానముచేయవచ్చును. ఆ విధముగా వ్యాఖ్యాద్వయము సిద్ధించడముమూలాన రెండుమతాలూ సూత్రసమ్మతములే. మధ్యస్థమతములో కరుణ శాంతరసాలకంటె విప్రలంభానికి మాధుర్యాతిశయము ఉన్నదని సహృదయుల అనుభవము సాక్షిగా ఉన్నపుడు దానినికూడా ప్రమాణముగా గ్రహించవచ్చును. వీరబీభత్సరౌద్రరసాలలో ఓజోగుణానికి ఉత్తరోత్తరము అతిశయము ఉంటుంది. వీరముకన్న బీభత్సములో, అంతకన్న రౌద్రములో ఓజస్సు అధికము. ఓజస్సు చిత్తమునకు దీప్తి కలుగజేస్తుంది. అది ఉత్తరోత్తరము అతిశయితమై కలుగుతూఉంటుంది. అద్భుతహాస్య భయానకరసాలకు మాధుర్యము ఓజస్సు అనే గుణద్వయసంబంధము ఉంటుందని

కొందరు అంగీకరించుచున్నారు. మరికొందరు కేవలము 'ప్రసాదము మాత్రమే ఉంటుందని తలచుచున్నారు. ప్రసాదగుణము సర్వరసాలలో, సర్వరచనలలోకూడా సాధారణముగా ఉంటుంది. అది విశేషముగా ఏ రసముతోనూ సంబంధించి ఉండేదికాదు.

ఈ గుణముల ద్వారా క్రమముగా "ద్రుతి దీప్తి వికాసము" అనే చిత్తవృత్తులు సంపాదింపబడుతవి. అనగా ఆయా గుణాలతో కూడు కొనిన రసాలను ఆస్వాదము చేసినపుడు ఆయా చిత్తవృత్తులు ఉత్ప న్నము లవుతవని భావము. మాధుర్యగుణ యుక్తమయిన రసమును ఆస్వా దించినపుడు చిత్తానికి ద్రవీభావము కలుగుతుంది. ఓజోగుణయుక్త మయిన రసాన్ని ఆస్వాదించినపుడు చిత్తానికి దీప్తి కలుగుతుంది. ప్రసాదగుణయుక్త మయిన రసాన్ని ఆస్వాదించినపుడు చిత్తము వికసిత మవుతుంది. అందువలననే ఈ చిత్తవృత్తులు ఆయా గుణవిశిష్ట రసచర్వణాజన్యములు అనబడుతున్నవి.

ఈ విధముగా ఈ గుణములు రసమాత్ర ధర్మాలు. ఇవి ఇతరములకు ఏమాత్రమూ సంబంధించి ఉండవు. అయినప్పటికీ "ఈ పద్యరచన మధురముగా ఉన్నది" "ఈ బంధము ఓజోయుతముగా ఉన్నది" అనే వ్యవహారము లోకములో ఉన్నది. అయినా ఆ వ్యవహారమును అనుసరించి గుణాలకు రసేతరధర్మత్వమును ఊహించరాదు. ఆ వ్యవ హారము కల్పితము. శూరత్వము వీరత్వము ధీరత్వమూ అనేవి ఆత్మ ధర్మాలు కాని ఆకారధర్మాలు కావు. ఆకారము జడము కదా! అయినా ఆకారము 'శూర'మని 'ధీర'మని 'వీర'మని వ్యవహరించుట లోకములో ఉన్నది. ఇట్టి వ్యవహారము వాస్తవము కాదు. కల్పితము. అట్లాగే గుణాలు రసేతరధర్మా లని వ్యవహరించుటకూడా కల్పితమే. అది ఔపచారిక ధర్మమే అని మమ్మట భట్టాదులు పలుకుచున్నారు.

మాధుర్యము ఓజస్సు ప్రసాదము అనే ఈగుణాలు కేవలము రసమాత్ర ధర్మాలుగా చెప్పబడుతున్నవి. అంటే అవి కేవలము రసములందే ఉంట వన్నమాట. అవి రసమాత్రధర్మము లగుటలో ప్రమాణము ఏమిటి? పూర్వోక్తరీత్యనుసారముగా ఆయారసాస్వాదనము చేసే సమయ

ములో పూర్వము చెప్పిన చిత్తవృత్తులు ఉత్పన్నము లవుతున్నట్లు అనుభవము ఉన్నది కాబట్టి ప్రత్యక్షమే ప్రమాణమని కొందరనుకోవచ్చు, కాని అది యుక్తము కాదు. దహనముచేయుట అగ్ని కార్యము. ఉష్ణస్పర్శ అనేది అగ్నిగుణము. ఈ రెండిటినీ మనము వేరువేరుగా అనుభవించుతున్నాము. మనము దాహము పొందకుండానే దానికన్న వేరుగా ఉష్ణస్పర్శను అనుభవించుతున్నాము. ఈ విధముగా రసకార్యములయిన ఈ రత్యాదిచిత్తవృత్తులు ఏవి ఉన్నవో వానికంటె అతిరిక్తముగా రసాలలో ఉండునట్టి గుణాలను మనము అనుభవించుట లేదు. కాబట్టి ప్రత్యక్షము ప్రమాణము కాదు.

గుణాలు రసధర్మములు అని అనడములో అనుమానము ప్రమాణము అవుతుంది అని పలికేవారి వాదసారమును ఈ విధముగా గ్రహింపవచ్చును. ప్రత్యక్షము ప్రమాణము కాకపోతే పోనివ్వండి. మాధుర్యాదిగుణాలతో కూడుకొనిన రసము ద్రుత్యాదులకు కారణము అవుతున్నది. అంటే ఆ గుణాలతో కూడుకొని ఉంటేనే రసాలవలన ద్రుతి మొదలయిన చిత్తవృత్తులు ఉత్పన్నములవుతున్నవి. అందువలన కారణతావచ్ఛేదకరూపముతో* వానిని అనుమానింపవచ్చును గదా! అని.

అదికూడా యుక్తముకాదు. గుణాలను కారణతావచ్ఛేదకీభూతధర్మాలనుగా చెప్పడము అనవసరము. గుణములు లేకపోయినా ప్రత్యేకముగా రసాలు ఆయా చిత్తవృత్తులకు కారణములు కాగలుగుతూనే ఉండగా గుణకల్పన గౌరవదోషగ్రస్తమవుతుంది. ఆయా చిత్తవృత్తులకు కేవలమూ రసాలే కారణములు అని అనక వానితోపాటు గుణా

---

* కారణతావచ్ఛేదకము ఘటములో ఘటత్వము ఉన్నట్లుగా కారణములో కారణత్వము ఉంటుంది. అవచ్ఛేదకము అంటే ఒక విశేషధర్మము విశేషణరూపముగా ఉండేది అన్నమాట. కారణతారూపమయిన అవచ్ఛేదకము కారణములో ఉంటుంది. ప్రస్తుతములో చిత్తద్రుత్యాదులు. కార్యములు, రసాలు ద్రుత్యాది కారణాలు. అవి కారణములు అగుటలో గుణవిశిష్టములై కారణములవుతున్నవి కారణీభూతములయిన ఆ రసాలలో విశేషణీభూతములయిన గుణములు అవచ్ఛేదక (విశేషధర్మ) రూపముగా ఉన్నవి. కాబట్టి ఆ గుణాలు కారణతావచ్ఛేదకములు అనబడుతున్నవి అని గ్రహించాలి.

లనుకూడా జోడింపవలసిన ఆవశ్యకత ఏమున్నది? ఇట్లా ఆవశ్యకత లేని విషయాన్ని అనుసరించి అనుమానరచన చేయడము సముచితముకాదు. కేవలరసాలే కారణాలు అని చెప్పినా బాధ లేనపుడు గుణవిశిష్టరసములు కారణములు అని అనుట గౌరవముకదా!

శృంగారము కరుణము శాంతరసములలో ప్రత్యేకముగా ఒక్కొక్కటి చిత్తద్రుతికి కారణమని అంగీకరించడముకంటె, మూడు కార్య కారణ భావములను చెప్పుటకంటె, మూడు రసాలుకూడా మాధుర్యయుక్త ములే కాబట్టి ఆ మూడింటివలనా చిత్తద్రుతి ఉత్పన్న మవుతున్నదనీ మాధుర్య విశిష్టరసము ద్రుతిలో కారణమనీ చెప్పితే ఒకే కార్యకారణ భావము కాబట్టి లాఘవము ఉన్నదికదా! మూడు కారణాలను అంగీ కరించడముకంటె ఒకే కారణమును అంగీకరించడములో గౌరవ దోషము లేదు. లాఘవమే ఉన్నది అని ఇక్కడి పూర్వపక్షము.

ఇది యుక్తము కాదు. మమ్మటభట్టు మొదలయిన కొందరు విద్వాం సులు మధురమయిన రసమువలన ద్రుతికలుగుతుందనీ,అత్యంతము మధుర మయిన రసమువలన అత్యంతము ద్రుతి కలుగుతుందనీ కార్యములలో తరతమ భావమును న్యూనత్వాధిక్యములను అంగీకరించినారు. అందు వలన రసము మాధుర్యగుణయుక్త మయినపుడు ద్రుతికారణ మవుతుం దని అంగీకరించుట వ్యర్థము. అది గడుభూతము. పైని చెప్పిన తర తమభావానురోధమునుబట్టి మూడుకార్యకారణభావములను చెప్పక తీరదు. ఒక్కొక్క కార్యానికి ఒక్కొక్క రసము వేరువేరుగా కారణ మవుతుంది. ద్రుతినిగురించి శృంగారము కారణము, ద్రుతితరత్వమును గూర్చి కరుణము కారణము, ద్రుతితమత్వమును గూర్చి శాంతము కార ణము అని ఈ విధముగా మూడు కార్యకారణభావములను చెప్పక తీరదు. ఇటువంటి స్థితిలో కారణ మని చెప్పడములో గుణరూప విశే షణ ప్రవేశము నిరుపయోగ మవుతుంది. ప్రత్యేకముగా రసమే కారణ మని చెప్పడము లాఘవము. ఇట్లా ప్రాతిస్వికరూపముగా కారణత్వ మును అంగీకరించినపుడు సకలనిర్వాహము కలుగుతూ ఉంటే

సామాన్యరూపముగా కార్యకారణభావమునుఅంగీకరించడము వ్యర్థమూ నిష్ఫలమూను. ఆ విధముగా అంగీకరించుట గౌరవదోషగ్రస్తము.

ఇంకా ఆత్మ నిర్గుణము, రసము ఆత్మస్వరూపము. అందువలన మాధుర్యాదులు ఆత్మరూపరసగుణము లవుతవని తలంచుట ఉపపన్నము కాదు. నిర్గుణాత్మకు గుణా లున్నవని చెప్పడము వ్యాహతము.

మాధుర్యాదులు రసధర్మాలు కాకపోయినా రసోపాధిరూపాలయిన రత్యాదిస్థాయి భావాలకు గుణము లవుత వని అంగీకరించరాదా? అని అనుటకూడా ఉచితముకాదు. ఈ విధముగా అనడములో ఏమీ ప్రమాణములేదు. కావ్యప్రకాశకారాదుల రీతిని అనుసరించి చూస్తే రత్యాదులు స్వయముగా గుణరూపములు. అందువలన ఆ గుణాలలో ఇతరగుణాలు ఉంటవని అంగీకరించుట అనుచితము.గుణములో గుణము ఉన్నట్లు అంగీకరించరుకదా!

అయితే "శృంగార రసము మధురము" ఇత్యాది వ్యవహారములు ఏవిధముగా కుదురుతవి? ఈ వ్యవహారములు అంతటా ప్రచలితములు అయి ఉన్నవే. మీ పద్ధతిని బట్టి చూస్తే మాధుర్యాదులు గుణాలే కావని తోచుచున్నదికదా!

అనే శంకకు ఈ చెప్పబోయేది సమాధానము. ద్రుత్యాది చిత్తవృత్తుల ప్రయోజకత (ప్రయోగింపచేయుట) ఏది రసాలలో ఉన్నదో అదే మాధుర్యాదిగుణ మని అంగీకరించండి. అటువంటి ప్రయోజకత్వము ఉండడము మూలాన - "శృంగారో మధురః" - మొదలయిన వ్యవహారాలకు కుదురుబాటును గ్రహించవచ్చును. ద్రుతి మొదలయిన చిత్తవృత్తులే (ఏదైనా రసముతోపాటు) ప్రయోజకతాసంబంధముతో ఉన్నట్లయితే వానినే మాధుర్యాదిగుణము లని అనవచ్చును.

రసములు ద్రుత్యాదిప్రయోజకములు అయినపుడు ప్రయోజకతా సంబంధముతో ద్రుతి కూడా రసమందు ఉంటుంది. పర్వతమందు వహ్నిసంయోగము ఉన్నపుడు సంయోగసంబంధముచే వహ్ని కూడా

ఉన్నట్లు సర్వజనవ్యవహారము ఉన్నది. అనగా ఒకదానియందు
సంబంధము ఉన్నపుడు ఆ సంబంధముచే సంబంధి కూడ ఉంటుందని
భావించాలి. ఈ అంశాన్నే "సంబంధసత్త, సంబంధిసత్తానియా
మకము" అని అభియుక్తులు చెప్పుతున్నారు. ఇక్కడ 'గుణము'
అంటే ధర్మమని గ్రహించాలి.

ప్రయోజకతాసంబంధముతో ఉన్న ద్రుత్యాదిచిత్తవృత్తులే మాధు
ర్యాది గుణములు అని అన్నప్పటికీ "శృంగారరసము మధురము
(మాధుర్య గుణయుక్తము)" అనే వ్యవహారోపపత్తికి హాని లేదు.
సామాన్యంగా "గుణవిశిష్టము" అనే వ్యవహారములో ప్రాయికముగా
సమవాయసంబంధమే ఉన్నది. అయినా ప్రయోజకతాసంబంధము
కూడా ఆ వ్యవహారములో కన్పడుతున్నది. రసాలలో ద్రుత్యాదిచిత్త
వృత్తులు సమవేతములై ఉండకపోయినా ప్రయోజకతాసంబంధముతో
ఉండడానికి అభ్యంతరము లేదు. "ద్రుత్యాదులు రసకార్యములు. అందు
వలన రసము మాధుర్యయుక్తము కాదు" అనుకొంటారు. అయినా
'అశ్వగంధ' అనే ఔషధము ఉష్ణతను కలుగజేస్తుంది. అందువలన
లోకము అశ్వగంధ - ఉష్ణము అని అంటున్నది. కారణమందు కార్యా
భేదమును చెప్పడము ఒక మర్యాద. ప్రయోజకతాసంబంధముతో ఉష్ణ
త్వము అశ్వగంధయందు ఉంటున్నది. అందువలననే ఈ వ్యవహారము
కుదురుతున్నది. అట్లాగే శృంగారాదిరసాలు మాధుర్యాదిగుణాలకు
ప్రయోజకములు (ఉత్పాదకములు) అవుతున్నవి, కాబట్టి అవి మధుర
ములు అవుతున్నవని వ్యవహారమును సరిపుచ్చుకోవాలి.

ఈ ప్రపంచములో ఎన్నిఎన్ని కార్యములు ఉన్నవో వాటి అన్నిటిలో
ఉండే ప్రయోజకత ధర్మాధర్మములు అనబడే అదృష్టాదులతో కూడు
కొని ఉన్నది. కార్యమాత్రమునుగూర్చి అదృష్టము కారణము అవుతుం
దని అందరూ అంగీకరించిన విషయమే. అదృష్టాది ప్రయోజకము
లేకుండా ఏకార్యమూ కాదు. కాగా ద్రుతికి అదృష్టముకూడా ప్రయో
జక మవుతుంది. అప్పుడు ఈ ద్రుతి అదృష్టాదులలోకూడా ఉంటుం

దనాలి. అటువంటప్పుడు "అదృష్టం మధురం" అని వ్యవహారము ఏల రాకూడదు? అని ఇక్కడ ఒకశంక కలుగవచ్చును.

దీని కిది సమాధానము. ప్రకృతములో ఉన్న ప్రయోజకత అదృష్టాది విలక్షణ మని అంగీకరించాలి. "శృంగారము మధురము" అనే వ్యవహార నియామకమైన సంబంధము ప్రయోజకతావిశేషము కాని ప్రయోజకతాసామాన్యము కాదు. వ్యవహారనియామకమైన ప్రయోజకతా విశేషము అదృష్టమందు లేదు. అది శబ్దము అర్థము రసము రచన వీని లోనే ఉంటుం దని గ్రహించాలి. కాబట్టి పూర్వోక్తవ్యవహారానికి అదృష్టాదులలో అతిప్రసక్తి రాదు. అదృష్టాదులలో ఉన్న ప్రయోజకత వేరు, శబ్దార్థరసరచనలలో ఉండే ప్రయోజకత వేరు. అందువలన ద్రుత్యాది ప్రయోజకత అదృష్టాదులలో ఉన్నప్పటికీ "అదృష్టాదికము మధురము" అనే వ్యవహారము రాదు.

ఈ విధముగా శబ్దార్థములలో కూడా మాధుర్యము ఉంటున్నది. కేవలము రసములోనే ఉండడము కాదు. కాబట్టి శబ్దార్థములందు మాధుర్యాదికము కల్పిత మని ఔపచారిక మని మమ్మటభట్టాదులు అన నక్కర లేదు అని మాదృశుల విచారధార.

## ప్రాచీనమతము

అత్యంతము ప్రాచీనులు జరత్తరులు అయిన సాహిత్యాచార్యులు.

> శ్లేషః ప్రసాదః సమతా మాధుర్యం సుకుమారతా
> అర్థవ్యక్తి రుదారత్వం ఓజః కాంతి సమాధయః

శ్లేష, ప్రసాదము, సమత, మాధుర్యము, సుకుమారత, అర్థవ్యక్తి, ఉదారత్వము, ఓజస్సు, కాంతి, సమాధి అని పది శబ్దగుణాలను పది అర్థగుణాలను చెప్పుతున్నారు. రెండిటికీ అవే నామములు. లక్షణములు మటుకు భిన్నములు.

## శబ్దగుణములు

శ్లేషః— శబ్దానాం భిన్నానా మపి ఏకత్వప్రతిభానప్రయోజకః సంహితయా ఏకజాతీయ వర్ణవిన్యాసవిశేషః గాఢత్వాపరపర్యాయః శ్లేషః.

శబ్దాలు భిన్నభిన్నములు అయినప్పటికీ ఏకశబ్దముగా ప్రతీతము చేయునట్టి, అత్యంతము సమీపముగా సమానజాతీయములయిన వర్ణాలను విన్యాసము చేయుటలోని విశేషము శ్లేష అనబడును. దీనికే గాఢత్వము అని కూడా పేరు. "శ్లిష్ట మస్పృష్ట శైథిల్యం" శిథిలత స్పష్టము కానప్పుడు శ్లేషగుణ మని అంటున్నారు.

ఉదా:—'అనవరతవిద్వద్ద్రుమద్రోహిదారిద్ర్యమాద్యద్ద్విపోద్దామదర్పౌఘ
విద్రావణప్రౌఢపంచాననః'.

ఇది ఒక రాజవర్ణనము. కవి పలుకుతున్నాడు. 'ఆరాజు, నిత్యమూ విద్వాంసులు అనే ద్రుమాలకు ద్రోహమును కలుగజేసే దారిద్ర్యమనే మదించిన గజాలయొక్క అతిశయించిన గర్వసమూహమును పోగొట్టుటలో ప్రౌఢసింహము.'

౨. ప్రసాదము:—గాఢత్వశైథిల్యాభ్యాం వ్యుత్క్రమేణ మిశ్రణం బంధస్య
ప్రసాదః.

రచనకు గాఢత్వము శైథిల్యములతో వ్యుత్క్రమముగా మిశ్రణము ఉండుట ప్రసాదగుణము అవుతుంది. అనగా రచనలో మొదటగా శైథిల్యము ఉండాలి. పిమ్మట గాఢత్వము ఉండాలి. అట్లా ఉంటే ప్రసాద గుణ మవుతుంది అని భావము. ఉదా:—

కిం బ్రూమ స్తవ వీరతాం వయ మమీ యస్మిన్ ధరాఖండల
క్రీడాకుండలితభ్రుశోణనయనే దోర్మండలం పశ్యతి
మాణిక్యావళికాంతిదంతురతరై ర్భూషాసహస్రోత్కరైః
వింధ్యారణ్యగుహాగృహావనిరుహా స్తత్కాల ముల్లాసితాః.

రాజా! భూమీంద్రా! ఈ మేము నీ వీరత్వమును ఏమని వర్ణించగలము? ఏ నీవు ఆటలో కుండలాకారముగా చేసిన కనుబొమలును ఎఱ్ఱని నేత్రములును కలవాడవై భుజమండలమును చూడగా, మాణిక్యసమూహ కాంతులతో మిశ్రితములయిన భూషణముల అనంతసమూహములతో, వింధ్యారణ్యములోని గుహాలనే గృహములవృక్షములు ఆసమయమున శోభించినవి. నీ ఆ చేష్టను విని భీతశత్రువులు పలాయనముచేసి వింధ్య

ప్రదేశములలో సంగతు లయినారు. తమ ఆభరణములను వృక్షములకు సమర్పించినా రని భావము.

పై పద్యములో "యస్మిన్" అనేవరకు శైథిల్య మున్నది. 'భ్రు' శబ్దము వరకు గాఢత్వము ఉన్నది. మళ్లా "నయనే" వరకూ శిథిలత్వము ఉన్నది. ఈ విధముగా మిగిలిన అంశమునుగూడా గ్రహించాలి.

౩ సమత:—ఉపక్రమా దాసమాప్తే రీత్యభేదః సమతా.

ప్రారంభము మొదలుకొని సమాప్తి వరకు ఏకవిధమయిన రచన సమత అనబడును. చెప్పబోవు మాధుర్యోదాహరణములో ఉన్నట్లుగా ఉండాలి. దానిలో * ఉపనాగరికావృత్తితో ఉపక్రమము ఉన్నది. ఉపనాగరికావృత్తితోనే ఉపసంహారము ఉన్నది.

౪ మాధుర్యము:—

సంయోగపర హ్రస్వాతిరిక్త వర్ణఘటితత్వే సతి పృథక్పదత్వం మాధుర్యమ్.

సంయోగము పరమందు ఉన్న హ్రస్వవర్ణాలకంటె అతిరిక్తము లయిన వర్ణాలతో కూర్చబడి ఉన్నపుడు, వేరువేరు పదాలతో ఉన్నప్పుడు మాధుర్యగుణము అవుతుంది. సమాసములు సంధులూ అధికముగా ఉండరా దనే భావము.

ఉదా:—నితరాం పరుషా సరోజమాలా
న మృణాలాని విచార పేశలాని
యది కోమలతా తవాంగకానాం
అథ కా నామ కథాపి పల్లవానామ్.

నీ మనోహరాంగముల కోమలత్వమే చెప్పబడినప్పుడు సరోజమాల అత్యంతమూ పరుషము. లేత తామర తూడులుకూడా విచారించగా

---

* రీతులు మూడు. ఉపనాగరిక, పరుష, కోమల అని. ఇవే వైదర్భి, గౌడి, పాంచాలి అనబడుతున్నవి. మాధుర్యవ్యంజకవర్ణాలతో ఉన్నట్లయితే మొదటి రీతి అని, ఓజోవ్యంజకవర్ణాలతో ఉన్నట్లయితే రెండవ రీతి అని, మాధుర్యగుణమును ఓజోగుణమును వ్యంజనము చేయు వర్ణాలకంటె అతిరిక్తము లయిన ప్రసాదగుణమును వ్యంజనము చేయు వర్ణాలతో ఉన్నట్లయితే మూడవరీతి అని గ్రహించాలి.

శక్తివిహీనములు అవుతున్నవి. ఇక పల్లవాలకథ చెప్పవలసినది ఏమి ఉన్నది? అవి ఏమాత్రమూ నీ అంగకాలతో సరిరావు అని భావము.

౫. సుకుమారత్వము:—అపరుషవర్ణఘటితత్వం సుకుమారత్వమ్.

అపరుషవర్ణములతో కూర్చబడుట సౌకుమార్య మనే గుణము.

ఉదా:—స్వేదాంబు సాంద్రకణశాలి కపోలపాలి
దోలాయిత శ్రవణ కుండల వందనీయా
ఆనంద మంకురయతి స్మరణేన కాపి
రమ్యా దశా మనసి మే మదిరేక్షణాయాః.

నాయకుడు తన మిత్రునితో చెప్పుతున్నాడు. స్వేదోదక సాంద్రకణము లతో శోభించుతున్న చెక్కిళ్లపై ఊగులాడునటువంటి శ్రవణ కుండలములచేత శ్లాఘింపతగిన మదిరేక్షణయొక్క చెప్పడానికి శక్యముకాని ఒకానొక మనోహరదశ నా మనస్సులో స్మరణముచేత ఆనందమును అంకురింప చేస్తున్నది.

ఈ పద్యము పూర్వార్థములో సుకుమారత్వ మున్నది. ఉత్తరార్థములో సుకుమారత్వము మాధుర్యమూ రెండూ ఉన్నవి.

౬. అర్థవ్యక్తి:—ఝడితి ప్రతీయమానార్థాన్వయకత్వ మర్థవ్యక్తిః.

అర్థమూ అన్వయమూ రెండూ వెంటనే గోచరము లయినట్లయితే అర్థవ్యక్తి అనే గుణము అవుతుంది. "నితరాం పరుషా సరోజమాలా" అనే పద్యములో దీని సమన్వయము చూచుకోవాలి.

౭. ఉదారత:—కఠినవర్ణఘటనారూప వికటత్వ లక్షణా ఉదారతా.

కఠినాక్షరముల రచనారూపమయిన వికటత్వము ఉదారత యొక్క స్వరూపము. ఉదా:—

ప్రమోదభరతుందిల ప్రమథదత్తతాలావలీ
వినోదిని వినాయకే డమరు డిండిమధ్వానిని

లలాటతటవిస్ఫుటన్నవకృపీటయోనిచ్ఛటో
హఠోద్ధత జటోద్భటో గతపటో నటో నృత్యతి.

ఆనందభరముతో నిండిఉన్న ప్రమథులు నానావిధ తాళములను వేస్తూ ఉంటే వినోదించుతున్న వినాయకుడు డమరుకవాద్యమును డమ్ డమా డమ్ అనేటట్లు వాయించుతూ ఉండగా, లలాటతటము నుండి ఫుటఫుటా ప్రసరిస్తున్న నవవహ్నిచ్ఛటలు కలిగిన హఠాత్తుగా ఉద్ధతములయిన జటల వలన వికటంగా ఉన్న మహానటుడయిన పరశివుడు వీతవస్త్రుడై నృత్యము చేస్తున్నాడు.

కావ్యప్రకాశటీకాకర్తలు "పదాలు నృత్యము చేస్తూ ఉన్నట్లుగా ఉండుట ఉదారత్వము" అని వ్యాఖ్యచేస్తూ

స్వచరణ వినివిష్టై ర్నూపురై ర్నర్తకీనాం, ఝుడితి రణిత మాసీత్

అని ఉదహరించు తున్నారు. ఇటువంటి వికటతారూపమయిన ఉదారతను ఓజోగుణములో అంతర్భవింప చేస్తున్న కావ్యప్రకాశకారుడు వారికి ఏవిధముగా అనుకూలుడు అవుతాడో వారే తెలుసుకోవాలి. మమ్మటునకూ తమకూ ఏవిధముగా ఐకమత్యము కుదురుతుందో వారికే తెలుసు. దీనిలో ఓజోగుణము అధికముగా ప్రతీతము కావడము లేదు. "వినివిష్టై ర్నూపురై ర్నర్తకీ" అనే స్థలములో ఓజోగుణము లవముగా ఉన్నా చమత్కారి కాదు. అక్కడ సహృదయులకు వర్ణముల నృత్యత్ప్రాయత్వము ఏమీ అనుభవ గోచరము కావడము లేదు. ఇతరాంశములో అయితే మాధుర్యమే.

౮. ఓజస్సు:—సంయోగపరహ్రస్వప్రాచుర్యరూపం గాఢత్వమోజః.

సంయోగము పరమందున్న హ్రస్వాక్షరములు అధికముగా ఉంటే ఓజస్సు అనే గుణము. దీనికి గాఢత్వ మని పేరు. ఉదా:

సాహంకారసురాసురావలికరాకృష్టభ్రమన్మంధర
క్షుభ్యత్క్షీరధి వల్గువీచివలయ శ్రీగర్వసర్వంకషాః
తృష్ణాతామ్యదమందతాపసకులైస్సానంద మాలోకితా
భూమీభూషణ! భూషయంతి భువనాభోగం భవత్కీర్తయః.

ఇది కవి వచనము. ఓధరాలంకారా! అహంకార సహితులయిన దేవ దానవుల సమూహాముయొక్క హస్తములచేత ఆకర్షింపబడి భ్రమించు తున్న మంధరపర్వతము వలన క్షుబ్ధమవుతూ ఉన్నట్టి పాలసముద్రము నకు సంబంధించిన తరంగముల సమూహ శోభాగర్వమును అంతనూ నశింపచేయునటువంటిన్ని, దప్పికచేత డస్సిపోతూ ఉన్న అసంఖ్యాక తాపసకులములచేత తృష్ణాశాంతిసాధన మని తలచ బడడము వలన సానందముగా చూడబడినటువంటిన్ని నీ కీర్తులు విశ్వవిశాల విశ్వమును భూషింపచేస్తున్నవి.

ఇంకా "అయం పతతు నిర్దయం" అని పూర్వము రౌద్రరసానికి ఉదహ రించిన పద్యమునందు ఈగుణ సమన్వయమును చూచుకోవాలి.

౯ కాంతి:—అవిదగ్ధ వైదికాది ప్రయోగయోగ్యానాం పదానాం పరిహారేణ ప్రయుజ్యమానేషు లోకోత్తరశోభారూప మౌజ్వల్యం కాంతిః

అచతురులయిన వైదిక ఛాందసులు మొదలయిన వారి ప్రయోగ యోగ్యములయిన పదాలకంటె అతిరిక్తముగా ప్రయోగింపబడు పదా లలో ఉన్న అలౌకిక శోభారూపమయిన ఉజ్జ్వలతకు కాంతి అని పేరు. దీనికి "నితరాం పరుషా సరోజమాలా" అని పూర్వము చెప్పిన పద్యము ఉదాహరణము.

౧౦ సమాధి:—బంధగాఢత్వశిథిలత్వయోః క్రమేణావస్థాపనం సమాధిః

రచనలోని గాఢత్వ శిథిలత్వములను క్రమముగా ఉంచుట సమాధి గుణము. అనగా మొదట గాఢరచన, పిమ్మట శిథిలరచన ఉన్నట్లయితే సమాధిగుణము అని భావము.

ఈగాఢత్వశిథిలత్వములకే ప్రాచీనులు ఆరోహము అవరోహము అని వ్యపదేశము చేస్తున్నారు. ప్రసాదగుణములోనూ ఈ గుణములోనూ గాఢశిథిలరచనల క్రమములో భేద మున్నది. ప్రసాదగుణములో ఇవి వ్యుత్క్రమముగా ఉన్నవి. దీనిలో క్రమముగా ఉన్నవి: ప్రసాదగుణ ములో మొదట శిథిలత ఉంటుంది, తరువాత గాఢత్వము ఉంటుంది.

సమాధి గుణములో మొదట గాఢత్వము ఉంటుంది, తరువాత శిథిలత్వము ఉంటుంది. సమాధికి ఉదా:

స్వర్గనిర్గతనిరర్గల గంగా తుంగభంగురతరంగసఖానామ్
కేవలామృతముచాం వచనానాం యస్య లాస్యగృహ మాస్యసరోజమ్.

ఇది కవియొక్క వచనము:—స్వర్గమునుండి నిర్గమించినది కాబట్టి నిరర్గలంగా ప్రవహించుతున్న గంగానదియొక్క సముత్తుంగములయిన భంగురములు అవుతూఉన్న తరంగములతో సమానములయినట్టి కేవలము అమృతమును స్యందించుతున్న వచనాలకు ఆ మహనీయుని ఆస్యసరోజము లాస్యగృహముగా ఉన్నది.

దీనిలో ప్రథమార్థమందారోహ మున్నది. తృతీయపాదములో అవరోహ మున్నది. 'గంగ' మొదలయిన శబ్దాలలో మాధుర్యమునకు వ్యంజకములయిన శబ్దాలు ఉన్నప్పటికీ దీర్ఘసమాసములో అంతర్గతములయినవి కాబట్టి మాధుర్యమునకు ప్రరోహము కలగడము లేదు. ఉత్తరార్థములో మాధుర్యముకూడా ఉన్నది.
ఈ చెప్పబడిన పదీ శబ్దగుణములు.

## అ ర్థ గు ణ ము లు

౧ శ్లేషః—ఏవం క్రియాపరంపరయా విదగ్ధచేష్టితస్య తదస్ఫుటత్వస్య
తదుపపాదకయుక్తేశ్చ సామానాధికరణ్యరూపః సంసర్గః శ్లేషః

నానారూప మయిన క్రియాపరంపర చేత చాతుర్యముతో కూడుకొనిన చేష్టకు, ఆ విదగ్ధచేష్టితము స్ఫుటము కాకపోవుటకు, ఆ చేష్టితమును ఉపపాదించే యుక్తికి సామానాధికరణ్యము ఉండేటట్లుగా నిబంధము చేయుట శ్లేష అనే అర్థగుణము.

అమరుకశతకములోని ఈ పద్యములో ఈ గుణము ఉన్నది.

దృష్ట్వైకాసన సంస్థితే ప్రియతమే పశ్చాదుపే త్యాదరాత్
ఏకాస్యా నయనే నిమీల్య విహిత క్రీడానుబంధచ్ఛలః
ఈషద్వక్రితకంధరః సపులకః ప్రేమోల్లసన్మానసాం
అంతర్హాస లసత్కపోలఫలకాం ధూర్తోఽపరాం చుంబతి,

ఒక ధూర్తనాయకుడు తన ప్రియురాండ్రు ఇద్దరూ ఏకాసనమందు ఉప వేశించి ఉండడమును చూచి అభిమానము వలన వెనకగా వచ్చి ఒక యామె నేత్రాలను మూసినాడు. సవిలాస క్రీడానుషంగములోని ఛలమును కొంతగా ఆచరించినవాడై కొంచెముగా మెడను ప్రక్కకు త్రిప్పికొని గగుర్పాటు కలవాడై అనురాగము వలన సముల్లసించుతున్న మాన సము కలిగిన అంతర్హాసముచేత లసించు కపోలఫలకము కలిగిన వేరొక తెను చుంబించుతున్నాడు.

దీనిలో ఒక నాయికను విడిచి వేరొక నాయికను చుంబనముచేయుట విదగ్ధచేష్టితము. అది ప్రకటము కాలేదు. నాయకుడు ఆమె నేత్రాలను మూసినాడు, కాబట్టి ఇతర నాయికను నాయకుడు ముద్దుగొనుటను ఆమె తెలుసుకో లేకపోయింది. ఆ నేత్రపిధానమే చతురచేష్టను ఉపపాద నము చేయు యుక్తి. వెనుకనుండి వచ్చుట, కండ్లుమూయుట క్రీడాకర ణము మొదలయిన క్రియాపరంపర వర్ణింపబడినందు వలన శ్లేషగుణము.

౨. ప్రసాదము - యావదర్థకపదత్వరూప మర్థవైమల్యం ప్రసాదః,

అర్థానికి తగినన్ని పదాలు కలిగిఉండుట రూపముగా కలిగిన అర్థము లోని నిర్మలత ప్రసాదగుణ మనబడును. ఉదా:—

కమలానుకారి వదనం కిల తస్యాః

ఆమె వదనము కమలమును అనుకరించుతున్నది మొదలయినది. ప్రసాదోదాహరణము.

ప్రత్యుదాహరణము:—"కమలకాంత్యనుకారి వక్త్రం"

వక్త్రము కమలకాంత్యనుకారము కలది. దీనిలో కాంతి పదము వ్యర్థము- వక్త్రం అనేదికూడా నిర్మలతకు భంగకారి.

౩. సమత - ప్రక్రమాభంగేనార్థఘటనాత్మక మవైషమ్యం సమతా,

ప్రారంభము చేసిన అర్థానికి భంగపాటు లేకుండా అర్థమును ఘటిం చుట, వైషమ్యము లేకపోవుట సమత అనబడును.

ఉదా:—హరిః పితా హరి ర్మాతా హరి ర్భ్రాతా హరిః సుహృత్
హరిం సర్వత్ర పశ్యామి హరే రన్య న్న భాతి మే.

ఒక అనన్యభక్తుని వచనము. నాకు హరియే తండ్రి, హరియే మాత, హరియే సోదరుడు, హరియే స్నేహితుడు, అంతటా హరినే చూచుచున్నాను. హరికన్న ఇతరము ఏదీ నాకు గోచర మగుటలేదు.

దీనిలో 'విష్ణు ర్భ్రాతా' అని నిర్మాణించితే ప్రక్రమభంగరూప మైన వైషమ్యము కలుగుతుంది. మొదట హరిశబ్దము ప్రయోగింపబడింది కాబట్టి మళ్లా విష్ణుశబ్దమును ప్రయోగించితే హరిసంబంధము పోయి విషమత్వము కలుగుతుంది

౪. మాధుర్యము:—ఏకస్యా ఏవోక్తేః భంగ్యంతరేణ పునః కథనాత్మక ముక్తివైచిత్ర్యం మాధుర్యమ్.

ఒకే వచనానికి భిన్నభిన్న ప్రకారము అనబడు భంగ్యంతరముతో మరలమరల చెప్పుట మాధుర్యమనే గుణము. ఇదియే ఉక్తి విచిత్రత అనబడుతున్నది.

ఉదా:

> విధత్తాం నిశ్శంకం నిరవధి సమాధిం విధి రహో!
> సుఖం శేషే శేతాం హరి రవిరతం నృత్యతు హరః
> కృతం ప్రాయశ్చిత్తై రల మథ తపోదానయజనైః
> సవిత్రీ కామానాం యది జగతి జాగర్తి భవతీ.

ఒకభక్తుడు గంగాదేవినిగురించి పలుకుతున్నాడు. సర్వకామప్రసవిత్రి అయిన జగదంబ వగు ఓ గంగామతల్లీ! నీవు జగమున సంచరించినట్లయితే మాకు ఏమియు కొదువ లేదు. బ్రహ్మ నిశ్శంకముగా నిరవనిరవధి సమాధిని విధానించుకోనీ! సుఖముగా విష్ణువు శేషునిపై శయనించుగావుత. పరమేశ్వరుడు ఎడతెరపిలేకుండా నృత్యముచేయుగాత. ఇంకను ప్రాయశ్చిత్తా లేమీ అక్కర లేదు. తపోదానయజనాలవలన గూడా ఇంకా కావలసినది ఏమీ లేదు. మా కేమీ లోటు లేదు. గంగకన్న ఇతరముల ఆవశ్యకత్వము ఏమీ లేదు.

దీనిలో బ్రహ్మాదులతో ఏమీ ప్రయోజనము లేదు అనే అర్థము "సమాధిని చేయుగాత" మొదలయినవాని ప్రేరణరూపముగా ఉన్న ఉక్తి

వైచిత్ర్యముతో చెప్పబడినది. అట్లు కాకపోతే అనవీకృత మనే దోషము సంభవించుతుంది.

౫. సుకుమారత:-అకాండే శోకదాయిత్వాభావరూప మపారుష్యం సుకుమారతా

అసమయంలో శోకదాయిత్వము లేకపోవుట రూపముగా గలిగిన అపారుష్యము సుకుమారత్వము అనబడును. ఉదా:—

"త్వరయా యాతి పాంథోయం ప్రియావిరహకాతరః"

ఒకయువతి పరొకయువతితో చెప్పుతున్నది. ఈ బాటసారి ప్రియావిరహకాతరుడై త్వరగా వెళ్ళుతున్నాడు.

పై పద్యపాదములో 'ప్రియామరణకాతరః' 'ప్రియురాలు మరణించుతుందని భయపడినవాడై' అనే ఉంటే శోకదాయకమైన మరణపదము ఉంటుంది. అది కఠోరత్వమును ఆపాదించుతుంది. అందువలన పారుష్యము ఉన్నట్లు. కాబట్టి ప్రత్యుదాహరణ మన్నమాట. ఈ కఠోరత్వము అశ్లీలము అనే దోషములో అమంగళరూపముగా అంతర్భవించుతుంది.

౬. అర్థవ్యక్తి:—వస్తునో వర్ణనీయ స్యాసాధారణక్రియారూపయో
ర్వర్ణన మర్థవ్యక్తిః

వర్ణింపదగిన వస్తువుయొక్క అసాధారణములయిన క్రియారూపములను వర్ణించుట అర్థవ్యక్తి అనబడును. ఉదా:—

గురుమధ్యే కమలాక్షీ కమలాక్షేణ ప్రహర్తుకామం మామ్
రదయంత్రితరసనాగ్రం తరలితనయనం నివారయాంచక్రే.

నాయకుడు తన మిత్రునితో చెప్పుతున్నాడు. అత్త,మామ మొదలయిన గురుజనముల మధ్య ఉన్న ఆ కమలనయన కమలబీజముతో ప్రహారము చేయవలెనని అనుకొనిన నన్ను, దంతములతో నాలుక చివరను పట్టి నేత్రాలు చంచలము లగునట్లుగా (ఆచరించి) నివారణ చేసినది.

దీనిలో "కమలాక్షి" అని ఒక రూపము "రదయంత్రిత" అని క్రియా

వర్ణింపబడినవి. ఈ అర్థవ్యక్తి గుణమునే అర్వాచీనులు స్వభావోక్త్యలంకార మని వ్యపదేశము చేస్తున్నారు.

౭. ఉదారత:—గ్రామ్యార్థపరిహార ఉదారతా.

గ్రామీణవచనాలను పరిహారము చేయుట ఉదారత అనబడును. "చుంబనం దేహి మే భార్యే! కామచాండాలతృప్తయే" "ఓసీ పెండ్లామా! కామచండాలుణ్ణి తృప్తిపరచడానికి నాకు ముద్దియ్యి!" అనేది గ్రామ్యార్థము. ఇటువంటి నింద్యార్థాలు లేకుండా ఉండడమే ఉదారత అని గ్రహించాలి.

౮. ఓజస్సు:—ఏకస్య పదార్థస్య బహుభిః పదైరభిధానం,
బహూనాం చైకేన, తథైకస్య వాక్యస్య బహుభిర్వాక్యైః,
బహువాక్యార్థస్య ఏకవాక్యే నాభిధానం, విశేషణానాం
సాభిప్రాయత్వం చేతి పంచవిధ మోజః.

ఓజోగుణము అయిదు విధాలు. ఒక పదార్థమును అనేక పదార్థములతో వర్ణించుట మొదటిది. అనేక పదార్థములను ఏకపదముతో చెప్పుట రెండవది. ఆ విధముగా ఒక వాక్యార్థమును అనేక వాక్యములతో చెప్పుట మూడవది. అనేక వాక్యార్థములను ఏకవాక్యముతో చెప్పుట నాల్గవది. విశేషణములు సాభిప్రాయముగా ఉండుట అయిదవది. ఈ విధముగా ఓజోగుణము అయిదు ప్రకారములు.

పదార్థే వాక్యరచనా వాక్యార్థేచ పదాభిధా
ప్రౌఢి ర్వ్యాససమాసౌ చ సాభిప్రాయత్వ మస్య చ.

అని ప్రాచీనులు చెప్పుతున్నారు. ఒక పదార్థములో వాక్యరచన చేయుట ఒక వాక్యార్థరచనకై పదరచన చేయుట ఏదైనా విషయమును విస్తారము చేయుట సంక్షేపము చేయుట ఈ నాలుగు విధానాలకూ ప్రౌఢి అని పేరు. దీనినే వర్ణనలోని విచిత్రత అంటారు. ఇంకా సాభిప్రాయత్వము ఉండడము కూడా ఓజోగుణమే.

ప్రాచీనులు చెప్పిన పై కారికలో పూర్వార్థములో చెప్పబడిన రెండూ

ఉత్తరార్థములోని వ్యాస సమాసములు రెండూకలిసి ఇట్లా ప్రౌఢి అనేది చతుర్ప్రకారము. సాభిప్రాయత్వము అనేది కూడా కలసి ఓజస్సు పంచ ప్రకార మని అర్థము. ప్రతిపాదన విచిత్రతను ప్రౌఢి అంటారు.

ఉదా!— సరసిజవనబంధుశ్రీసమారంభకాలే
రజనిరమణరాజ్యే నాశ మాశు ప్రయాతి
పరమపురుష వక్త్రా దుద్గతానాం నరాణాం
మధుమధురగిరాంచ ప్రాదురాసీ ద్వినోదః.

కమలవనబాంధవుడయిన భాస్కరుని శోభాప్రారంభకాలములో రజనీ రమణుడయిన చంద్రదేవుని రాజ్యము శీఘ్రముగా నాశమును పొందు చుండగా పరమపురుషుని ముఖములోనుండి వెలువడిన మానవుల యొక్కయు మధుమధురములయిన వేదవాక్కులయొక్కయు వినోదము ప్రకటమైనది. ప్రాతఃకాలములో బ్రాహ్మణులు వేదపాఠ ప్రారంభముచేసి నారు అని సారాంశము.

పై పద్యములో "ఉషఃకాలము" అని ఒక పదార్థమును చెప్పుటకు ప్రథమపాదము రెండవపాదము చెప్పబడినవి. బ్రాహ్మణులయొక్క అని చెప్పడానికి తృతీయపాదము ఉపయుక్తమైనది. వేదములు అనే అర్థము ను చెప్పడానికి నాల్గవపాదము స్వీకృతమైనది. మొత్తముమీద దీనిలో ఒక పదార్థమునకై అనేకపదముల వర్ణన ఉన్నది. అందువలన మొదటి ఓజోగుణమును ఊహించాలి.

౨వ. ఓజస్సుకు ఉదాహరణము

ఖండితానేత్రకంజాతమంజురంజనపండితాః
మండితాఖిల దిక్ప్రాంతా శ్చండాంశో ర్భాంతి భానవః

ఖండితలయిన యువతుల నేత్రకమలమాలాసుందరరంజనములో పాండి త్యము కలిగిన నిఖల దిక్ప్రాంతములను అలంకరించిన సూర్యుని కిరణ ములు శోభించుచున్నవి.

దీనిలో "యస్యాః పరాంగనాగేహాత్ పతిః ప్రాతర్గృహే అంచతి"

'ఏస్త్రీయొక్క భర్త పరవనితాగృహమునుండి ప్రాతఃకాలములో గృహమునకు వచ్చుచున్నాడో' అనే వాక్యార్థస్థానములో కేవలమూ 'ఖండితా' పదము ప్రయుక్తమైనది.

౩వ ఓజస్సుకు ఉదాహరణము

> అయాచితః సుఖం దత్తే యాచితశ్చ న యచ్ఛతి
> సర్వస్వం చాపి హరతే విధి రుచ్ఛృంఖలో నృణామ్.

యాచింపని వానికి సుఖము నిస్తాడు. యాచించిన వానికి ఇవ్వడు. ఉచ్ఛృంఖలుడైన విధి మానవుల సర్వస్వమును హరించుతాడు.

దీనిలో "సర్వమూ దైవాధీనమే" అనే వాక్యార్థములో అనేక వాక్యరచన చేయబడినది. అందువలన ఇది విస్తారము. ప్రాచీనాచార్యులు దీనిని వ్యాసము అనే పేరుతో పిలుస్తున్నారు.

౪వ ఓజస్సుకు ఉదాహరణము

> తపస్యతో మునే ర్వక్త్రా ద్వేదార్థ మధిగత్య సః
> వాసుదేవ నివిష్టాత్మా వివేశ పరమం పదమ్.

ఒక మనుష్యుడు ఒక భక్తుని విషయంలో చెప్పుతున్నాడు. తపస్సు చేస్తూఉన్న ముని ముఖమునుండి అతడు వేదార్థమును పొంది వాసుదేవునియందు చిత్తమును లగించి పరమపదమును పొందినాడు.

దీనిలో "ముని తపస్సు చేస్తున్నాడు. ముని ముఖమునుండి అతడు వేదార్థమును పొందినాడు. తరువాత వాసుదేవ పరబ్రహ్మలో మనస్సును ప్రవేశింపచేసినాడు. పిమ్మట ముక్తుడయినాడు." అనే వాక్యార్థసమూహము, 'తపస్యతః' అనే శతృ ప్రత్యయము, 'అధిగత్య' అనే క్త్వా ప్రత్యయము "వాసుదేవ నివిష్టాత్మా" అనే బహువ్రీహిసమాసముల ద్వారా అనువాద్యరూపముగాను, 'వివేశ' అనే తిఙంతరూపముద్వారా విధేయరూపముగానూ ఒక వాక్యార్థరూపముగా స్వీకరింపబడినది.

౫ వ ఓజస్సుకు ఉదాహరణము.

సాభిప్రాయత్వము అంటే ప్రకృతార్థమును పోషించుట అని అర్థము.

> గణికాజామిళ ముఖ్యా నవతా భవతా బ తాఽహ మపి
> సీదన్ భవమరుగర్తే కరుణామూర్తే! న సర్వధోపేక్ష్యః,

ఓ కరుణామూర్తీ! పింగళ అనే గణికను అజామిళుడు మొదలయిన పాపాత్ములను రక్షించుతున్న నీవు సంసారపు ఎండమావుల గోతిలో వ్యధపడుతున్న నన్ను కూడా ఏవిధముగానూ ఉపేక్షింపరాదు. దయామయా! నన్ను ఏమాత్రమూ మరచి పోవద్దు.

దీనిలో "నీవు ఉపేక్షించవద్దు" అనే వచనమును పోషించడానికి "కరుణామూర్తే!" అనే విశేషణము ప్రయోగింపబడినది. నీవు పరమ దయాళుడవు, నీవు నన్ను ఉపేక్షింపవద్దు. నేను పాపాత్ముడ నని నాపై కరుణచూపక పోయినట్లయితే ఇది నీ స్వభావమునకు విరుద్ధము అనే ఈ వచనమును సిద్ధముచేయడానికి గణిక మొదలయిన దృష్టాంతము లీయబడినవి.

'సీదన్' వ్యధపడుతున్న అనే విశేషణము ఉంచబడినది. తాను అత్యంతమూ పాపిష్ఠు డయినపుడు కరుణము ప్రసక్తము కాదు కాబట్టి దాని సంపాదనకై ఆ యా వచనాలు చెప్పబడినవి. మొత్తముమీద ఈ పద్యములో ఒకటికూడా నిరర్థకపదము లేదు. అన్నిటికీ ఏదో కొంత అభిప్రాయ మున్నది.

౯. కాంతి:—దీప్తరసత్వం కాంతిః.

రసము స్పష్టముగా ప్రతీతమైనపుడు కాంతి అనబడును. దీని ఉదాహరణము రసప్రకరణములో వర్ణింపబడినది. ముందుకూడా అవసరము వచ్చినపుడు వర్ణించుతాము.

౧౦. సమాధి:— అవర్ణితపూర్వోయ మర్థః పూర్వవర్ణితచ్ఛాయోవేతి కవేరాలోచనం సమాధిః.

ఈ అర్థము పూర్వము వర్ణింపబడినది కాదు గదా! పూర్వము

వర్ణించినదానికి ఛాయ కావచ్చునుగదా! అనే కవియొక్క ఆలోచన 'సమాధి' అనే గుణము.

ఆలోచించుట అనేది ఒకవిధమైన జ్ఞానము. జ్ఞానము ఆత్మగుణము. కాబట్టి అర్థగుణము కాజాలదుకదా! కాగా దీనిని అర్థగుణము అనుట ఏ విధముగా కుదురుతుంది? అనే శంకకు,

ఇది సమాధానము. జ్ఞానముకూడా ఏదో ఒక అర్థవిషయములో కలుగుతుంది. ఆ జ్ఞానము ఏ విధముగా సమవాయసంబంధంతో ఆత్మయందు ఉంటుందో అట్లాగే విషయతాసంబంధముతో అర్థములో కూడా ఉంటుంది. కాబట్టి దీనిని అర్థగుణము అని అనుటలో ఏమీ బాధ లేదు. మొదటిదానికి ఉదాహరణము.

"తనయమైనాకగవేషణ" అని ఇదివరలో ఉదహరించిన గద్య. దీనిలో అర్థము వర్ణితపూర్వము కాదు.

రెండవ దానికి ఉదాహరణము తరుచుగా అంతటా సులభముగానే గోచర మవుతూ ఉంటుంది.

## ఇతరమతము

ప్రాచీనాచార్యులు కొందరు ఈ పైనిచెప్పిన గుణాలను అన్నిటినీ అంగీకరించరు. ఈ చెప్పిన వానిలో కొన్ని గుణములను మాధుర్యౌజఃప్రసాదములనే గుణములతో గతార్థములనుగా చేస్తారు. కొన్నిటిని ముందు చెప్పబోయే దోషాభావస్వరూపములనుగా భావించుతారు. కొన్నిటిని అలంకార కుక్షిలో అంతర్భవింప చేస్తారు. ఇంకా కొన్నిటిని విచిత్రతామాత్రములనుగా తలంచుతున్నారు. కొన్నిగుణాలను కొన్ని కొన్నిచోట్ల దోషరూపములనుగా భావించుతున్నారు. అందువలన ఈ చెప్పిన వానిని అన్నిటినీ స్వీకరించడము లేదు. వారు ఈ యిరువది గుణాలను ఒప్పుకోక మూడు గుణాలనే స్వీకరించుతారు.

శ్లేష, ఉదారత, ప్రసాదము, సమాధి ఈ గుణాలకు ఓజస్సును వ్యంజనముచేసే రచనలో అంతర్భావము కలుగుతుంది. ఓజోరచనలో బంధ

గాఢత్వము ఉన్నది. ఈ చెప్పిన శ్లేషాదులలో కూడా గాఢత్వము ఉన్నది. అందువలన అవి దీనిలో అంతర్భావము పొందవచ్చును.

ఇక్కడ ఒక శంక కలుగుతుంది. శ్లేష, ఉదారత అనే రెండు గుణాలూ సర్వాంశములో గాఢరచనారూపములు. కాబట్టి ఆ రెండిటికి ఓజో వ్యంజక ఘటనలో అంతర్భావము ఉండవచ్చుగాక. ప్రసాదము సమాధి అనే ఈ రెండు గుణములూ గాఢరచన శిథిలరచన అనే రెండు విధము లయిన రచనలలో మిశ్రితములై ఉంటవి. వీనిలో గాఢతారూపమైన అంశము ఓజోరూపమయిన అంశములో అంతర్భావము పొందినప్పటికీ శిథిలతారూప మయిన అంశానికి అంతర్భావము కలుగదు గదా! ఈ అంశము దేనిలో అంతర్భవించుతుంది? అని.

ఈ శంకకు అనాయాసముగా ఈ సమాధానము చెప్పవచ్చును. మాధుర్యమును వ్యంజనము చేయు ఘటనలో కాని ప్రసాదాభివ్యంజక మయిన రచనలో కాని ఇది అంతర్భవించవచ్చును.

ఇతరులు అంగీకరించిన మాధుర్యము మాచే అంగీకరింపబడిన మాధుర్యవ్యంజకము రెండూ ఒకటే కాగా ప్రాచీనుల మతములో వ్యంజకమందు వ్యంగ్యశబ్దమును ప్రయోగించుట లాక్షణిక మని తెలిసికోవాలి. రచనాదులు వ్యంజకములు. మాధుర్యము వ్యంగ్యము. మాధుర్య వ్యంజకమును మాధుర్యముగా వారు గ్రహించినా రంటే లక్షణా(భక్తి) వ్యవహారమును వారు స్వీకరించినా రని తెలుసుకోవాలి. అందువలన ఓజోగుణమునకు కూడా ఓజోవ్యంజకరచనలో అంతర్భావమును గ్రహించాలి.

సమత్వ మనేది అంతటా ఉచితము కాదు. తాము ఏవిషయమును ప్రతిపాదనము చేస్తారో ఆ విషయము యొక్క ఉద్భటత్వానుద్భటత్వ ములను అనుసరించి ఒకే పద్యములో భిన్న భిన్న రీతి ప్రయోగము ఉండుట ఇష్టమే.

> నిర్మాణే యది మార్మికోఽసి నితరా మత్యంత పాకద్రవ
> న్మృద్వీకామధుమాధురీమదపరీహారోద్ధురాణాం గిరామ్

కావ్యం తర్హి సఖే! సుఖేన కథయ త్వం సమ్ముఖే మాదృశాం
నోచే ద్దుష్కృత మాత్మనా కృత మివ స్వాంతా ద్బహి ర్మాకృథాః.

నీవు అత్యంతమూ పాకముచేత ద్రవించుతున్న ద్రాక్ష తేనెల మాధురీమదమును తిరస్కరించుటలో సమర్థములయిన వాక్కుల నిర్మాణములో మిక్కిలి విమర్శజ్ఞుడవే అయితే ఓ స్నేహితుడా! మావంటివారి ఎదుట ఆనందముగా కావ్యమును చెప్పుము. ఇట్లా కాకపోతే తాను చేసిన దుష్కృతమును ఇతరుల సన్నిధానములో ప్రకటన చేయనట్లుగా దానిని నీ స్వాంతములోనుండి బయట పెట్టవద్దు. నీమనస్సులోనే ఉంచుకో. ఏమాత్రమూ బయటకు రానీయవద్దు.

ఈ పద్యములో రెండు మార్గములూ ఉన్నవి. పూర్వార్థము తృతీయ చరణమూను లోకోత్తరనిర్మాణము కలిగిన కావ్యప్రతిపాదకము. ఈ మూడు పాదాలలో ఏమార్గము అవలంబింపబడినదో ఆ మార్గము నాల్గవ పాదములో లేదు. ఆ చతుర్థచరణము హీనకావ్యమును ప్రతిపాదన చేయడానికై స్వీకరింపబడినది. కాబట్టి ప్రతిపాద్య విషయమును అనుసరించిన ఈ విషమత్వము దీనిలో గుణమే. సమత అనేది ఏకరీతిగా ఉండటమే అయితే ఈ పద్యము దోషదుష్టమే అయ్యేది.

కాంతి, సౌకుమార్యము అనే ఈ రెండుగుణాలూ దోషాభావరూపములే. కాంతి గ్రామ్యతాత్యాగరూపము. సౌకుమార్యము కష్టతా పరిహారరూపము. ప్రసాదగుణమునుఅంగీకరించినప్పుడు అర్థవ్యక్తిని ప్రత్యేకంగా స్వీకరించనక్కరలేదు. ఈచెప్పినది అంతా శబ్దగుణాల విషయము. అర్థగుణాలలో కూడా శ్లేష ఓజోగుణముయొక్క మొదటి నాలుగు భేదాలూ. ఇవి విచిత్రతా మాత్రములే కాబట్టి గుణాలలో వీనిని పరిగణించ నక్కరలేదు. అది ఉచితముకూడా కాదు. కాకపోతే ప్రతి శ్లోకంలోనూ అర్థానికి విలక్షణ విలక్షణ విచిత్రతలు ఉండవచ్చు. అవి అన్నీకూడా గుణములభేదాలే అని అనవలసి వస్తుంది. వాటి నన్నిటినీ లెక్కపెట్టడము శక్యము కాదు.

అధికపదములు లేకపోవుట రూపముగా గలిగిన ప్రసాదము, ఉక్తి

విచిత్రతయే స్వరూపముగా కలిగిన మాధుర్యము, అపారుష్యమే శరీర ముగా కలిగిన సౌకుమార్యము, గ్రామ్యత్వము లేకపోవుటయే రూప ముగా కలిగిన ఉదారత, విషమతాభావరూప మయిన సమత్వము, సాభిప్రాయముగా ఉండుట అనే అయిదవ ఓజఃప్రకారము అనే ఈ ఆరుగుణాలూ క్రమముగా, అధికపదత్వము, అనవీకృతత్వము, అమంగళ రూపమయిన అశ్లీలత్వము, గ్రామ్యత్వము, భగ్నక్రమత్వము, అపుష్టార్థత్వము రూపములుగా గలిగిన ఆరుదోషములను నిరాకరిం చగా సిద్ధము లవుతున్నవి. అంటే ఆయా దోషాభావమాత్రములే కాని ప్రత్యేకముగా గుణములు మాత్రము కావు.

స్వభావోక్త్యలంకారమును స్వీకరించితే స్వభావమును స్పష్టముగా వర్ణించుట అనే అర్థవ్యక్తి గుణమును స్వభావోక్తిలో చేర్చవచ్చును. కాబట్టి ప్రత్యేకముగా అంగీకరించ నక్కరలేదు. స్ఫుటరసత్వరూపము అయిన కాంతి అనేది కూడా ప్రత్యేకగుణము కాదు. రసధ్వని రస వదలంకారము వీనిలో కాంతి గతార్థమై పోతుంది. ఆ రెండింటిని స్వీక రించినపుడు కాంతిని స్వీకరింపవలసిన ఆవశ్యకత్వము లేదు. సమాధి అనేది ప్రత్యేకముగా గుణమే కాదు. అది కవి అంతఃకరణములో ఉండే జ్ఞానరూపమయిన వస్తువు. అది కవితాకారణము. ఇట్లా తలచకపోతే ప్రతిభకూడా కావ్యగుణము కావలసి వస్తుంది. ఆలోచన ప్రతిభ అనే ఈ రెండూ ఒక విధముగా జ్ఞానములే. ఈ రెండిటిలో ప్రతిభను కావ్య కారణముగా అంగీకరించి ఆలోచనమాత్రము కావ్యగుణము అని అను టలో ప్రమాణ మేమిటి? కాబట్టి గుణములు మూడే అని మమ్మటాదుల భావము.

## ౧౦. రచన

### మాధుర్యవ్యంజక రచన

వానిలో మాధుర్యమును వ్యంజనముచేసే రచన ఈ దిగువ వ్రాసిన ప్రకారంగా ఉండాలి.

టవర్గ కాక తదతిరిక్తము లయిన ఇతరవర్గములలోని ప్రథమ తృతీయా

క్షరములతో శ, ష, స - య, ర, ల, వ లతో కూర్పబడునదిగా, అత్యంత సమీపములో ప్రయోగించబడిన అనుస్వారపరసవర్ణములతో కేవలానునాసికములతో శోభించేదిగా ముందుచెప్పబోవు స్వరూపము కలిగిన, సామాన్యరూపముగా విశేషరూపముగా కూడా నిషేధింప బడిన సంయోగాదులయొక్క స్పర్శరహితమైనదిగా, కేవలమూ సమాసప్రయోగరహితముగా గాక, కోమల స్వల్పసమాసయుక్తముగా ఉన్నరచన చక్కని ఆనుపూర్విత్వతో కూడుకొని ఉన్నప్పుడు మాధుర్య మునకు వ్యంజకము అవుతుంది.

వర్గములలోని ద్వితీయాక్షరములు చతుర్థాక్షరములు ఈ మాధుర్య గుణానికి అనుకూలములూ కావు, ప్రతికూలములూ కావు; కాని వానిని దూరదూరంగా సన్నివేశింపచేయాలి. ఆ వర్ణాలను సమీపసమీపాన ప్రయోగించి వానితో అనుప్రాసానునిర్మాణము చేసేటట్లయితే అవి ప్రతి కూలము కూడా కావచ్చును.

ఈ విషయములో కొందరు టవర్గభిన్నములయిన ఇతర వర్గములలోని అన్ని అక్షరాలకూ నిర్విశేషముగా మాధుర్య వ్యంజకత్వము ఉన్నదని చెప్పతున్నారు.

ఉదా :—తాం తమాలతరుకాంతిలంఘినీం
కింకరీకృతనవాంబుదత్విషమ్
స్వాంతః మే కలయ శాంతయే చిరం
నైచికీనయనచుంబితాం శ్రియమ్.

ఒక భక్తుడు తన హృదయమును సంబోధించు కొంటున్నాడు. ఓ స్వాంతమా ! నీవు శాంతిని పొందటానికి తమాలతరుకాంతిని ఉల్లం ఘించినట్టిన్నీ నూతనాంబుదకాంతిని కింకరీకరించుకొన్నట్టిన్నీ ఉత్త మోత్తమ గోనయన పరిచుంబితమైన శ్రీకృష్ణుని శోభను స్వీకరించు. నిత్యము స్మరించు. మరియొక ఉదాహరణము.

స్వేదాంబుసాంద్రకణశాలి కపోలపాలి
రన్తః స్మితాలస విలోకన వందనీయా

**ఆనంద మంకురయతి స్మరణేన కాపి**
**రమ్యా దశా మనసి మే మదిరేక్షణాయాః.**

నాయకుడు తన మిత్రునితో చెప్పుతున్నాడు. స్వేదోదకకణాలతో శోభించే కపోలపాళి కలిగినట్టిన్నీ లోలోపలి చిరునగవుచేత అలసమైన చూపులవలన ప్రశంసింప తగినట్టిన్నీ ఆ మదిరేక్షణయొక్క రమణీయము అనిర్వచనీయము అయిన అవస్థ మనస్సులో స్మరణచేయగా ఆనందమును అంకురింప చేస్తున్నది.

ఇక్కడ మొదటి పద్యములో భగవద్ధ్యానోత్సుక్యము అతిశయోక్తి చేత అలంకృత మవుతున్నది. అని కాని భగవద్విషయకమైన రతి అలంకృత మవుతున్న దని కాని తలచవచ్చును ఆ ఉత్సుకత్వము కాని ఆ రతి కాని వ్యజ్యమాన మవుతూ తుదకు శాంతరసములోనే పర్యవసానము పొందుతున్నది. కాబట్టి ఈ రచన శాంతరసము యొక్క మాధుర్యమును అభివ్యక్తము చేస్తున్నది. స్మరణముచేత బాగా ఉపష్టంభము పొందిన శృంగారగత మగు మాధుర్యమును రచన అభివ్యక్తము చేస్తున్నది.

## ఓ జో వ్యం జ క ర చ న

ఓజోగుణముయొక్క రచన దగ్గరదగ్గరగా ప్రయోగింప బడిన వర్గద్వితీయ చతుర్థాక్షరములతో టవర్గీయాక్షరములతో జిహ్వామూలీయము ఉపధ్మానీయము విసర్గసకారములతో అధికముగా కూర్చబడినదిన్నీ, వర్గములలోని మొదటి నాలుగు అక్షరములతో గాని రేఫముతో గాని కూర్చబడిన సంయోగము పరమందున్న దగ్గరదగ్గరగా ప్రయోగింప బడిన హ్రస్వాక్షరములతో కూడుకొనినదిన్నీ దీర్ఘసమాసాత్మక మైనట్టిన్నీ రచన ఓజోవ్యంజకము.

ఈ ఓజోబంధములో మధ్యమధ్య కూడుకొనిన వర్గీయ ప్రథమ తృతీయాక్షరములు సంయోగముతో కూడుకొని ఉండక పోయినట్లయితే అనుకూలములూ కావు ప్రతికూలములూ కావు. సంయోగ యుక్తములే అయినప్పుడు అనుకూలములు కావచ్చును. ఇట్లాగే అనుస్వారము,

పరసవర్ణమూ కూడా అనుకూలమూ కాదు, ప్రతికూలమూ కాదు "అయం పతతు నిర్దయం" అనేది దీనికి ఉదాహరణము.

## ప్రసాదవ్యంజక రచన

వినినంత మాత్రాన వాక్యార్థమును చేతిలో రేగుపండువలె నివేదించుతూ ఉండేరచన ప్రసాదగుణానికి అభివ్యంజక మవుతుంది. ఇందులో అర్థమును తెలుసుకొనడానికి కొంచెమైనా ప్రయాసపడ నక్కర లేదు. ఇది సర్వరస భావాదిసాధారణము. ఇది ఏదో ఒకరసానికే ఒకభావానికే అను కూల మని అనుకో నక్కరలేదు. ఈ విషయములో సామాన్యముగా నా (పండితరాజు) పద్యాలన్నీ ఉదాహరణములే అయినా ఒకటి ఉదా:

చింతామీలితమానసో మనసిజః సఖ్యో విహీనప్రభాః
ప్రాణేశః ప్రణయాకులః పున రసౌ వార్తాం సమస్తా కథా
ఏతత్ త్వాం వినివేదయామి మమ చే దుక్తిం హితాం మన్యసే
ముగ్ధే! మా కురు మాన మానన మిదం రాకాపతి ర్జేష్యతి.

మానిని అయిన నాయికతో చెలికత్తె చెప్పుతున్నది. మన్మథుడు చిత్తచింతతో నిమీలితమనస్కు డయినాడు. ఆతనికి ఆలోచించే శక్తి లేదు. చెలికత్తెలు దుఃఖించి దుఃఖించి కాంతివిహీన లయినారు. నీ ప్రాణనాథుడు ప్రేమకారణముగా అధీరు డయినాడు. ఈకథ అంతా ఆ విధముగా ఉండనీ. నావచనమును నీవు హితముగా తలచునట్లయితే దీనిని నివేదించుతున్నాను. ఓముగ్ధా! నీవు కోపపడవద్దు. నీ సుందర ముఖమును చంద్రుడు జయించుతాడు. రోషముతో నీముఖము మలిన మవుతున్నది. అందువలన ఇదివరకు ఎన్నడూలేని కలంకి అయిన చంద్రునితో సామ్యము కలుగుతుంది. అయ్యో! ఇప్పటికీ ప్రసన్నురాలవు కావా?

ఈ పద్యము మొత్తముమీద అంతా ప్రసాదాభివ్యంజకమే. కొన్ని కొన్ని అంశాలలో మాధుర్యము, ఓజస్సుకూడా వ్యంజకము కా వచ్చును. "చింతామీలిత మానసో మనసిజః" "మా కురు మాన మానన మిదం" ఈభాగాలవలన మాధుర్యమున్నూ "సఖ్యో విహీన

ప్రభా:" ఇత్యాది భాగము వలన ఓజోగుణములున్నూ అభివ్యక్తము లవుతున్నవి.

ఇక్కడ ఒకశంక కలుగవచ్చును. శృంగారమును ఆశ్రయించి ఉన్నట్టి మాధుర్యమును అభివ్యక్తము చేయడానికి తదనుకూలమైన రచన ఉండును గాక. కాని ఓజస్సునకు ఇక్కడ ప్రసంగ మేమిటి? తదనుకూలాక్షర విన్యాసము ఎందుకు చెయ్యాలి? అని.

ఇది సమాధానము. చెలికత్తె నాయికాకోపమును శాంతింపచేయడానికి అనేక ప్రయత్నాలు చేసినది. అనేకవిధాల పలికింది. ఎంతగానో హితము ఉపదేశించినది. అయినా నాయిక ప్రసన్నురాలు కాలేదు. కాబట్టి చెలికత్తెకు కోపము వచ్చింది. ఆ క్రోధయుక్తత్వమును వ్యంజనము చేయడానికి ఆ విధముగా విన్యాసము చెయ్యాలి. అప్పుడే సాఫల్యము ఉంటుంది.

ఈ విషయములో అధికముగా చెప్పవలసిన అవసరములేదు. ఓజస్వి అయిన రసమును కాని అమర్షాదిభావములను కాని వర్ణించవలె ననే ఇచ్ఛ లేకపోయినా వక్త అయినవాడు కోపయుక్తు డయినట్లుగా ప్రసిద్ధమైతే వర్ణింపబడే అర్థము క్రూరతరముగా ఉంటే రచింపబడే ప్రబంధము ఆఖ్యాయిక అయితే పరుషవర్ణఘటన ఉండవచ్చును అని సిద్ధాంతము.

కేవల ప్రసాదగుణానికి ఉదా:

> వాచా నిర్మలయా సుధామధురయా యాం నాథశిక్షామదాః
> తాం స్వప్నేపి న సంస్పృశా మ్యహ మహంభావావృతో నిస్త్రపః
> ఇ త్యాగఃశతశాలినం పున రపి స్వీయేషు మాం బిభ్రతః
> త్వత్తో నాస్తి దయానిధి ర్యదుపతే మత్తో న మత్తః పరః.

ఓ నాథా! సుధామధురమైన నిర్మలవాక్కుతో నాకు ఏశిక్షను ఇచ్చి నావో ఆ శిక్షను అహంకారముతో ఆచ్ఛాదితుడనై లజ్జారహితుడనై నేను స్వప్నములోకూడా స్పృశించలేదు. ఓ యదుపతీ! ఈ విధముగా

అపరాధశతముతో కూడుకొనిన నన్ను మళ్లా ఆత్మీయులలో పరిగణించుతూ ఉన్న నీ కంటె దయానిధి లేడు నా కంటె అధికంగా మద మత్తున్నూ లేడు. ఈ పద్యములో గుణాన్తరసంబంధము ఏమాత్రమూ లేని ప్రసాదము ఉన్నది.

## రచనాదోషము

ఒక్కొక్క రచనకు పూర్వము చెప్పిన గుణాలను వ్యంజనము చేసేశక్తి ఉంటుంది. దానిపరిచయము ఆవశ్యకము. అందుకు సామాన్యరూపముగా విశేషరూపముగా వర్జనీయములను తెలుసుకోవాలి. ఒకే అక్షరము వరుస వరుసగా ఒక పదములో ఒక పర్యాయము ప్రయోగింపబడితే దాని శ్రవ్యతలో కొంత అనౌచిత్యము ఉంటుంది. "కకుభ సురభిః" "వితతగాత్రః" "పలల మి వాభాతి" మొదలయిన పదాలలో ఒకే పదములో సజాతీయ వర్ణానికి స్వానంతర్యము ఉన్నది. ఆ స్వానంతర్యమే అనేక పర్యాయములు ఉన్నట్లయితే అధికముగా అనౌచిత్యము ప్రతీతము అవుతుంది. "వితతతరస్తరు రేష భాతి భూమౌ" అనేది దీనికి ఉదాహరణము. ఇట్లాగే భిన్నభిన్న పదములలో వచ్చినా అనౌచిత్యము ఉన్నది. "శుక! కరోషి కథం విజనే రుచిం" అనేది ఉదాహరణము. భిన్నభిన్న పదాలలో మాటిమాటికీ ఈస్వానంతర్యము ఉన్నట్లయితే అధికానౌచిత్యము ఉన్నది. "పిక! కకుభో ముఖరీకురు ప్రకామమ్."

ఈ విధముగా ఒకవర్గములోని అక్షరము ఒకపర్యాయము ప్రయోగింపబడినతరువాత దానితోపాటు ఆ వర్గములోని ఇతరాక్షరమును ఒక పదములో ఒకపర్యాయము ప్రయోగించితే అశ్రవ్యత్వము ఉన్నది. "వితథస్తే మనోరథః" అనేదానిలో 'త' తరువాత 'థ' ఉండడము అనుచితము. ఒకే పదములో అవి అనేకపర్యాయములు ఉంటే అధికాశ్రవ్యత్వమున్నది. "వితథతరం వచనం తవ ప్రతీమః" దీనిలో 'త థ త' ప్రయోగ మున్నది. ఇట్లాగే భిన్నభిన్నపదాలలో ఉన్నా అధికాశ్రవ్యత్వము ఉన్నది. "అథ తస్య వచః శ్రుత్వా" దీనిలో 'థత' ప్రయోగము. భిన్నపదములో మాటిమాటికీ ఈవిధముగానే ప్రయోగము

ఉంటే అంతకన్న అధికముగా అశ్రావ్యత్వము ఉన్నది. "అథ తథా కురు యేన సుఖం లభే".

వర్గాక్షరాలలో మొదటిఅక్షరము తరువాత రెండవఅక్షరమును మూడవ అక్షరము తరువాత నాల్గవ అక్షరమును సహప్రయోగము చేయడం అనుచితము. ప్రథమ తృతీయములకూ, ద్వితీయ తృతీయములకూ సహప్రయోగము అంతగా అనుచితము కాదు, అంతగా అశ్రావ్యమూ కాదు. అక్కడ ఉన్న కొంచెపుపాటి అశ్రావ్యత్వమును నిర్మాణమార్మికులు మాత్రమే తెలుసుకో గలుగుతారు. ఇదే మాటిమాటికీ ఉంటే అశ్రావ్యత్వము అధికము అవుతుంది. అప్పుడు సాధారణులు తెలుసుకొనడానికి అవకాశము ఉంటుంది. "ఖగకలానిధి రేవ విజృంభతే," "ఇతి వదతి దివానిశం ధన్యః" ఇత్యాదులలో ఆ విశేషమును చూడాలి. ప్రతివర్గములోనూ పంచమాక్షరములు మధురములు. వాటికి అటూ ఇటూ తమ వర్గములోని అక్షరా లున్నా దోషము లేదు. "తనుతే తనుతాం తనా" దీనిలో అశ్రావ్యత్వము లేదు. కాని పంచమాక్షరమైన తంతో తనకే మాటిమాటికీ సహప్రయోగము ఉన్నట్లయితే అశ్రావ్యత ఉండనే ఉంటుంది. "మమ మహతీ మనసివ్యథాఽవిరాసీత్." ఈ చెప్పిన అశ్రావ్యత్వములు గురువర్ణములతో వ్యవహితములు అయినట్లయితే దోషములు కావు. "సంజాయతాం కథంకారం కాకే కేకా కలస్వనః" వేరొక ఉదాహరణము:

యథా యథా తామరసాయతేక్షణా, మయా సరాగం నితరాం నిషేవితా
తథా తథా తత్త్వకథేవ సర్వతో, వికృష్య మా మేకరసం చకార సా.

నాయకుడు తన మిత్రునితో చెప్తున్నాడు. నేను సానురాగంగా సంపూర్ణంగా ఆ పద్మవిశాలనయనను ఏయే విధంగా అనుభవించినానో ఆయావిధంగా తత్త్వకథ (బ్రహ్మవిచారణ) మాదిరిగా అంతటా నన్ను ఆ తామరసాయతేక్షణ ఆకర్షించి ఏకరసమయునిగా చేస్తున్నది. బ్రహ్మవిజ్ఞానికి బ్రహ్మకంటె అతిరిక్తముగా ఏమీ గోచరము కాదు అట్లాగే నాకుకూడా ఆమెకంటె అన్యము ఏమీగోచరముకావడంలేదు.

గుర్వక్షరము రెండువిధాలుగా ఉంటుంది. ఒకటి దీర్ఘము, సంయోగము పరముగా ఉన్న లఘువు; సంయోగపరకమైన లఘువు గురువవుతుం దని నియమముకదా! పైపద్యము మొదటి దానికి ఉదాహరణము. దీనిలో దీర్ఘము వెంటవెంటనే ఉండడము వలన అశ్రవ్యత్వము కనబడడం లేదు.

సంయోగము పరమం దున్నప్పటికీ అశ్రవ్యత లేకపోవడానికి ఉదాహరణము.

> సదా జయానుషంగాణా మంగానాం సంగరస్థలమ్
> రంగాంగణ మి వాభాతి తత్తత్తురగతాండవైః.

అంగదేశరాజ వర్ణనము. నిత్యము జయములో అనుషక్తు లయి నేటి వరకూ ఎన్నడూ పరాస్తులు కానట్టి అంగదేశరాజుల సంగరస్థలము ఆ యా తురగముల తాండవములచేత నాట్యరంగాంగణమువలె భాసించుతున్నది.

దీనిలో "తత్తత్తు" అనే సంయుక్తతకారము ద్వారా అశ్రవ్యత నివృత్త మవుతున్నది. ఈవిషయమును ఇక్కడ గ్రహించాలి. గుర్వక్షరము ఏఅక్షరాలమధ్యకూర్పబడుతున్నదో ఆవర్ణాలకే ఆనంతర్యమువలన సిద్ధమగునట్టి అశ్రవ్యత్వమును పోగొట్టగలదు. అందువలన ప్రకృతములో "యథా యథా తామరసాయతేక్షణా" అనే పద్యము "యథాతా" అనే భాగములో "తథా తథా త" అనేభాగములోనూ 'థ' కారానంతరము 'త' కారము కూర్పబడినది. దీనలో 'థ' కార 'త' కారములకు ఆనంతర్యమువలన కలిగిన దోషము దూర మైపోయినప్పటికీ 'త' కార 'థ' కారములకు ఆనంతర్యమువలన కలిగే అశ్రవ్యత్వము పోవడం లేదు. ఆ దోషము ఉన్నది ఉన్నట్లుగానే ఉన్నది. వాని మధ్యలో గురువర్ణము లేదు. హ్రస్వాకారమే ఉన్నది.

ఈ విధముగా మూర్ధన్యము మొదలుగా గల అక్షరముల సంయోగము కూడా సామాన్యముగా అశ్రవ్య మవుతున్నది. "రాష్ట్రేత వోష్ట్ర్యః పరితశ్చరంతి"—దీనిలో "ష, ట, ర" సంయోగ మున్నది. ఈ విధముగా

అనుభవానుసారముగా శ్రుతికటుత్వమునకు సంబంధించిన ఇతరభేదా లనుకూడా ఊహించాలి.

సంయోగము కల వర్ణము దీర్ఘాక్షరముతరువాత ఉన్నప్పుడు అది భిన్న పదగతముగా ఉంటే ఒక పర్యాయము ప్రయోగించినా అశ్రవ్యమే. మాటిమాటికీ ప్రయోగించినప్పుడు అధికముగా అశ్రవ్య మవుతుంది.

హరిణీప్రేక్షణా యత్ర గృహిణీ న విలోక్యతే
సేవితం సర్వసంపద్భి రపి తద్భవనం వనమ్.

ఏభవనములో కురంగీనయన అయిన గృహిణి కనబడదో ఆ భవనము సకలసంపత్తులతో కూడుకొనప్పటికీ వనమే అవుతున్నది. కాని భవనము కానడములేదు. గృహానికి గృహలక్ష్మి ఉండాలి.

'హరిణీ' పదములో 'ణీ' కారానంతరము 'ప్రేక్షణ' పదములో 'ప'కార 'రేఫ' సంయోగ మున్నది. అందువలన ఇది దోషదుష్టము.

దీర్ఘస్వరానంతరము సంయుక్త వర్ణము ఈ రెండూ ఒకే పదములో ఉంటే ఈ విధంగా అశ్రవ్యము గాదు.

"జాగ్రతా విచితః పంథాః శాత్రవాణాం వృథోద్యమః"

జాగరణము కలవానిచేత మార్గము వెతుకబడినది. శత్రువుల ప్రయత్నము వ్యర్థమే. ఇత్యాదులలో 'జాగ్రతా' 'శాత్రవ' అశ్రవ్యత్వము లేదని గ్రహించాలి.

పరసవర్ణమువలన వచ్చిన సంయోగము ఎపుడూ దీర్ఘఘటితపదము కంటె భిన్నపదఘటితము కాదు. అందువలన దాని ఆనంతర్యము ఏమాత్రమూ అశ్రవ్యము కాదు. అది భిన్నపదములో ఉండనే ఉండదు. మధురముగా కూడా ఉంటుంది. "తా న్తమాలతరుకా న్తిలక్ష్మీం" అనేపద్యములో "తా న్తమాల" "సీఙ్కిఞ్కరీ" పదములలో ఉన్న పరసవర్ణము పూర్వపదముతో సంబంధించి ఉన్నది అందువలన ఈ సంయోగము భిన్నపదగతము అనబడదు. ఈ విషయములో ఈ మతములను గ్రహించాలి.

సంయుక్త వర్ణాలలో ప్రత్యేకమూ సంయోగసంజ్ఞ ఉంటుంది అని కొందరి మతము. వారి మతానుసారం "తా న్తమాల" అనేచోట 'న, త'లు రెండింటికీ ప్రత్యేకముగా సంయోగసంజ్ఞ ఉన్నది. తమాల పదములోని మొదటి 'త' అనే వర్ణము భిన్నపదములోనే ఉన్నప్పటికీ మొదటి 'తా' వర్ణములోని దీర్ఘమైన ఆకారముకంటె అవ్యవహిత పరము కాదు. ఆ రెండిటికీ మధ్య 'న' కారముతో వ్యవధాన మున్నది.

సముదాయానికే సంయోగసంజ్ఞ ఉంటుంది అని అంగీకరించే వారి మత ములో ఈ సంయోగము భిన్నపదగతము కాదు. ప్రత్యేకముగా సంయోగసంజ్ఞ ఉంటుంది అనే వారి మతంలోనే సంయోగము ఉన్న ప్పటికీ వ్యవధానమును సంపాదించే పరసవర్ణము ఉన్నందున అశ్రవ్యము కాదు. ఆ పరసవర్ణము ఆ అశ్రవ్యతాదోషాన్ని హరించుతున్నది.

ఈ పద్యములోనే "నవామ్బుద" అనే శబ్దములో నవ-అంబుద ఈ రెండి టికీ మధ్య 'ఆ'కారము ఏకాదేశముగా వచ్చినది. ఆ ఏకాదేశము పూర్వపు 'వ'కారముతోటీ, పరమున ఉన్న 'అ'కారముతోటీ సంబం ధించి ఉంటుంది. "అన్తాదివచ్చ" అనే పాణినిసూత్రము ఈ అర్థమునే చెప్పుతున్నది. అది పూర్వపదముతో భాగము పొందినప్పుడు 'మ్బు'లో సంయోగము ఉన్నది. అది భిన్నపదగతమే. దీర్ఘానంతరమే వచ్చింది. వాని మధ్యలో ఏమీ వ్యవధానము లేదు. అయినప్పటికీ అది దోషము కాదు. భిన్నపదగతమైన సంయోగము అంటే ఈ విధముగా గ్రహిం చాలి. అది ఏకపదములో అంతర్గతము కారాదు. కాబట్టి ఏదోషమూ లేదు. "నవ-అమ్బుద" అనే రెండు పదాలూ భిన్నభిన్నములే అయినా వానికి ఏకాదేశము రావడముచేత "నవామ్బుద" రూపముగా ఏక పదాన్తర్గతము లయినవి. అందువలన ఇక్కడ అశ్రవ్యత్వము లేదు.

ఈ దీర్ఘము పైనచెప్పిన విధంగా రెండు పదాలలోనూ చేరినట్లవు తుంది. అప్పుడు దీర్ఘము రెండవపదంలోకూడా చేరి ఉండడముచేత ఏక పదగతముకూడా అయినందువలన ఏకపదగత భిన్నము కాజాలదు అని ప్రకృతంలో గ్రాహిక.

ఈ చెప్పిన భిన్నపదగత సంయోగము మరల మరల వచ్చిన ట్లయితే అత్యంతమూ కర్ణకటువుగా ఉంటుంది.

"ఏషా ప్రియా మే క్వ గతా త్రపాకులా"

త్రపతో కూడుకొన్న ఈ నా ప్రియురాలు ఎక్కడికి వెళ్లింది? ఈ అశ్రవ్యత్వము కావ్యానికి కుంటితనమును ఇచ్చేదిగా ప్రతీత మవుతున్నది. కావ్యరసధారకు ఇది అడ్డు తగులు తున్నది. కాబట్టి దీనిపరిహారము ఆవశ్యకము.

ఇంకా సంధివిషయములో ఈ నియమాలను తెలుసుకోవాలి. ఇచ్ఛాను సారముగా ఒకపర్యాయము సంధి చేయకపోయినా దోషమే. "రమ్యాణి ఇందుముఖి! తే కిలికించితాని" దీనిలో "ని, ఇ' వీటికి సంధి చేయలేదు. ప్రగృహ్యాసంజ్ఞాకారణముగా ఒక పర్యాయము సంధిచేయక పోవచ్చును. అనేక పర్యాయములు ఆ ప్రగృహ్యాము ఉన్న ట్లయితే అశ్రవ్య మవుతుంది. "అహో! అమీ ఇందుముఖీవిలాసాః": దీనిలో "ఓ+అ, ఈ+ఇ," ఇవి అశ్రవ్యములే. ఈ విధానానుసారముగా 'య'కారము నకు 'వ'కారమునకూ లోపము నిమిత్తముగా సంధి చేయక పోవచ్చును. అది వారంవారము వచ్చిన ట్లయితే దోషము. "అపర ఇషవ ఏతే కామినీనాం దృగంతాః": దీనిలో "అ+ఇ, అ+ఏ" ఇవి అశ్రవ్యములు. అయితే మీ కావ్యమందే ఉన్నపద్యములో:

భుజగాహితప్రకృతయో గారుడమంత్రా ఇ వావనీరమణ!
తారా ఇవ తురగా ఇవ సుఖలీనా మంత్రిణో భవతః.

కవివచనము. ఓరాజా! నీమంత్రులు గారుడమంత్రాలవలె భుజగాహిత ప్రకృతులు.(భుజగ-జారులు సర్పములు,) తారలవలె తురగములవలె సుఖలీనులు, (తారలుశోభనాకాశలీనములు, తురగములు శోభనఖలీనములు కళ్లెములు కలవి,) మంత్రులు సుఖమందు లీనులు.

కవిత ఏవిధముగా కుదురుతుంది? అని శంక. అటువంటి అభిమానమే ఉంటే యకారలోపము చేయకుండా పఠించినప్పుడు "మన్త్రాయివ తారాయివ తురగాయివ" అని ఉంటుంది. కాబట్టి దోషము లేదు.

ఈ మా పద్యంలో యకారలోపము లేనిపాఠమే మాకు సమ్మతము కాబట్టి దోషము లేదని గ్రహించాలి.

ఈవిధముగానే 'రు' వర్ణానికి 'ఉ'త్వము, హల్లు పరంగా ఉండగా యకారానికి లోపము. యణ్, గుణ, వృద్ధి, సవర్ణదీర్ఘ, పూర్వరూపాదులు సమీపసమీపములో బహుళముగా ప్రయోగింపబడినప్పుడు అశ్రవ్యత్వము కలుగుతుంది. ఈ చెప్పిన అశ్రవ్యభేదము లన్నీ సామాన్యముగా కావ్యములో అంతటా వర్జనీయములే. రసభావవర్ణనము ఉన్నప్పుడు ఈ అశ్రవ్యతలను ఏమాత్రమూ కూర్చరాదు.

## విశేషదోషములు

ఏ యే దోషాలు యే రసాలలో వర్జనీయములో వాని విషయములను తెలుసుకోవాలి. మధురరసములో ఏవర్ణములు విశేషముగా వర్జనీయములో ఆ వర్ణాలే ఓజస్విరసాలలో అనుగుణములు. అవి ముమ్ముందు చెప్పబడును. ఓజస్విరసాలలో వానిని అవశ్యంగా గ్రహించాలి. మధురరసాలకు అనుకూలంగా చెప్పబడే వర్ణములు ఓజస్విరసాలకు ప్రతికూలములు. ఇది సాధారణ నిర్ణయము. దీనిని సవిశేషంగా తెలుసుకోవడం ఆవశ్యకము.

ఈ చెప్పబోయేవి మధురరసాలలో నిషిద్ధములు. దీర్ఘసమాసము, క చ ట త ప; ఖ ఛ ఠ థ ఫ; గ జ డ ద బ; ఘ ఝ ఢ ధ భ అనే ఝయ్ వర్ణములయొక్క సంయోగపరకము లయిన హ్రస్వవర్ణములు; విసర్గ, విసర్గకు ఆదేశముగా వచ్చే సకారము, జిహ్వామూలీయములు, ఉపధ్మానీయములు, టవర్గులోని అక్షరములు, అన్ని వర్గులకూ సంబంధించిన మొదటి నాలుగు అక్షరాలు రేఫహకారముల ద్వారా కూడుకొనిన సంయోగములు, ల, మ, న, వర్ణాలకంటె అతిరిక్తము లయిన హల్లులకు వానితోటిసంయోగము, రెండు ఝయ్ వర్ణములతో కూర్చబడిన సంయోగము, వీనిని వ్యవధానము లేకుండా మాటిమాటికీ ప్రయోగించడం వర్జించాలి. అంటే వాటి ద్విత్వాలకు అత్యంతసమీపంలో మాటిమాటికీ ప్రయోగము ఉండరాదు. వర్గములలోని మొదటి

నాలుగు అక్షరాలకూ ఆవర్గములలోని ఏవో రెండక్షరాలతో సంయోగ మును దగ్గర దగ్గరగా మాటిమాటికీ కూర్చరాదు.

ఇంకా సవర్ణ ఝయ్ ద్వయ ఘటిత సంయోగమును ఒక పర్యాయ మైనా ప్రయోగించరాదు. స్థాన ప్రయత్నములు సమంగా ఉంటే సవ ర్ణము లవుతవి. ఇట్లాగే శ, ష, స, వర్ణాలకంటె అతిరిక్తము లయిన మహాప్రాణాక్షరములతో సంయోగమును కూడా ఒక పర్యాయమైనా ప్రయోగించరాదు. "వర్గాణాం ద్వితీయ చతుర్థా శలశ్చ మహాప్రాణాః" అని వైయాకరణ నియమము. కాగా "ఖ ఘ ఛ ఝ ఠ ఢ థ ధ ఫ భ శ ష స హ" అనే అక్షరాలు మహాప్రాణములు అని భావము. వీనికి ప్రత్యేక ప్రత్యేకముగా ఉదాహరణములను ఈ క్రిందివిధంగా గ్రహించాలి. దీర్ఘసమాసము. ఉదా:

> లోలాలకావలివలన్నయనారవింద
> లీలావశంవదితలోకవిలోచనాయాః
> సాయాహ్ని ప్రణయినో భవనం వ్రజంత్యాః
> చేతో న కస్య హరతే గతి రంగనాయాః!

చంచలము లయిన అలకలసమూహములతో చలించు నయనకమల లీల లతో లోకవిలోచనములను వశంవదము చేసి, సాయంకాలము ప్రియుని భవనమునకు గమించుతున్న ఆ అంగనామణిగమనము ఎవనిచేతమును హరింపదు! ఈ పద్యము పూర్వార్థములో దీర్ఘసమాస మున్నది. ఇది మధురరసానికి అనుకూలము కాదు.

ఏ హ్రస్వవర్ణాలకు కఖగఘ, చఛజఝ, టఠడఢ, తథదధ, పఫబభ, వర్ణముల సంయోగము ఉన్నదో వాని అధికత్వమునకు ఉదాహరణము:

> హీరస్ఫురద్రదనశుభ్రిమశోభి కించ
> సాంద్రామృతం వదన మేణవిలోచనాయాః
> వేధా విధాయ పునరుక్త మి వేందుబింబం
> దూరీకరోతి న కథం విదుషాం వరేణ్యః?

వజ్రాల మాదిరి ప్రకాశించుతున్న దంతశుభ్రతతో శోభించే చిక్కని

అమృతము ఉన్న ఈ ఏణాక్షీవదనమును నిర్మాణించి విద్వద్వరేణ్యుడైన బ్రహ్మ పునరుక్తముగా ఉన్న చంద్రబింబమును ఏల దూరీకరించడు? ఈ పద్యములో "హీరస్ఫురద్రదనశుభ్రి" అనేవరకూ ఉన్న రచన శృంగారరసమునకు ప్రతికూలము; మిగిలినది రమణీయమే ఉత్తరార్థము లోని 'పునరుక్త' శబ్దములో ఝయ్‌వర్ణము లయిన, 'కత'ల సంయోగమున్నది. అయినా ఆ సంయోగము ప్రచురముగా లేదు. కాబట్టి దోషము కాదు. ఈ పద్యము ఆదిలో "దంతాంశుకాంత మరవింద రమాపహారి" అని రచించితే సర్వమూ రమణీయముగానే ఉంటుంది.
విసర్గములు ప్రచురముగా ఉన్నందుకు ఉదా:

సానురాగాః సానుకంపా శ్చతురాః శీలశీతలాః
హరంతి హృదయం హంత! కాంతాయాః స్వాంతవృత్తయః॥

అనురాగసహితములు దయాయుక్తములు చతురములు శీలశీతలములు అయిన ప్రియురాలి చిత్తవృత్తులు ఆహా! హృదయమును హరించుతున్నవి.

ఈ పద్యంలో "సానురాగాః సానుకంపాః చతురాశ్శీ"అనేవరకూ ఉన్న పూర్వార్థము మాధుర్యమునకు అనుకూలము కాదు.
జిహ్వామూలీయముల ప్రచురత్వమునకు ఉదా:

కలితకులిశఘాతాః కేఽపి ఖేలంతి వాతాః
కుశల మిహ కథం వా జాయతాం జీవితే మే
అయ మపి బత గుంజన్నాలి! మాకందమౌళౌ
చులుకయతి మదీయాం చేతనాం చంచరీకః.

ఇది విరహిణీ వచనము. వజ్రాఘాతముతో కూడుకొనిన ఏవో గాడ్పులు విసురుతున్నవి. అబ్బా! నా జీవితములో కుశలత్వము ఏవిధముగా కలుగుతుంది? అయ్యో సఖీ! రసాలశిఖరముమీద గుంజనము చేస్తూ ఉన్న ఈ తుమ్మెదకూడా నా జీవితమును ఆపోశనము పట్టుతున్నది.
ఈ పద్యములో రెండవ జిహ్వామూలీయపర్యంతమూ రచన మాధుర్యానికి అనుకూలము కాదు.

**కథయ క్థ మి వాశా జాయతాం జీవితే మే**
**మలయభుజగవాంతా వాంతి వాతాః కృతాంతాః**

అని రచించితే ఈ దోషము రాదు.

ఉపధ్మానీయముల ప్రచురతకు ఉదా:

**అలకాః ఫణిశాబతుల్యశీలాః, నయనాంతాః పరిపుంఖితేషు లీలాః**
**చపలోపమితా ఖలు స్వయం యా, బత లోకే సుఖసాధనం కథం సా॥**

ముంగురులు ఫణికుమార సమాన స్వభావములు. నయనప్రాంతములు పుంఖిత బాణలీలలు. స్వయముగా ఆయువతి క్షణప్రభ కదా! అటువంటి ఆస్త్రీ ఏవిధముగా లోకములో సుఖసాధన మవుతుంది?

దీనిలోని రెండు ఉపధ్మానీయములూ శాంతరసానుగుణములు కావు.

టవర్గము ఝుయ్‌వర్ణముల ప్రచురత్వమునకు ఉదా:

**వచనే తవ యత్ర మాధురీ సా, హృది పూర్ణా కరుణే చ కోమలే ఽభూత్**
**అధునా హరిణాక్షి! హా కథం వా, కటుతా తత్ర కఠోరతా పిరాసీత్ ॥**

ఇది నాయికావచనము. ఓ హరిణాక్షీ! ఏ నీవచనములో అనుపమమధురత్వము ఉన్నదో, ఏ నీ కోమలహృదయములో పూర్ణకరుణ ఉన్నదో, ఆ ఈ రెండిటిలో ఈ కటుత్వము, ఈకఠోరత్వము, ఏవిధముగా వచ్చినవమ్మా!

ఈ పద్యము ఉత్తరార్ధమును,

**అధునా సఖి! హా కథం వా, గతి ర న్యైవ విలోక్యతే గుణానామ్.**

అని రచించితే మాధుర్యానికి అనుకూల మవుతుంది.

రేఫఘటితసంయోగానికి అసకృత్ప్రయోగము. ఉదా:

**తులా మనాలోక్య నిజా మఖర్వం, గౌరాంగి! గర్వం న కదాఽపి కుర్యాః**
**లసంతి నానాఫలభారవత్యో, లతాః కియత్యో గహనాంతరేషు.**

ఇది నాయికవచమున. ఓ గౌరాంగీ! నీకు సామ్యము కనపడ లేదని

అఖర్వగర్వమును ఎప్పుడూ కలుగజేసుకో వద్దు. గహనాంతరములలో నానాఫలభారము కలిగిన పెన్నో లతలు శోభించుతున్నవి. అవి నీకు సమానములే.

దీనిలో "తులా మనాలోక్య మహీతలే ఽస్మిన్" అని నిర్మాణము చేస్తే బాగా ఉండేది.

ల, మ, న, వర్ణాలకంటె భిన్నము లయిన వర్ణాలకు తమతో పాటు సంయోగము అసకృత్తుగా ఉన్నప్పుడు ఉదా:

విగణయ్య మే నికాయ్యం తా మనుయాతోసి నైవ త న్న్యాయ్యమ్.

"నీవు ఏమీ గణించకుండా ఆమె ననుసరించి నాయింటికి వచ్చినావు. ఇది న్యాయము కాదు" అనే భావము కలిగిన దీనిలో "నికాయ్యం న్యాయ్యం" అనే యకారద్వయసంయోగము రసానుకూలముగా లేదు.

ల, మ, న, వర్ణాలకు స్వాత్మ సంయోగము అయితే ఆవిధముగా పారుష్యావహము కాదు. ఉదా:

ఇయ ముల్లసితా ముఖస్య శోభా, పరిఫుల్లం నయనాంబుజద్వయం తే
జలదాలిమయం జగ ద్వితన్వన్, కలితః క్వాపి కి మాలి ! నీలమేఘః.

సంభోగచిహ్నాలతో కూడుకొన్న గోపికతో సఖి అంటున్నది నీయీ ముఖశోభ ఉల్లాసయుక్తముగా ఉన్నది. నీ నయన కమలద్వంద్వము బాగా వికసించినది. జగత్తును నీలమేఘ మాలామయముగా చేయునట్టి నీలమేఘము ఎక్కడ నైనా కూడుకొన్నదా ? చెలీ ! నీకు శ్రీకృష్ణ సమాగమము కలిగినదా ?

రుయ్ ద్వయఘటిత సంయోగమునకు ఉదా:

ఆసాయం సలిలభరే, సవితార ముపాస్య సాదరం తపసా
అధునాఽబ్జేన మనాక్ తవ మానిని ! తులనా ముఖ స్యాప్తా.

మానిని అయిన నాయికతో దూతి పలుకుతున్నది. ఓమానినీ! సాయం కాలమువరకూ సలిలపూరములో సాదరముగా తపస్సుచే సూర్యుని

ఉపాసించి ఇప్పుడు పద్మముచేత నీ ముఖసామ్యము కొంచెముగా పొంద బడినది.

దీనిలో ఉత్తరార్ధము సుందరముగా లేదు.

సరసిజకులేన సంప్రతి, భామిని ! తే ముఖతులాఽధిగతా.

అని ఉంటే యుక్తముగా ఉంటుంది.

సవర్ణము లయిన ఝయద్వయముతో కూర్పబడిన సంయోగమునకు సకృత్ప్రయోగోదాహరణము :

అయి ! మందస్మితమధురం, వదనం తన్వంగి! యది మనా క్కురుషే
అధు నైవ కలయ శమితం, రాకారమణస్య హంత, సామ్రాజ్యమ్ !

ఓతన్వంగీ! నీ వదనమును నీవు కొంచెము మందస్మిత మధురముగా చేసినట్లయితే, ఆహా! ఇపుడే పూర్ణిమాచంద్రుని సామ్రాజ్యము పోయిం దని తెలుసుకో.

ఈ విషయములో ఒక విధముగా శంకించవచ్చును. సవర్ణఝయ్ద్వయ సంయోగమును నిషేధించడం అనవసరము. అది వేరొకవిధంగా గతార్థమైపోతున్నది. పై పద్యములో "మనా క్కురుషే" అనే చోట ఏ కకారద్వయ సంయోగము ఉన్నదో దానిలో దోషము పూర్వము చెప్పిన విధానముతోటే సంగృహీత మవుతున్నది. హల్ఘటితస్వాత్మ సంయోగము ఇదివరలో చెప్పబడినది. దానిచేతనే దీనినిషేధము సిద్ధ మవుతున్నది. ఇంకా 'క, ఖ' వర్ణముల సంయోగ మయితే మహాప్రాణ ములకు ఏ సంయోగనిషేధము చేయబడిందో దానిచేతనే గతార్థ మవు తున్నది. ఇక మూడవ అక్షరముతో సంయోగమే మిగిలి ఉన్నది. అసలు అది ఎపుడూ సంభవించనే సంభవించదు. కాబట్టి రెండు సవ ర్ణము లయిన ఝయ్ వర్ణముల నిషేధము వేరుగా వ్రాయడం నిరవ కాశమే కదా అని.

సమాధానము. రెండుసవర్ణము లయిన ఝయ్వర్ణములకు ఒకపర్యా యము సంయోగము ఉన్నప్పటికీ దూషితము అవుతుంది. సకృ

త్ప్రయోగవిషయంగా దీనికి అవకాశము ఉన్నదని వేరుగా పరిగణింప వలసి వచ్చినది. కాకపోయినట్లయితే ల, మ, న భిన్నము లయిన హల్లులకు స్వాత్మసంయోగము అసకృత్తుగా ప్రయోగింప బడినపుడే దోష మవుతున్నది. కాబట్టి "మనా కుఋరుషే" అనే పదములో సకృ త్ప్రయోగము ఉన్నందువలన ఇది నిర్దోషము కావలసి వస్తుంది.

మహాప్రాణఘటితసంయోగమునకు ఉదా: పూర్వము చెప్పిన శ్లోకా నికి పూర్వార్ధమును—

> అయి! మృగమదబిందుం చేత్
> భాలే బాలే! సమాతనుషే

అని రచించి సమన్వయమును చూచుకోవాలి.

ఈ విధముగా 'త్వా' ప్రత్యయమును యఙన్తములను యఙ్లుగంతము లను ఇంకా వైయాకరణులకు ప్రియము లయినవానిని మధురరసములో ప్రయోగించరాదు. ఈ విధముగానే వ్యంగ్యచర్వణకంటె అతిరిక్త మయిన యోజనావిశేషమును అపేక్షించునటువంటి ఆపాతమధురము లయిన అనుప్రాససమూహములను, యమకాదులనూ, కూర్చగలిగి నప్పటికీ అధిక చమత్కారు లయినప్పటికీ కవి నిబంధించరాదు. ఎందు వలన అంటే అవి రసచర్వణలో అంతర్భవించవు. రసమును ఆస్వాదించు నట్టి సహృదయుల హృదయాలను తమకు అభిముఖముగా చేసుకుంటూ రసవిముఖులను చేస్తవి. సహృదయులు ఆ అనుప్రాసయమకముల చమ త్కారచక్రములో పడిపోయి రసాస్వాదనవంచితు లవుతారు.

ఇంకా విశేషంగా విప్రలంభశృంగారములో కవి పూర్ణముగా నిధ్యానము ఉంచాలి. విప్రలంభ శృంగారము అత్యంతమూ మధురతమము. అందు వలననే విప్రలంభము మంచిపంచదారతో చేసిన పానకముతో సమాన మనిఅంటున్నారు. అందువలన దానిలో ఏకొంచెమయినా వేరుగా ఉండి స్వాతంత్ర్యమును వహించే పదార్థము సహృదయ హృదయారుంతుద మవుతుంది. కాబట్టి అటువంటి వస్తువును ఆ పదార్థముతో ఉంచుట సర్వథా అనుచితము.

ధ్వన్యాత్మభూతే శృంగారే యమకాది నిబంధనమ్
శక్తా వపి ప్రమాదిత్వం విప్రలంభే విశేషతః.

ధ్వనికావ్యమునకు ఆత్మభూతమై లోకోత్తరచమత్కారి అయిన శృంగార రసములో కవికి ఆ యా రచనా సామర్థ్యము ఉన్నప్పటికీ, స్వభావసిద్ధముగా అవి ప్రవర్తించినప్పటికీ, యమకాదిరచన ప్రమాదమును కలుగజేస్తుంది. విప్రలంభశృంగారములో ప్రమాదిత్వము అధికము అని ఆనందవర్ధనాచార్యులు పలుకుతున్నారు.

క్లిష్టములూ విస్తృతములూ కానటువంటివన్నీ పృథగనుసంధానము యొక్క ఆవశ్యకత లేనటువంటివన్నీ, రసాస్వాదనములోనే అత్యంతమూ సుఖపూర్వకముగా ఆస్వాదనమును సంపాదించునటువంటి అనుప్రాస యమకాదులను పరిత్యాగము చేయనక్కర లేదు. ఉదా:

కస్తూరికాతిలక మాలి! విధాయ సాయం
స్మేరాననా సపది శీలయ సౌధమౌలిమ్
ప్రౌఢిం భజంతు కుముదాని ముదా ముదారా
ముల్లాసయంతు పరితో హరితో ముఖాని.

సఖి నాయికతో పలుకుతున్నది. ఓ సఖీ! నీవు సాయంసమయములో కస్తూరికాతిలకమును ధరించి చిరునగవు కలిగినదానవై సౌధశిఖరమును పరిశీలించు. కుముదములు ఆనందముల అధికప్రౌఢిని పొందుగాక! దిక్కులు తమ ముఖమును అంతటా ఉల్లసింపచేసికొను గాక!

ఈవిధముగా ప్రసంగమును అనుసరించి మధురరసమును వ్యంజనము చేయు రచనలో దోషములు సంక్షేపముగా నిరూపించబడినవి.

ఏభి ర్విశేషవిషయైః సామాన్యై రపి దూషణై రహితా
మాధుర్యభారభంగురసుందరపదవర్ణవిన్యాసా
వ్యుత్పత్తి ముద్గిరంతీ నిర్మాతు ర్యా ప్రసాదయుతా
తాం విబుధా వైదర్భీం వదంతి వృత్తిం గృహీతపరిపాకమ్.

ఈ విశేషరూపములు సామాన్యరూపములు అయిన దూషణములతో రహితమయినదిన్నీ, మాధుర్య గుణభారముచేత భంగురము సుందరము

అయిన పదవర్ణములరచన కలిగినటువంటిన్నీ, కవీశ్వరుని వ్యుత్పత్తిని ప్రకటనము చేయునదై, ప్రసాదసముపేతమై మంచిపరిపాకముతో కూడుకొనిన రచనను విద్వాంసులు "వైదర్భీవృత్తి" అని అంటున్నారు. ఈవైదర్భీవిషయములో కొన్ని పద్యములు ఉదాహరింపబడినవి.

మరియొక ఉదా :

> ఆయా తైవ నిశా నిశాపతికరైః కీర్ణం దిశా మంతరం
> భామిన్యో భవనేషు భూషణగణై రుల్లాసయంతి శ్రియమ్
> వామే! మాన మపాకరోషి నమనా గద్యాపి రోషేణ తే
> హాహా! బాలమృణాలతో ప్యతితమాం తన్వీ తను స్తామ్యతి.

ఒకనాయకుడు నాయికతో పలుకుతున్నాడు. ప్రియా! రాత్రి రానే వచ్చింది. రాకలో ఏమీ ఆలస్యములేదు. చూడు! నిశాపతి కిరణాలచే దిగంతరము వ్యాప్తమైనది. ప్రణయకోపముతో కూడుకొనిన భామినీ మణులు భవనాలలో భూషణగణాలతో శోభను ఉల్లసింపచేస్తున్నారు. ఓ వామా! రసమయ సమయములో వక్రముగా గమించుదానా! నీవు ఇప్పటికీ కొంచెమైనా కోపమును పోగొట్టుకొనవు. రోష మెందుకు? హా హా! బాలమృణాలముకంటె కూడా మిక్కిలి దుర్బలమైన నీతనువు వాడి పోతున్నది. నాపై దయ లేకపోతే పోనీ. ఆ సుకుమార శరీరమును దయగా చూడు.

ఈ వైదర్భీరీతిని నిర్మాణించుటలో కవి మిక్కిలి సావధానుడు కావలసి ఉన్నది. కాకపోతే పరిపాకభంగము కలుగుతుంది. రసమును ఎంత మధురముగా చేయూ లని అనుకుంటామో అది ఆ విధముగా కాక పోతుంది.

అమరుక కవిపద్యమును చూడుడు :

> శూన్యం వాసగృహం విలోక్య శయనా దుత్థాయ కించి చ్ఛనైః
> నిద్రావ్యాజ ముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యు ర్ముఖమ్
> విస్రబ్ధం పరిచుంబ్య జాతపులకా మాలోక్య గండస్థలీం
> లజ్జానమ్రముఖీ ప్రియేణ సహసా బాలా చిరం చుంబితా.

నూతన సమాగమములోని ముగ్ధనాయికాకృత్యము దీనిలో వర్ణితము. ఆబాల వాసగృహమును అంటే శయ్యాగారమును శూన్యముగా ఉండుట చూచి శయనమునుండి లేచి కొంచెము మెల్లగా కపటనిద్రను పొందిన భర్తముఖమును చాలాసేపు పరిశీలించి బాగా ముద్దుపెట్టు కొని పులకలు కలిగిన నాయకుని గండఫలకభాగమును చూచి లజ్జానమ్రముఖి అయినది. నవ్వుతున్న ప్రియుడు తొందరగా ఆ పిల్లను చాలాసేపు ముద్దుపెట్టు కొన్నాడు.

ఈ పద్యములో "ఉత్థాయ" "కించిచ్ఛనైః" ఈరెండు స్థానములలో సవర్ణఝయ్‌వర్ణముల సంయోగ మున్నది. అవి కూడా అత్యంత సమీపములో ఉన్నవి. కాబట్టి అత్యంతమూ అశ్రవ్యము. ఇట్లాగే ఝయ్‌ఘటిత సంయోగ పరహ్రస్వముకూడా ఉన్నది. ఆ విధముగా "శనైర్నిద్రా" అనేచోట "నిర్వర్ణ్య పత్యుర్ముఖం" అనేచోట రేఫఘటిత సంయోగము ఉన్నది. ఝయ్‌ఘటిత సంయోగ పరహ్రస్వము ప్రచుర ముగా ఉన్నది. ఇంకా "విస్రబ్ధం" అనే చోట మహాప్రాణఘటిత సంయో గము, "లజ్జా" అనేస్థలములో సవర్ణఝయ్‌ద్వయఘటిత స్వాత్మసం యోగము, "ముఖీప్రియేణ" అనేచోట భిన్నపద గతమైన దీర్ఘా నంతర సంయోగమూ ఉన్నవి. ఈ విధముగా "విలోక్య, ఉత్థాయ, నిర్వర్ణ్య, పరిచుంబ్య, ఆలోక్య" అని క్త్వాప్రత్యయము అయిదు పర్యా యములు ప్రయోగింప బడినది. "విలోక్య, ఆలోక్య" అని 'లోకృ' ధాతువు రెండుపర్యాయములు ప్రయోగింపబడినది. ఇది అంతా కవికి కవితానిర్మాణ సామగ్రీదారిద్ర్యము ఉన్నట్లు స్పష్టము చేస్తున్నది. పోనీయండి. పరకీయకావ్య విమర్శనము ఎందుకు? ఇక చాలు.

ఈ విధముగా రసములు సంక్షేపముగా నిరూపించబడినవి.

## ౧౧. భా వ ము

ఇకభావధ్వని నిరూపించబడును. భావ మనగా ఏమిటి? దేనిని భావము అని అంటారు? భావలక్షణము ఏమి? "విభావానుభావభిన్నము రసవ్యంజకము అయినట్టిది భావము" అని భావలక్షణమును చెప్పడము

సముచితము కాదు. ఈ లక్షణము రసమును ప్రతిపాదన చేసే కావ్య వాక్యములో అతివ్యాప్త మవుతున్నది. అర్థముద్వారా శబ్దము కూడా రసవ్యంజకమే కదా !

"దేనినీ ద్వారముగా చేసుకోకుండా తనంతట తానే రసమునకు వ్యంజకము కావాలి" అని వ్యంజకమునకు ఒక విశేషణమును కూర్చి నట్లయితే కావ్యవాక్యములో అతివ్యాప్తి రాదు. కావ్యశబ్దము అర్థ మును ద్వారముగా చేసుకొంటున్నదిగా !

కాని ఈ లక్షణము అసంభవదోషగ్రస్త మవుతుంది. ఇది అసలు భావానికే లక్షణము కాక పోవలసివస్తుంది. భావముకూడా ద్వారాం తరనిరపేక్షముగా రసవ్యంజకము కావడము లేదు. అది భావము పునః పునరనుసంధాన మనేభావనను ద్వారముగా చేసికొని రసానికి వ్యంజక మవుతున్నది. ఇంకా ఈలక్షణము భావనలో అతివ్యాప్తము కూడా అవుతున్నది. భావన దేనినీ ద్వారము చేసుకోకుండా రసవ్యంజక మవు తున్నది.

ఈ విధముగా పై లక్షణములో "విభావానుభావాతిరిక్తము" అని విశేష ణమునుఉంచినట్లు "శబ్దాతిరిక్తము" అనే విశేషణమునుకూడా వ్యంజక పదానికి చేర్చినప్పటికీ మోక్షము లేదు. భావనలో అతివ్యాప్తి ఆ విధముగానే ఉన్నది. భావన విభావానుభావభిన్నమూ అయింది. శబ్దభిన్నమూ అయింది. రసవ్యంజకమూ అవుతున్నది.

ఇంకా ప్రధానముగా ధ్వనించేభావము రసవ్యంజకము కావడములేదు. కాబట్టి అవ్యాప్తికూడా కలుగుతున్నది. ప్రధానధ్వన్యమానభావానికి ఈ లక్షణము సరిపడ లేదన్నమాట. విభావాది సామగ్రిచేత భావమే వ్యంగ్య మవుతున్నది. కాని అది రసవ్యంజకము కావడము లేదు. అటువంటిదికూడా భావమే. అటువంటిదానిలో ఈలక్షణము అవ్యాప్త మవుతున్నది. అందువలన ఇది సరికాదు.

ప్రధానముగా ధ్వన్యమాన మయ్యేభావస్థలములోకూడా ఏదోవిధముగా రసము అభివ్యక్తము కావచ్చు. కాబట్టి అటువంటి భావాలలోకూడా

రసవ్యంజకత్వము ఉన్నదని వాదించితే—అసలు భావధ్వని లోపించు తుంది. చరమసీమలో ఉన్న రసాభివ్యక్తినే పరిగణించితే భావధ్వని స్థలంలోకూడా రసవ్యపదేశమే వస్తుంది కాని భావధ్వని అని పేరు రాదు. ఇక భావానికి తావు ఏది ?

"భావచమత్కారము ప్రకర్ష కలిగి ఉంటే భావధ్వని అవుతుంది. ప్రధానధ్వన్యమాన భావస్థలములో రసాభివ్యక్తి ఉన్నప్పటికీ అది చమత్కారి కాదు. అందువలన అటువంటి స్థలములో రసధ్వని వ్యవహారము లేదు."

ఇలా అనడముకూడా స్వారసికము కాదు. చమత్కార విరహితముగా రసము అభివ్యక్తము అవుతుంది అని అనడములో ఏమీ ప్రమాణము లేదు. రసమేమిటి, ధ్వన్యమాన మవుతూ చమత్కారకము కాకపోవడము ఏమిటి ? ఏప్రమాణమువలన రసపదార్థానుభవము కలుగుతున్నదో ఆ ప్రమాణము రసమును సిద్ధింపచేయకుండా ఉండదు. ఆనందరూపము గానే రసము ఉంటుం దని సిద్ధార్థము. రసము ఆనందాంశమును విడిచి ఉండదని ప్రమాణముద్వారా నిర్ధారిత మవుతున్నది. ఇదివరలో రసము ఆనందాంశమునకు తప్పకుండా సంబంధించి ఉంటుం దని నిరూపించ డానికి ప్రమాణము ప్రదర్శించబడింది. కాబట్టి ఆ ధర్మిగ్రాహక ప్రమాణముచేత రసము ఆనందసంబద్ధమే అని నిశ్చయించాలి. ధర్మి రసము. తద్గ్రాహకము తత్ప్రత్యాయకము అయిన ఏప్రమాణ మున్నదో అదే రసానికి ఆనందాంశావినాభావిత్వమును ప్రతిపాదించుతున్నది. విభావాది వ్యంజనారూప మైన సామగ్రి రసాభివ్యక్తిని సాధించుతున్నది. దాని చేత రసోద్బోధ కలుగగానే ఆనందముకూడా అవశ్యంభావి అని ఆవేదిత మైనట్లే. భగ్నావరణ చిదానంద మే రసము కదా. ఈ విషయము రసవాదప్రఘట్టములో నిర్ణీత మే.

ఇక్కడ ఈవిధంగా ఆశంకించాలి. ఇప్పటికి భావలక్షణము ఈ విధముగా పర్యవసన్న మయింది. "విభావానుభావభిన్నమై శబ్దభిన్నమూ రసాభివ్యంజకమూ అయితే భావము" అని. ఇటువంటిభావ లక్షణములో—

భావధ్వనిస్థలమందు చరమచమత్కారి రసాభివ్యక్తిని స్వీకరించినా భావధ్వనిత్వానికి విలోపము రాదు. రసముకన్న భావము గౌణ మైనప్పటికీ వాచ్యముకన్న ప్రధానము, కాబట్టి భావధ్వనిత్వము అక్షతమే. ఇంకా భృత్యునకు వివాహ మవుతూ ఉంటే రాజు అనుసరిస్తూ ప్రవర్తించుతాడు. ఆ సమయంలో రాజుకంటె భృత్యునకు ప్రాధాన్యము ఉన్నది. ఈ విధముగా రసముకంటెకూడా భావానికి ప్రాధాన్యము ఉంటుంది. కాబట్టి భావము భావధ్వని అనబడుతుంది. అందువలన భావానికి తుదకు రసాభివ్యంజకమును స్వీకరించినా బాధలేదు అని.

అయినప్పటికీ దేశకాలవయోవస్థాద్యనేకపదార్థములతో కూర్చబడిన పద్యవాక్యార్థములో అతివ్యాప్తి తప్పదు. ఆ పద్యవాక్యార్థము విభావానుభిన్న మవుతూ రసాభివ్యంజక మవుతున్నది.

ఏ ఆస్వాదనము రసాభివ్యంజనము చేస్తున్నదో ఆ ఆస్వాదనలో విషయమైన చిత్తవృత్తికి భావము అని పేరు అని ఈ విధముగా భావలక్షణమును అంగీకరించితే భావాదిచర్వణలో అతివ్యాప్తి రాదు. చిత్తవృత్తికి "ఆస్వాదనలో విషయ మైన" అని చర్వణావిషయత్వము విశేషణముగా ఉంచబడుతున్నది. "చర్వణావిషయచిత్తవృత్తే భావము" అని అంటున్నాము. కాబట్టి చర్వణలో భావాదుల ఆస్వాదన విషయము గాదు గదా! అందువలన అతివ్యాప్తి లేదు అని వేరొక లక్షణము.

కాని ఇది కూడా ఉచితము కాదు. ఉదా:

> కాలాగురుద్రవం సా, హాలాహలవ ద్విజానతీ నితరామ్
> అపి నీలోత్పలమాలాం, బాలా వ్యాలావలిం కి లామనుతే।

ఒకసఖి రెండవసఖితో ఒకవియోగినీకథను చెప్పుతున్నది. అగరు ద్రవమును హాలాహలముతో సమానముగా తెలుసుకుంటూ, ఆ బాలిక నీలోత్పలమాలనుకూడా సర్పపంక్తి అని అనుకుంటున్నది గదా!

ఈ పద్యములోని "హాలాహలసదృశము" అనే సహృదయుల జ్ఞానములో అతివ్యాప్తి కలుగుతున్నది. ఆ జ్ఞానము విప్రలంభశృంగారము

నకు అనుభావము. ఇది రసవ్యంజక మవుతూనే ఉన్నది. చర్వణా విషయముకూడా అయింది. ఏ విధముగా భావాలను ఆస్వాదించు తామో ఆ విధముగా అనుభావాలనుకూడా ఆస్వాదించుతాము. అది జ్ఞానము. కాబట్టి చిత్తవృత్తిరూపము కూడాను. అందువలన పై లక్ష ణము ఉచితము కాదు.

"భావములోని భావత్వ మనేది అఖండోపాధి. అందువలన లక్షణనిర్దేశ మేమీ ఆవశ్యకము కాదు" అని,

అనడముకూడా బాగా లేదు. ఆ భావత్వము అఖండము అనడములో ప్రమాణము ఏమీ లేదు. ఈ విధముగా పూర్వపక్షవార్త లున్నవి. సిద్ధాంతమును ఇక వినవలసి ఉన్నది.

## భా వ ల క్ష ణ ము

విభావాదివ్యజ్యమాన హర్షాద్యన్యతమత్వం తత్వమ్.

విభావాదులద్వారా ధ్వన్యమానము లగు హర్షాదులలో ఏదో అగుట భావము అవుతుంది అని భావలక్షణము. "వ్యభిచార్యంజితో భావః" ధ్వనిత మగునట్టి వ్యభిచారిభావము భావ మనబడును అని పెద్దలు చెప్పుతున్నారు. ఈ భావాభివ్యక్తి విషయములో మూడుమతము లున్నవి.

మొదటి మతము: సామాజికుల హృదయసీమలో వాసనారూపంగా ఉన్న స్థాయిభావాలు కావ్యనాటకాదులలో ఉపస్థితము లయిన విరుద్ధావిరుద్ధభావాలచేత ఏమాత్రమూ తిరస్కరింప బడవు. కాబట్టి ఆయా అభివ్యక్తసామగ్రివలన స్థిరమైన అభివ్యక్తిని పొందుతున్నవి. ఆ విధముగానే ఈ హర్షాది భావాలుకూడా అభివ్యక్తిని పొందుతవి అని ప్రథమపక్షము. ఇదే సిద్ధాంతము.

రెండవ మతము: సామాజికుల హృదయంలో స్వభావసిద్ధముగా చిదా నందము ఉన్నది. విభావానుభావాదుల అభివ్యక్తి సామగ్రిచేత సత్త్వోద్రేకము కలుగగా ఇదివరలో చిదానందానికి ఉన్న ఆవరణ

నివృత్తమై పోతున్నది. అట్లా భగ్నావరణ మైన చిదానందము స్థాయిభావోపహితమై రసముగా అభివ్యజ్యమాన మవుతున్నది. ఆ విధముగా విభావాద్యభివ్యక్తి సామగ్రిచేత సత్వోద్రేకము కలిగితే భగ్నావరణ చిద్విశిష్ట భావాలుకూడా సామాజికహృదయంలో అభివ్యక్తము లవుతున్నవి అని ద్వితీయకల్పము.

మూడవమతము : వాచకలక్షకాది శబ్దాలద్వారా వాచ్యలక్ష్యాద్యర్థోపస్థితి కలుగుతున్నది. అయినా వక్తృబోద్ధవ్యాదివైశిష్ట్యం ఉండగానే అనురణనరూపముగా వస్త్వలంకారాత్మకమైన వ్యంగ్యము శ్రోతలహృదయములో అభివ్యక్త మవుతున్నది. అదే విధముగా ప్రకృతములోకూడా విభావాదులను ప్రతిపాదనము చేయు ఆ యా శబ్దముల ప్రత్యయానంతరము అనురణనన్యాయానుసారంగా ఈ హర్షాది భావాలుకూడా సామాజికుల హృదయభూమిలో అభివ్యక్తము లవుతూ ఉంటవి అని కొందరు అంగీకరించే తృతీయపక్షము.

విభావము అనుభావము అనే ఈ రెండూ హర్షాదిభావాలకు వ్యంజకములు. ఒక వ్యభిచారిభావము ధ్వన్యమాన మవుతూ ఉన్నప్పుడు వ్యంజకముగా వేరొక వ్యభిచారిభావము అవశ్యము ఉండితీరాలని నియమము లేదు. వేరొకవ్యభిచారి వ్యంజకముగా ఉండాలి అనేటట్లయితే అదే ప్రధాన మవుతుంది. వ్యంగ్యముగా తలచబడే వ్యభిచారిభావము ఏవిధముగా అభివ్యక్త మవుతున్నదో వ్యంజకముగా తలచబడే వ్యభిచారిభావముకూడా ఆ విధముగానే అభివ్యక్త మవుతుంది. దీనిలో ఇంకా అభివ్యంజకత్వ మనేది అధికముగా ఉంటుంది. అందువలన అదే ప్రధాన మవుతుంది. అందువలన విభావము అనుభావము అనేవి రెండే వ్యభిచారిభావాలకు వ్యంజకములని తలంచుట సముచితముగా ఉంటుంది. కాని వాస్తవంగా పరిశీలించినట్లయితే ప్రకరణాదివశమువలన ఒక భావము ప్రాధాన్యము పొందుతున్నప్పుడు దానిని వ్యక్తము చేయు సామగ్రిద్వారా అనుద్దిష్టముగా ఇతరభావముకూడా అభివ్యక్తము కావచ్చును. సామాన్యంగా ప్రధానభావము ధ్వన్యమాన మవుతూ ఉన్నప్పుడు ఏదో ఒక ఇతరభావము ధ్వనిత మవుతూనే ఉంటుంది

ఇతరభావరహితంగా కేవలము ప్రధానభావము ధ్వనితము కాదు. అట్లా నాంతరీయకముగా, అంటే అనుద్దిష్టముగా, అప్రధానముగా ధ్వనిత మైన ఇతర వ్యభిచారిభావము ప్రకరణబలముతో ఉన్న ప్రకృతవ్యభి చారిభావముకంటె హీనమే అవుతుంది. అందువలన అది అంగ మైన ప్పటికీ హాని లేదు.

గర్వాదులు అభివ్యంగ్యము లయ్యేటప్పుడు అమర్ష, అమర్షాదు లభి వ్యంగ్యము లయ్యేటప్పుడు గర్వమూ నాంతరీయకముగా అభివ్యంగ్యము కాక తప్పదు. ఈ రెండు భావాలలో ఒకభావముకంటె వేరొకభావము గౌణము అయినప్పటికీ గుణీభూతవ్యంగ్య మవుతుంది కాని భావధ్వని కా దని తలచ నక్కర లేదు.

ఏభావము ప్రధానముకన్న వేరుగా విభావానుభావములద్వారా అభి వ్యక్త మవుతుందో అట్టి భావమే గుణీభూతవ్యంగ్య మవుతుంది. ప్రధానభావాభివ్యక్తి సామగ్రిచేత అది అభివ్యక్తము కాదు. అట్లా అయితే గుణీభూతవ్యంగ్యత్వ వ్యవహారమే పోతుంది. గర్వాది ధ్వను లలో అమర్షాదులు నాంతరీయకములు, కాబట్టి గర్వాది ధ్వనులకు ఉచ్ఛేదమే కలుగుతుంది. అవి ఎప్పుడూ అమర్షాదిరహితముగా ధ్వన్యమానములు కావు కదా. గర్వాదులలో గోచరించే అమర్ష భావము వేరువేరు విభావానుభావములతో అభివ్యక్తము కావడము లేదు. గర్వాదులను తెలియజేసే విభావానుభావాలే అమర్షనుకూడా అభివ్యంజనము చేస్తున్నవి. అందువలననే అవి నాంతరీయకములు అని అంటున్నాము. గుణీభూతముగా ఉండదగినభావ మయితే అనాంతరీ యక మవుతుంది. కాబట్టి నాంతరీయకముగా ఉన్నభావానికి ధ్వనన ముంటుం దని గ్రహించాలి.

ఇక్కడ వ్యభిచారిభావానికి విభావమంటే సాధారణ మైన నిమిత్తకారణ మని ఊహించాలి. అంతే కాని రసానికివలె సర్వథా ఆలంబనోద్దీపన ములు అపేక్షితములు కావు. ఎక్కడ నయినా ఒకచోట విభావములో ఆలంబనోద్దీపనములు సంభవించేట ట్లయితే వానినికూడా గ్రహించ వచ్చును, ఏమీ నిషేధము లేదు.

— భావ గణనము —

హర్షస్మృతివ్రీడా మోహ ధృతి శంకా గ్లాని దైన్య చింతా మద శ్రమ గర్వ నిద్రా మతి వ్యాధి త్రాస సుప్త విబో ధామ ర్షావహిత్థోగ్ర తోన్మాద మరణ వితర్క విషా దౌత్సు క్యావేగ జడ తాల స్యాసూ యాపస్మా ర చపలతాః ప్రతిపక్ష కృత ధిక్కారాది జన్మా నిర్వేద శ్చేతి త్రయస్త్రింశ ద్వ్యభిచారిణః గురుదేవనృపపుత్రాదివిషయా రతి శ్చేతి చతుస్త్రింశత్.

హర్షాదిభావములు ముప్పదినాలుగు. హర్షము, స్మృతి, వ్రీడ, మోహము, ధృతి, శంక, గ్లాని, దైన్యము, చింత, మదము, శ్రమము, గర్వము, నిద్ర, మతి, వ్యాధి, త్రాసము, సుప్తము, విబోధ, అమర్ష, అవహిత్థ, ఉగ్రత, ఉన్మాదము, మరణము, వితర్కము, విషాదము, ఔత్సుక్యము, ఆవేగము, జడత, ఆలస్యము, అసూయ, అపస్మారము, చపలతలు, ప్రతిపక్షి చేసిన తిరస్కారమువల్లన ఉత్పన్నమైన నిర్వేదము- అనే ఇవి ముప్పదిమూడు వ్యభిచారి భావాలు. గురుదేవ నృపపుత్రాదివిషయమైన రతికూడా వ్యభిచారిభావమే. ఈ మొత్తము 34 వ్యభిచారిభావాలు.

పుత్రాదులు ఆలంబనముగా కలిగిన రతి వాత్సల్య మనే రసాంతర మవుతుం దని కొందరు తలంచడం ఈ గణనచేత పరాస్త మవుతున్నది. ఉచ్ఛృంఖలత్వ మనేది భరతమునివచనముచేత పరాహతమై పోతు న్నది. కాబట్టి ఈ చెప్పిన భావములనే పరిగణనము చేయడము సము చితముగా ఉంటుంది.

## ౧. హర్షము

ఇష్టప్రాప్త్యాదిజన్మా సుఖవిశేషో హర్షః.

వాంఛితము లయిన పదార్థముల ప్రాప్త్యాదివలన కలిగే సుఖవిశేషము హర్షము. ఈ విషయమున ఇతరులు ఈ విధముగా చెప్పుతున్నారు.

> దేవభర్తృగురుస్వామిప్రసాదః ప్రియసంగమః
> మనోరథాప్తి రప్రాప్య మనోహరధనాగమః
> తథోత్పత్తిశ్చ పుత్రాదే ర్విభావో యత్ర జాయతే
> నేత్రవక్త్రప్రసాదశ్చ ప్రియోక్తిః పులకోద్గమః
> అశ్రుస్వేదాదయ శ్చానుభావా హర్షం సమాదిశేత్.

దేవత, భర్త, గురువు, ప్రభువుల అనుగ్రహము, ప్రియసమాగమము, మనోరథప్రాప్తి, పొంద శక్యము కాని మనోహరమైన ధనలాభము, పుత్రాదుల ఉత్పత్తి, ఇవి దేనియందు విభావములుగా ఉంటవో, నేత్ర ముఖ ప్రసన్నత ప్రియవచనము రోమాంచము అశ్రుస్వేదాదులు అనే ఇవి దేనికి అనుభావములు అవుతవో, దానిని హర్షముగా నిరూపించ వలసినది అని. దీని ఉదా :

అవధౌ దివసావసానకాలే, భవనద్వారి విలోచనే దధానా
అవలోక్య సమాగతం తదా మా, మథ రామా వికసన్ముఖీ బభూవ.

నాయకుడు తనమిత్రునితో చెప్పుతున్నాడు. గడువు తుదిదినమందు సాయంకాలమున గృహద్వారమున నేత్రములను నిలిపినదై అప్పుడు వచ్చిన నన్ను చూచి తరువాత నారామ వికసన్ముఖి అయినది.

దీనిలో అవధికాలములో ప్రియుడు వచ్చుట విభావము. ముఖవికాసము అనుభావము.

## ౨ స్మృ తి

సంస్కార జన్యం జ్ఞానం స్మృతిః.

పదార్థములను చూచినప్పుడూ వినినప్పుడున్నూ, హృదయములో సంస్కారము కలుగుతుంది. ఆ సంస్కారము ద్వారా ఉత్పన్నమైన జ్ఞానము ' స్మృతి ' అనబడును. ఉదా:

తన్మంజుమందహసితం శ్వసితాని తాని
సా వై కలంకవిధురా మధురాననశ్రీః
అద్యాపి మే హృదయ మున్మదయంతి హంత!
సాయంతనాంబుజసహోదరలోచనాయాః.

నాయకుడు తన మిత్రునితో చెప్పుతున్నాడు. సాయంసమయ పద్మ సమానలోచనములు కలిగిన ప్రియురాలియొక్క ఆ మనోహర మంద హాసితము, ఆ శ్వసితములు, కళంకరహితమైన ఆ మధురముఖశోభ ఇప్పటికీ నాహృదయమును ఉన్మత్తము చేస్తున్నవి. ఆహా!

దీనిలో చింతావిశేషము విభావము. ఆక్షేపగమ్యము లయిన భ్రూసమున్నతి, శరీరనిశ్చలత్వము మొదలైనవి అనుభావాలు. పరిశీలించితే అభివ్యజ్యమాన మగు విప్రలంభశృంగారము గోచర మవుతున్నది. ఈ చెప్పిన స్మృతిరూప మైన సంచారిభావము నాయికారూప మైన విభావము హంత పదముద్వారా అభివ్యంగ్య మయిన హృదయవికలతారూప మగు అనుభావము. వీటి సంయోగమువలన విప్రలంభవ్యక్తి ఉన్నది. అందువలన "రసధ్వని" అనవచ్చును.

అయినప్పటికీ, మొదట స్మృతి స్ఫురించుతున్నది. అన్నిటికన్న ముందుగా అదే హృదయములో భాసించి చమత్కారాపాదకము అవుతున్నది. అందువలన ఈ పద్యము స్మృతికి ఉదాహరణముగా తలచబడుతున్నది.

ఇక్కడ ఈశంక కలుగవచ్చును. నైయాయికుల పదార్థవిజ్ఞానశైలి అనుసరించి చూస్తే "తత్" అనే పదముయొక్క అర్థవిషయములో రెండు మతములు గోచరము లవుతవి. వానిలో ఇది మొదటిమతము.

ఏ పదార్థానికి తత్ అనే పదముతో వర్ణన ఉంటుందో ఆ పదార్థానికి ఆ 'తత్' పదముద్వారా అసాధారణరూపములో బోధ కలుగుతుంది. ఆదశలో ఆపదార్థము "బుద్ధిస్థ" అనే విశేషణముతో కూడుకొన్నదిగా తలచబడుతున్నది. "తత్ హసితం" అనేచోట "బుద్ధిస్థమైన లోకోత్తర మగు సౌందర్యయుక్తము" అని "తత్" పదానికి అర్థము. ఇక్కడ హసితానికి "లోకోత్తరసౌందర్యసహితము" అని విశేషణము. అనగా ఇతరహసితాలకంటె దీనిలో ఇది భేదకధర్మ మన్నమాట. బుద్ధిస్థత్వము దానికి ఉపలక్షణము. ఈవిధముగా హసితమును బోధన చేయడములో 'తత్'పదానికి శక్తి ఉన్నది. కాబట్టి హసితము తత్ పదానికి శక్య మవుతున్నది.

విశేషణము శక్యతావచ్ఛేదకము అని వ్యవహరించబడుతుంది. అందువలన హసితవిశేషణ మైన లోకోత్తర సౌందర్యము శక్యతావచ్ఛేదక మవుతున్నది; శక్యతావచ్ఛేదకము అనగా ఏదైనా శక్యార్థములో

ఉంటూ ఉన్న శక్యతను ఇతరశక్యతలకంటె వేరుపరిచే ధర్మము అని అర్థము. శక్యతావచ్ఛేదకమును బోధన చేసే శక్తికూడా పదమందే ఉన్నట్లు అంగీకరించబడుతున్నది.

'తత్' పదమువలన భిన్నభిన్న విశేషణాలతో కూడుకొనిన జగత్తులోని సర్వపదార్థములూ తెలియబడతవి. ఆ సర్వవిశేషణములనూ వ్యవస్థితములనుగా చేయడానికి ఏదైనా వాస్తవధర్మము లేకపోయినప్పటికీ వానిలో "బుద్ధిస్థత్వము" అనే ధర్మము ఒకటి ఉపలక్షణరూపముగా అంగీకరించబడుతున్నది. ఈఏకత్వమువలన సర్వపదార్థములనూ బోధచేసే శక్తి ఒకటి 'తత్'పదములో సిద్ధమవుతున్నది. అంతేకాని తత్పదానికి నానార్థాలు లేవు. ఈ బుద్ధిస్థత్వము అనే ధర్మము సకలశక్యతావచ్ఛేదకములకూ అనుగమకమనీ, వ్యవస్థాపకమనీ అంగీకరించబడుతున్నది. ఈఅనుగమకమనేది ఏదైనా ఒక పదానికి శక్యార్థమని తలచబడదు. ఇది ఈ మొదటి మతరహస్యము.

రెండవ మతము: అసాధారణరూపముగా పదార్థబోధ కలుగదు. బోధ బుద్ధిస్థపదార్థరూపముగా కలుగుతుంది. బుద్ధి జ్ఞానమూ అనేవి రెండూ ఒక పదార్థానికే పేరులు. స్మృతికూడా ఒకవిధమైన జ్ఞానమే. ఈరెండు మతాలలోనూ 'తత్' శబ్దముతో స్మృతికి కొంత సంబంధము అవశ్యముగా ఉన్నది. పైపద్యములో 'తత్' పదము ప్రయోగింపబడినందువలన "ఈకావ్యములో స్మృతిభావముయొక్క ధ్వని ఉన్నది" అనరాదు. పైన చెప్పినరీతిగా వ్యంగ్యానికి వాచ్యముతో కొంతసంబంధము ఉన్నందువలన "ధ్వని"అని అనడానికి దీనికి యోగ్యత లేదు అని పూర్వపక్షము.

ఇక ఇది సమాధానగ్రంథము. మొదటి మతానుసారముగా తత్పదానికి అసాధారణరూపము కలిగినపదార్థము వాచ్యము. శక్యతావచ్ఛేదకానికి బుద్ధి అనుగమనము సంపాదించుతున్నది. వాచ్యత్వము బుద్ధిని స్పృశించడము లేదు. బుద్ధివాచ్య (శక్య)ము కా దన్నమాట. కాబట్టి వ్యంగ్యత్వానికి క్షతి లేదు.

రెండవమతములో "బుద్ధిస్థము" అనేపదార్థము తత్పదానికి వాచ్యము. అందు వలన బుద్ధిసామాన్య మనే సాధారణజ్ఞానము తత్పదముచేత ప్రతిపాదింపబడినప్పటికీ స్మృతిరూపముగా ప్రతిపాదింపబడడము లేదు. స్మృతిరూపమైన బోధ వ్యంజనాద్వారానే కలగాలి. అందువలన స్మృతి వ్యంగ్యమే.

ఈ పైక్లిష్టవిషయాన్ని ఈ ఉక్తిభంగీద్వారాకూడా తెలియడము సముచితముగా ఉంటుంది.

తదాదిశబ్దాలను ప్రయోగించినప్పుడు నలాదిబోధ కలుగుతున్నది. ఆ నలాదిబోధ కలుగుటలో "బుద్ధిస్థ" అని బుద్ధిస్థత్వ మనేధర్మమును పురస్కరించుకొనే ఆబోధ కలుగుతున్నది. నలాదిపదాలవలన వ్యక్తిబోధ కలిగినప్పుడు నలత్వ మనేధర్మమును పురస్కరించుకొనే బోధ కలుగుతుంది. 'నైషధ' పదమువలన బోధ కలిగినప్పుడు 'నిషధప్రభుత్వరూప ధర్మమును' పురస్కరించుకొని బోధ కలుగుతుంది. ఇట్లా బోధింపబడే వ్యక్తి ఒకటి అయినప్పటికీ విశేషణీభూతధర్మాలు వేరువేరుగా ఉంటవి. ఆ విశేషణీభూతధర్మాలను బోధించడములో తదాదిశబ్దముల స్థలములో నలబోధ కలుగునప్పుడు 'బుద్ధిస్థ' అని బోధ కలుగుతుం దని ఒక అభిప్రాయము.

ఈబుద్ధిస్థత్వము విశేషణముగా భాసించదు. నలపదమువలన కలిగిన బోధలో మాదిరిగా నలత్వమే విశేషణముగా భాసించుతుం దని వేరొక అభిప్రాయము. ఈ రెండవ అభిప్రాయములో తచ్ఛబ్దమువలన నలబోధ కలుగునప్పుడు నలత్వము విశేషణము, నలవ్యక్తి విశేష్యము. దిలీపునిబోధ కలుగు స్థలములో దిలీపత్వము విశేషణము, దిలీపుడు విశేష్యము. రామబోధ కలుగుచోట రామత్వము విశేషణము, రాముడు విశేష్యము. ఈ విధముగా తచ్ఛబ్దమువలన కలిగే బోధలలో విశేష్య వ్యక్తులు విశేషణవ్యక్తులుకూడా వేరు వే రయినప్పుడు హర్యాదిపదాలలో మాదిరిగా నానార్థాలు కలుగవలసి వస్తుంది అని శంక కలుగవచ్చును.

దీని సమాధానమును ఈవిధంగా గ్రహించాలి. విశేష్యవ్యక్తులూ విశేషణీభూతధర్మాలూ వేరు వేరయినా ఆ ధర్మాలు వేరొక ధర్మము చేత అనుగతములు అయినప్పుడు ఆ పదమును నానార్థకముగా పరిగణించకూడ దని ఆమతమువారి నిర్ణయము. కాగా ప్రకృతములో ఉన్న తత్పదములు పై అభిప్రాయభేదాన్నిబట్టి 'బుద్ధిస్థ'ములు అనే అర్థాన్ని చెప్పవచ్చును. ఆ హాసితాదులలో ఉన్న విశేషధర్మవత్తులు అని కూడా అర్థము చెప్పవచ్చును. ఈ రెండవపక్షములో 'బుద్ధి' అనే అర్థము ఏశబ్దముచేతనూ చెప్పబడకపోయినా "బుద్ధిస్థము" అని బోధిస్తుంది. అనే పక్షములో, బుద్ధి తదాదిశబ్దవాచ్యకోటిలో చేరినట్లు స్పష్టము. వ్యంగ్య మనేది వాచ్యముగా ఉండరా దని నిషిద్ధార్థము. ప్రకృతములో వ్యంగ్యము అని తలచబడే స్మృతి బుద్ధియే కదా! అది వాచ్యము అవుతున్నప్పుడు స్మృతి ధ్వని అనడం కుదరదు అని పూర్వపక్షము.

ఇది సమాధానము. ఇచట బుద్ధి అనేటపుడు స్మృతికికూడా సంగ్రహము కలిగినా, ఆ స్మృతి బుద్ధిస్థత్వ మనే ధర్మవిశేషితమై వాచ్య మవుతున్నది. స్మృతిత్వరూప ధర్మవిశేషితమై స్మృతి వాచ్యము కావడము లేదు. కాబట్టి స్మృతిత్వరూప ధర్మవిశేషితమై స్మృతివ్యంగ్య మగుటలో బాధకము లేదు. "వ్యంగ్యార్థములో విశేషణీభూతధర్మము వాచ్యార్థములో విశేషణీభూతధర్మము వేరువేరు అయిన ట్లయితే విశేష్యవ్యక్తి వాచ్య మయినా వ్యంగ్యమే కావచ్చును" అనే మతానుసారముగా ఈ ఉదాహరణము ఈయబడినది.*

---

* ఈ విషయములో నిరూపించబడిన శంకాసమాధాన ప్రఘట్టము మొత్తానికి నిర్గలితమైన సారాంశమును ఈవిధముగా గ్రహించవచ్చును.

'తత్'పదానికి అర్థవిషయములో నైయాయికులలో మతద్వయము ఉన్నది. బుద్ధిస్థత్వరూపముగా అనుగతనుగా చేయబడిన అసాధారణపదార్థము తత్పదబోధ్యము అని ప్రథమమతము. బుద్ధిస్థత్వ మనేది అనుగమకధర్మము. ఇది నానార్థములను వ్యవస్థితము చేస్తున్నది. ఇట్లా వ్యవస్థిత నానార్థములను బోధించడమువలన 'తత్'పదము పర్యాయార్థబోధక మయినప్పటికీ అనేకార్థకముగా పరిగణింపబడదు. తదాదిపదముల స్థలములో ఈబుద్ధిస్థత్వ మనే ధర్మమే సకలశక్యతావచ్ఛేదకములకు అనుగమకముగా స్వీకరింపబడుతున్నది. ఈ అనుగమకము ఏపదానికీ శక్య మనబడదు.

పై పద్యములో స్మృతి వాక్యమువలన ధ్వనిత మవుతున్నది. అందు వలన 'ఇది పదధ్వని కాదు' అని తోచవచ్చును. కాని తచ్ఛబ్దమాత్రమే ఆ వ్యంగ్యస్వరూపమును నిలువబెట్టుతున్నది. అందువలన ఈ స్మృతి భావము పదముద్వారా ధ్వనిత మవుతున్న దని గ్రహించాలి. వ్యంగ్యార్థ ప్రకటన సామర్థ్యము పరిశీలించితే తచ్ఛబ్దమాత్రమందే విశ్రాంతిని పొందుతున్నది. కాబట్టి పదధ్వని అంటారు. ఇక్కడ పదానికే 'కుర్వద్రూపత్వము' ఉన్నది. ఆయావస్తువులో ఉండే అసాధారణ శక్తి స్వభావానికి కుర్వద్రూప మని వ్యవహారము. కాబట్టి "భావాలు పదవ్యంగ్యము లయితే విచిత్రత లేదు" అనేవారి వాదము నిరస్త మవుతున్నది.

---

తత్ పదముచేత పదార్థానికి అసాధారణరూపముగా బోధ కలుగదు. బుద్ధిస్థత్వరూపముగా కలుగుతుంది. బుద్ధిస్థత్వము శక్యతావచ్ఛేదకమే అని ద్వితీయ మతము.

బుద్ధిస్థత్వముచేత అనుగతీకృతమైన అసాధారణపదార్థబోధ కలుగుతుంది అని ప్రథమము; బుద్ధిస్థరూపార్థమే బోధించబడుతుందని రెండవది. ఈ రెండుమతాలలోకూడా 'తత్' పదముచేత బుద్ధిస్థము పరామర్శింపబడుతున్నది. బుద్ధి జ్ఞానమూ ఒకటే, స్మృతి జ్ఞానరూపమే.

అందువలన 'తత్' పదముచేత బుద్ధిస్థము పరామర్శింపబడినపుడు ఆ 'తత్' పదముచేత జ్ఞానరూపమైన స్మృతికూడా పరామర్శింపబడింది. కాబట్టి 'తన్మంజు' అనే పద్యము స్మృతిధ్వనికి ఉదాహరణము కాదు. ఇక్కడ తత్పదమువలన జ్ఞానరూప స్మృతికి పరామర్శ ఉన్నందువలన స్మృతితో వాచ్యతకు సంబంధము కలిగింది. వ్యంగ్యార్థానికి ఏవిధముగానూ వాచ్యతాసంస్పర్శ లేనపుడే ధ్వని అవుతుంది అని శంకా గ్రంథము.

ప్రథమమతానుసారముగా ఈ పద్యములో తత్పదానికి అసాధారణసౌందర్య విశిష్టమైన హసితాదికము శక్యము. బుద్ధి శక్యతావచ్ఛేదకానికి అనుగమమాత్రమునే సంపాదించుతుంది. అది వాచ్యము (అంటే శక్యము) కాద ని తెలుతుంది.

రెండవమతంలోకూడా బుద్ధిస్థత్వము తత్పదానికి శక్యతావచ్ఛేదకము. కాగా బుద్ధిస్థలో ఉన్నబుద్ధి సామాన్యజ్ఞానరూపముగా ప్రతిపాదించబడినా స్మృతిత్వవిశేష రూపముగా స్మృతి వ్యంజనచేతనే బోధింపబడాలి కాని శక్తిచేత బోధింపబడదు.

కాబట్టి మతద్వయంలోకూడా స్మృతికి వాచ్యత్వము లేదు. అందువలన పైపద్యములో స్మృతిధ్వనిత్వము అవ్యాహతము అని గ్రహించాలి. ఇది సమాధానము.

ఈపద్యములోనే "సాయంతనాంబుజ సహోదర లోచనాయాః" అని ఉన్నది. నేత్రాలకు సాయంతనాంబుజసామ్యము చెప్పబడుటవలన ఈవ్యంగ్యము గోచరమవుతున్నది. సాయంసమయములో పద్మము క్రమక్రమముగా ముకుళిత మవుతుంది. అంతకంతకు ఆ నిమీలనము అధిక మవుతుంది. ఆవిధముగానే నేత్రాలుకూడా ఉత్తరోత్తరము అధిక ముగా నిమీలనోన్ముఖము లవుతున్నవని వ్యంగ్యము. ఈవ్యంగ్యము ద్వారా ఆనాయికయొక్క ఆనందమగ్నత ప్రకాశిత మవుతున్నది.

దరానమత్కంధరబంధ మీషత్
నిమీలితస్నిగ్ధవిలోచనాబ్జమ్
అనల్పనిశ్వాసభరాలసాంగం
స్మరామి సంగం చిరమంగనాయాః।

నాయకుడు తన మిత్రునితో చెప్తున్నాడు. ఆ అంగనాసంగమును చిరకాలము స్మరించుతున్నాను. ఆ రతములో మెడ కొంచెము వంగి ఉన్నది. ప్రేమపూర్ణము లయిన విలోచనపద్మాలు కొంచెము మూతబడి నవి. అంగము అనల్పనిశ్వాసభరముచేత అలసమై ఉన్నది.

ఈ పద్యములో స్మృతి 'భావము' అనబడదు. ఆస్మృతి 'స్మరామి'అని స్వశబ్దముచేత చెప్పబడినది; అందువలన వ్యంగ్యము కాదు. ఇది స్మర ణాలంకారముకూడా కాదు. ఈ స్మరణము ఏమాత్రమూ సాదృశ్య మూలకముగా లేదు. సాదృశ్యమూలక మైతేనే స్మరణము అలంకార మవుతుంది. స్మరణము వ్యంగ్య మయితేనే స్మృతి భావమవుతుంది అని ఆలంకారికసిద్ధాంతము.

కాని ఇంకా ఈ పద్యములో విభావ మయిన నాయిక వర్ణింపబడినది. అది చమత్కారజనక మవుతూ సుందరముగా ఉన్నది. ఏదోవిధంగా అది రసపర్యవసానము పొందుతుంది. చమత్కారిగా ఉన్నది కాబట్టి ఆనాయిక ఈషత్కంధరానమనాదిరూప మయిన అనుభావమును, ఆక్షిప్తము లయిన వ్రీడాదిసంచారభావములను సన్నిధాపించి రసవ్యంజ నము చేస్తున్నది. రసవ్యంజనసామగ్రి పుష్కలముగా లేనందువలన ఏదోవిధంగా అనవలసివచ్చింది.

౩ వ్రీడ

స్త్రీణాం పురుషముఖావలోకనాదేః, పుంసాం చ ప్రతిజ్ఞాభంగపరాభవాదే రుత్పన్నః వైవర్ణ్యాధోముఖత్వాదికారణీభూత శ్చిత్తవృత్తి విశేషో వ్రీడా.

స్త్రీలకు పురుషముఖము చూచుట మొదలగువాని వలన, పురుషులకు ప్రతిజ్ఞాభంగము, పరాభవము మొదలగువానివలన ఉత్పన్న మైనదై వైవర్ణ్యము అధోముఖత్వము మొదలయినవానికి కారణ మైన చిత్తవృత్తి విశేషము వ్రీడ అనబడును. ఉదాహరణము:

కుచకలశయుగాన్త ర్మామకీనం నఖాంకం
సపులకతను మందం మంద మాలోకమానా
వినిహితవదనం మాం వీక్ష్య బాలా గవాక్షే
చకితనతనతాంగీ సద్మ సద్యో వివేశ.

నాయకుడు తనమిత్రునితో చెప్పుతున్నాడు. కలశములతో సమానము లయిన రెండు కుచాలమధ్యలో నానఖక్షతమును నాయిక పులకితాంగి అయి మెల్లగా చూస్తున్నదై, గవాక్షములో ముఖమును ఉంచిన నన్ను చూచి చకితములు అత్యంతమూ నతములూ అయిన అంగములు కలదై అప్పుడే భవనములో ప్రవేశించినది.

ఈ పద్యములో నాయిక, ప్రియుణ్ణి చూడడము, కుచములమధ్యలో ఉన్న ప్రియనఖక్షతములను నాయిక చూడడమువలన కలిగిన హర్షమును సూచన చేయునటువంటి రోమాంచాదులను ప్రియుడు చూడడమూ ఈ రెండూ విభావములు. అప్పుడే సదనప్రవేశము అనుభావము.

వేరొక ఉదా :

నిరుద్ధ్య యాంతీం తరసా కపోతీం
కూజత్కపోతస్య పురో దదానే
మయి స్మితార్ద్రం వదనారవిందం
సా మంద మందం నమయాంబభూవ.

వెళ్లిపోతూ ఉన్న ఆడపావురాన్ని తొందరగా అడ్డగించి, కామాతురముగా ఉండడమువలన కూజనము చేస్తూఉన్న మగపావురముదగ్గరగా నేను ఉంచగా నా నాయిక చూచి మందహాసమధురముఖకమలమును మెల్లగా వంచినది.

పూర్వపద్యములో త్రాసము ఉన్నట్లుగా దీనిలో కూడా లేశముగా హర్షము అభివ్యక్త మవుతున్నది. అయినప్పటికీ అది లజ్జకు అనుకూలమే. లజ్జ దానివలన పోషింపబడుతున్నది. మగపావురము ఎదట ఆడపావురమును సమర్పించుట విభావము; వదననమనము అనుభావము.

## ౪ మో హ ము

**భయవియోగాదిప్రయోజ్యా వస్తుతత్వానవధారిణీ చిత్తవృత్తి ర్మోహః.**

భయవియోగాదులవలన ఉత్పన్న మవుతూఉన్న చిత్తవృత్తి వస్తువుల యథార్థతత్వమును నిశ్చయించలేనిదిగా అయినప్పుడు మోహము అవుతుంది. మనుష్యాదులు ఎదుట ఉన్నప్పటికీ "వీరు ఫలానా" అని గుర్తుపట్టుట ఉండదు. ఇదే అంతఃకరణశూన్యత అని అనబడు చింత అవుతున్నది. వస్తువును 'ఫలానా' అని నిశ్చయించుటకు వీలు కాని అవస్థాంతరము పొందినచింత మోహ మన్నమాట. అందువలన నవీనవిద్వాంసులు "ఈ మోహముకూడా చింతే కాని కేవలమూ అవస్థాభేద మున్నది. చింత ఈ దశను పొందినప్పుడు మోహ మనబడుతున్నది. అంతకన్నచింతకంటె ఇది భిన్నమే కాదు" అని అంటున్నారు. ఉదా:

**విరహేణ వికలహృదయా, విలపంతీ దయిత! దయితే తి**
**ఆగత మపి తం సవిధే, పరిచయహీనేవ వీక్షతే బాలా.**

ఒకసఖి వేరొక చెలికత్తెతో చెపుతున్నది. ఆమె హృదయము విరహముచే వికలమై ఉన్నది. ఆ పిల్ల ప్రియా! ప్రియా! అని విలాపము చేస్తున్నది. సన్నిధికి వచ్చినప్పటికీ ప్రియుణ్ణి పరిచయము లేనిదానివలె చూస్తున్నది.

దీనిలో కాంతవియోగము విభావము; ఇంద్రియ వికలత్వము లజ్జాదులు లేకపోవుట అనుభావము.

వేరొక ఉదాహరణము:

> శుండాదండం కుండలీకృత్య కూలే, కల్లోలిన్యాః కించిదాకుంచితాక్షః
> నైవాకర్షత్యంబునైవాంబుజాలిం, కాంతాపేతః కృత్యశూన్యో గజేంద్రః

ప్రియురాలితో వియోగము పొందిన గజేంద్రము నిశ్చేష్టమై తొండమును కుండలాకారముగా చేసి కల్లోలినీకూలములో కొంత వంచిన నేత్రాలు కలదై ఉదకమును ఆకర్షించడము లేదు. పద్మసమూహమును కూడా పట్టుకొనుటలేదు.

౫ ధృతి

లోభశోకభయాదిజనితోపప్లవనివారణకారణీభూతశ్చిత్తవృత్తివిశేషో ధృతిః. లోభశోకభయాదులవలన కలిగిన ఉపప్లవములను నివారించుటలో కారణమైన చిత్తవృత్తి ధృతి అనబడును. ఉదా:

> సంతాపయామి హృదయం, ధావం ధావం ధరాతలే కిమహమ్
> అస్తి మమ శిరసి సతతం, నందకుమారః ప్రభుః పరమః.

ఇది ఒకభక్తుని వచనము. నేను ఈ భూతలములో పరుగెత్తి పరుగెత్తి హృదయమును ఎందుకు సంతాపపెట్టుకోవాలి? నా శిరస్సుపై పరమ ప్రభువైన నందకుమారుడు నిత్యమూ విరాజిల్లుతున్నాడు.

దీనిలో వివేకము శాస్త్రసంపత్తి మొదలయినవి విభావములు; చపలతాదులు ఉపశమించుట అనుభావము.

ఉత్తరార్థములో "నాకు చింత లేదు" అని వస్తువు వ్యక్తమవుతున్నది గదా! ఈ పద్యము ధృతిభావధ్వని ఏ విధముగా అవుతుంది? అని శంకించ నక్కర లేదు.

"నాకు చింత లేదు'' అనేవస్తువు ధృతిభావానికి ఉపయుక్తమవుతూ అభివ్యక్తమవుతున్నది. ధృతిప్రతీతిలో అది సాహాయ్యము చేస్తున్నది. దానికి వేరుగా అభివ్యక్తి లేదు. అందువలన ధృతిధ్వని కావచ్చును.

## ౬ శ ం క

కి మనిష్టం మమ భవిష్య తీత్యాకార శ్చిత్తవృత్తివిశేషః శంకా

'నాకు ఏమి అనిష్టము కలుగుతుందో' అనునట్టి చిత్తవృత్తివిశేషానికి 'శంక' అని పేరు. ఉదా :

విధివంచితయా మయా న యాతం, సఖి! సంకేతనికేతనం ప్రియస్య
అధునా బత కిం విధాతుకామో, మయి కామో నృపతిః పున ర్నజానే!

నాయిక సఖితో చెప్పుతున్నది. సఖీ! విధివంచితురాలనయిన నేను ప్రియునిసంకేతనికేతనమునుగురించి వెళ్ళలేదు. మదనుడు కాని రాజు కాని నా విషయమై ఇప్పుడు ఏమి చేయదలచి ఉన్నారో తెలుసుకో లేను గదా!

దీనిలో రాజాపచారము విభావము. ఆక్షేపగమ్యము లయిన ముఖ వైవర్ణ్యము మొదలయినవి అనుభావములు. చింతకూ దీనికీ ఈ భేద మున్నది. ఈశంక భయాదులను పుట్టించుతుంది. కాబట్టి కంపాదులకు కారణ మవుతుంది. చింత వీనిని కలుగచేయలేదు.

## ౭ గ్లా ని

ఆధివ్యాధిజన్యబలహానిప్రభవో వైవర్ణ్యశిథిలాంగత్వ దృగ్భ్రమణాది హేతు ర్దుఃఖవిశేషో గ్లానిః.

మనోవ్యాధి రోగములవలన పుట్టిన దుర్బలత్వమువలన కలిగిన వివర్ణత్వము అంగశిథిలత నేత్రభ్రమణము మొదలగువానికి హేతు వగు ఒకవిధమైన దుఃఖము గ్లాని.

ఉదా : శయితా శైవలశయనే, సుషమాశేషా నవేందులేఖేవ
ప్రియ మాగత మపి సవిధే, సత్కురుతే మధురవీక్షణై రేవ.

ఒక సఖి వేరొకసఖితో చెప్పుతున్నది. శైవాలశయనమున శయనించి నట్టిన్నీ, నవీనచంద్రకళవలె శోభమాత్రము మిగులగా కలిగిఉన్నట్టిన్నీ నాయిక, సన్నిధికి వచ్చినా ప్రియుణ్ణి మధురవీక్షణాలతో మాత్రమే సత్కరించుతున్నది.

దీనిలో ప్రియునివిరహము విభావము. "మధురవీక్షణాలతో మాత్రమే" అనుటవలన గోచరము లవుతూ ఉన్న- ఎదుర్కొనుట, పాదపతనము మొదలయినవాని నివృత్తి అనుభావము. దీనిలో శ్రమభావము ఉన్నదని శంకించ నక్కరలేదు. శ్రమాపాదక మైనహేతు వేమీ వర్ణింపబడ లేదు కనుక.

కొందరు రోగాదులవలన కలిగిన బలనాశమునే గ్లానిగా చెప్పుతున్నారు. వారిమతములో ఇది విచారింపదగి ఉన్నది. భావము లన్నీకూడా చిత్తవృత్తిరూపములే. వానిలో వినాశరూప మైన, అనగా అభావరూపమయినగ్లానికి ఏవిధముగా సమావేశము కలుగుతుంది ? కాబట్టి వారావిధముగా చెప్పడము ఉచితము కాదు.

**బలస్యాపచయో గ్లాని రాధివ్యాధిసముద్భవః.**

మానసికకష్టము, వ్యాధి వీనివలన కలిగిన బలాపచయము గ్లాని అగును అనే ప్రాచీనుల లక్షణములో 'అపచయ' శబ్దమువలన నాశమే గోచర మవుతున్నది. అయినప్పటికీ పూర్వము చెప్పిన అనుపపత్తి కారణముగా బలాపచయపదానికి "బలనాశజన్య మైనదుఃఖము" అని అర్థము చెప్పుకొనుట సమ్మతముగా ఉంటుంది. ఈవిధముగా ఈ గ్రంథము సుయోజ మని భావించాలి.

## ౮ దైన్యము

**దుఃఖదారిద్ర్యాపరాధాదిజనితః స్వాపకర్షభాషణాదిహేతు శ్చిత్తవృత్తి విశేషో దైన్యమ్**

దుఃఖము,దారిద్ర్యము, అపరాధము మొదలయిన వానివలన కలిగినటువంటిన్నీ తనను నిందించుకొను భాషణములో హేతువైనట్టి చిత్తవృత్తి విశేషము దైన్య మవుతుంది. ఉదా:

**హతకేన మయా వనాంతరే, వనజాక్షీ సహసా వివాసితా**
**అధునా మమ కుత్ర సా సతీ, పతితస్యేవ పరా సరస్వతీ ?**

నేను వనమధ్యములో కమలనయనను అనాలోచితముగా వెంటనే విడిచి పెట్టినాను. ఇప్పుడు ఆ పతివ్రత పతితునకు పరావాణి అయిన వేద వాక్కువలె నాకు ఎక్కడనుండి వస్తుంది? ఇది సీతను విడిచిపెట్టిన తరువాత శ్రీరామునివచనము.

దీనిలో సీతాపరిత్యాగరూపమైన అపరాధము గాని, సీతాపరిత్యాగము వలన గలిగిన దుఃఖము గాని విభావము. పతితునితో సామ్యమును చెప్పుకొనుట అనే స్వాపకర్ష భాషణము అనుభావము. దైన్యభావ విషయములో పెద్దలు ఈ విధముగా చెప్పుతున్నారు.

> చిత్తౌత్సుక్యా న్మనస్తాపా ద్దౌర్గత్యాచ్చ విభావతః
> అనుభావాత్తు శిరసో ఽభ్యావృత్తే ర్గాత్ర గౌరవాత్
> దేహోపస్కరణత్యాగా ద్దైన్యం భావం విభావయేత్

చిత్తములోని ఉత్సుకత మనస్తాపము దారిద్ర్యము ఇవి విభావములుగా శిరసు త్రిప్పుట, శరీరభారము దేహభూషణత్యాగము అనుభావములుగా దైన్యభావమును విభావన చేయవలెను.

> "దౌర్గత్యాదే రనౌజస్యం దైన్యం మలినతాదికృత్"

దుర్గతి దారిద్ర్యము మొదలయినవానివలన ఓజస్విత లేకపోవుట దైన్యమనబడుతుంది. ఇది మలినతాదులను గలుగజేస్తుంది అని.

పైపద్యములో "హతకేన మయా వివాసితా" హతకుడనైననాచేత పరిత్యక్తురా లయినది, విధిచేత గాదు, అనే అర్థము "పతితస్యేవ" అని పతితసామ్యముచేతనే పరిపోషము పొందుతున్నది. అంతే కాని శూద్రాద్యుపమచే పోషింపబడడము లేదు. శూద్రునకు జాతిచేతనే శ్రుతిదౌర్లభ్యము విధిచేత విధింపబడింది. బ్రాహ్మణాదులకు స్వభావసిద్ధముగా శ్రుతిసౌలభ్య మున్నప్పటికీ పతితుడైనవాడు స్వయముగా అటువంటి పాపమును ఆచరించి శ్రుతిని దూరము చేసుకున్నాడు అని రామునకు పతితునితో సామ్యము, సీతకు శ్రుతితో సామ్యము, ప్రతీతమవుతున్నది. ఇక్కడ ఉన్న ఉపమాలంకారము దైన్యభావమును అలంకరించుతున్నది. అందువలన అది కూడా దైన్యపోషకమే.

పై శ్లోకములో 'మయా' 'సా' అనే రెండుపదములూ ఉపాదానలక్షణా రూపములు. దానివలన "మయా" అనగా "అత్యంత క్లేశములలోకూడా ఆమెచే విడువబడినటువంటి నాచేత" అనీ, 'సా' అంటే "వనవాసములో సహచారిణిగా ఉన్నట్టి ఆమె" అనీ అర్థము గోచర మవుతున్నది. పిమ్మట తనకృతఘ్నత ఆమె కృతజ్ఞత, తననిర్దయత ఆమె దయాళుత మొదలయిన అనేకధర్మములు గోచరము లవుతున్నవి. వానిద్వారా దైన్యభావము పరిపోషము పొందుతున్నది. ఈవిధముగానే 'సా' అనే శబ్దముద్వారా లేశముగా స్మృతి ప్రతీయమాన మవుతున్నది. ఆ స్మృతికూడా దైన్యభావానికి పోషకముగా ఉన్నది. కాబట్టి ఈపద్యములో వ్యంగ్యము లయిన కృతజ్ఞత మొదలయినవి దైన్యభావములో గుణీభూతము లవుతున్నవి.

## ౯ చింత

ఇష్టప్రాప్త్యనిష్టప్రాప్త్యాదిజనితా ధ్యానాపరపర్యాయా వైవర్ణ్యభూలేఖనాధోముఖత్వాదిహేతు శ్చిత్తవృత్తి విశేష శ్చింతా.

ఇష్టప్రాప్తి,అనిష్టప్రాప్తి మొదలయినవానివలన ఉత్పన్నమైనటువంటిన్నీ ధ్యాన మనేపేరు కలిగినటువంటిన్నీ, వైవర్ణ్యము, భూమిని గీయుట, అధోముఖత్వము మొదలయిన వానిని కలుగజేయునటువంటిన్నీ చిత్తవృత్తివిశేషము చింత అనబడుతుంది. ఈవిషయములో ప్రాచీనులు ఈ విధముగా చెప్పుతున్నారు.

విభావా యత్ర దారిద్ర్య మైశ్వర్య భ్రంశనం తథా
ఇష్టార్థాపహృతిః శశ్వ చ్ఛ్వాసోచ్ఛ్వాసా వధోముఖమ్
సంతాపః స్మరణం చైవ కార్శ్యం దేహానుపస్కృతిః
అధృతి శ్చానుభావా స్యుః సా చింతా పరికీర్తితా
వితర్కోఽస్యాః క్షణే పూర్వే పాశ్చాత్యే వోపజాయతే

దారిద్ర్యము ఐశ్వర్యనాశము ఇష్టవస్త్వపహరణము దేనికి విభావము లవుతవో, మాటిమాటికీ శ్వాసోచ్ఛ్వాసములు, అధోముఖత్వము,

సంతాపము, స్మరణము, కృశత్వము శరీరమును అలంకరించుకొనకపోవుట, అధృతి అనుభావము లవుతవో, అది చింత అనబడుతున్నది. ఈచింతకు పూర్వక్షణములో కాని పరక్షణములో కాని వితర్కము కలుగు తుంది అని.

ధ్యానం చింతా హితాఽనాప్తేః సంతాపాదికరీ మతా

హిత మైనవస్తువు ప్రాపించకపోవడమువలన కలుగు విచారము చింత అనబడుతుంది. అది సంతాపాదులను కలుగజేస్తుంది. ఉదా:

అధరద్యుతి రస్తపల్లవా, ముఖశోభా శశికాంతిలంఘినీ
అకృతప్రతిమా తనుః కృతా, విధినా కస్య కృతే మృగీదృశః?

నాయకుడు మనస్సులో భావించుతున్నాడు. పల్లవశోభను పరాజయము చేయునట్టి ఆ మృగనయనయొక్క అధరకాంతి చంద్రకాంతిని ఉల్లంఘించునట్టి ముఖశోభా సాదృశ్యము లేనట్టి తనువూ ఎవనికొరకై బ్రహ్మచే సృజింపబడ్డవో కదా!

దీనిలో నాయికయొక్క అప్రాప్తి విభావము, ఆక్షేపగమ్యము లగు అనుతాపాదులు అనుభావములు. "కస్య కృతే" అనుటవలన నిర్ధారింపబడని ఒక ధర్మి ఆలంబనముగా చింత ప్రతీయమానము అవుతున్నది. కాబట్టి ఔత్సుక్యము ఉన్నప్పటికీ ప్రధానముగా గోచర మగుట లేదు. అందు వలన దీనిలో ఔత్సుక్యధ్వని ఉన్న దనరాదు.

## ౧౦ మ ద ము

మద్యాద్యుపయోగజన్మా ఉల్లాసాఖ్యః శయనహసితాదిహేతు శ్చిత్త వృత్తివిశేషో మదః

మద్యము మొదలయిన వానియొక్క ఉపభోగమువలన కలుగునటు వంటిన్నీ, ఉల్లాస మనేపేరు కలిగినట్టిన్నీ, శయనహసితాదులకు హేతు వయినట్టిన్నీ చిత్తవృత్తివిశేషము మద మనబడుతుంది. ఈ విషయ ములో ప్రాచీనులు:

సమ్మోహానందసంభేదో మదో మద్యోపయోగజః

సమ్మోహానందములయొక్క సమ్మిశ్రణమే మదము. అది మద్యోపయోగమువలన ఉత్పన్న మవుతుంది అంటున్నారు.

మదము ఉత్పన్న మయినపుడు ఉత్తమపురుషునిలో స్వాపము అనుభావము. మధ్యమపురుషునిలో హసితము, గానము అనుభావములు. నీచునిలో రోదనము, పరుషోక్తి అనుభావములు. ఈ మదము మూడు విధములు: తరుణము, మధ్యమము, అధమము అని. అస్పష్టాక్షరములతో, అసంగతవాక్యములతో, సుకుమార మగు స్ఖలద్గతితో అభినయించితే తరుణమదము అవుతుంది. భుజములను కదలించుట, తొట్రుపాటు, ఘూర్ణనము ఉన్నప్పుడు మధ్యమమద మవుతుంది. గతిభంగము, స్మృతినాశము, ఎక్కిళ్ళు, వాంతి మొదలయినవి ఉన్నప్పుడు అధమమదము.

ఉదా : మధురతరం స్మయమానః, స్వస్మిన్నే వాలపన్ శనైః కి మపి
కోకనదయన్ త్రిలోకీం, ఆలంబనశూన్య మీక్షతే క్షీబః.

మదమత్తమానవుడు మధురతరముగా నవ్వుతూ, తనలో తాను ఏదో మాట్లాడుకుంటూ, నేత్రాలు ఎర్రగా ఉండడమువలాన మూడు లోకాలనూ రక్తకమలములనుగా చేస్తూ ఆధారము లేనిశూన్యప్రదేశమును చూస్తున్నాడు.

దీనిలో మాదకద్రవ్యమును సేవించుట విభావము. అవ్యక్తాలాపాదులు అనుభావములు. ఈ పద్యములో మత్తపురుషుని స్వభావము వర్ణింపబడినది. ఆతనిమదమును ధ్వనితము చేయుటకై అది స్వీకృతము. కాబట్టి మదభావమే ఇందు ప్రధానము. అందువలన స్వభావవర్ణనమున్నా స్వభావోక్త్యలంకారము కాదు. ఆ స్వభావోక్తి ధ్వనికి ఉపస్కారక మవుతున్నది.

క్షీబశబ్దానికి 'మత్తుడు' అని అర్థము. ఆతనిలో విశేషణరూపముగా మదము కూడా చెప్పబడును. కాబట్టి మదము కూడా వాచ్యము అవుతుంది. అందువలన ఇది ధ్వని కాకూడదుగదా ? వ్యంగ్యము ఏవిధము

గానూ వాచ్యవృత్తిసమాలింగితము కాకుండా ఉంటేనే చమత్కారి అవుతుం దని నిర్ణయింపబడిన అర్థము కదా! కాబట్టి పై పద్యములో స్వభావోక్త్యలంకారమే కావాలి అనే టట్లయితే ఇది ఉదాహరణము:

**మధురసా న్మధురం! హి తవాధరం, తరుణి మద్వదనే వినివేశయ**
**మమ గృహాణ కరేణ కరాంబుజం, పపపతామి హహా భభభూతలే.**

నాయకుడు నాయికతో పలుకుతున్నాడు. ఓతరుణీ! నీ అధరము మధురసముకంటె మధురము. ఆ అధరమును నావదనములో ఉంచు. నీ కరములో నా కరాంబుజమును పట్టుకో! హాహాహా! భూభూభూతలముపై పపపడిపోతున్నాను.

దీనిలోకూడా మాదకవస్తుసేవనమే విభావము. అధిక వర్ణోచ్చారణాదికము అనుభావము. పూర్వార్థములోని గ్రామ్యవచనము ఉత్తరార్థములో అంబుజానికి ఉపమేయముగా తరుణీకరమునే చెప్పవలసి ఉండగా తనకరమును చెప్పి తనకరమునకు పద్మోపమేయత్వమును నిరూపించుట మదమునే పోషించుతున్నది.

## ౧౧ శ్రమము

**బహుతరశారీరవ్యాపారజన్మా నిశ్వాసాంగ సమ్మర్దనిద్రాది కారణీభూతః ఖేదవిశేషః శ్రమః.**

అత్యంతమూ శారీరకవ్యాపారము చేసినందువలన ఉత్పన్న మగునటువంటిన్నీ, నిశ్వాసము ఒళ్ళువిరుపు నిద్ర మొదలయినవానికి హేతుభూత మైనఖేదవిశేషము శ్రమము అనబడును. ప్రాచీనులు ఇట్లు చెప్పుతున్నారు.

**అధ్వవ్యాయామసేవాద్యై ర్విభావై రనుభావకైః**
**గాత్రసంవాహనై రాస్యసంకోచై రంగమోటనైః**
**నిశ్వాసై ర్జృంభితై ర్మందైః పాదోత్క్షేపైః శ్రమో మతః**

ప్రయాణము చేయుట, వ్యాయామము చేయుట మొదలగునట్టి విభావ

ములతో గాత్రసంవాహనము, ముఖమును ముడుచుకొనుట, ఒళ్లు విరుచుకొనుట, నిశ్వాసము, ఆవలింత, మెల్లగా అడుగులు వేయుట అనే అనుభావములతో శ్రమమును తెలుసుకోవలయును అని.

శ్రమః ఖేదోఽధ్వగత్యాదే ర్నిద్రాశ్వాసాదికృ న్మతః.

మార్గగమనము మొదలయిన వానివలన కలుగు ఖేదము శ్రమము అగును. అది నిద్రాశ్వాసములను కలుగజేయును. అది బల మున్నప్పటికీ కలుగును. శారీరవ్యాపారమువలననే కలిగేగ్లాని ఇటువంటిది కాదు. కాబట్టి గ్లానికీ శ్రమకూ భేదము ఉన్నది. ఉదా:

**విధాయ సా మద్వదనానుకూలం, కపోలమూలం హృదయే శయానా**
**చిరాయ చిత్రే లిఖితేవ తన్వీ, న స్పందితుం మందమపి క్షమాఽఽసీత్**

నాయకుడు తన మిత్రునితో తన ప్రియురాలియొక్క విపరీతసురతానంతరస్థితిని వర్ణించుచున్నాడు. ఆ నాయిక తన కపోలమూలమును నా వదనానుకూలముగా ఉంచి చిత్రమందు లిఖింపబడినట్లుగా చాలా సేపటివరకూ కొంచెమైనా కదలుటకు సమర్థురాలు కాలేదు.

దీనిలో విపరీతసురతరూప మయిన శారీరికకార్యము విభావము, స్పందము లేకుండా శయినించుట మొదలయినవి అనుభావములు.

ఒకశంక: ఈ పద్యములో 'నిద్ర' అనే భావము ధ్వనిత మవుతున్నది. దానితో ఈ శ్రమ గతార్థము కావడము లేదా? అని. కాదని సమాధానము.

నిద్ర కలిగినపుడు మానవునకు జ్ఞానము ఉండదు. అందువలన ఏచేష్టా కూడా కలుగదు. అప్పుడు "నస్పందితుం మంద మపి క్షమాసీత్" అనిచెప్పడానికి విశేషప్రయోజనము ఏమీ ఉండకపోవలసి వస్తుంది. ఇంకా "శయానా" అనుపదముచే (శీఙ్ ధాతువుచేత) నిద్ర వాచ్యముగా చెప్పబడుతున్నది. అందువలన అది వ్యంగ్యముకాదు. శ్రమ వ్యంగ్యము అవుతున్నది" అని అంటే సముచితముగా ఆనుగుణ్యము కుదురుతుంది.

## ౧౨ గర్వము

**రూపధనవిద్యాదిప్రయుక్తాత్మోత్కర్షజ్ఞానాధీన పరావహేలనం గర్వః**

రూపము, ధనము, విద్య మొదలయినవి కారణముగా తనకు ఉత్కర్ష ఉన్న దనేజ్ఞానము కలిగినపుడు దానిని ఆధారముగా చేసికొని ఇతరులను అవహేళనము చేయుట గర్వ మనబడుతుంది. ఉదా:

> ఆమూలా ద్రత్నసానో ర్మలయవలయితా దాచకూలా త్పయోధే
> ర్యావంత స్సంతి కావ్యప్రణయనపటవ స్తే విశంకం వదంతు
> మృద్వీకామధ్యనిర్యన్మసృణరసఝరీమాధురీభాగ్యభాజాం
> వాచా మాచార్యతాయాః పద మనుభవితుం కోఽస్తిధన్యో మ దన్యః

ఇది కవివచనము. సుమేరుపర్వతమూలభాగమునుండి మలయముతో వలయితమైనసాగరకూలముదాకా ఎందరుకావ్యరచనాసమర్థులున్నారో వారు నిశ్శంకముగా పలుకుదురుగాక! ద్రాక్షామధ్యభాగమునుండి వెలువడుతున్న చిక్కని రసఝరీ మాధురీభాగ్యమును పొందినవాక్కుల ఆచార్యతాపదమును అనుభవించడానికి నాకంటె ఇతరధన్యుడు ఎవడు ఉన్నాడు? నేను ఒకడనే తదధికారిని.

దీనిలో తనకవిత ఇతరకవితాసాధారణము కా దనేజ్ఞానము విభావము. ఇతరకవులను తిరస్కరించా లనేఅభిప్రాయముతో ఇటువంటి వాక్య ప్రయోగము చేయుట అనుభావము. ఈ గర్వమును అసూయ కూడా లేశముగా పోషించుతున్నది.

వీరరసధ్వనిలో ఉత్సాహము ప్రధాన మవుతుంది. గర్వము గుప్తముగా ఉంటుంది. ఈధ్వనిలో గర్వము ప్రధానముగా ఉంటుంది. దానికన్న దీని కిది భేదము. "యది వక్తి గిరాంపతిః" అని పూర్వము వీరరస ప్రసంగములో ఉదాహరించిన పద్యములో గీష్పతితో నయినా, వాగధిదేవతతో నయినా నేను వాదము చేస్తాను అని చెప్పడముచేత ఉత్సాహము ధ్వనిత మవుతుంది. "అందరిపండితులకంటె నేను అధికు డను" అనే గర్వము దానికి పరిపోషకముగా ఉన్నది. ప్రకృతపద్య

ములో మాదిరిగా "ఈ మహీతలంలో నాకంటె ఇతరుడు ఎవడూ లేడు" అనే విధముగా స్పష్టముగా చెప్పిన సోల్లుంఠవచనరూప మయిన అనుభావముతో ప్రధానముగా ప్రతీతము కావడము లేదు.

## ౧౩ నిద్ర

శ్రమాదిప్రయోజ్యం చేతస్సమ్మీలనం నిద్రా

శ్రమాదులవలన చిత్తమునకు సమ్మీలనము కలుగుట నిద్ర అనబడుతుంది. నేత్రనిమీలనము, అవయవములు నిశ్చేష్టము లగుట మొదలయినవి దీని అనుభావములు. ఉదా:

> సా మదాగమనబృంహితతోషా, జాగరేణ గమితాఖిలదోషా
> బోధితాపి బుబుధే మధుపై ర్న, ప్రాతరాననజసౌరభలుబ్ధైః

నాయకుడు తనమిత్రునితో చెప్పుతున్నాడు. నా రాకవలన అతిశయించిన సంతోషముకలదై మేలుకొనుటచేత రాత్రి నంతా గడపినదై ఆనాయిక ప్రాతస్సమయములో ముఖసుగంధలోభము కలిగిన తుమ్మెదలచే బోధితురాలయినా మేల్కొనలేదు.

దీనిలో రాత్రి జాగరణశ్రమ విభావము, మధుపములచే బోధ కలుగక పోవుట అనుభావము.

## ౧౪ మతి

శాస్త్రాదివిచారజన్య మర్థనిర్ధారణం మతిః

శాస్త్రాదుల పరిశీలనమువలన ఏదయినా విషయమును నిర్ణయముచేయుట మతి అనబడును. దీనిలో నిశ్శంకముగా నిశ్చిత తదర్థానుష్ఠానము సంశయోచ్ఛేదము మొదలయినవి అనుభావములు. ఉదా:

> నిఖిలం జగదేవ నశ్వరం, పున రస్మి న్నితరాం కళేబరమ్
> అథ తస్య కృతే కియా నయం, క్రియతే హంతః మయా పరిశ్రమః

ఇది విరక్తపురుషుని వచనము. ఈ జగత్తుఅంతా వినాశశీలము. ఇంకా

ఈ జగత్తులో ఈ శరీరము అన్నిటికన్నా వినశ్వరము. ఇవ్వాళా రేపూ కూడా ఉంటుందో ఉండదో చెప్పలేము. ఆ శరీరానికై నేను ఎంత పరిశ్రమ చేస్తున్నాను. ఇది ఖేదావహంగా ఉన్నది.

"శరీర మేత జ్జలబుద్బుదోపమం" అనే శాస్త్రపర్యాలోచనము దీనిలో విభావము. "హంత" పదముచేత గమ్యము అయిననింద, రాజసేవాదులు లేకపోవుట, తృష్ణారాహిత్యమున్నూ అనుభావాలు. దీనిలో వెంటనే మతిభావచమత్కారమే ప్రతీతమవుతుంది. అందువలన "మతిధ్వని" అని వ్యపదేశించాలి. కాని విలంబముగా ప్రతీయమానమగుట వలన "శాంతధ్వని" అని వ్యవహరించ రాదు.

## ౧౫ వ్యాధి

### రోగవిరహాదిప్రభవో మనస్తాపో వ్యాధిః

రోగము, విరహము మొదలయిన వానివలన కలుగునట్టి మనస్తాపమునకు వ్యాధి అని పేరు. శరీరము శిథిల మగుట, నిశ్వాసము మొదలయినవి వీనిలో అనుభావములు. ఈ విషయములో ప్రాచీనులు ఈ విధముగా చెప్పుతున్నారు.

> ఏకైకశో ద్వంద్వశో వా త్రయాణాం వా ప్రకోపతః
> వాతపిత్తకఫానాం స్యు ర్వ్యాధయో యే జ్వరాదయః
> ఇహ తత్ప్రభవో భావో వ్యాధ ఇ త్యభిధీయతే

వాతపిత్త కఫదోషములలో ఒక టొకటి గాని, రెండు రెండు కాని, మూడూ కాని ప్రకోపించినందువలన జ్వరాదివ్యాధులు కలుగును. వాని వలన కలిగిన భావము సాహిత్యశాస్త్రములో 'వ్యాధి' అనబడుతున్నది.
ఉదా :

> హృదయే కృతశైవలానుషంగా, ముహు రంగాని ఇత స్తతః క్షిపంతీ
> తదుదంతపరే ముఖే సఖీనా, మతిదీనా మియ మాదధాతి దృష్టిమ్

ఒకసఖి వేరొకసఖితో చెప్పుతున్నది. హృదయమునందు నాచుతీగెల సంబంధమును కలుగజేసికొన్నదై, మాటిమాటికీ అవయవాలను అట్లూ

ఇటూ విసరుతూ నాయకుని వృత్తాంతతత్పర మైన చెలికత్తెల ముఖ మందు ఈచిన్నది అతిదీన మైనదృష్టిని కూర్చుకున్నది.

దీనిలో విరహము విభావము, అంగక్షేపాదులు అనుభావాలు.

## ౧౭ త్రాసము

**భీరో ర్ఘోరసత్వదర్శన స్ఫూర్జథుశ్రవణాదిజన్మా చిత్తవృత్తివిశేష స్త్రాసః**

ఘోరక్రూర మృగములను చూచుట పిడుగుపాటును వినుట మొదలయిన వానివలన భీరువునకు కలిగిన చిత్తవృత్తి విశేషము త్రాసము. దీనిలో రోమాంచ కంప స్తంభ భ్రమాదులు అనుభావములు. "ఔత్పాతికైః మనఃక్షేపస్త్రాసః కంపాదికారకః" ఉత్పాతములను కలుగు జేయువాని వలన కలుగు నట్టి మనోవిక్షేపము త్రాస మగును. ఇది కంపాదులకు హేతువు అని ప్రాచీనులు చెప్పుతున్నారు. ఉదా:

**ఆశీషు కేళీరభసేన బాలా, ముహు ర్మమాలాప ముపాలపంతీ**
**ఆరా దుపాకర్ణ్య గిరం మదీయాం సౌదామనీయాం సుషమా మయాసీత్**

నాయకుడు తనమిత్రునితో చెప్పుట. ఆబాల క్రీడాసక్తితో వచ్చి చెలికత్తెలలో నాకు సంబంధించిన ఆలాపమును సంలాపించుచున్నదై నామాటను దూరముగా విని సౌదామనీశోభను పొందినది.

దీనిలో పతి తమవచనాలను వినుట విభావము.పరుగెత్తుట అనుభావము. దీనిలో లజ్జ వ్యంగ్య మవుతున్నదని ఆశంకించరాదు. శైశవముచేతనే లజ్జ నిరస్తమవుతున్నది. బాల్యావస్థలో లజ్జ ఉండదు. త్రాసమే ఉంటుం దని ఊహించాలి. ఈ పద్యములో బాలాపదముచేత నాయికయొక్క శిశుత్వము చెప్పుట ఇష్టము కాదని ఆనాయికయొక్క అల్పవయస్కతా రూప మయినవిశేషమే దానివలన సూచిత మవుతుందనీ అనేటట్లయితే ఇది వివిక్తమైన ఉదాహరణ మని గ్రహించాలి.

**మా కురు కశాం కరాబ్జే, కరుణావతి! కంపతే మమ స్వాంతమ్**
**ఖేల న్న జాతు గోప్యై, రంబ! విలంబం కరిష్యామి**

కరుణామయీ! నీ కరాబ్జములో కొరడాను ఉంచుకోవద్దు. నా హృదయము కంపించుచున్నది. అమ్మా! గోపులతో ఆడుతూ ఇక ఎప్పుడూ ఆలస్యము చేయను. ఇది లీలాగోపకిశోరుని వచనము.

## ౧౭ సు ప్త ము

నిద్రావిభావోత్థజ్ఞానం సుప్తమ్

నిద్రారూపమైన విభావమువలన ఉత్పన్నమయిన జ్ఞానమునకు సుప్తము అని పేరు. సుప్త మనగా స్వప్నము అని అర్థము. ప్రలాపాదులు దీనిలో అనుభావములు. నేత్రనిమీలనాదులు నిద్రానుభావములే కాని సుప్తానుభావములు కావు. అవి స్వప్నము కారణముగా కలుగుట లేదు. ప్రాచీనాచార్యులు:

"అస్యానుభావా నిభృతగాత్రనేత్రనిమీలనమ్"

శరీరనిశ్చేష్టత్వము నేత్రమీలనమూ దీని అనుభావములు అని అంటున్నారు. ఆ అనుభావములు నిద్రవల్లనే కలుగుతవి; అన్యథా సిద్ధములు కూడా అవుతవి. అవి కేవలమూ స్వప్నములోనే ఉండవు. స్వప్నము లేకపోయినా కేవలమూ నిద్రలోకూడా ఉండవచ్చును. అయినా ఈ భావములోకూడా వ్యాపకరూపంగా ఉంటున్నవి. ఈ సుప్తభావము వానితో రహితంగా ఉండదు అని తెలియవలసి ఉన్నది. ఉదా:

అకరుణః మృషాభాషాసింధో! విముంచ మ మాంచలం
తవ పరిచితః స్నేహః సమ్య ఙ్మయే త్యనుభాషిణీమ్
అవిరళగళద్బాష్పాం తన్వీం నిరస్తవిభూషణాం
క ఇహ భవతీం భద్రే! నిద్రే! వినా వినివేదయేత్.

ఓ దయారహితా! ఓ అసత్యభాషణ సాగరా! నా పైటను విడిచిపెట్టుము. నీ స్నేహము నాకు చాలా పరిచితమైనది అని పలుకుతున్నట్టిన్నీ, అవిరళముగా స్రవించుచున్న బాష్పములు కల ప్రియురాలిని ఓ కళ్యాణకారిణీ! నిద్రా! నీవు వినా ఇతరులు ఎవరు నివేదించుతారు? హే దేవి! ఈవిధముగా కూర్చు సౌభాగ్యము కేవలమూ నీకే ఉన్నది.

స్వప్నములో కూడా ఈ విధముగా పలుకుతూఉన్న ప్రియురాలిని చూస్తూ విదేశగతుడైన నాయకుడు అనుకొంటున్నాడు. ఇటువంటి ప్రియురాలి అవస్థను నివేదనము చేయుటచేత ఓ నిద్రా! నీవు నాకు గొప్ప ఉపకారము చేసినావు అనే వస్తువున్నూ విప్రలంభశృంగారమున్నూ ప్రతీతిపథములో అవతరించుతున్నవి. కాని ఈ పద్యము స్వప్నధ్వనికే ఉదాహరణముగా ఇవ్వబడినది. ప్రథమముగా స్ఫూర్తి కలదిఅగుట ఇందులో కారణము. స్వప్నానంతరము తుదకు ఆ రెండూ ధ్వనితములు కావచ్చును. వానిని ఈ స్వప్నధ్వననము నిరోధించదు.

## ౧౮. విబోధము

నిద్రానాశోత్తరం జాయమానో బోధో విబోధః

నిద్ర నశించిపోయినపిమ్మట కలుగునట్టి బోధ విబోధము అనబడును. నిద్రాపూర్తి, స్వప్నాంతము, బలీయమైన శబ్దస్పర్శ వీనివలన నిద్రానాశము కలుగుతుంది. కాబట్టి అవే దీనిలో విభావములు. కండ్లు నులుముకొనుట, శరీరము విరుచుకొనుట మొదలయినవి అనుభావములు. ఉదా:

**నితరాం హి తయాద్య నిద్రయా మే, బత యామే చరమే నివేదితాయాః**
**సుదృశో వచనం శృణోమి యావ, న్మయి తావత్ప్రచుకోప వారివాహః**

ఇప్పుడు మిక్కిలి హితమైననిద్రచేత చరమయామములో నివేదింపబడిన ప్రియురాలి వచనమును ఎంతలో వింటున్నానో అంతలో నాపై మేఘుడు కుపితుడైనాడు.

దీనిలో గర్జితశ్రవణము విభావము, ప్రియావచన శ్రవణములోని ఉల్లాసము నశించుట అనుభావము. అది స్పష్టముగా శబ్దములచే వర్ణింపబడక పోయినా సమున్నేయము. కొందరు అవిద్యానాశమువలన ఉత్పన్నము అగునట్టి దానినిగాకూడా విబోధమును తలచుతున్నారు. వారిమతంలో:

నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత ।
స్థితోస్మి గతసందేహః కరిష్యే వచనం తవ

కృష్ణా ! నీ అనుగ్రహామువలన మోహాము నశించింది. నాచే స్మృతి పొందబడినది. సందేహాము లేనివాడనై ఉన్నాను. నీవచన ప్రకారము చేయుదును.

ఈ గీతాపద్యము ఉదాహారింపదగి ఉన్నది.

"నితరాంహి తయాద్య నిద్రయా మే" అనేపద్యములో మేఘవిషయక మైనఅసూయకే వాక్యార్థత్వము ఉన్నది అని శంకించడము ఉచితము కాదు. విబోధప్రతీతి కలుగగా ఆ విబోధమందు అనౌచిత్యము గోచరించితే అనుచితవిబోధము కలిగినందువలన మేఘునియందు అసూయ విలంబముగా ప్రతీతము అవుతున్నది. ఆ అసూయ విబోధముయొక్క ముఖమును చూచిన తరువాత కాని ఉత్పన్నము కావడము లేదు. విలంబముగా ప్రతీతము అవుతున్నది. కాబట్టి మేఘవిషయాసూయకు ప్రధానత్వము లేదు. మేఘవిషయములో నిర్దయత్వము మొదలయిన వానిని బోధించేది ఏమాత్ర మయినా ఉన్నట్లయితే ఆ అసూయకు ప్రాధాన్యమువచ్చేది. కానిఅటువంటిది ఏమీలేదు. ఇట్లాగే ఈపద్యములో స్వప్నభావముకూడా వాక్యార్థము కాదు. మేఘనాదముచేత స్వప్న నాశమే గోచర మగుట దీనిలో హేతువు. మేఘుని బోధించడానికి పద్యములో వారివాహశబ్దము ప్రయోగింపబడినది. నీళ్ళు మోయు వాడు అనే అర్థము రావచ్చును. ఇటువంటి నికృష్టశబ్ద ప్రయోగము వలన అసూయ ధ్వనిత మవుతున్నది. స్వప్నభావశాంతికూడా ధ్వనిత మవుతున్నది అనేటట్లయితే దీనిలో విబోధభావానికి స్వప్నభావ శాంతితో, అసూయతోకూడా సాంకర్యము ఉన్నదని ఊహించవచ్చును.

ఈ పద్యమును విబోధమునకు ఉదహారించరాదు.

> గాఢ మాలింగ్య సకలాం యామినీం సహ తస్థుషీమ్
> నిద్రాం విహాయ స ప్రాత రాలిలింగాఢ చేతనామ్.

గాఢముగా ఆలింగనము చేసుకొని రాత్రి అంతా ఉన్న నిద్రను విడిచి అతడు ప్రాతఃకాలములో చేతనను ఆలింగనము చేసికొన్నాడు.

దీనిలో విబోధము, చేతనాపదముచేత వాచ్య మైనది. సత్యప్రతిజ్ఞ కలిగిన ఒకడు ఇద్దరు నాయికలకు రెండుకాలములను ఉపభోగానికై ఇచ్చి తగిన కాలములో ఒకనాయికను ఉపభోగించి మరిఒకకాలము రాగా ఆమెను విడిచి వేరొకనాయికను అనుభవించుతాడు. అట్లాగే ఈతడు రాత్రి నిద్రను, ప్రాతఃకాలములో చేతనను అనుభవించుతున్నాడు అని సమాసోక్త్యలంకారమే దీనిలో ప్రకాశిత మవుతున్నది.

## ౧౯. అమర్షము

పరకృతావజ్ఞాదినానాపరాధజన్యో మౌనవాక్పారుష్యాదికారణీభూత
చిత్తవృత్తివిశేషోఽమర్షః

ఇతరులు చేసిన తిరస్కారము మొదలయిన నానాపరాధముల వలన కలుగునట్టి మౌనము వాక్పారుష్యము మొదలయిన వానిని కలుగజేయునట్టి చిత్తవృత్తివిశేషము అమర్షము అనబడుతుంది. విబోధములో చెప్పినట్లుగా పరకృతావజ్ఞాదికారణములు విభావములు; మౌనాది కార్యములు అనుభావము లని గ్రహించాలి. ఉదా:

వక్షోజాగ్రం పాణినాఽఽమృశ్య దూరే
యాతస్య ద్రాగాననాబ్జం ప్రియస్య
శోణాగ్రాభ్యాం భామినీ లోచనాభ్యాం
జోషం జోషం జోష మేవావతస్థే.

కుచాగ్రమును చేతితో పట్టుకొని తొందరగా దూరము వెళ్లిన ప్రియుని ముఖపద్మమును ఎర్రని అగ్రభాగాలు కలిగిన లోచనాలతో భామిని కొర కొర చూస్తూ ఉన్నది.

దీనిలో అకస్మాత్తుగా స్తనాగ్రములను స్పృశించుట విభావము; నేత్రాల ఎరుపుదనము, రెప్పపాటులేకుండా చూచుట అనుభావములు.

స్థాయిభావ మయినక్రోధానికి సంచారిభావ మయిన అమర్షకూ విషయములు భిన్నభిన్నములుగా ఉండడమే భేదము. వానివాని కార్యముల విలక్షణత్వములను బట్టి విషయములు భిన్నములుగా ఉన్నవి. ఉత్క-

టావస్థను పొందిన భావము క్రోధము; కోమలావస్థను పొందినభావము అమర్ష అని తాత్పర్యము. క్రోధమువలన శీఘ్రముగా ప్రతిపక్షిని నాశముచేయుట మొదలయిన వానిలో ప్రవృత్తి కలుగుతుంది. అమర్ష వలన మాట్లాడకుండా ఉండుట మొదలయినవి కలుగుతవి. ఇది కార్య వైలక్షణ్యము.

## ౨౦ అవహిత్థ

వ్రీడాదిభి ర్నిమిత్తైః హర్షాద్యనుభావానాం గోపనాయ జనితో భావ విశేషోఽ వహిత్థమ్.

వ్రీడాదులు నిమిత్తములుగా హర్షాదిభావములను కప్పిపుచ్చడానికి ఉత్ప న్నమైన భావవిశేషము అవహిత్థ అనబడుతుంది. ప్రాచీనులు ఈ విధ ముగా చెప్పుతున్నారు.

అనుభావపిధానార్థోఽ వహిత్థం భావ ఉచ్యతే
తద్విభావ్యం భయవ్రీడాధార్ష్ట్యకౌటిల్యగౌరవైః

అనుభావములను పిధానముచేయడానికి ఉత్పన్నమయిన భావానికి అవ హిత్థము అని పేరు. భయము, లజ్జ, ధృష్టత, కుటిలత, గౌరవములు దీని విభావములు. ఉదా:

ప్రసంగే గోపానాం గురుషు మహిమానం యదుపతే
రుపాకర్ణ్య స్విద్యత్పులకితకపోలా కులవధూః
విషజ్వాలాజ్వాలం ఝుడితి వమతః పన్నగపతేః
ఫణాయాం సాశ్చర్యం కథయతితరాం తాండవవిధిమ్

గోపజనుల ప్రసంగము వచ్చినప్పుడు గురువులందు శ్రీకృష్ణునకు కల మహిమను విని కులవధువు, స్వేదము, పులకము, కల కపోలముతో హఠాత్తుగా విషజ్వాలాసమూహమును కక్కుతున్న ఫణీశుని ఫణాలపై తాండవవిధానమును సాశ్చర్యముగా చెప్పుతున్నది.

తనకు కలిగిన స్వేదరోమాంచములు కృష్ణప్రేమవలన కలుగ లేదు. ఆతని పరాక్రమ వర్ణనవలన కలిగిన వని తాను సూచించుతున్నది.

దీనిలో లజ్జ విభావము. భయంకరమైన కాళీయకథా ప్రసంగము అనుభావము. ఈ విధముగానే భయాదులద్వారా కలిగే అవహిత్థ భావానికికూడా ఉదాహరణమును గ్రహించాలి.

## ౨౧ ఉగ్రత

అధిక్షేపాపమానాదిప్రభవః కి మస్య కరోమి త్యాద్యాకారా
చిత్తవృత్తి రుగ్రతా.

తిరస్కారము అపమానము మొదలయిన వానివలన కలుగునట్టిన్ని 'నేను దీనికి బదులు ఏమిచేయవలయును' అనే చిత్తవృత్తి ఉగ్రత అన బడుతుంది.

ప్రాచీనులు ఈ విధముగా చెప్పుతున్నారు:

నృపాపరాధోఽసద్దోషకీర్తనం చోరధారణమ్
విభావా స్య రధోబంధో వధ స్తాడనభర్త్సనే
ఏతే య త్రానుభావా స్త దౌగ్ర్యం నిర్దయతాత్మకమ్

రాజాపరాధము లేనిదోషములను వర్ణించుట దొంగవస్తువును ధరించుట విభావములు. బంధించుట వధించుట కొట్టుట భయపెట్టుట దేని యందు అనుభావములుగా ఉంటవో అది ఉగ్రత అవుతుంది. ఇది నిర్ద యతారూపము. ఉదా:

అవాప్య భంగం ఖలు సంగరాంగణే, నితాంత మంగాధిపతే రమంగలమ్
పరప్రభావం మమ గాండివం ధను,ర్వినిందత స్తే హృదయం న కంపతే

యుద్ధాంగణములో అంగదేశాధిపతి అయిన కర్ణునివలన అమంగళమైన భంగమును బాగా పొంది నిరతిశయ ప్రభావమును పొందిన నా గాండీవ ధనువును నిందించుతున్న నీ హృదయము కంపించుట లేదా?

ఇది కర్ణునిచే పరాజితుడయి గాండీవమును నిందించుతున్న యుధిష్ఠి రుని గురించి అర్జునుని వచనము. యుధిష్ఠిరుడు చేసిన గాండీవనింద దీనిలో విభావము. ఆతన్ని చంపవలెననే కోరిక అనుభావము. అమర్ష ఉగ్రత్వములకు భేదము లేదని అనరాదు. పూర్వము ఉదాహరించిన అమర్షధ్వనిలో ఉగ్రత ఏమాత్రమూ గోచరము కావడము లేదు.

రెండు ఉదాహరణములనూ ఒకచోట చూస్తే విశేషము తెలుస్తుంది. ఇది క్రోధముకూడా కాదు. క్రోధము స్థాయిభావము. ఇది సంచారి భావము. ఈ భేదము స్పష్టమే.

## ౨౨ ఉన్మాదము

విప్రలంభమహాపత్తిపరమానందాదిజన్మా అన్యస్మిన్నన్యావభాస ఉన్మాదః.

విప్రలంభము, గొప్పఆపద, పరమానందము మొదలయినవానివలన ఉత్పన్న మగునట్టి, ఒక వస్తువునందు వేరొక వస్త్వవభాసము ఉన్మాదము.

ముత్తెపుచిప్పయందు రజతజ్ఞానము కలుగుతున్నది. అది భ్రమ. దాని యందు ఈ లక్షణానికి అతివ్యాప్తి లేకుండా ఉండడానికి, "విప్రలంభ మహాపత్తి పరమానందాదిజన్మా" అని చెప్పబడినది. ఆ భ్రమ నేత్ర దోషము, అంధకారము మొదలయినవానివలన కలుగుతుంది. కాని విప్రలంభాదులవలన కలుగదు. ఉదా:

> అకరుణహృదయ! ప్రియతమ!, ముంచామి త్వా మితఃపరం నాహమ్
> ఇ త్యాలపతి కరాంబుజ మాదాయ, ఆళీజనస్య వికలాపా

కరుణారహిత హృదయా! ప్రియతమా! ఇటుపై నేను నిన్నువిడిచిపెట్టను, అని వికలురా లయిన ఆమె సఖీజనముయొక్క కరాంబుజమును పట్టు కొని పలుకుతున్నది.

ప్రవాసమునకు వెళ్లి తన ప్రియురాలి వృత్తాంతమును అడుగుతున్న నాయకుని గురించి ఒకానొక సందేశహారిణి అయిన దూతియొక్క వచనము. దీనిలో ప్రియవిరహము విభావము. అసంబద్ధోక్తి అనుభావము. ఉన్మాదమునకు వ్యాధిలో అంతర్భావము కలుగవచ్చును. అయినప్పటికీ ఇతరవ్యాధులకంటె దీనిలో వైచిత్ర్యవిశేషము ఉన్నదని స్ఫురింప చేయడానికై వేరుగా చెప్పబడినది.

## ౨౩ మరణము

రోగాదిజన్యా మూర్ఛారూపా మరణప్రాగవస్థా మరణమ్

రోగాదువలన ఉత్పన్న మయినట్టిన్నీ మరణమునకు పూర్వపుమూర్ఛా రూపమయిన అవస్థ మరణ మనబడును. అచ్చట ప్రాణవియోగరూప మయిన ముఖ్యమరణమును గ్రహించుట ఉచితము కాదు. భావము లన్నీ చిత్తవృత్తిరూపములు. వానిలో ఇటువంటి మరణానికి ఏమీ ప్రసంగము లేదు. హర్షాదిసర్వ వ్యభిచారిభావాలకుశరీరప్రాణసంయోగము కారణము. కార్యోత్పత్తికి పూర్వము ఉండునది మాత్రమే కారణము కాదు. కార్యోత్పత్తి సమయములోకూడా ఉండేదే కారణము అవుతుంది. ఈ అవస్థలో మరణభావము ముఖ్యమరణ రూపముగా నిరూపించబడడము లేదు. ఈభావోత్పత్తి సమయంలో శరీరప్రాణ సంయోగము కారణముగా ఉండాలి. అందువలన మరణము నకు పూర్వకాలములోని చిత్తవృత్తి ఇక్కడ మరణ మనే వ్యభిచారి భావముగా చెప్పబడుతున్నది. ఆ పూర్వావస్థలోనే శరీరప్రాణ సంయోగము ఉంటున్నది. ఉదా:

యితస్య గుణా ననుస్మరంతీ, శయనే సంప్రతి యా విలోకి తాసీత్
అధునా ఖలు హంత! సా కృశాంగీ, గిర మంగీకురుతే న భాషి తాపి

ఏయువతి ఇప్పటికీ ప్రియునిగుణాలను అనుస్మరణము చేస్తూ శయ్యపై చూడబడినదో హంత! ఆ కృశాంగి ఇప్పుడు పలుకరింపబడి కూడా వాక్కును అంగీకరించుట లేదుగదా.

దీనిలో ప్రియవిరహము విభావము, మాట్లాడకపోవుట అనుభావము. హంతఅనేపదము ఇక్కడ అత్యంతము ఉపకారకముగా ఉండడమువలన ఈ భావము వాక్యవ్యంగ్య మయినప్పటికీ పదవ్యంగ్య మవుతున్నది. ఇట్లా ఉండడముచేత "భావము పదవ్యంగ్య మయిన ట్లయి తే వైచిత్ర్యము అంతగా ఉండదు" అనేమాట పరాస్త మవుతున్నది. "దయితస్య గుణా ననుస్మరంతీ" అనుటచేత చరమావస్థలోకూడా ఆమె ప్రియుని గుణాలను మరచిపోలేదు అనే వస్తువు అభివ్యంగ్య మవుతున్నది. ఈవస్తువు చివ రకు అభివ్యంగ్యము అవునట్టి విప్రలంభశృంగారమునకు గాని, కరుణరస స్థాయిభావ మయిన శోకమునకు గాని పరిపోషక మవుతుంది. ఇక్కడ

ఈభావము తనకు వ్యంజక మయిన వాక్యానికి తరువాత ఉన్న, సందర్భములో కూడుకొన్న, వాక్యాంతరముచేత నాయికాదులకు పునర్జీవనవర్ణనము ఉన్న ట్లయితే విప్రలంభమును పోషించేది అవుతుంది. అట్లా కాకపోతే కరుణరసానికి పోషక మవుతుంది. ఈభావము సామాన్యంగా అమంగళప్రాయ మని కవీశ్వరులు దీనిని ప్రధానముగా వర్ణించడం లేదు.

## ౨౪ వి త ర్క ము

సందేహాద్యనంతరం జాయమాన ఊహో వితర్కః.

సందేహాదులయొక్క అనంతరమందు ఉత్పన్న మగునట్టి ఊహ వితర్కము అనబడును. ఇది నిశ్చయమునకు అనుకూలముగా ఉంటుంది. ఉదా:

> యది సా మిథిలేంద్రనందినీ, నితరా మేవ న విద్యతే భువి
> అథ మే కథ మస్తి జీవితం, న వినాలంబన మాశ్రితస్థితిః.

ఆజనకనందిని సర్వథా ఈపృథివిపై ఉండకపోయిన ట్లయితే నాజీవితము ఏవిధముగా ఉంటుంది? ఆలంబనము లేకుండా ఆశ్రయముయొక్కస్థితి ఉండదు గదా! జనకనందిని ఈ జీవానికి ఆధారము.

ఇది శ్రీరామచంద్రుని మనస్సులోనిమాట. పృథివిలో సీత ఉన్నదా? లేదా? అనే సందేహము ఇక్కడ విభావము. భ్రూవిక్షేపము శిరశ్చాలనము అంగుళీనర్తనము అనుభావములు. ఇవి ఆక్షిప్తము లవుతున్నవి. ఇది చింత కాదు. చింత నియతనిశ్చయమును కలుగ చేయ లేదు. ఇంకా ఈరెండు భావాలకూ విషయము భిన్నభిన్నముగా ఉన్నది. ఏమి జరుగుతుందో, ఎట్లా అవుతుందో అనేది చింతయొక్క ఆకారము. ఇది ఈవిధముగా కావడానికి బహుశః తగి ఉన్నది అనేది వితర్కముయొక్క ఆకారము. నాల్గవపాదములో చెప్పబడిన అర్థాంతరన్యాసాలంకారము కూడా వితర్కభావానికే అనుకూలము కాని చింతకు అనుకూలము కాదు.

## ౨౨ విషాదము

ఇష్టాసిద్ధిరాజగుర్వాద్యపరాధాదిజన్యోఽనుతాపో విషాదః.

ఇష్టము సిద్ధింపకపోవుట, రాజాపరాధము, గుర్వపరాధము మొదలయిన వానివలన ఉత్పన్న మగునట్టి అనుతాపము విషాద మనబడును.
ఉదా:

భాస్కరసూనా వస్తం,యాతే జాతే చ పాండవోత్కర్షే
దుర్యోధనస్యజీవితః కథ మివ నా ద్యాపి నిర్యాసి?

దుర్యోధనుడు తనలో అనుకుంటున్నాడు. సూర్యపుత్రుడైన కర్ణుడు అస్తంగతు డయినా పాండవులకు ఉత్కర్ష కలిగినా ఓదుర్యోధనుని జీవితమా, నీవు ఇప్పటికీ ఎట్లా పోకుండా ఉన్నావు? ఇంకా దుఃఖ విశేషము చూడవలసి ఉన్నదా?

దీనిలో తనఅపకర్షను పరుల ఉత్కర్షను చూచుట విభావము. "జీవితము పోవాలి" అని కోరుట దానిచే ఆక్షిప్త మయిన ముఖమును వంచుకొనుట మొదలయినవి అనుభావములు. "దుర్యోధనస్య" అనేది దీనిలో అర్థాంతరసంక్రమితావివక్షితవాచ్యధ్వని. అది విషాదధ్వనిని పరిపోషించు తున్నది. ఈ పద్యము త్రాసభావధ్వని అవుతుం దని శంకించరాదు.

మహావీరు డయిన దుర్యోధనునకు త్రాసలేశస్పర్శకూడా ఉండదు. ఇది చింతాధ్వనికూడా కాదు. "యుద్ధము చేసి చచ్చిపోతాను" అని దుర్యోధనునియొక్క మహానిశ్చయములో చింతకు అవకాశము లేదు. సర్వసైన్యవినాశము కలిగినప్పటికీ ఆపదలను ఆత లేశమాత్రమూ గణించ లేదు. కాబట్టే ఇది దైన్యధ్వనికూడా కాదు. ఇది వీరరసధ్వనికూడా కానేరదు. దుర్యోధనుడు తన వచనములో మరణమే తనకు రక్షక మంటున్నాడు. ఇతరులను తక్కువగా చూచుట ఉత్సాహమునకు ప్రాణము. అది ఆతనిలో కనపడడము లేదు. ఆ ఉత్సాహము లేనిదీ వీరరసము అనరాదు,

ఈ పద్యమును విషాదధ్వనికి ఉదాహరించరాదు.

> అయి, పవనరయాణాం నిర్దయానాం హయానాం
> శ్లథయ గతి మహం నో సంగరం ద్రష్టు మీహే
> శ్రుతివివర మమీ మే దారయంతి ప్రకుప్య
> ద్భుజగనిభభుజానాం బాహుజానాం నినాదాః

భయస్వభావము కలిగిన విరాటపుత్త్రు డయిన ఉత్తరుడు తనకు సారథిగా ఉన్న బృహన్నలావేషమును ధరించిన అర్జునునితో చెప్పుతున్నాడు. ఓయీ! వాయువేగము గలిగిన నిర్దయము లయిన ఈ అశ్వముల గమనాన్ని తగ్గించు. "నేను యుద్ధమును చూడాలి" అని అనుకోవడము లేదు. కోపించిన సర్పసమాన భుజాలు కల ఈక్షత్త్రియుల సింహనాద ములు నాకర్ణవివరములను బ్రద్దలు చేస్తున్నవి.

ఇందులో త్రాసమే ప్రతీయమాన మవుతున్నది. విషాదము ప్రతీయ మాన మగుటలేదు. లేశముగా ప్రతీత మయినా దానికి త్రాసములోనే ఆనుగుణ్యము చెప్పుట ఉచితముగా ఉంటుంది. అందువలన విషాదధ్వని వ్యపదేశానికి ఇది యోగ్యము కాదు.

## ౨౬ ఔత్సుక్యము

> అథ నై వాస్య లాభో మ మాస్త్వి తీచ్ఛా ఔత్సుక్యమ్

దీని లాభము నాకు ఇప్పుడే కలుగు గావుత అనే ఇచ్ఛ ఔత్సుక్య మన బడును. వాంఛితము ప్రాప్తము కాకపోవుట దీనిలో విభావము. త్వరా చింతాదులు అనుభావములు. ప్రాచీనులు

> "సంజాత మిష్టవిరహా దుద్దీప్తం ప్రియసంస్మృతేః
> నిద్రయా తంద్రయా గాత్రగౌరవేణ చ చింతయా
> అనుభావిత మాఖ్యాత మౌత్సుక్యం భావకోవిదైః."

"ఇష్టప్రాప్తి లేనందువలన పుట్టునది, ప్రియపదార్థ స్మరణమువలన ఉద్దీప్త మగునది నిద్ర, ఆలస్యము, శరీరము బరువగుట, చింత, అనునవి అను భావములుగా గలది ఔత్సుక్యము అని భావకోవిదులు పలుకు తున్నారు." అని చెప్పుతున్నారు. ఉదా:

నిపతద్బాష్పసంరోధ ముక్తచాంచల్యతారకమ్
కదా నయననీలాబ్జ మాలోకేయ మృగీదృశః !

పడిపోవుచున్న బాష్పములను అడ్డుపెట్టడముచేత చాంచల్యమును విడిచిపెట్టిన తారకలు కలిగినట్టి ఆ మృగనయనయొక్క నయననీలాబ్జమును ఎప్పుడు ఆలోకించుతానో కదా !

## ౨౭ ఆ వే గ ము

అనర్థాతిశయజనితా చిత్తస్య సంభ్రమాఖ్యా వృత్తి రావేగః

అధికమైన అనర్థము కారణముగా పుట్టినట్టి సంభ్రమము అనే పేరు గలిగిన చిత్తవృత్తి ఆవేగము అనబడును. ఉదా:

లీలయా విహితసింధుబంధనః, సో య మేతి రఘువంశనందనః
దర్పదుర్విలసితో దశాననః, కుత్ర యామి నికటే కులక్షయః.?

మందోదరి తనలో అనుకుంటున్నది. విలాసముగా సముద్రబంధనమును చేసిన ఈ రఘునందను డయిన శ్రీరాముడు వచ్చుచున్నాడు. రావణుడు దర్పదుర్విలాసి వంశనాశము దగ్గరలో ఉన్నది. ఎక్కడికి వెళ్లుదును?

దీనిలో ఆ రామచంద్రునిరాక విభావము. ఎక్కడికి వెళ్లెదను అనే వచనముచేత వ్యంగ్య మవుతూ ఉన్న స్థైర్యాభావము అనుభావము. "కుత్ర యామి" అనే మాటలవలన స్ఫుటముగా ప్రతీయమాన మవుతున్న స్థైర్యాభావముచేత ఉద్వేగము ప్రతీత మవుతున్నట్లు చింత ప్రతీత మగుట లేదు. అందువలన దీనిలో ప్రధానముగా చింత ప్రతీయమాన మవుతున్నదని అనుట శక్యముకాదు. ఆవేగమును ఆస్వాదించేటప్పుడు దానికి పరిపోషకముగా అప్రధానమై చింతకూడా అనుభవములో విషయ మవుతుంది.

## ౨౮ జ డ త

చింతోత్కంఠాభయ విరహేష్టానిష్టదర్శనశ్రవణాదిజన్యా వశ్యకర్తవ్యార్థప్రతిసంధానవికలా చిత్తవృత్తి ర్జడతా

చింత, ఉత్కంఠ, భయము, విరహము, ఇష్టానిష్ట వస్తువులయొక్క దర్శన శ్రవణాదులవలన ఉత్పన్నమగునట్టిన్నీ, అవశ్యముగా చేయదగిన యోగ్యకార్యములయొక్క అనుసంధానముతో రహితమైన చిత్తవృత్తి జడత అనబడును. ఇది మోహానికి పూర్వమందున్నూ పరమందున్నూ కలుగుతూ ఉంటుంది. ప్రాచీనులు ఈ విధముగా చెప్పుతున్నారు:

> కార్యావివేకో జడతా పశ్యతః శృణ్వతోపి వా
> తద్విభావాః ప్రియానిష్టదర్శనశ్రవణే రుజా
> అనుభావా స్త్వమీ తూష్ణింభావవిస్మరణాదయః.
> పూర్వం పరతో వా స్యా న్మోహా దితి విదాం మతమ్.

చూస్తూ, ఉన్నా వింటూ ఉన్నా కర్తవ్యవివేకము లేకపోవుట జడత అనబడును. ఇష్టానిష్టములయొక్క దర్శనశ్రవణములు రోగమూ విభావములు. ఊరకనే ఉండుట మరచిపోవుట అనుభావములు. మోహముకంటె ఇది పూర్వమందు గాని పరమందుగాని కలుగుతుం దని విద్వాంసులమతము. ఉదా:

> యదవధి దయితో విలోచనాభ్యాం
> సహచరి! దైవవశేన దూరతోఽభూత్
> తదవధి శిథిలీకృతో మదీయైః
> అథ కరణైః ప్రణయో నిజక్రియాసు.

నాయిక చెలికత్తెతో చెప్పుతున్నది. సఖీ! దైవవశాన ఎప్పటినుండి ప్రియుడు నేత్రాలకు దూర మయిపోయినాడో అప్పటినుండి నాయింద్రియములచేత నిజక్రియలలో ప్రేమ శిథిలీకృత మయింది.

ప్రియవిరహము దీనిలో విభావము. నేత్రము శ్రోత్రము మొదలయిన ఇంద్రియములచేత తమ తమజ్ఞానములలో పరిచయము శిథిలము చేయుట, అనగా చక్షురాదులచేత ఏవిధముగా రూపాదులు గ్రహింపబడవలెనో అట్లు గ్రహింపబడకపోవుట అనుభావము. మోహములో నేత్రాదులు దర్శనాదికార్యములను చేయవు. ఈజడత్వములో అట్లా కాదు. దీనిలో వస్తుదర్శనాదులు ఉంటవి, కాని అవి విశేషరూపముగా

పరిచితములు కావు. ఏమాత్రమూ తెలిసికొనక పోవుట మోహము. "ఇది ఈవిధముగా ఉన్నది" అని విశేషరూపముగా తెలుసుకొనక పోవుట జడత. అందువల్లనే ఉదాహరణములో "శిథిలీకృతః" అని చెప్పబడినది, కాని "త్యక్తః" అని చెప్పబడలేదు.

## ౨౫ ఆలస్యము

**అతితృప్తి గర్భ వ్యాధి శ్రమాదిజన్మా చేతసః క్రియానున్ముఖతా ఆలస్యమ్.**

అతితృప్తి, గర్భధారణము, రోగము, పరిశ్రమ మొదలయినవానివలన కలుగునటువంటి మనస్సుయొక్క కార్యవైముఖ్యము ఆలస్యము అనబడును. దీనిలో అశక్తి ఉండదు. కర్తవ్యాకర్తవ్యములవివేకము లేక పోవుటకూడా ఉండదు. క్రియలను చేయకపోవుట అనే అనుభావము సమానమైనప్పటికీ గ్లానిజడతలకంటె దీనికి గల ఈభేదమును ఊహించాలి. ఉదా:

> నిఖిలాం రజనీం ప్రియేణ దూరా, దుపయాతేన విబోధితా కథాభిః
> అధికం న హి పారయామి వక్తుం,సఖి! మా జల్ప త వాయసీ రసజ్ఞా.

దూరమునుండి వచ్చినప్రియునిచేత రాత్రి అంతా కథలతో మేలుకొని ఉండేటట్లు చేయబడిననేను అధికముగా పలుకుటకు సమర్థురాలను కాను. సఖీ!మాట్లాడకు. నీనాలుక ఇనుపపట్టె! ప్రియుడు వచ్చినరెండవదినమున మాటిమాటికీ రాత్రికథను అడుగుతున్నచెలికత్తెను గురించి రాత్రి అంతా మేలుకొనడముచేత అలసురాలయిన ఒకానొక నాయిక యొక్క వచనము.

రజనిజాగరణము విభావము. ఎక్కువగా మాట్లాడలేక పోవుట అనుభావము. జడత మోహానికి పూర్వము ఉండుటగాని తరువాత ఉండుట గాని నియతంగా ఉంటుంది. దీనిలో ఆవిధముగా ఉండదు. ఇదీ ఇందులో విశేషము.

ఈవిషయమును ఇక్కడ గ్రహించాలి. దీనిలో కథాశబ్దము ప్రయోగింపబడినది. అసలు విషయమును కప్పిపుచ్చడానికి ఆపద ప్రయోగము ఉన్నది. అందువలననే అది అవివక్షిత వాచ్యము. కథాశబ్దానికి అసలు

అర్థము సురతము. నాయిక రాత్రి అంతా ఆవిధానమువలన అత్యంతమూ శ్రమయుక్తురా లయినది అని వ్యంగ్యము. దీనిలో శ్రమ భావము అభివ్యక్త మయినప్పటికీ, అది ఆలస్యమునకే పరిపోషకముగా ఉన్నది. ఆలస్యము శ్రమవలన ఉత్పన్నము అవుతుంది గదా ! కాబట్టి శ్రమ పరిపోషకము అగుట అనివార్యమే. అత్యంతతృప్తివలన కలిగిన ఆలస్యములో శ్రమకన్న వివిక్తవిషయత్వము ఉన్నదని గ్రహించాలి.

## ౩౦ అ సూ య

పరోత్కర్ష దర్శనాదిజన్యః పరనిందాదికారణీభూత శ్చిత్తవృత్తి విశేషోఽసూయా.

ఇతరుల ఉత్కర్షను చూచుట మొదలయిన వానివలన ఉత్పన్న మయినట్టిన్నీ, పరనిందాదులలో కారణ మయిన చిత్తవృత్తి విశేషము అసూయ అనబడును. దీనినే అసహనము అసహిష్ణుత మొదలయిన శబ్దాలతో వ్యవహరించుతున్నారు. ఉదా:

> కుత్ర శైవం ధను రిదం? క్వచాయం ప్రాకృతః శిశుః?
> భంగస్తు సర్వసంహర్త్రా కాలే నైవ వినిర్మితః.

శివధనువును విరిచిన భగవాను డగు రాముని పరాక్రమమును సహింపనట్టి అక్కడ ఉన్న రాజుల వచనము. ఈశివధనువు ఎక్కడ ? ఈ సాధారణబాలకు డెక్కడ ? సర్వసంహారక మైన కాలముచేతనే భంగము చేయబడినది.

దీనిలో శ్రీమద్దాశరథి బలముయొక్క సర్వోత్కృష్టత్వము చూచుట విభావము. ప్రాకృతశిశుపదముచేత గమ్య మైననింద అనుభావము.

> తృష్ణాలోలవిలోచనే కలయతి ప్రాచీం చకోరవ్రజే
> మౌనం ముంచతి కించ కైరవకులే కామే ధను ర్ధున్వతి
> మానే మానవతీజనస్య సపది ప్రస్థాతుకామేఽధునా
> ధాతః! కిన్ను విధౌ విధాతు ముచితో ధారాధరాడంబరః.

చకోరసమూహము ఆశాచంచలనేత్రాలు కలిగి ప్రాచీదిశను అనుస
రించుతూ ఉండగా, ఇంకా కుముదకులము మౌనమును విడిచిపెట్టుతూ
ఉండగా, మన్మథుడు ధనువును విదల్చుతూ ఉండగా, ఇప్పుడు మాన
వతుల మానము వెళ్ళదలచి ఉండగా, ఓబ్రహ్మా! చంద్రునిపై మేఘాడంబ
రము చేయుట ఉచితమా ?

ఈ పద్యములో విచారించగా బ్రహ్మయొక్క ఉచ్ఛృంఖలత్వము మొద
లయినవానిని చూచినందువలన పుట్టినట్టిన్నీ, అనుచితకారితారూప
మయిన నిందను ప్రకాశితము చేయుట అనుభావముగా కలిగినట్టిన్నీ
విధాత ఆలంబనముగా కవిగత మైన అసూయ వ్యంగ్యమవుతున్న దని
చెప్పుట కవకాశ మున్నది.

అయినప్పటికీ అసూయకు ఏ కార్యకారణములు వర్ణింపబడినవో అవే
అమర్షకుకూడా కార్యకారణములు కావచ్చు. కాబట్టి కార్యకారణముల
సమానత్వమువలన అభివ్యంగ్యముఅవుతూఉన్న అమర్షతో ఈఅసూయ
శబలిత మవుతున్నది. అంతేకాని వివిక్తముగా ప్రతీయమాన మగుట
లేదు. ఈపద్యములోవలె పూర్వము చెప్పిన "కుత్రశైవం ధను రిదం"
అనే పద్యములో అమర్షతో అసూయకు మిశ్రణము ఉన్న దని అన
నక్కరలేదు. రెండవపద్యములో విధాతయొక్క అపరాధము స్పష్టముగా
ప్రతీయమానము అగునట్లు భగవానుడయిన శ్రీరాముని అపరాధము
ఏమీ లేదు. ఆవిధముగా ఉన్నట్లయితే రెండవపద్యములో కవి
యొక్క అమర్ష అభివ్యక్త మైనట్లు మొదటిపద్యములో వీరపురుషుల
అమర్షకూడా గోచర మయ్యేది. ధనుర్భంగము చేసి రాజుల అభి
మానమర్దనము చేయుట రామచంద్రునిఅపరాధము కాదు. మహో
న్నతక్రియలు చేయుట వీరులస్వభావము.

రెండవపద్యములో చంద్రవృత్తాంతము ప్రాసంగికము కాదు. అది
అప్రస్తుతము. అప్రస్తుత మయిన ఆ చంద్రవృత్తాంతముచేత ప్రసంగ
ప్రాప్త మయిన రాజకుమారాదివృత్తాంతము గోచర మవుతున్నది.
అయినప్పటికీ ఈపద్యములో అసూయ ధ్వనించుతున్న దని తలచ
డానికి ఏమీ ఆటంకము లేదు. ఒకధ్వనికి వేరొకధ్వనితో విరోధములేదు.

ఒకేపద్యములో రెండుఅర్థములు గోచరములు కావచ్చును. అట్లాగే ప్రకృతములో రాజకుమారాది వృత్తాంతము గోచరము కావచ్చును. అసూయకూడా ధ్వనించవచ్చును. ఈ విధముగా అంగీకరించకపోతే మహావాక్యధ్వనికి అవాంతరవాక్యధ్వనులతో, అవాంతర వాక్యధ్వనులకు పదధ్వనులతో ఎక్కడా సామానాధికరణ్యము ఉండకపోవలసి వస్తుంది.

### ౩౧ అ ప స్మా ర ము

వియోగశోకభయజుగుప్సాదీనా మతిశయాత్ గ్రహావేశాదే శ్చోత్ప న్నో వ్యాధివిశేషోఽపస్మారః.

వియోగము, శోకము, భయము, జుగుప్స, మొదలయినవానియొక్క అతిశయమువలన భూతప్రేతాదుల ఆవేశమువలన ఉత్పన్న మయిన వ్యాధివిశేషము అపస్మారము అనబడును. దీనిని వ్యాధిగా చెప్ప వచ్చును. అయినప్పటికీ బీభత్స, భయానక రసాలలో ఈవ్యాధికి అంగత్వము ఉండాలి. కాని ఇతరవ్యాధులకు అంగత్వము ఉండరాదు అని స్ఫురింపచేయడానికై విశేషాకారముతో గ్రహింపబడుతున్నది. విప్రలంభశృంగారములో అయితే ఈవ్యాధి అంగము కావచ్చు, ఇతర వ్యాధికూడా అంగము కావచ్చును. ఉదా:

హరి మాగత మాకర్ణ్య మధురా మంతకాంతకమ్
కంపమానః శ్వసన్ కంసో నిపపాత మహీతలే.

అంతకాంతకు డయిన శ్రీకృష్ణుని మధురాపట్టణము వచ్చినవానిగా విని కంసుడు కంపించుతూ శ్వసించుతూ మహీతలమున పడినాడు.

దీనిలో భయము విభావము. కంపనిశ్వాసపతనాదులు అనుభావములు.

### ౩౨ చ ప ల త

అమర్షాదిజన్యవాక్పారుష్యాదికారణీభూతా చిత్తవృత్తి శ్చపలతా.

అమర్షాదులవలన ఉత్పన్న మగునట్టిన్నీ వాక్పారుష్యాదులకు కారణ మయినట్టిన్నీ చిత్తవృత్తివిశేషము చపలత అనబడును. ప్రాచీనులు ఈవిధముగా చెప్పుతున్నారు.

> అమర్ష ప్రాతికూల్యేర్ష్యా-రాగద్వేషాశ్చ మత్సరః
> ఇతి యత్ర విభావా స్యు రనుభావస్తు భర్త్సనమ్
> వాక్పారుష్యం ప్రహారశ్చ తాడనం వధబంధనే
> తచ్చాపల మనాలోచ్య కార్యకారిత్వ మిష్యతే.

అమర్షము, ప్రతికూలత, ఈర్ష్య, ప్రేమ, ద్వేషము, అసహిష్ణుత ఎక్కడ విభావములుగా ఉంటవో, భయపెట్టుట వాక్పారుష్యము ప్రహరించుట తాడనము చంపుట బంధనమూ అనుభావములుగా ఉంటవో అది చాపలము. దీనిలో ఆలోచించకుండా కార్యములు చేయుట ఉంటుంది. ఉదా:

> అహితవ్రత! పాపాత్మ! న్మైవం మే దర్శ యాననమ్
> ఆత్మానం హంతు మిచ్ఛామి యేన త్వ మసి భావితః.

అనిష్టములను కలుగజేయు నియమములను పాలించువాడా! పాపాత్మా! నీముఖమును నాకు చూపించవద్దు. నీవు పుట్టినందున నన్ను నేను చంపుకోవా లనుకుంటున్నాను.

ప్రహ్లాదునకు భగవంతునిపై ఉన్న అనురాగమును, పోగొట్టడానికి ఉపాయములను కనిపెట్టలేక ప్రహ్లాదుని గురించి హిరణ్యకశిపుని వచనము. దీనిలో భగవద్ద్వేషమువలన బయలుదేరిన పుత్రద్వేషము విభావము. తనను చంపుకోవా లనుకునే పరుషవచనము అనుభావము. ఈపద్యములో అమర్ష వ్యంగ్య మవుతున్నదని తలచరాదు. ప్రహ్లాదుడు నిత్యమూకూడా భగవదనురాగము కలవాడు. అతనిపై హిరణ్యకశిపునకు చిరకాలమునుండి అమర్ష అభివృద్ధి పొంది ఉన్నది. అందువలన తనను చంపుకోవాలి అనే ఇచ్ఛ ఇదే మొదలు అని అనుకోవడానికి వీలులేదు. ఆకారణమువలననే ఆ ఇచ్ఛ కలిగినట్లయితే ఇన్ని సంవత్సరముల దాకా ఎందుకు కలుగకపోవాలి? అది మొట్టమొదటనే ఉత్పన్నమయినట్లయితే ఆకారణముకూడా మొట్టమొదట్లోనే ఉండాలి. ఇదే మొదటికార్య మయినప్పుడు కారణముకూడా అదే మొదటిదిగా ఉండాలి. మొదటి ఈర్ష్యకంటె చపలత అనే చిత్తవృత్తి ఇక్కడ

కలుగుతూనే ఉన్నది. అమర్ష యొక్క ఆధిక్యమే ఆత్మవధేచ్ఛలో కారణముగా అభివ్యక్తిని పొందవచ్చును. అనికూడా అనరాదు. అమర్షలోని ప్రకర్షకు కూడా స్వాభావికముకంటె విలక్షణత్వము ఒకటి ఉండవలెను. స్వాభావిక రూపముకంటె అధికతారూపములో భేదము ఉండాలి. ఆవిలక్షణత్వము కలదియే చపలత్వము అనబడుతుంది. అందువలన ప్రకర్ష అనేది వేరుగా గోచర మవుతుం దని అనుకో నక్కర లేదు.

## ౩౩ ని ర్వే ద ము

నీచపురుషే ష్వాక్రోశనాధిక్షేపవ్యాధితాడన దారిద్ర్యేష్ట విరహ పరసంపద్దర్శనాదిభిః, ఉత్తమేషు త్వవజ్ఞాదిభి ర్జనితా విషయద్వేషాఖ్యా రోదన దీర్ఘశ్వాస దీనముఖతాదికారిణీ చిత్తవృత్తి ర్నిర్వేదః.

నీచపురుషులందు ఆక్రోశనము తిరస్కారము వ్యాధి తాడనము దారిద్ర్యము కోరినది కలుగకపోవుట ఇతరసంపదలను చూచుటవలన కలుగు విషయద్వేష మనేపేరు కలిగిన చిత్తవృత్తి నిర్వేదము. ఉత్తమ పురుషులలో తిరస్కారము మొదలయినవానివలన ఉత్పన్న మగునట్టిన్ని విషయద్వేష మనేపేరు కలిగినట్టిన్ని చిత్తవృత్తి నిర్వేదము. రోదనము దీర్ఘశ్వాసము దీనముఖత్వము మొదలయినవానిని ఇది కలుగజేస్తుంది.
ఉదా :

> యది లక్ష్మణః సా మృగేక్షణా, న మదీక్షాసరణిం సమేష్యతి
> అమునా జడజీవితేన మే, జగతా వా విఫలేన కిం ఫలమ్?

లక్ష్మణా! ఆమృగేక్షణ అయినసీత నా ఈక్షామార్గమును పొందకపోయినట్లయితే ఈ జడజీవితముచేత కాని, విఫలమైన ఈ జగత్తుచేత కాని నాకు ఏమి ఫల మున్నది?

నిర్వేదము శాంతరసమునకు స్థాయిభావము. దీనిలో నిర్వేదము ఉన్నప్పటికీ శాంతరసధ్వని కాదు. స్థాయిభావ మైన నిర్వేదము నిత్యానిత్య వస్తువివేకమువలన కలుగుతుంది. ఇది ఆవిధముగా లేదు. అందువలన శాంతరస మని వ్యపదేశించరాదు.

దేవాదివిషయమైన రతికి ఉదా :

> భవద్ద్వారి క్రుధ్యజ్జయవిజయదండాహతిదల
> త్కిరీటా స్తే కీటా ఇవ విధిమహేంద్రప్రభృతయః
> వితిష్ఠంతే యుష్మన్నయనపరిపాతోత్కలికయా
> వరాకాః కే తత్ర క్షపితమురః నాకాధిపతయః,

ఇది భగవానుని గురించిన భక్తునివచనము. ఓమురారీ! నీభవనద్వార మందు కోపించిన జయవిజయులయొక్క దండపుదెబ్బలచేత పగిలి పోతూఉన్న కిరీటములు కలిగిన బ్రహ్మేంద్రాదులు కీటములవలె దీను లయి, నీనయనప్రసారసముత్కంఠతో నిలబడి ఉన్నారు. అక్కడ కృపణు లయిన నాకాధిపతులు ఎవరో? యమకుబేరాదులకు గణ నమే లేదు.

దీనిలో అపమానమును సహించుతూ భగవానునిద్వారమును సేవిం చుతూ భగవత్కటాక్షపాతమును అభిలషించుతూ ఉండుటచేత భగవ ద్విషయమైన బ్రహ్మాదిగత మగు రతిభావము గోచర మగుట లేదు. "భగవానుని ఐశ్వర్యము అవాఙ్మానసగోచరము" అని అభివ్యక్తము అవుతున్నది. అయినప్పటికీ దీనిలో భగవద్విషయక మయినకవిప్రేమకు ధ్వనిత్వము అక్షతము. ఆవిధముగా భగవదైశ్వర్యమును వర్ణించుట అనుభావము.

ఈపద్యములో ఐశ్వర్యవర్ణనమే ప్రధానముగా ఉన్నది, కవిరతి గౌణ ముగా ఉన్నది అనేటట్లయితే ఇది ఉదాహరణము కావచ్చును.

> న ధనం నచ రాజ్యసంపదం, నహి విద్యా మిద మేక మర్థయే
> మయి ధేహి మనా గపి ప్రభో! కరుణాభంగితరంగితాం దృశమ్.

ధనమును కోరను. రాజ్యసంపదను కాంక్షించను. విద్యను అభిలషించను. ఇది ఒక్కటే అర్థించుతాను. ఓప్రభూ! కరుణాభంగితరంగితమైన దృక్కును కొంచెమైనా నాపైన ఉంచు.

దీనిలో ధనాద్యపేక్ష లేనివానియొక్క భగవద్దృగంతపాతాభిలాష భగవానునిలో అనురక్తిని వ్యంగ్యము చేస్తున్నది.

ఈ విధముగా భావాలు సంక్షేపముగా నిరూపించబడినవి.

## భా వ ని య మ ము

ఈపరిగణించినభావాలకు సంఖ్యానియమము ఏవిధముగా కుదురుతుంది? అనేకకావ్యాలయందు అనేకస్థలాలలో మాత్సర్యము, ఉద్వేగము, దంభము, ఈర్ష్య, వివేకము, నిర్ణయము, క్లైబ్యము, క్షమ, కౌతూహలము, ఉత్కంఠ, వినయము, సంశయము, ధార్ష్ట్యము మొదలయినవి కూడా కనపడుతూనే ఉన్నవే అని శంక.

ఇది ఉచితము కాదు. వీనిపరిగణనము అవసరము కాదు. పూర్వము చెప్పినభావాలలోనే ఇవి అంతర్భవించుతవి. ఇంకా ప్రత్యేకముగా పరిగణింపవలసిన ఆవశ్యకత ఎందుకు ఉంటుంది? అసూయకన్న మాత్సర్యానికి, త్రాసముకన్న ఉద్వేగానికి, అవహిత్థకన్న దంభానికి, అమర్షకన్న ఈర్ష్యకు, మతికన్న వివేకనిర్ణయములకూ, దైన్యముకన్న క్లైబ్యానికీ, ధృతికన్న క్షమకూ, ఔత్సుక్యముకన్న కుతుకము ఉత్కంఠలకూ, లజ్జకన్న వినయానికీ, తర్కముకన్న సంశయానికీ, చాపలముకన్న ధార్ష్ట్యానికీ, వస్తుతః సూక్ష్మమైన భేద మున్నది. అయినప్పటికీ ఒకభావము రెండదానిని విడిచి ఉండదు. అసూయ ఉన్నచోట మాత్సర్యము ఉండకపోదు. ఈవిధముగానే ఇతరములను కూడా గ్రహించాలి. కాబట్టి వీనిని వేరువేరుగా పరిగణించ నక్కరలేదు. భరతముని వచనానుపాలనమునందు కుదురుబాటు అయినంతవరకూ ఉచ్ఛృంఖలత ఉచితము కాదు.

ఈచెప్పబడిన సంచారిభావాలలో కొన్ని కొన్నిటికి విభావములు అవుతవి, అనుభావాలుకూడా అవుతవి. ఈర్ష్య నిర్వేదములో విభావము అవుతుంది, అసూయలో అనుభావమూ అవుతుంది. చింత నిద్రకు విభావము అవుతుంది, ఔత్సుక్యానికి అనుభావము అవుతుంది. ఇటువంటి విశేషాలను స్వయముగా అభ్యూహించాలి.

## ౧౨ ఆ భా స

### ర సా భా స

**అనుచితవిభావాలంబనత్వం రసాభాసత్వమ్.**

అనుచితవిభావమును అవలంబనముగా అభిమానించి రత్యాదులను ఆస్వాదము చేయుట రసాభాస అవుతుంది. ఏవిభావము ఉచితము అవుతుందో, ఏది అనుచిత మవుతుందో లోకవ్యవహారమును అనుసరించి తెలుసుకోవాలి. ఏ విషయములో లోకులకు 'ఇది అయోగ్యము, ఇది అనుచితము' అని బుద్ధి పుడుతుందో అది అనుచిత మని గ్రహించాలన్న మాట.

కొందరు విద్వాంసులు ఈవిషయమును విని క్షమించరు. ఈపైనచెప్పిన లక్షణముద్వారా మునిపత్న్యాదులవిషయకము లయిన రత్యాదులను సంగ్రహించవచ్చును. మానవులు మునిపత్నులను ప్రేమపాత్రములనుగా తలచుట సముచితముగా ఉండదుకదా! అట్లా అది సంగృహీత మైనా, అనేకనాయకుల విషయ మైనరతి, నాయికానాయకులలో కేవలము ఒకరియందే ఉండేరతి, సంగ్రహింపబడడము లేదు. అక్కడ విభావ గతముగా అనౌచిత్యము ఏమీ లేదు. ప్రేమమాత్రమే అనుచితరూపముగా ప్రవృత్త మవుతున్నది. కాబట్టి అనుచితవిశేషణాన్ని రత్యాదులతో సంబంధింపచేయుట బాగా ఉంటుంది. ఏస్థలములో అనుచితరూపముగా రత్యాదికము ప్రవృత్త మవుతుందో అక్కడ రసాభాస ఉంటుంది అని పరిష్కరించడము ఉచితము. అప్పుడు ఉచిత విభావమును ఆలంబనమునుగా చేసుకొన్న రతి, బహునాయక విషయరతి, నాయికానాయకులలో ఉభయనిష్ఠము కాని రతీ గ్రహించబడుతవి. అనౌచిత్యమనేది పూర్వము మాదిరిగా లోకవ్యవహారమువలన గ్రహించాలి.

## రసాభాస రసమా? కాదా?

రసాభాస విషయములో వేరొక విషయాన్ని భావించాలి. ఎక్కడ రసాదులకు ఆభాస ఉంటుందో అక్కడ రసాదులు ఉండవు. రసాదులు ఉన్నచోట రసాదుల ఆభాస ఉండదు. ఆ రెండూకూడా కలిసి ఉండుట నియమవిరుద్ధము. నిర్మలముగా ఉండి అనుచితము కాకుండా ఉండేదే రస మవుతుంది. హేత్వాభాస అయ్యేది ఎన్నడూ హేతువు కాదు. అట్లాగే రసాభాస అయ్యేది రసము కాదు అని కొందరంటున్నారు.

అనుచిత మైనంత మాత్రాన స్వరూపనాశము లేదు. అది రసమూ కావచ్చు. దోషయుక్త మైనందువలన ఆభాసముకూడా కావచ్చు. అశ్వమును చూచి అశ్వాభాస మని వ్యవహరించుతాము. అది అశ్వము కాకపోవడము లేదుగా. దోషయుక్తము అగుటవలన 'అశ్వాభాసము' అంటున్నాము. అట్లాగే ప్రకృతములో అని మరికొంద రంటున్నారు. ఉదా:

> శతే నోపాయానాం కథ మపి గతః సౌధశిఖరం
> సుధాఫేనస్వచ్ఛే రహసి శయితాం పుష్పశయనే
> విబోధ్య క్షామాంగీం చకితనయనాం స్మేరవదనాం
> సనిశ్వాసం శ్లిష్య త్యహహ! సుకృతీ రాజరమణీమ్.

ఉపాయములశతముతో ఏదోవిధముగా సౌధశిఖరమును పొందిన వాడై అమృతఫేనస్వచ్ఛమైన పుష్పశయ్యలో ఏకాంతమున శయనించి ఉన్నకృశాంగిని మేల్కొలిపి చకితనయన స్మేరవదన అయిన ఆరాజరమణిని పుణ్యపురుషుడే సనిశ్వాసముగా కౌగిలించు కొంటాడు గదా! అహహః!

దీనిలో అనుచితప్రణయము కల రాజరమణి ఆలంబనవిభావము. ఏకాంతము రాత్రిసమయము మొదలయినవి ఉద్దీపనవిభావములు. సాహసముతో రాజాంతఃపురమునకు వెళ్లుట, ప్రాణములం దుపేక్ష, నిశ్వాసము ఆలింగనము మొదలయినవి అనుభావములు, శంకాదులు సంచారి భావములు. దీనిలో రత్యాలంబనము నిషిద్ధ మైనది కాబట్టి రసము ఆభాస అవుతున్నది. రాజాంగనను ప్రేమించుట లోకశాస్త్రద్వారా నిషిద్ధము. అందువలన ఆరసము ఆభాసరూపము అవుతున్నది అని భావము.

పైపద్యములో రసము ఆభాస అగుటను మరియొకవిధముగా ఊహించవచ్చును. రాజరమణి నిషిద్ధ అగుటవలన రసము ఆభాసరూపము అగుట కాదు. రాజరమణికి "చకితనయన" అని విశేణము ఉన్నది. దానివలన ఆమెకు పరపురుషస్పర్శవలన త్రాసము కల్గినది అని అభి

వ్యక్తము అవుతున్నది. కాబట్టి ఆనాయకునకే ఆమెయందు ప్రేమ ఉన్నది కాని ఆమెకు అతనియందు ప్రేమ లేదు అని స్పష్టము. కాగా ప్రేమ ఉభయనిష్ఠము కాలేదు. అదే హేతువుగా రసము ఆభాసము అవుతున్నది అని. ఇది సముచితము కాదు.

ఆరాజరమణి చాలాకాలమునుంచి అతనియందు అనురక్తురాలయి ఉన్నది. అంతఃపురములోనికి పరపురుషుడు ఎవడైనా వస్తాడని భావించడానికి ఏమాత్రమూ అవకాశము లేదు. అందువలన "ఎవరు నన్ను మేలుకొలుపుతున్నారు?" అని మొదట్లో త్రాసము కలుగుట ఉచితమే. అనంతరము పరిచయము స్పష్టమయినందువలన "ఓ! ఆనాప్రియుడు వచ్చాడు. నాకొరకు ప్రాణాలనుకూడ తృణీకరించి వచ్చినాడు," అనే అభిప్రాయము కలుగ్గగా, రాజరమణి స్మేరవదన అయింది. అప్పటి ఆచిరునగవు ఆమె హర్షమును అభివ్యంజనము చేస్తున్నది. ఆమె రతిని కూడా వ్యక్తము చేస్తున్నది. దీనిలోని వాక్యార్థమంతా నాయకవర్ణనపరముగా ఉన్నది. కాబట్టి నాయకనిష్ఠరతికే ఇక్కడ ప్రాధాన్యము ఉన్నది. కాగా ఆమె రత్యాలంబనము అగుట అనుచితము కాబట్టి రసము ఆభాసము అయింది అని గ్రహించాలి.

అనేకనాయకవిషయమైన ప్రేమ ఆభాసమగుటకు ఉదా:

> భవనం కరుణావతీ విశంతీ, గమనాజ్ఞాలవలాభలాలసేషు
> తరుణేషు విలోచనాబ్జమాలా మథ బాలా పథి పాతయాంబభూవ,

కరుణ కలిగిన ఆపిల్లది భవనము ప్రవేశించుతూ తరుణయువకులు తాము వెనుకకు తిరిగి వెళ్ళిపోవడానికి ఆమెయొక్క ఆజ్ఞాలవలాభలాలసులు కాగా దృగబ్జమాలను పథములో ప్రసరింపచేసింది.

ఏదో ప్రదేశమునుండి బాలిక వస్తున్నది. ఆమె రూపయౌవనహృతమానసులయిన యువకులు మార్గములో ఆమెను అనుగమించారు. ఇంటిదగ్గరకు వచ్చి ఆమె భవనము ప్రవేశించుతున్నది. ఇంతవరకూ ప్రేమతో అనుగమించి వచ్చిన యువకులు తమసేవాసార్థక్యమును తెలిసికొనడానికి ఆసక్తి పడుతున్నారు. "మీరంతా వెళ్ళవచ్చు" అని

ఆమె అజ్ఞాపించడమే మహాలాభముగా భావించుతూ వాళ్ళు లాలసులై ఉన్నారు. వారు వెంట అనుసరించి రావడము అనే పరిశ్రమను ఆమె స్మరించి దయ కలదై "మీరు వెళ్ళండి" అని గమనాజ్ఞాదానమును సూచించే విలోచనాంబుజమాలలపరిక్షేపము చేసింది. అది అనుభావము. దీనివలన వారియందు ఆపిల్లకు అనురాగము ఉన్నట్లు వ్యంగ్యము అవుతుంది. "తరుణేషు" అని బహువచనము ఉండడము వలన ఆ అనురాగము బహువిషయ మని విశద మవుతున్నది. కాబట్టి ఇది కూడా రసాభాస.

ఉభయనిష్ఠము కానిరతి ఆభాస మగుటకు ఉదా:

> భుజపంజరే గృహీతా, నవపరిణీతా వరేణ వధూః
> తత్కాలజాలపతితా, బాలకురంగీవ వేపతే నితరామ్

క్రొత్తగా పెండ్లిచేసుకొనబడిన వధువు ప్రియునిచేత బాహుపంజరములో గ్రహింపబడినదై ఆసమయములో వలలో పడిన బాలకురంగివలె మిక్కిలి కంపించుతున్నది.

దీనిలో నవవధువు ప్రేమస్పర్శ కొంచె మయినా లేదు. అందువలన రతి అనుభయనిష్ఠమై ఆభాసరూపము పొందుతున్నది. ఈవిషయములో ప్రాచీనులు:

> ఉపనాయకసంస్థాయాం మునిగురుపత్నీగతాయాం చ
> బహునాయకవిషయాయాం రతౌ తథాఽనుభయనిష్ఠాయామ్.

అనురాగము ఉపనాయకునియందు ఉన్నా మునిగురుపత్నీగతముగా ఉన్నా బహునాయకవిషయముగా ఉన్నా అనుభయనిష్ఠ మయినా ఆభాస అవుతుంది అంటున్నారు. ఈకారికలో మునిగురుపదాలు ఉపలక్షణపరములు. కాబట్టి రాజాదులను కూడా గ్రహించాలి.

ఈపద్యములో వ్యంగ్యము ఏమి ?

> వ్యానమ్రా శ్చలితా శ్చైవ స్ఫురితాః పరమాకులాః
> పాండుపుత్రేషు పాంచాల్యాః పతంతి ప్రథమా దృశః.

పాండుపుత్రులపై పాంచాలీ ప్రథమదృష్టులు అత్యంతమూ నమ్రములై చంచలములై, వికసితములై, అత్యంతము ఆకులములై ప్రసరించుతున్నవి.

యుధిష్ఠిరునిపై, ఆతడు ధర్మాత్ముడు కావడముమూలాన నమ్రములుగా ఉండడము చేత భక్తి కలిగి ఉండడమును, భీమసేనునిపై, చలించుటచేత స్థూలాకారత్వము ఉన్నదని త్రాసము కలిగి ఉండుటను, అర్జునుని విషయములో, విస్ఫారితములు కావడముచేత ఆతని అలౌకిక వీరత్వమును వినుట కారణముగా హర్షము కలిగి ఉండుటను, నకుల సహదేవుల విషయములో, అత్యంతమూ వ్యాకులములుగా ఉండడముచేత వారు పరమసుందరులగుట కారణముగా ఔత్సుక్యము కలిగి ఉండడమునూ దృష్టులు వ్యంగ్యము చేస్తున్నవి. పాంచాలికి ఈ అయిదుగురు వ్యక్తులందూ అనురాగము ఉన్నదని గోచరమవుతున్నది. ఇట్లా బహువిషయక రతి వ్యంజితము అవుతున్నందువలన ఇది రసాభాస అవుతుందని నవీనులభావము.

రతి పెండ్లిచేసికొనని అనేకనాయకులను విషయముగా చేసికొన్నప్పుడే రసాభాస అవుతుంది గాని వివాహితబహునాయకవిషయకముగా ఉంటే రసాభాస కాదు అని ప్రాచీనుల అభిప్రాయము.

శృంగారరసము మాదిరిగా శృంగారాభాసకూడా రెండువిధాలు. సంయోగాభాస, విప్రలంభాభాస అని. సంయోగాభాస ఇంతకు పూర్వము ఉదాహరింపబడినది.

విప్రలంభాభాసకు ఉదా :

> వ్యత్యస్తం లపతి క్షణం క్షణ మథో మౌనం సమాలంబతే
> సర్వస్మిన్ విదధాతి కించ విషయే దృష్టిం నిరాలంబనామ్
> శ్వాసం దీర్ఘ మురీకరోతి న మనా గంగేషు ధత్తే ధృతిం
> వైదేహీకమనీయతాకబలితో హా హంత లంకేశ్వరః.

సీతాసౌందర్యకబలితుడయినరావణుడు క్షణకాలము వ్యత్యస్త

ముగా పలుకుతాడు. క్షణకాలము మౌనము అవలంబించుతాడు. ఏవిషయముపై నయినా ఏదో నిరాలంబ మగు దృష్టిని ఉంచుతాడు. దీర్ఘముగా శ్వాసమును విడుస్తాడు. అవయవాలపై కొంచె మయినా ధైర్యము పూనడు. హా!

దీనిలో సీత ఆలంబనముగా లంకేశ్వరగత మైనవిప్రలంభరతి అనుభయ నిష్ఠము అవుతున్నది. కాబట్టి ఆభాసత్వము పొందుతున్నది. ఇంకా ఆరతి జగద్గురు వయిన శ్రీరామచంద్రుని పత్నీవిషయకముగా ఉన్నందు వలన గూడా ఆభాసము అవుతున్నది. వ్యత్యస్తముగా పలుకుట ద్వారా ఉన్మాదము, మౌనావలంబనముద్వారా శ్రమము, నిరాలంబన దృష్టిద్వారా మోహము, దీర్ఘశ్వాసద్వారా చింత, అంగములందు అధీరతద్వారా వ్యాధి, అభివ్యక్తము లవుతూ జగద్గురుపత్నీవిషయ కము లగుటవలన ఆభాసత్వము పొందుతున్నవి. వీనిచేత రావణుని విప్రలంభరతి పోషింపబడుతున్నది. అందువలన ఇది ధ్వనికావ్యము అయినది.

ఈవిధముగా కలహస్వభావము కలిగి క్లేశకారులుగా ఉండేకుపుత్రాదులు ఆలంబనముగా వర్ణింపబడే శోకమూ, ప్రపంచవిరక్తు లయినవారి గత ముగా వర్ణింపబడే శోకమూ ఆభాస అవుతవి. బ్రహ్మవిద్యాధికారులు కా దగనటువంటి చండాలాదుల గతముగా ఉన్న నిర్వేదము ఆభాస అవుతుంది. నీచులు, భీరువులు అయిన వారియందు ఉన్నట్లుగా వర్ణింప బడిన క్రోధోత్సాహములు, పిత్రాదులు ఆలంబనముగా వర్ణింపబడే క్రోధోత్సాహములూ, ఐంద్రజాలికులు ఆలంబనముగా వర్ణింపబడే విస్మ యమూ, గురువు మొద లయినవారు ఆలంబనముగా ఉండేహాసము, మహావీరపురుషగతముగా వర్ణింపబడే భయమూ, యజ్ఞములోని పశు వులకు సంబంధించిన వసాసృఙ్మాంసాదులు ఆలంబనముగా ఉన్న జుగుప్స, రసాభాసములు అవుతున్నవి. అత్యంతమూ గ్రంథవిస్తారము అవుతుం- దనేభయముతో వానిని అన్నిటినీ ఉదాహరించ లేదు. సుధీ మణులు స్వయముగా ఊహించాలి.

### భావాభాస

దేనివిషయము అనుచిత మవుతుందో అది భావాభాస అవుతుం దని ఈవిధముగానే గ్రహించాలి. ఉదా:

> సర్వేఽపి విస్మృతిపథం విషయాః ప్రయాతాః
> విద్యాపి ఖేదకలితా విముఖీ బభూవ
> సా కేవలం హరిణశావకలోచనా మే
> నైవాపయాతి హృదయా దధిదేవతేవ.

సర్వవిషయములూ విస్మృతిమార్గమును పొందినవి. ఖేదముతో సంపాదించిన విద్యకూడా విముఖ మైనది. ఆబాలమృగనేత్ర మాత్రమే నా హృదయమునుండి అధిదేవతవలె తొలగిపోవడము లేదు.

ఇది గురుకులములో విద్యాభ్యాసము చేసేసమయములో గురుపుత్రిక యొక్క లావణ్యాగృహీతమానసుడై దేశాంతరమునకు వెళ్ళినవాని వచనము. లేక అత్యంత ప్రతిషిద్ధగమన అయినయువతిని స్మరించుతూ దేశాంతరగతు డయినవాని వచనము.

స్రక్చందనాదిపదార్థములలో చాలాకాలమునుండి ఆరాధించినవిద్యలో తనను విడిచిపెట్టడమువలన కృతఘ్నత్వము వ్యజ్యమాన మవుతున్నది. హరిణశావకలోచన తనను విడిచిపెట్టక పోవడముమూలాన ఆమె యందు లోకోత్తరత్వము వ్యంగ్యము అవుతున్నది. ఈ రెండిటిలో నాయికయందు విశేషము ఉండుటను గ్రహించాలి. ఈవిధముగా ఈ రెండూ స్మృతిని పోషించుతున్నవి. అందువలన *స్మృతిభావము ప్రధానము (చిరకాలము సేవించినా విషయములూ విద్యా రెండూ కృతఘ్నములై విముఖము లయినవి. అంతకన్న తక్కువకాలము అభిధ్యానించి

---

*"ఏషా(స్మృతి) అనుచితవిషయకత్వా దనుభయనిష్ఠత్వాచ్చ భావాభాసః" అని మూలము. ఇక్కడ "అనుభయనిష్ఠత్వాత్" అని ఉండడమువలన "స్మృతిభావము ప్రధానము అనుట ఉచితముకాదు. రతిభావము ప్రధానము" అని ఉండవలయును. మూలములో "స్మృతి మేవ" పదమునుబట్టి "అనుభయనిష్ఠత్వాత్" తీసివేయవలయును. లేదా, "అనుభయనిష్ఠరతిమూలకత్వాత్" అని పాఠమును సవరించుట మంచిది అని ఆ స్మద్గురువర్యులు మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయ శాస్త్రి గారు.

సప్పటికీ భామిని సర్వదా అనుగామిని అవుతున్నది. కాబట్టి లోకోత్తరకృతజ్ఞ. ఇవి ఇంతగా వ్యక్తిని పొందినా అంగములే. ఈవిధముగా విడిచిపెట్టకపోవడములోని సార్వదికత్వము (సర్వదా ఉంపుటను) వ్యంగ్యము చేస్తూ ఉన్న అధిదేవతతో ఉపమకూడా స్మృతినే పోషించుతున్నది. ఇటువంటి ఈస్మృతి అనుచితవిషయకము అగుటవలన అనుభయనిష్ఠము అగుటవలన భావాభాస అవుతున్నది.

కాక ఈవచనము ఆహరిణనయనను వివాహము చేసుకొన్నవానిదే అయితే అపుడు భావాభాసధ్వనియే అవుతుం దని గ్రహించాలి.

## ౧౩. శాంత్యాదులు

### భావశాంతి

భావస్య ప్రాగుక్తస్వరూపస్యశాంతి ర్నాశః.

పూర్వము చెప్పబడిన స్వరూపము కలిగినభావాలలో ఏదైనా ఒకభావానికి నాశము ఉంటే అది భావశాంతి అవుతుంది. దీనిని నాశముయొక్క ఉత్పత్తిలో ఉత్పత్తిసమయానికి సంబంధించిన దానినిగా గ్రహించాలి. అనగా భావనాశము ఉత్పన్న మవుతున్నప్పుడే (ఉత్పత్త్య వచ్ఛిన్న ముగానే అన్నమాట) వర్ణించాలి. అదే సహృదయచమత్కారి అవుతుంది. నాశోత్పత్త్యనంతరవర్ణనము చమత్కారకము కాదు. ఆ భావము ఆక్షణములోనే నశించుతున్నట్లుగా భాసించితేనే ధ్వని అవుతుంది. కాని నాశము అనశ్వరపదార్థము అగుటవలన కాలాంతరములో ఉండేనాశము భావశాంతి అనబడదు. ఉదా :

> ముంచసి నాద్యాఽపి రుషం
> భామిని! ముదిరాలి రుదియాయ
> ఇతి తన్వ్యాః పతివచనై
> రపాయి నయనాబ్జకోణశోణరుచిః.

"ఓ కోపనా! ఇప్పటికీ కోపాన్ని విడిచి పెట్టవు. మేఘమాల ఉదయించింది" ఈవిధముగా పతియొక్క వచనాలచేత తన్వియొక్క నయనాబ్జాల కోణములలోని శోణకాంతి పోయినది.

దీనిలో అటువంటి ప్రియవచనశ్రవణము విభావము. నయనకోణముల లోని శోణకాంతి నశించిపోవుట కాని దానివలన వ్యంగ్యమయిన ప్రసన్నత కాని అనుభావము. దీనివలన ఉత్పత్తిసమయములో ఉండే (ఉత్పత్త్యవచ్ఛిన్న మగు) రోషనాశము వ్యంగ్యము అవుతున్నది.

## భావోదయము

భావోదయో భావస్యోత్పత్తిః.

ఈ విధముగా భావముయొక్క ఉత్పత్తి భావోదయము అనబడును.
ఉదా:

> వీక్ష్య వక్షసి విపక్షకామినీ,హారలక్ష్మ దయితస్య భామినీ
> అంసదేశవలయీకృతాం క్షణా, దాచకర్ష నిజబాహువల్లరీమ్.

ఒక భామిని దయితుని వక్షోభాగములో విపక్షకామినీహారలక్ష్మను చూచి క్షణములో ప్రియుని అంసప్రదేశాన వలయముగా చేయబడిన తనబాహులతను లాగికొన్నది.

దీనిలో దయితవక్షోగత విపక్షకామినీహారలక్ష్మ దర్శనము విభావము. ప్రియునిఅంసదేశాన వలయముగాచేయబడిన తనబాహులతాకర్షణము అనుభావము. వీనివలన రోషోదయము వ్యంగ్యము అవుతున్నది. బాగా పరిశీలించితే భావశాంతిలో భావాంతరము ఉదయించుట ఆవశ్యకమై ఉన్నది. భావోదయములోకూడా పూర్వము ఏదో ఒక భావాంతరము శాంతిపొందుట ఆవశ్యకమై ఉన్నది. దీనిలో అది దానిలో ఇదీ ఉండడమువలన వేరువేరుగా వ్యవహరించడానికి అవకాశము కనబడడము లేదు. వ్యవహారవిషయము వేరువేరుగా లేదు అని గోచరించుతున్నది.

అయినా ఒకస్థలములో రెండిటి చమత్కారము కనపడడము లేదు. ఎక్కడైనా వ్యవహారము చమత్కారాధీనము కదా! ఎక్కడ ఏది చమత్కారి అవుతుందో అక్కడ దానినే చెప్పాలి. చమత్కారాను సారముగా వానికి పృథగ్విషయమును విభాగించి గ్రహించవచ్చును.

## భావసంధి

భావసంధి రన్యోన్యానభిభూతయో రన్యోన్యాభి
భవనయోగ్యయోః సామానాధికరణ్యమ్.

అన్యోన్యమూ తిరస్కరింపబడకుండా ఉన్నటువంటివీన్నీ, అన్యోన్యము అభిభవనము చేయడానికి యోగ్యత కలిగి ఉన్న రెండుభావాలకు ఒకే స్థానములో నిబంధనము ఉన్నప్పుడు భావసంధి అనబడును. రెండు భావాలు పరస్పరమూ అభిభవయోగ్యతను ధరించి ఉండాలి. కాని పరస్పరము అభిభూతములు కారాదు. అవి అన్యోన్య చమత్కారమును అవరుద్ధము చేసుకోవాలి. అటువంటి భావాలకు సమస్థలములో సమకాలంలో అభివ్యక్తి ఉంటే "భావసంధి" అని అభిప్రాయము. పరస్పరాభిభూతభావాలకు సంధి ఉంటే ఆ రెండిటి చమత్కారము ఏమీ ఉండదు. పరస్పరాభిభవ యోగ్యతారహితము లయిన ఉదాసీన భావాల అభివ్యక్తిలో సంధికృత మైన విశిష్టచమత్కార మేమీ ఉండదు. ఉదా:

యౌవనోదయనితాంతశంకితాః, శీలశౌర్యబలకాంతిలోభితాః
సంకుచంతి వికసంతి రాఘవే, జానకీనయననీరజశ్రియః.

యౌవన ప్రాదుర్భావమువల్ల మిక్కిలి శంకాయుక్తములును, శ్రీరాముని శీలశౌర్యబలకాంతులవలన లోభయుక్తములును అయిన సీతా నయనకమలశ్రీలు శ్రీరామునియందు సంకుచితములు అవుతున్నవి, వికసితములూ అవుతున్నవి.

దీనిలో భగవాను డయిన శ్రీరామచంద్రుని లోకోత్తర యౌవనసము త్పత్తిని, లోకోత్తరము లయిన శీలశౌర్యాదులను చూచుట విభావము. నయనములలోని సంకోచవికాసములు అనుభావములు. వ్రీడ, ఔత్సుక్యము, ఈ రెండిటిసంధి వ్యంగ్యము అవుతున్నది.

## భావశబలత

భావశబలత్వం భావానాం బాధ్యబాధకభావాపన్నానా ముదాసీనానాం వా
వ్యామిశ్రణమ్.

పరస్పరము బాధ్యబాధకభావమును పొందినట్టి భావములకు గాని ఉదాసీనములుగా ఉన్న భావములకు గాని వ్యామిశ్రణము భావశబలత అనబడును. ఆయా భావాలు తమతమ వాక్యాలలో వేరువేరుగా ఉన్నప్పటికీ మహావాక్యానికి చమత్కారోత్పాదక మైన ఒకబోధ కలుగుతుంది. అది అందరకూ అనుభూత మవుతుంది. ఈవిధంగా సహృదయానుభవ విషయత్వము ఉంటే భావశబలత అవుతుంది. మొత్తముమీద వ్యామిశ్రణము అంటే ఏకచమత్కారమును కలుగజేసేజ్ఞానములో గోచరము అగుట అనిభావము. ఉదా:

> పాపం హంత! మయా హతేన విహితం సీతాపి యద్యాపితా
> సా మా మిందుముఖీ వినా బత! వనే కిం జీవితం ధాస్యతి?
> ఆలోకేయ కథం ముఖాని కృతినాం? కిం తే వదిష్యంతి మాం?
> రాజ్యం యాతు రసాతలం పున రిదం న ప్రాణితుం కామయే.

సీతను వనవాసానికి పంపినతరువాత శ్రీరాముడు ఈవిధముగా అంటున్నాడు. హతకుడ నైన నేను సీతనుకూడా పంపివేయుట అనేపాపము చేసినాను. అయ్యో! నేను లేకుండా ఆ చంద్రవదన అరణ్యములో జీవితమును ఎట్లా ధరించుతుంది? పెద్దల ముఖాలను నేను ఎట్లా చూచేది? వారు నన్ను ఏమని అంటారో కదా? ఈ నారాజ్యము పాతాళలోకానికి క్రుంగి పోనీ! నేను బ్రతికి ఉండడము కోరను.

పై పద్యములో "పాపము" అనే పదమువలన 'మతి' భావము. "అయ్యో! హతకుడనైన నేను" అని 'అసూయ' "సీతనుకూడా" అని 'విషాదము' "ఆసీత" అని 'స్మృతి' "నేను లేకుండా" అని 'వితర్కము' "ఎట్లా చూచేది?" అని "వ్రీడ" "వారు ఏమి అంటారో గదా" అని 'శంక' "నారాజ్యము పోనీ" అని 'నిర్వేదమూ' పూర్వము చెప్పిన తమతమ విభావములద్వారా వ్యంగ్యము లవుతున్నవి. వీని కన్నిటికీ ఇక్కడ శబలత్వము ఉన్నది.

## శ బ ల తా వి చా ర ము

కావ్యప్రకాశటీకాకారులు ఈవిధముగా అంటున్నారు. "ఉత్తరోత్తర

భావము వలన పూర్వ పూర్వభావానికి ఉపమర్దము ఉన్నట్లయితే శబలత అవుతుంది'' అని. అది ఉచితము కాదు.

> పశ్యే త్కశ్చి చ్చల! చపల! రే! కా త్వరాఽహం కుమారీ
> హస్తాలంబం వితర హహహా! వ్యుత్క్రమః క్వాసి యాసి?
> ఇత్థం పృథ్వీపరివృఢ! భవద్విద్విషోఽరణ్యవృత్తేః
> కన్యా కంచిత్ఫలకిసలయా న్యాదదాఽనాభిధత్తే.

ఓ పృథివీప్రభూ! అరణ్యములో వర్తనము కలిగిన నీ శత్రువుకన్య ఫలములను కిసలయములనూ భక్షణమునకై గ్రహించుతూ తనను గ్రహించడానికి వచ్చిన ఒక పురుషునిపై అనురాగముకలదై ఈ విధముగా పలుకుతున్నది. "ఓ చలచిత్తా! ఎవరైనా చూస్తారు. ఓయీ! చపలా! పోపో! అయ్యో! అప్పుడే ఇంతతొందరేమిటి? నేనుపిల్లదానను కదా! నాకు స్వాతంత్ర్యము ఏది? హస్తాలంబనమును ఇవ్వవయ్యా! పట్టుకో! హా! హా! హా! తలక్రిందు లయింది. ఏమీ వ్యుత్క్రమము? ఎక్కడికి వెళ్ళుతున్నావో" అని.

ఈ ఉదాహరణములో "ఎవరైనా చూస్తారు'' అని శంక. ఓయీ! చపలా పోపో'' అని అసూయ. ''అప్పుడే ఇంత తొందర ఏమిటి?'' అని ధృతి. "నేను పిల్లదానను'' అని స్మృతి. "హస్తాలంబనమును ఇవ్వు'' అని శ్రమ. "హాహాహా'' అని శ్రమ "వ్యుత్క్రమము'' అని విబోధము, ''ఎక్కడికి వెళ్ళుతున్నావో'' అని ఔత్సుక్యము అనేభావాలు ఉపమర్దలేశ మయినా లేకపోయి నప్పటికీ శబలత్వము పొందుతున్న వని దీనిలో ఉన్న భావశబలత రాజస్తుతిలో గుణీభూత మవుతున్న దనీ కావ్యప్రకాశ పంచమోల్లాసములో మూలకర్త అయిన మమ్మటభట్టు నిరూపణ చేస్తున్నాడు. కాబట్టి టీకాకారుల వచనము మూలవిరుద్ధము.

అనంతరకాలములో వచ్చే విశేషగుణము పూర్వభావి విశేషగుణమును నశింపచేస్తుంది, అని నియమ మున్నది. నైయాయిక సిద్ధాంతానుసారముగా చిత్తవృత్తిరూపము లయిన భావాలకు ఇచ్ఛ మొదలయిన విశేషగుణాలలో సమావేశము కలుగుతుంది. కాగా పూర్వభావానికి

నాశము లేనిదే, ఉత్తరభావానికి ఉత్పత్తి కలుగదు. కాబట్టి ఈ విధానానుసారముగా భావాలకు ఉపమర్ద్యోపమర్దక భావమును చెప్పరాదా అని శంక.

ఇది ఉచితము కాదు. స్వోత్తరవిశేషగుణమువలన కలుగునట్టి నాశము వ్యంగ్యము కాదు. అది ఉపమర్దపదముచేతకూడా చెప్ప తగదు. అది చమత్కారికూడా కాదు. అందువలన—

నారికేళజలక్షీరసితాకదళమిశ్రణే
విలక్షణో యథా స్వాదో భావానాం సంహతౌ తథా.

కొబ్బరినీళ్లు, పాలు, పంచదార, అరటిపండు మిశ్రణము చేయగా విలక్షణమైన ఆస్వాదము ఏవిధముగా కలుగుతుందో అట్లాగే భావాల మిశ్రణములో విలక్షణమైన ఆస్వాదము పుట్టుతుందని గ్రహించాలి. కొబ్బరినీళ్ళు మొదలయినవి కలిసినప్పుడు ఒక పదార్థము వేరొకపదార్థముయొక్క ఆస్వాదమును నష్టముచేయదు. అన్నీ కూడుకొని తమతమ ఆస్వాదముతో కూడుకుంటూ నూతనాస్వాదమును కలుగజేస్తున్నవి. ఆ విధముగానే భావశబలతలో భావాలు తమతమ స్వాదముతో ఉంటూ విలక్షణాస్వాదమును కలుగజేస్తున్నవని తాత్పర్యము.

భావశాంత్యాదులలో భావము ప్రధానమా?

శాంత్యాదికము ప్రధానమా?

ఈ విషయమును ఇక్కడ గ్రహించాలి. ఈ ఉదాహరింపబడిన భావశాంతి భావోదయ భావసంధి భావశబలతాధ్వనులు అన్నీకూడా భావధ్వనులే. విద్యమానతావస్థలో భావమును ఆస్వాదించినప్పుడు అవస్థకు ఏవిధముగా ప్రాధాన్యములేదో, భావానికే ప్రాధాన్యము ఉంటుందో ఆవిధముగానే ఉత్పన్నము అవుతున్నట్టి, వినాశము పొందుతున్నట్టి ఒకదానితో ఒకటి సంధీయమానము అవుతున్నట్టి, పరస్పరమూ సమానాధికరణములు అవుతున్నట్టి ప్రకారములతో ఆస్వాదనము చేయునప్పుడుకూడా భావాలకే ప్రధానత్వము సముచితముగా ఉంటుంది,

భావచర్వణలోనే చమత్కార విశ్రాంతి ఉన్నది, కాని కేవలావస్థా మాత్రాస్వాదములో చమత్కారము విశ్రాంతము కాదు.

భావాలకు అనేకానస్థలు ఉండవచ్చు. ఆ యా స్థలాలలో ఆయా అవస్థలలో కూడుకొన్న భావాలు ఆస్వాదింపబడే టప్పుడు చమత్కారము భావాలలోనే ఉంటుంది. కాబట్టి అన్నిటినీ భావ ధ్వనులే అనుట బాగా ఉంటుం దని భావము. ఉత్పత్తి, వినాశము, సంధి, శబలతల యొక్క ఆస్వాదమూ, వాని వానికి సంబంధించిన భావాలయొక్క ఆస్వాదమూ, ఆ యా సమయాలలో సమానరూపము గానే ఉంటుంది. ఏది ప్రధానమో, ఏది అప్రధానమో సరిగా నిర్ణయించుట శక్యము కాదు. అయినా స్థితియొక్క అవస్థలో విద్యమానావస్థలో భావమందే; ప్రధానత ఉన్నట్లు అంగీకరింపబడి క్లుప్తమై ఉన్నది. కాబట్టి భావశాంత్యాదులలో కూడా శాంత్యాదులద్వారా అభివ్యక్తము లవుతూ ఉన్న భావాలలోనే ప్రధానత్వము ఉన్న దని నిశ్చయించుట సముచితముగా ఉంటుంది.

ఇంకా భావశాంత్యాదులలో భావము ప్రధానము కాదు. భావము ఉపసర్జనముగా (అప్రధానము) ఉన్న శాంత్యాదులే ప్రధానములు అని అనేట ట్లయితే:

భావము వ్యంగ్య మవుతూ శాంత్యాదికము వాచ్య మవుతూ ఉన్నప్పుడు అటువంటికావ్యాలలో భావశాంత్యాదిధ్వని అని వ్యవహరించ డానికి వీలు లేక పోతుంది. చూడండి. ఉదా:

> ఉషసి ప్రతిపక్షనాయికా, సదనా దంతిక మంచతి ప్రియే
> సుదృశో నయనాబ్జకోణయో, రుదియాయ త్వరయా ఽరుణద్యుతిః.

ప్రాతఃకాలములో విరోధినీనాయికాసదనమునుండి ప్రియుడు సమీపానికి రాగా ఒక సునయనయొక్క నయనకమల కోణములో త్వరగా అరుణకాంతి ఉత్పన్న మయినది.

ఈ పద్యములో "ఉదయాయ" అనే శబ్దముద్వారా భావముయొక్క ఉత్పత్తి (భావోదయము) వాచ్యముగా గోచరము అవుతున్నది.

ఉదయము వాచ్య మయినా భావము వాచ్యము కాలేదు. కాబట్టి ఈ కావ్యము ధ్వని కావడములో ఏమీ బాధ లేదు అనేటట్లయితే, మీ మతానుసారముగా ప్రధాన మైన ఉదయము "కావ్యము ధ్వని" అని వ్యపదేశించడానికి యోగ్యత కలది కాకపోగా అప్రధాన మయిన భావమును అనుసరించి "కావ్యము ధ్వని" అని వ్యపదేశించుట ఏవిధ ముగా కుదురుతుంది? ప్రధానము వ్యవహారములో ఉపాయము కాన ప్పుడు అప్రధానము వ్యవహారములో ఉపాయ మగుట ఉపపన్నముకాదు. మా మతానుసారముగా అయితే, ఉత్పత్తి వాచ్యము అయినప్పటికీ ఉత్పద్యమాన మగు ప్రధాన మైన అమర్ష భావము వాచ్యము కాలేదు కాబట్టి పై పద్యమును భావోదయ ధ్వనిగా వ్యపదేశము చేయడము యుక్తమే.

ఇట్లాగే మీ మతములో భావము వ్యంగ్య మయినప్పుడు శాంతి వాచ్య మయినప్పుడు భావశాంతి ధ్వని కాకపోవలసి వస్తుంది. ఉదా:

> క్షమాపణైకపదయోః పదయోః పతతి ప్రియే
> శేముః సరోజనయనా నయనారుణకాంతయః.

ఒకసఖి వేరొకసఖితో చెప్పుతున్నది. క్షమించడానికి సర్వప్రధానస్థాన ము లయినపాదాలపై ప్రియుడు పడగా కమలనయనయొక్క నయ నారుణకాంతులు శమించినవి.

దీనిలో శాంతి వాచ్యము అయినది. భావము వ్యంగ్య మైనది. శమమే ప్రధానము అని అనేటట్లయితే అది వాచ్యము అయింది. కాబట్టి ఇందులో భావశాంతిధ్వని కా దనవలసి వస్తుంది. కాని ధ్వని అని అందరూ అంగీకరింప వలసిన సరసత దీనిలో ఉన్నది.

ఈవిషయములో ఒక ఆశంక. ఈ చెప్పినపద్యాలలో శబ్దములద్వారా వాచ్యము లయిన శాంత్యాదులు అరుణకాంతితోనే అన్వయము పొందుతున్నవి. "అరుణద్యుతిః ఉదియాయ" అనేచోట ఉదయములో అరుణకాంతి అన్వయించింది. "అరుణకాంతయః శేముః" అనేచోట కూడా శమనములో అరుణకాంతులకే అన్వయము ఉన్నది. అమర్షాది

భావాలతో అన్వయము లేదు. కాబట్టి అరుణకాంతిశాంత్యాదులే వాచ్యములు అయినవికాని ప్రశమాదుల చేత అభివ్యంగ్యము లయిన రోషప్రశమాదులు వాచ్యములు కాలేదు. వ్యంగ్యము వ్యంజకమూ రెండూ వేరువేరుగా ఉండడము, వానికి భేదము ఉండడమూ ఆవశ్యకముకదా! అరుణకాంతి శాంతివాచ్య మయినా, రోషశాంతి వ్యంగ్య మవుతున్నది అరుణకాంతి శాంతివ్యంజకము. రోషశాంతి వ్యంగ్యము. ఈ భేదము ఈ విధముగా ఉండాలి. వ్యంగ్యానికి వాచ్యముతో అన్వయమును అంగీకరించి అరుణ్యావ్యంగ్య మయిన రోషానికి వాచ్యముగా ఉన్న ప్రశమాదులతో అన్వయము చెప్పుట ఉచితము కాదు. మొదట వాచ్యప్రతీతి కలుగుతుంది. అనంతరము వ్యంగ్యప్రతీతి కలుగుతుంది అని సిద్ధార్థము. కాగా వాచ్యాన్వయసమయములో వ్యంగ్యము ఉపస్థితము కాదు. కాబట్టి వాచ్యములతో వ్యంగ్యాలకు అన్వయము కుదరదు. కాకపోతే "ఉపసి ప్రతిపక్ష నాయికా" అనే పద్యములో "సుదృశో నయనాబ్జకోణయోః'' అనే వాక్యఖండానికి అన్వయము కుదరదు. అమర్ష అనేది చిత్తవృత్తి కదా! అది నేత్రాలలో ఉండదు. కాబట్టి వాచ్యము లయిన శాంత్యాదులకు అరుణకాంత్యాదులతో అన్వయము చెప్పడమే బాగా ఉంటుంది. కాబట్టి ఆ పద్యాలలో భావశాంత్యాదులు వాచ్యములు కానందున వ్యంగ్యములే అనవలయును అని. ఇట్లా అనరాదు. అయినప్పటికీ ఈ విధముగా అయితే—

> నిర్వాసయంతీం ధృతి మంగనానాం
> శోభాం హరే రేణదృశో ధయంత్యాః
> చిరాపరాధస్మృతి మాంసలో౽పి
> రోషః క్షణప్రాఘుణికో బభూవ.

స్త్రీల ధైర్యాన్ని పోగొట్టుతూ ఉన్న శ్రీకృష్ణుని శోభను పానముచేస్తూ ఉన్న మృగనయనయొక్క రోషము చిరాపరాధస్మరణమువలన అత్యంతమూ ప్రబలముగా ఉన్నప్పటికీ క్షణకాలాతిథి అయినది. అంత కన్న ఎక్కువకాలము ఉండడానికి ఆరోషము సాహసించ లేదని భావము.

ఇత్యాదిపద్యాలలో కూడా భావశాంతిధ్వని కావలసివస్తుంది. మీ మతానుసారముగా ఈపద్యములో భావము వాచ్య మయినా ప్రధాన ప్రశమము "క్షణప్రాఘుణికః" అనడమువలన వ్యంగ్య మవుతున్నదిగా! రెండూ వాచ్యములు కాకుండా ఉండడమే వివక్షితము అని అనేటట్లయితే పూర్వోక్తపద్యద్వయములో శాంతిరూపముతో శాంతి, ఉదయ రూపముతో ఉదయమూ వాచ్యము లయినవి. కాబట్టి అవి ఉదాహరణములు కాక పోవలసి వస్తుంది. అట్లా కావడము ఇష్టమే అనడము సహృదయులకు సమ్మతము కాదు. కాబట్టి భావ ప్రశమాదులలో కూడా ప్రధానంగా భావాలకే చమత్కారిత్వము ఉన్నది. ప్రశమాదులకు గౌణత్వము ఉన్నది. అందువలన అవి వాచ్యము లయినా దోషము లేదు. భావధ్వనులకంటె భావశాంత్యాదిధ్వనులకు విలక్షణ చమత్కారము ఉన్నది అనడములో ఇది నిదానము. శుద్ధభావధ్వనులలో స్థితితో పాటు స్థిత్యవచ్ఛిన్నామర్షాది రూపములో భావాలఆస్వాదనము ఉంటుంది. కేవలామర్షాదిరూపములో నయినా భావాలఆస్వాదనము ఉంటుంది. భావశాంత్యాదిధ్వనులలో భావాలతోపాటు శాంత్యాద్యవస్థలు కూడి ఉండడముకూడా ఆస్వాదింపబడుతూ ఉంటవి. భావధ్వనిలో అమర్షాదికృత చమత్కారమే ఆస్వాదనీయము. భావశాంత్యాదులలో అయితే భావాలతోపాటు ప్రశమోదయాదికృతచమత్కారముకూడా ఆస్వాదనీయము అవుతుం దన్నమాట.

రసాలు స్థాయిమూలకములు కాబట్టి శాంత్యాదులు ఉండవు. స్థాయికి ప్రశమాదులు ఉండేట ట్లయితే స్థాయిత్వమే నష్ట మవుతుంది. దానికి సాధారణభావాలకంటె భేదము లేకపోవలసి వస్తుంది. స్థాయిభావానికి కూడా ఉత్పత్తినాశాలు సంభవించేట ట్లయితే చమత్కారము ఉండదు. అందువలన అది ఇక్కడ విచారింపబడదు.

### రసభావాదులు అలక్ష్యక్రమములేనా ? లక్ష్య క్రమములుకూడానా ?

ఈ చెప్పబడిన రసభావాదిలక్షణ మైన వ్యంగ్యప్రపంచ మంతా ప్రకరణము స్ఫుటముగా ఉన్నప్పుడు విభావానుభావవ్యభిచారిభావాలు

వెంటనే ప్రతీతములు కాగా అత్యంతమూ సహృదయుడయిన భావకునకు సూక్ష్మసమయములోనే ప్రతీయమానము అవుతుంది. అనుభవకర్తకు కార్యకారణముల పౌర్వాపర్యముయొక్క క్రమము గోచరము కాదు. అందువలననే అలక్ష్యక్రమ మని వ్యపదేశింపబడుతున్నది.

ఎక్కడనయినా ప్రకరణము విచారించిన తరువాతనే తెలియబడుతున్నప్పుడు సందర్భము స్పష్టమయినా విభావాదులు సమున్నేయములుగా (ఊహింపదగినవిగా) ఉన్నప్పుడు సామగ్రియొక్క విలంబనము అధీనముగా చేసుకొని ఉంటుంది. కాబట్టి చమత్కారము మంథరము అవుతుంది. మెల్లమెల్లగా ప్రతీతము అవుతుంది. అందువలన ఈ రసాదికము సంలక్ష్యక్రమము కూడా అవుతుంది. "తల్పగతాపి చ సుతనుః" అని పూర్వము ఉదాహరించిన పద్యములో "సంప్రతి" అనే పదముయొక్క అర్థజ్ఞానము ఆలస్యముగా కలుగుతున్నది. అందువలన రసాదులను సంలక్ష్యక్రమవ్యంగ్యములని అన్నప్పటికీ ఏమీ బాధ లేదు. రత్యాదిధ్వనులకు అలక్ష్యక్రమవ్యంగ్యత్వ మనేది ధర్మిగ్రాహక ప్రమాణసిద్ధమేమీ కాదు. రత్యాదిధ్వనులు ఏ ప్రమాణముచేత గ్రహింపబడుతున్నవో ఆ ప్రమాణమువలన వానికి అసంలక్ష్యక్రమవ్యంగ్యత్వమే సిద్ధము కావడము లేదు. అందువలన అవి అసంలక్ష్యక్రమవ్యంగ్యములే అని అనవసరము లేదు. రసాదులు సంలక్ష్యవ్యంగ్యక్రమములు కావు అని తలచనక్కర లేదు. అందువలననే లక్ష్యక్రమముల ప్రసంగములో ధ్వన్యాలోకకర్త అయిన ఆనందవర్ధనాచార్యుడు ఈవిధముగా చెప్పుతున్నాడు:

> ఏవం వాదిని దేవర్షౌ పార్శ్వే పితు రధోముఖీ
> లీలాకమలపత్రాణి గణయామాస పార్వతీ.

దేవర్షి అయిన నారదుడు ఈవిధముగా పలుకగా తండ్రియొక్క పార్శ్వమందు అధోముఖి అయిన పార్వతి లీలాకమలపత్రాలను గణనము చేసినది.

ఈ పద్యమునకు పూర్వప్రసంగము ఈ విధముగా ఉన్నది :

పార్వతీదేవి తపస్సుకు ప్రసన్నుడయిన పరమేశ్వరుడు ఆమెను వినా

హము చేసికొనుటకై వరదానము ఇచ్చినాడు. ఆవరదానమును పరి పాలించుటకు పరమేశ్వరుడు నారదుని హిమవానునిదగ్గరకు పంపినాడు. అప్పుడు పార్వతీపరమేశ్వరుల వివాహప్రసంగము వచ్చినది. ఆసమయములో కవి ఇట్లు చెప్పుతున్నాడు.

ఈపద్యములో బాలికలస్వభావానుసారముగా కూడా అధోముఖత్వముతో కూడుకొనిన లీలాకమలపత్రగణనము సిద్ధము అవుతుంది. అందువలన కొంత విలంబముగా నారదుడు ఒనరించిన వివాహప్రసంగజ్ఞానానంతరము లజ్జ చమత్కారమును కలుగజేసింది కాబట్టి ఈ లజ్జా ధ్వని లక్ష్యక్రమము అవుతుంది అని.

ధ్వన్యాలోకముపై లోచనము అనే వ్యాఖ్యానము వ్రాసిన అభినవగుప్తపాదాచార్యులుకూడా, రసభావాద్యర్థము ఎల్లప్పుడు ధ్వన్యమానమే అవుతుంది. అది ఎప్పుడూ వాచ్యము కాదు. అయినప్పటికీ రసభావాదులు సర్వమూ అలక్ష్యక్రమమునకే విషయము కాదు. అది సంలక్ష్య క్రమవిషయముగా కూడా ఉంటుంది అని ప్రతిపాదించుతున్నాడు.

ఇక్కడ మళ్లా ఒకశంక: ఈ రసాదికము సంలక్ష్యక్రమ విషయము అయినట్లయితే అనురణనధ్వనులయొక్క భేదపరిగణన ప్రసంగములో అర్థశక్తిమూలధ్వనికి పండ్రెండు భేదములు అని అభినవగుప్తుడు చెప్పుట, "అందువలన పండ్రెండువిధము లవుతుంది" అని మమ్మటుడు చెప్పుటా కుదురదు. ఎందువల్ల నంటే వ్యంజకమైనఅర్థము రెండువిధాల ఉంటుంది. ఒకటి వస్తురూపము, రెండు అలంకారరూపము. అవి ప్రత్యేకంగా స్వతస్సంభవి, కవిప్రౌఢోక్తిసిద్ధము, కవి నిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధమూ అనే మూడుమూడు ఉపాధులతో కూడుకొని ఉంటవి. అందువలన వస్తువ్యంగ్యము ఆరువిధములు. అలంకారవ్యంగ్యము ఆరువిధములు. ఈ విధముగా పండ్రెండువిధములు అయినవి. వస్త్వలంకారములకు ప్రత్యేకముగా షడ్విధత్వము వచ్చినట్లు రసాదులు కూడా ఆరువిధాలుగా అభివ్యక్తములు కావలసి ఉన్నది. దీనిని పూర్వ

ద్వాదశభేదాలతో కలిపితే అష్టాదశత్వము రావలసి ఉన్నది గదా! ఆనందాభినవాదులు ఆవిధముగా చెప్పడము ఏవిధముగా కుదురుతుంది? ఈద్వాదశభేదత్వము కుదిరేటట్లయితే వారివచనము కుదరవచ్చును అని.

దీని కిది సమాధానము. అభినవగుప్తాదులయొక్క అభిప్రాయమును ఈ విధముగా వర్ణించాలి. బాగా ప్రకటములయిన విభావానుభావ వ్యభిచారులచేత అలక్ష్యక్రమరూపముగా వ్యంగ్యము అవుతూ ఉన్నట్టి రత్యాది స్థాయిభావము రసీభావము పొందుతుంది. అలక్ష్యక్రమముగా ఉన్నప్పుడే రసీభావసిద్ధి ఉన్నది, కాని సంలక్ష్యక్రమముగా ఉన్నప్పుడు రసీభావసిద్ధి లేదు. రసీభావము పొందుట అంటే స్థాయిభావము వెంటనే కలుగు నటువంటి అలౌకిక చమత్కారములో విషయము కావాలి. నెమ్మది నెమ్మదిగా గోచరించినప్పుడు వానిలో అలౌకికచమత్కారము ఉత్పన్నము కాదు. రత్యాదులయొక్క ప్రతీతి క్రమము సులక్షము అయినట్లయితే అది వస్తుమాత్రమే. అప్పుడు కేవలమూ రత్యాదులుఅనే వ్యవహరించాలి కాని రసవ్యవహారము రాదు అని ఈ విధముగా వారివచనాలకు అర్థమును వర్ణించితే విరోధము ఏమీ లేదు. ఈ విధముగా రసాదికముయొక్క ఆరుభేదములూ వస్తువులో అంతర్గతములు అవుతవి. అందువలన అష్టాదశభేదాలను లిఖించవలసిన ఆవశ్యకత్వము లేదు.

కాని అసంలక్ష్యక్రమవ్యంగ్య మయినప్పుడే "రసము" అనాలి. కాని సంలక్ష్యక్రమవ్యంగ్య మయినపుడు రసము అనరాదు" అనే విషయసిద్ధిలో ఉపపత్తి విచారింప తగిఉన్నది. ఆవిధముగా అనుటలో యుక్తి కనపడుట లేదు. సంలక్ష్యక్రమము లయినప్పటికీ అవి రసములు అని అనబడవచ్చును. అభినవగుప్తాదుల వాక్యములో "రసభావాద్యర్థము" అనేచోట రసాదిశబ్దమును రత్యాదిపరముగా గ్రహించాలి.

## ౧౪ వ్యంజకములు

ఈవిధముగా నిరూపింపబడిన ఈ రసాదిధ్వని ప్రపంచము, పదము,

వర్ణము, రచన, వాక్యము, ప్రబంధము, పదైకదేశము, వర్ణాత్మకములు కానట్టి రాగాదులచేగూడా అభివ్యక్తము అవుతుందని అంగీకరించుతున్నారు. వీని ప్రత్యేకవివరణమును ఈవిధముగా గ్రహించాలి.

## పదధ్వని

వాక్యములో ఉన్న సర్వపదములూ తమతమ అర్థోపస్థితిని కలుగజేయుట ద్వారా వాక్యార్థజ్ఞానసాధనములు అవుతవి. అయినప్పటికీ ఏదో ఒక పదమే కృత్యమును నిర్వహించేది అవుతుంది. అందువలననే చమత్కారి కాగలుగుతున్నది. ఆ కారణముచేత వాక్యము ధ్వని అవుతున్నది. "మందమాక్షిపతి" అనేపద్యములో "మందం" అనేపదము ఇటువంటిదే.

## వర్ణరచనాధ్వని

రచన వర్ణము ఇవి పదములలో వాక్యములలో అంతర్భవించి వ్యంజకము లయినవానికోటిలో ప్రవేశము పొందుతున్నవి. పదవాక్యాలకన్న రచన వర్ణమూ వేరుగా ఉండి వ్యంజకములు కావు. అందువలననే రచనా వర్ణములతో కూడుకొన్న పదవాక్యములే వ్యంజకము లని చెప్పవలసి ఉన్నది. పదవాక్యముల వ్యంజకతలో వర్ణరచనలుకూడా విశేష రూపంగా అనుప్రవేశము పొందుతున్నవి. అందువలననే వర్ణము కాని రచన కాని స్వతంత్రరూపముగా వ్యంజకములు అని అనవలసిన ఆవశ్యకత లేదు. అయినప్పటికీ "పదవాక్యములతో కూడుకొనిన రచనా వర్ణములు వ్యంజకములు", "రచనావర్ణములతో కూడుకొనిన పదవాక్యములు వ్యంజకములు" అని విశేషణవిశేష్యభావవ్యత్యాసములో నియామకము లేదు. ఈ రెండువచనాలలో ఏఒకదానినే ప్రమాణముగా చేయుటకు సాధనము లేదు. వీనికి గమకము కనపడుట లేదు. రెండు పక్షములలో ఒక పక్షమును సాధించడానికి దృఢతర ప్రమాణము ఉంటే వినిగమకము ఉన్నట్లు అని గ్రహించాలి.

కాబట్టి పదవాక్యవిశిష్టవర్ణరచనారూపముగాను, వర్ణరచనా విశిష్ట పదవాక్యరూపముగానూ వ్యంజకత్వము చెప్పవలెను. ఘటములో చక్రసహితదండము కారణ మని గాని, దండసహిత చక్రమే కారణ

మని గాని అనుటలో వినిగమకము లేదు. అందువలన చక్రదండములు రెండిటికీ వేరువేరుగా కారణత్వమును తార్కికులు అంగీకరించుతున్నారు. ఆవిధముగా వర్ణరచనలకుకూడా పృథక్కుగా వ్యంజకత్వమును అంగీకరించుట అనుచితము కాదు అని. ఇది ప్రాచీన విద్వాంసుల మతము.

నవీనులలో కొంతమతభేదము ఉన్నది. వారు ఈ విధముగా అంటారు. వర్ణము వానివానిభిన్న ప్రకారములతో కూడుకొనిన వైదర్భ్యాదిరచన మాధుర్యాదిగుణములను అభివ్యంజనము చేయగలవు. కాని రసమును అభివ్యంజనము చేయలేవు. అందువలన రసాభివ్యంజకత్వము ఉన్నదనుట గౌరవము. రసాభివ్యంజకముల సంఖ్యావ్యర్థముగా ప్రవృద్ధ మవుతుంది. ఇంకా ఆవిధముగా అనడములో ప్రమాణము లేదు.

మాధుర్యాది గుణములు రసములందు ఉన్న వని ఆరసములు గుణి రూపములు కాబట్టి గుణి అయినవాని అభివ్యంజనము లేకుండా గుణాభివ్యంజకత్వము ఉండదు.

అనే నియమము లేదు. ఇటువంటి ఈ నియమము ఘ్రాణము మొదలయిన ఇంద్రియత్రయములో వ్యభిచరించుతున్నది. ఘ్రాణము గంధగుణయుక్తమైన గుణిఅగు పృథివిని తెలియచేయకుండగానే గంధగుణమును అభివ్యక్తము చేస్తున్నది. అట్లాగే రసన మధురపదార్థమును తెలియజేయకపోయినా మాధుర్యమును తెలియజేస్తున్నది. త్వగింద్రియము గుణిపదార్థమును తెలియజేయకుండగానే శీతాదిగుణమును తెలియజేస్తున్నది. నాసికాదులకు పృథివ్యాదుల అనుభవము కలుగదు. కేవలమూ గంధాదుల అనుభవమే కలుగుతున్నది. ఈ విధముగా గుణి-గుణము తదతిరిక్తమైన ఉదాసీనపదార్థము తమతమ అభివ్యంజకముల చేత ఉపస్థితము లవుతున్నవి. అవి ఒకప్పుడు పరస్పరము సమ్మిలితరూపంగానూ ఒకప్పుడు ఉదాసీనరూపంగానూ శ్రావణాది జ్ఞానములలో విషయము లవుతున్నవి. కాబట్టి గుణములతోబాటు గుణి ప్రత్యక్షము కలుగవలె నన్న నియమము లేదు.

ఆ విధంగానే రసాలు వాని గుణాలుకూడా తమతమ వ్యంజకములవలన

వేరువేరుగా అభివ్యక్తము లయినా ఒకప్పుడు సమ్మిలితరూంపగానూ వేరొకప్పుడు ఉదాసీనరూపంగాకూడా అభివ్యక్తి విషయములు కావచ్చును. అందువలన గుణాభివ్యంజనము ఉంటే రసాభివ్యంజనము ఉండాలి అన్న అనుగమము లేదు. కాబట్టి వర్ణరచనలు రసవ్యంజకము లనుట ఉచితముకాదు. అవి కేవలమూ గుణాలకు వ్యంజకము లనుట సముచితంగా ఉంటుంది. వర్ణరచనా వ్యంజకత్వానికి "తాం తమాల తరుకాంతిలంఘునీం" అనే పద్యము ఉదాహరణము అని భావించాలి.

## వాక్యధ్వని

వాక్యవ్యంజకత్వానికి "ఆవిర్భూతా యదవధి మధుస్యంది సీ" అనేపద్యమును ఉదాహరణముగా భావించాలి.

## ప్రబంధధ్వని

యోగవాసిష్ఠ రామాయణములో శాంతరసము ప్రబంధవ్యంగ్యము అవుతున్నది. శ్రీమద్రామాయణములో కరుణరసము ప్రబంధవ్యంగ్యముగా ఉన్నది. రత్నావళ్యాదిరూపకములు శృంగారవ్యంజకములు. అవికూడా ప్రబంధవ్యంజకత్వములో ప్రసిద్ధనిదర్శనములుగా ఉన్నవి. నాచేత (పండితరాజు) నిర్మింపబడిన గంగాలహర్యాది పంచలహరులు భావము ప్రబంధవ్యంగ్య మగుటలో ఉదాహరణములు.

## పదైకదేశధ్వని

"నిఖల మిదం జగదండకం వహామి" అనేచోట అల్పార్థకమైన "క" రూపతద్ధితప్రత్యయము వీరరసానికి వ్యంజక మవుతున్నది. ఇదిపదైకదేశమునకు ఉదాహరణము. "అల్పాల్ప మైన ఈ జగద్గోళ మెంత" అని వీరస్థాయి అయిన వక్త ఉత్సాహము "జగదండకం" వలన గోచర మవుతున్నది.

## రాగాది వ్యంజకత

ఈవిధముగా రాగాదులుకూడా వ్యంజకములు అగుటలో సహృదయు

హృదయము ప్రమాణము. సహృదయులకు ఈ విషయములో అనుభవము ఉన్నప్పుడు దీనిని వ్యంజకముగా స్వీకరించవచ్చును.

ఈ విధముగా రసాదులు ప్రధానముగా ఉన్నప్పుడు ఉదాహరణములు ప్రదర్శింపబడినవి. రసాదులు గుణీభావము పొందినప్పటి ఉదాహరణములను నామములనూ ముందు చెప్పుతాము. ఈవిషయములోకూడా విద్వాంసులలో మతభేదము ఉన్నది. కొందరు ఈవిధముగా అంటారు. "ఈరసాదులు ప్రధానము లయినపుడే రసాదివ్యవహారము ఉంటుంది. ప్రాధాన్యము లేకపోతే రత్యాదివ్యవహారమే. గౌణతావస్థలోఉన్న "రసాలంకారము" అనే పేరులో రసపదము రత్యాదిపరమే కాని రసాదిపరము కాదు" అని.

మరికొందరు ఈవిధముగా పలుకుతారు: "అవి కూడా (అప్రధానములు కూడా) రసాదులు కావచ్చును. కాని ధ్వని (ఉత్తమోత్తమ, వ్యపదేశము మాత్రము లేదు" అని.

రసనిరూపణాత్మక ప్రథమాననము

శ్రీదేవ్యై నితరాం సుధామయవచఃప్రాగల్భ్యభూత్యై యిదం
ఉన్మేషం సముదీర్య విశ్వవచనవ్యావిద్ధభారూపకమ్
ఆత్మశ్రీప్రథమావతారమధురం విద్యాసముల్లాసితం
ఆహార్ణంమనురూపతా ముపగతం సద్భావ మారాధయే

# అకారాది శ్లోకానుక్రమణిక

# శోధిక

౨- ౯ శ్రీకృష్ణుని పుత్రుడు
౪-౧౮ అవసరము కావనీ
౬-౨౩ నిసర్గమనోహర
౧౨- ౨ వారించడానికి
౧౫-౧౬ పేటిలో ఉంటవో
౧౬-౧౧ లక్షణాహేతువులు
౫౫-౨౩ అంగీకరించి గుణీభావము
౫౭- ౨ శ్వైతత్వము తనయుని
౬౧-౨౮ ఇది ఉత్పాతము
౬౪-౩౧ పోతుంది
౭౭-౨౧ వ్యాపారాంతరమును
౯౯-౧౩ ఔన్నత్యమని పేరు
అలౌకిక వస్తుదర్శనాది జన్మా
శ్చర్యాఖ్యో విస్మయః
అలౌకికములయిన వస్తువుల
సందర్శనాదుల వలన విస్మ
యము కలుగుతుంది. దీనికి
ఆశ్చర్యమని పేరు.
౯౯-౧౮ పొందడానికి
౧౦౧- ౯ మొదలయినవి
౧౦౫-౨౫ రస్త్రైరశస్త్రం
౧౦౬-౧౨ మధురాః చేష్టా
౧౦౬-౨౮ బాలావృత్తవివర్తన
౧౦౭-౨౪ అస్త్రైస్త్రావస్మృహు
౧౩౯- ౯ తలచినచో విరోధి
౧౪౦- ౭ ప్రమాణములేదు
౧౫౬-౧౬ ఉండరాదని భావము
౧౬౦-౨౫ ఏకస్యా నయనే
౧౬౧-౧౮ కారణ మని గ్రహించాలి
౧౬౭-౧౩ గణికాజామికాది దృష్టాంత
గర్భమయిన భగవద్విశేషణము
నిరూపించబడింది. దీనికొరకే
అహామర్ధానికి 'సీదక్ష' వ్యథ
పడుచున్న' అనే విశేషణము
కూడా సాకూతముగా ఉంచ
బడింది.
౧౭౨-౧౨ అనుప్రాసను నిర్మాణము
౧౭౨-౧౩ కాలములు కూడా
౧౭౭- ౭ నిర్మాణ మార్మికలు
౧౮౦-౨౧ భిన్నభిన్నముతో
౧౮౫- ౫ పరిపుంఖితేషుశిలాః
౧౮౭- ౬ ధ్యుయో ద్వయముతో
౧౮౮-౧౬ నప్పటికీ అవి అధిక
౧౮౯-౨౫ గృహీత పరిహారాగ
౧౯౪- ౮ వ్యంజకత్వమును
౧౯౫-౨౧ అభివ్యక్త
౧౯౫-౨౩ వర్ధమపక్షము
౧౯౮- ౩ హితోగ్రితోన్మాద
౧౯౮-౨౧ సుఖవిశ్లేషో
౨౧౧-౧౦ గాత్రగౌరవాత్
౨౨౨-౧౬ నితరాం హితయాద్య
౨౨౪- ౭ అమర్ష
౨౨౬- ౫ కరోమీత్యాద్యాకారా
౨౨౬-౨౧ పొందిన నా గాండీవ
౨౨౬-౧౫ వికలాసా
౨౨౮- ౨ ఇక్కడ ప్రాణ
౨౨౩- ౯ సాపూర్వ్యం పరతో
౨౪౮-౨౮ అస్మద్గురువర్యులు
౨౫౫-౨౬ "ఉదియాయ"
౨౪౮-౨౬ లక్ష్యక్రమములు
౨౬౪- ౧ సమ్మిళితరూపంగానూ